
ఆంధ్రజ్యోతి
5వ
వార్షికోత్సవ ప్రత్యేక సంచిక
దసరా, దీపావళి శుభాకాంక్షలతో...
సాంస్కృతిక సౌరభం.. సిరిసంపదల భాండాగారం...
గుంటూరు జిల్లా
andhrajyothi

# కృష్ణా డెల్టాకు వరప్రదాయని పులిచింతల ప్రాజెక్ట్







2004 అక్టోబర్ 15వ తేదీన పులిచింతల ప్రాజెక్టుకు శంకుస్థాపన చేస్తున్న డా॥ వై.ఎస్

అక్షరజ్యోతి ఆంధ్రజ్యోతికి
5వ
ఐదవ వార్షికోత్సవ శుభాకాంక్షలు



నిర్మాణంలో వున్న పులిచింతల డ్యామ్ పిల్లర్

## కృష్ణా డెల్టాకు వరప్రదాయని



నిర్మాణంలో వున్న పులిచింతల డ్యామ్

- డెల్టా చింతలకు చెల్లు చీటి పులిచింతల
- నికరమయిన నీటి సరఫరాకు నమ్మకమైన ధాన్యం దిగుబడికి తిరుగులేని మందు పులిచింతల
- 120 మెగావాట్ల విద్యుత్ ఉత్పత్తికి అవకాశం
- సముద్రం పాలయ్యే 45 టి.యం.సి.ల నీటిని నిల్వచేసే అవకాశం
- నల్గొండ , కృష్ణా, గుంటూరు జిల్లాలను కలిపే వారధి పులిచింతల
- 13 లక్షల ఎకరాల ఆయకట్టు స్థిరీకరణకు చివరి సంతకం పులిచింతల
- శతాబ్ద కాలపు రైతాంగ పోరాట సాధనకు నిలువెత్తు సాక్ష్యం పులిచింతల



చురుగ్గా సాగుతున్న పులిచింతల పనులు



డ్యామ్ లేఅవుట్ వ్యూ



పులిచింతల ప్రాజెక్టు పనులను పర్యవేక్షిస్తున్న మంత్రులు మోపిదేవి, పొన్నాల, కాసు, కన్నా, మండలి,మురుగుడు, పలువురు ఎమ్మెల్యేలు, ఎమ్మెల్సీలు



ఆధునిక పరికరాలతో కొనసాగుతున్న డ్యామ్ పనులు

# SREENIVASA CONSTRUCTIONS Ltd.

HYDERABAD

# గుంటూరు జిల్లాలోని మొట్టమొదటి ఇంజనీరింగ్ కళాశాల

# బాపట్ల ఇంజనీరింగ్ కళాశాల




బాపట్ల ఇంజనీరింగ్ కళాశాల భవనం

## సాంకేతిక విద్య ప్రపంచానికే సువర్ణ మణిహారం, చదువుల తల్లి నుదుటిపైన సిరులొలికే సింధూరం

* భారత ప్రభుత్వ మానవ వనరులశాఖ వారి టెక్నికల్, క్వాలిటీ ఇంప్రూమెంట్ ప్రోగ్రాం. క్రింద ప్రపంచ బ్యాంకు నిధులతో అంతర్జాతీయ ప్రమాణాలతో అధునాతన సౌకర్యాల కొరకు ప్రపంచ బ్యాంకు ఆర్థిక సహాయం అందజేస్తున్న ఆంధ్రప్రదేశ్‌లో ప్రైవేటు సెక్టారులోని ఏకైక విద్యా సంస్థ.

* ప్రైవేటు సెక్టార్‌లో గుంటూరు జిల్లాలో మొట్టమొదటి పాలిటెక్నిక్ కళాశాల బాపట్ల పాలిటెక్నిక్ కళాశాల
* కె.జి. నుండి పి.జి. వరకు విద్యాభ్యాసాన్ని ఒకేచోట అందిస్తూ తొమ్మిది వేలమంది విద్యార్థులతో అలరారుతున్న ఏకైక విద్యాసంస్థ.



శ్రీ ముప్పలనేని శేషగిరిరావు
చైర్మన్, బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీ

గుంటూరు జిల్లాలో మొట్టమొదటి ఫార్మసీ కళాశాల బాపట్ల కాలేజీ ఆఫ్ ఫార్మసీ

* గ్రామీణ వాతావరణంలో 1962లో బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీ ప్రారంభించి గేట్ ర్యాంకులతో పాటు, విశ్వవిద్యాలయాల ర్యాంకులతో అసమాన్యమైన అభివృద్ధి శిఖరాలను అధిరోహిస్తున్న ఏకైక విద్యా సంస్థ.

* గత 6 సంవత్సరాలలో సగటున పది మంది విద్యార్థులు అఖిల భారత స్థాయిలో 100 లోపు ర్యాంకులు సాధించారు.

అద్వితీయరీతిలో గేట్ ర్యాంకులను సాధిస్తూ దేశ, విదేశాల్లో ఈ కళాశాలల విజయకేతనాన్ని ఎగురవేస్తున్న విద్యార్థిని విద్యార్థులకు ఇవే మా శుభాకాంక్షలు.



జనరల్ ఇంజనీరింగ్ బిల్డింగ్



సివిల్ మరియు మెకానికల్ బిల్డింగ్



అడ్మినిస్ట్రేటివ్ బిల్డింగ్



బిఫార్మసీ కళాశాల



పబ్లిక్ స్కూల్



ఆర్ట్స్ & సైన్సెస్ కళాశాల

### ☛ ఇంజనీరింగ్ కళాశాల ప్రగతి

* బాపట్ల ఇంజనీరింగ్ కళాశాల 1981లో స్థాపించబడింది * AICTE న్యూఢిల్లీ వారిచే ఆమోదించబడింది. * కాలేజీలోని 8 కోర్సులు ఎన్‌బిఎ గుర్తింపు స్థాయిని పొందాయి * AICTE, UGC వారి ద్వారా త్వరలో స్వయం ప్రతిపత్తి పొందబోతున్నది * 'గేట్1997'లో సివిల్ ఇంజనీరింగ్‌లో అఖిల భారతస్థాయిలో ప్రథమ స్థానం సాధించబడింది * గేట్ 2005లో అర్హత పొందిన 230 మందిలో 22 మంది విద్యార్థులు 99% పర్సన్‌టేజ్ సాధించారు. * 1999, 2000, 2003, 2004 మరియు 2005 సంవత్సరాలలో విశ్వవిద్యాలయంలో ప్రథమ స్థానాన్ని ఈ కాలేజి విద్యార్థులు సాధించారు. * 2000 నుండి 2003 సంవత్సరాలలో మాథ్స్ ఒలంపియాడ్‌లో ప్రథమ స్థానాన్ని సాధించారు. * 600 మంది బాలికల సౌకర్యార్థం రెండు బాలికల వసతి గృహాలు అత్యాధునిక వసతులతో నిర్వహించబడుతున్నాయి. * విద్యార్థులందరికి ఉచితంగా ఇంటర్నెట్ సదుపాయం (2 ఎం.బి.పి.ఎస్ లీజ్‌డ్ లైన్) కల్పించబడుతోంది. * బాలికల వసతి గృహంలో ప్రత్యేకంగా ఇంటర్నెట్ సదుపాయంతో కంప్యూటర్ సెంటర్ ఏర్పాటు చేయబడింది * 51,036 సంపుటాలతో 70 విదేశీ పత్రికలతో కలిసి 154 సాంకేతిక పత్రికలతో గ్రంథాలయం నిర్వహించబడుతోంది. ఇందులో విద్యార్థులకు 30 టెర్మినల్స్ ద్వారా 250 విదేశీ పత్రికలు చదువుకునే అవకాశం కల డిజిటల్ లైబ్రరీ సౌకర్యం కూడా కల్పించబడింది.

**కళాశాలలోని కోర్సులు :**
బిటెక్ : సిహెచ్.ఇ., సి.ఇ., సి.ఎస్.ఇ, ఇ.సి.ఇ., ఇ.ఇ.ఇ., ఇ.ఐ.ఇ., ఐ.టి., ఎం.ఇ., బయోటెక్నాలజీ
ఎంటెక్ : ఇ.సి.ఇ (ఎస్.పి. & సి.ఎస్), ఎం.ఇ (సి.ఎ.డి/సి.ఎ.ఎం) ఎం.సి.ఏతో సహా 6 కోర్సులు ఉన్నాయి.

**★ ఫార్మసీ కళాశాలలో నిర్వహించే కోర్సులు**
1. డిఫార్మసీ 2. బిఫార్మసీ 3. ఎమ్ ఫార్మసీ (ఫార్మస్యూటిక్స్)

**★ పాలిటెక్నిక్ కాలేజీలో నిర్వహించే కోర్సులు**
1. ఇసిఇ 2. ఇఇఇ 3. ఎమ్ఇ 4. ఇసిఇ 5. సిఎస్ఇ (3 సంవత్సరాలు) 6. డిప్లమో ఇన్ బయోటెక్నాలజీ (2 సంవత్సరాలు)

**★ ఆర్ట్స్ అండ్ సైన్సెస్ కళాశాలలోని కోర్సులు**
ఇంటర్మీడియట్ : 1. ఎంపిసి (TM & EM) 2. బైపిసి (TM & EM) 3. హెచ్ఇసి (TM) 4. హెచ్‌టిసి (TM) 5. సిఇసి (TM)
బిఎ : 1. హిస్టరీ, పాలిటిక్స్, ఎకనామిక్స్ 2. హిస్టరీ, పాలిటిక్స్, ఇంగ్లీషు 3. హిస్టరీ, పాలిటిక్స్, తెలుగు
బిఎస్సీ : 1. మ్యాథ్స్, ఫిజిక్స్, కెమిస్ట్రీ (TM & EM) 2. బోటనీ, జూవాలజీ, కెమిస్ట్రీ (TM & EM) 3. మ్యాథ్స్, ఫిజిక్స్, కంప్యూటర్ సైన్స్ 4. మ్యాథ్స్, ఫిజిక్స్, ఎలక్ట్రానిక్స్ 5. మ్యాథ్స్, కంప్యూటర్ సైన్స్, ఎలక్ట్రానిక్స్ 6. మ్యాథ్స్, కంప్యూటర్ సైన్స్, స్టాటిస్టిక్స్ 7. బయోకెమిస్ట్రీ, మైక్రోబయాలజీ, కెమిస్ట్రీ 8. బయోటెక్నాలజీ, జువాలజీ, కెమిస్ట్రీ, 9. పి.జి.లో బయోటెక్నాలజి
బికాం : (TM & EM) బి.కాం. కంప్యూటర్ అప్లికేషన్స్ * ఈ కళాశాలలో ఎన్‌సిసి, ఎన్ఎస్ఎస్ మరియు స్పోర్ట్స్ విభాగాలలో విద్యార్థులు రాష్ట్ర, జాతీయ స్థాయిల్లో ఉన్నత పురస్కారాలు అందుకుంటున్నారు.

**★ బాపట్ల జూనియర్ కాలేజిలో కోర్సులు**
ఎంపిసి మరియు బైపిసి (EM)

**★ బాపట్ల పబ్లిక్ స్కూల్**
LKG నుండి 10th వరకు (EM) తరగతులు నిర్వహిస్తున్నారు.

## విశిష్ట లక్షణాలు

* లైట్ బ్రాడ్ క్యాస్టలు మరియు లెక్చరర్ ట్రాన్స్‌మిషన్‌తో 50-ఇ-తరగతి గదులు * 15 వాస్తవిక తరగతులు మరియు ఆన్ డిమాండ్ లెక్చరర్లు మరియు లైట్ ఇంటరాక్షన్‌తో ఒక స్టూడియో * ఏ సమయంలోనైనా, ఎక్కడినుండైనా పురాతన ఉపన్యాసాలు బ్రౌస్ చేయుటకు, అన్వేషించుటకు మరియు పొందుటకు వీలుగా విద్యార్థులను అనుమతించే వెబ్ ఆధారిత అన్వయం. * రూ.69 లక్షల విలువగల దేశంలో అదే మొదటిదైన రెండు విధాల పరస్పర చర్యగల సిస్కో (CISCO) డిజిటల్ మీడియా విధానం. * ఫైబర్ ఆప్టిక్ బ్యాక్‌బోన్ మరియు గిగాబైట్ స్విచింగ్ పరికరాలతో క్యాంపస్ నెట్‌వర్క్. *సిల్వాన్ హరిత పరిసరాల్లో ల్యాండ్ స్కేప్ ఉద్యానాలతో 30 ఎకరాల క్యాంపస్. * ఆదర్శమైన విద్యా విషయ మరియు ప్రాచీన వాస్తు శిల్ప శాస్త్రంతో 4,00,000 చ.అ.నిర్మిత విస్తీర్ణం. * రెండు అంతర్జాతీయ విద్యాపరమైన సదస్సుల్లో ఈ కళాశాల ప్రాతినిధ్యం వహించింది. * యు.జి మరియు పి.జి. కోర్సుల్లో అత్యధికంగా 1,074 మంది విద్యార్థులకు ఏటా ప్రవేశం. * దిగుమతి చేసుకొన్న కళాత్మకమైన, అత్యాధునిక ప్రయోగశాల ఎక్విప్‌మెంట్. *60 పిసిలతో డిజిటల్ మీడియా కమ్యూనికేషన్ స్కిల్స్ ల్యాబ్. * రాష్ట్రంలోనే అత్యధిక ఇన్‌టేక్ కలిగిన ఇంజనీరింగ్ కాలేజి. * ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయము పరిధిలో గల బెస్ట్ పర్ఫామింగ్, ప్రొఫెషనల్ యు.జి. కాలేజి. * యూనివర్శిటీ పరిధిలో నిర్వహించే పరీక్షా ఫలితాలలో ప్రథమ స్థానము.

* 51,036 వాల్యూంలు మరియు 139 జర్నల్స్‌తో సెంట్రల్ గ్రంథాలయం, 30 టెర్మినల్స్ మరియు 20 ల్యాప్‌టాప్‌లు మరియు వీడియో కాన్ఫరెన్సింగ్ సౌకర్యంతో డిజిటల్ గ్రంథాలయం. * 130కి పైగా అంతర్జాతీయ ఆన్‌లైన్ జర్నల్స్‌కు అందుబాటు కల్పించు విధంగా ఐఐటీలు, సొనెట్, డెల్నెట్, ఇండెస్ట్, ఇన్ఫ్లిబ్‌నెట్ ద్వారా రూపొందించిన వీడియో ఉపన్యాసాలకై ఏకలవ్య టీవీ ఛానెల్. * యుపిఎస్‌తో 950కి పైగా ఆధునిక పిసిలతో 11శాఖాపరమైన కంప్యూటర్ కేంద్రం, గ్రంథాలయ కేటలాగ్ (బిపిఎపి) మరియు కంప్యూటరీకరించిన పుస్తకాల పంపిణీ.* కంప్యూటర్ ల్యాబ్‌లు మరియు శాఖలన్నిటిలో 2ఎంబిపిఎస్ ఇంటర్నెట్ సౌకర్యం 250 కెవిఎ మరియు 90 కెవిఎ ఆధునిక జన్‌సెట్ల.ద్వారా నిరంతరాయంగా విద్యుత్. చేర్చుకున్న బాలికలందరికీ వసతితో ప్రత్యేకమైన విద్యార్థినుల హాస్టళ్ళు. * బాలికల హాస్టల్ లోపల ఇంటర్నెట్ సౌకర్యంతో కంప్యూటర్ కేంద్రం.. * ఉచిత మినరల్ వాటర్‌సరఫరా మరియు అంబులెన్స్ సౌకర్యం. * సాలీనా రూ.750/- వంతున డేస్కాలర్స్ కొరకు సబ్సిడీతో కూడిన రవాణా.. * అందరికీ సబ్సిడీతో కూడిన క్యాంటీన్ సౌకర్యం.



డా॥ జి.నాగేశ్వరరావు
ప్రిన్సిపాల్

# బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీ

## సేవా దృక్పథంతో నడుపబడుతున్న ఏకైక విద్యా సంస్థ

# సరస్వతీపుత్రుడు... సంభాషణా విరించి

# సముద్రాల జూనియర్



చిత్తూరితో సముద్రాల



సముద్రాల జూనియర్

(ఆన్‌లైన్, చిలకలూరిపేట అర్బన్)

ఇంటిపేరు సముద్రాల. తెలుగు చలనచిత్ర పరిశ్రమలో నిజంగా సముద్ర మంత గంభీరత్వాన్ని, విశాలత్వాన్ని కలిగినవారు సముద్రాల. సముద్రాల వేంకట రాఘవాచార్య తెలుగు సినీరంగంలో పాటల, మాటల రచయితగా వీరవిహారం చేశారు. అనంతరం వారి కుమారులు రామానుజాచార్యులు కూడా సినిమా రచయిత అయ్యారు. తండ్రి సముద్రాల సీనియర్‌గా కొడుకు సముద్రాల జూనియర్ పిలువబడ్డారు. గుంటూరు జిల్లా రేపల్లెకు సమీపంలోని పెద్దపులివర్రు గ్రామంలో 1923 ఏప్రిల్ 15న జన్మించిన సముద్రాల జూనియర్ ఎన్‌టిరామారావు నిర్మించిన తోడుదొంగలు చిత్రంతో సినీరంగప్రవేశం చేశారు. ఎన్‌టిఆర్ నటించిన దాదాపు 30 చిత్రాలకు సముద్రాలు జూనియర్ మాటల రచయితగా పనిచేశారు.

ప్రకృతి వైపరీత్యాలు సంభవించిన సందర్భంలో పోలీసు సంక్షేమనిధి, వీరజవానులు సంక్షేమనిధి కోసం ఎన్.టి.ఆర్ ఆదేశంపై ఈ మూడు నాటికలను రచించారు. ఈ నాటికలను ఒక విధంగా సినిమా నాటికలు అనవచ్చు. వ్రాసినవారు సుప్రసిద్ధ సినీ రచయిత. వ్రాయించుకొన్నవారు సుప్రసిద్ధ సినిమా దర్శక నిర్మాత మహానటుడు, నటించిన వారందరూ అభిమాన సినిమా నటులు. మామూలు నాటకాలలాగా ఇందులో పునరుక్తి, పులుముడూ ఎక్కడా ఉండదు.

## శ్రీకృష్ణతులాభారం

నందితిమ్మన రచించిన పారిజాతాపహరణం ప్రబంధం ఆధారంగా ఎన్నో కథలూ, నాటకాలూ వెలువడ్డాయి. సురభి వారి పుణ్యమా అని నాటకంగా వాడవాడలా ప్రదర్శింపబడి తెలుగువారికి ఎంతో ఆత్మీయమైన ఇతివృత్తంగా నిలిచిపోయింది. అప్పటికే ఎన్.టి.రామారావు కృష్ణపాత్రలో ప్రజలకు ఆరాధ్యదైవంగా నిలిచిపోయారు. శ్రీకృష్ణతులాభారం పేరుతో నిర్మించిన సినిమా ద్వారా ఈ కథను రసరమ్యంగా తెలుగువారికి అందించారు. తెలుగువారికే కాక తనకు కూడా వ్యక్తిగతంగా ఇష్టమైన కథను సముద్రాల జూనియర్ చేత నాటికగా రాయించారు. ఇందులోని ఇతివృత్తం తెలుగువారికి సుపరిచితమైనది. నారదుడు పారిజాతపుష్పాన్ని కృష్ణునికి ఇచ్చి ఇష్టసఖికి బహూకరించమని అంటాడు. రుక్మిణి ఇంట ఉన్న కృష్ణుడు ఆ పుష్పాన్ని రుక్మిణికి ఇస్తాడు. ఈ విషయాన్ని చెలికత్తె ద్వారా తెలుసుకొన్న సత్యభామ వేటుపడ్డ కోడెతాచు లాగా లేచి అలకమందిరంలో శయనిస్తుంది. నీవు కోరిన పారిజాత వృక్షమునే తెచ్చి నీ పెరటిలో నాటెదనని కృష్ణుడు అభయమిస్తాడు. సత్య తన ప్రాణనాధుని నారదునికి దానం ఇస్తుంది. భర్తను తిరిగి పొందుటకు సరిపడు ఆభరణములు తూసి ఇవ్వమని నారదుడు అంటాడు. సత్యభామకు గర్వభంగం అవుతుంది. రుక్మిణి భక్తితో సమర్పించిన తులసీదళానికి కృష్ణుడు తూగుతాడు. రుక్మిణి పవిత్రప్రేమకు సత్య తల ఒగ్గుతుంది. ఈ ఇతివృత్తంలో 1969 లో గోదావరి వరదలు వచ్చినప్పుడు సముద్రాలు ఈ నాటకాన్ని రచించారు.తొలి ప్రదర్శన 1969 జులై 15న ప్రదర్శించారు. సైక్లోన్ రిలీఫ్ పేరుతో ఆరు లక్షల నిధులను సేకరించి ప్రభుత్వానికి సమర్పించారు. ఈ నాటకంలో కృష్ణునిగా ఎన్.టి రామారావు, సత్యభామగా సావిత్రి, రుక్మిణిగా దేవిక, నారదునిగా కాంతారావు,వసంతునిగా పద్మనాభం, జాంబవతిగా అనిత, నళినిగా సుమతి నటించారు. 1977 దివిసీమ ఉప్పెన సందర్భంగా కూడా ప్రజలను ఆదుకోవడానికి చలనచిత్ర పరిశ్రమ ఎన్.టి.రామారావు ఆధ్వర్యంలో ఈ నాటికను ప్రదర్శించింది. ఈ ప్రదర్శనలో కృష్ణునిగా ఎన్.టి.రామారావు, సత్యభామగా జమున, రుక్మిణిగా జయప్రద, జాంబవతిగా దీప, నళినిగా విజయభాను, నారదునిగా కాంతారావు నటించారు. ఈ నాటకాన్ని ఆ సమయంలో రాష్ట్రంలోని పలు ప్రాంతా లలో ప్రదర్శించారు.

## పోలీసు రామన్న

సమాజ శ్రేయస్సును, నైతిక విలువలను కాపాడుతూ ప్రజలకు అండదండలుగా నిలవవలసిన బాధ్యత గల వ్యక్తి పోలీసు. మంచీచెడూ మానవులలో ఎప్పుడూ ఉంటాయి. నీతి, అవినీతి మధ్య సతమతమయ్యే సాంఘిక జీవనంలో అవినీతికే ప్రాధాన్యమిస్తున్న ఈ రోజుల్లో నిజాయితీగా బతికేవారిని ఈ సంఘం బతకనివ్వదు. ఆకర్షణలకు బానిసలు కాకుండా ఆదర్శంగా బతకాలనుకొని ఈ సంఘవిద్రోహుల అత్యాచారాలకు బలైపోయి గుర్తింపు కూడా లేకుండాపోయిన రక్షకభటుని అమరగాధే ఈ నాటికలోని ఇతివృత్తం. పోలీసు సంక్షేమనిధి కోసం ఎన్.టి.రామారావు ఆధ్వర్యంలో 24న తొలిసారిగా గుంటూరులో ప్రదర్శించారు. మరుసటిరోజు హైదరాబాద్‌లో ప్రదర్శించారు. ప్రతి రక్షకభటుడూ న్యాయరక్షణకు, ధర్మరక్షణకు, ప్రజాసేవకు కంకణం కట్టుకోవాలి. ఆశావ్యామోహాలకు ఆత్మను అమ్ముకోకుండా ధర్మమార్గంలో నీతి, నిజాయితీగా జీవించాలి. దేశ సౌభాగ్యానికీ, శ్రేయస్సుకీ ప్రాణాలర్పించడానికైనా సిద్ధంగా ఉండాలనే సందేశంతో రాసిన ఈ నాటికలో ఎన్.టి.రామారావు, చిత్తూరు నాగయ్య, జమున,బాలయ్య,రాజబాబు, పేకేటి, బాలకృష్ణ ప్రభృతులు నటించారు.

## జయం మనదే

మానవుడు సుఖశాంతులతో బతకాలంటే దేశం సుభిక్షంగా ఉంటాలి. ఇల్లు కాలుతున్నప్పుడు నీళ్ల కోసం వెదికినట్లు కాకుండా ముందుగానే సుశిక్షితులైన యుద్ధ వీరులను ఎల్లల మీద నిలబెట్టాలి. అందుకోసం మన ప్రతి కుటుంబం నుంచి ఒక యువకుడు సైనికుడిగా వెళ్లాలి. ఈ అవసరాన్ని, అవశ్యతను ఉత్తేజకరంగా, ఉద్రేకభరితంగా నిరూపించిన ఇతివృత్తంతో సముద్రాల రచించిన నాటిక జయం మనదే. ఈ నాటికను సముద్రాల 1965లోరచించారు. పాకిస్తాన్ భారతదేశంపై దురాక్రమణచేసి యుద్ధం ప్రకటించినప్పుడు దేశ రక్షణకై యుద్ధ భూమికి వెళ్లిన వీర జవానులకు నిధిని సేకరించడానికి ఎన్.టి.రామారావు ఆంధ్రదేశంలోని నలుచెరుగులా 1965 నవంబర్ 20నుండి డిసెంబర్ 11వరకూ పర్యటించి సాంస్కృతిక ప్రదర్శనలిచ్చారు.

### భువిలో వెలసిన కైలాసం

# జాగర్లమూడి సంగమేశ్వరాలయం

(ఆన్‌లైన్, తెనాలి)

జిల్లాలో చరిత్ర ప్రసిద్ధి గాంచిన దేవాలయాలలో సంగం జాగర్లమూడి సంగమేశ్వరాలయం ఒకటి. కొన్ని ఉప నదులు సంగం జాగర్లమూడి సమీపాన తుంగభద్రలో సంగమించడం వల్ల ఇది సంగమ క్షేత్రంగా ప్రసిద్ధికెక్కింది. భువిలో అవతరించిన కైలాసంగా పేర్కొనబడిన సంగమేశ్వరాలయానికి విశిష్ట చరిత్ర ఉంది.

పూర్వం గూని గోవిందు అనే బ్రాహ్మణునికి సాక్ష్యం చెప్పేందుకు కాశీ క్షేత్రం నుండి సాక్షాత్తు విశ్వేశ్వరుడు ఈ ప్రాంతానికి వచ్చినట్లు చరిత్ర చెబుతోంది. ఆ విశ్వేశ్వరుడే సంగమేశ్వరునిగా సంగం జాగర్లమూడిలో వెలిసినట్లు పురాణ ప్రసిద్ధి. ఇక్కడ సంగమేశ్వరుడు బాలా త్రిపుర సుందరీ సమేతుడై ప్రధాన దేవతగా పూజలందుకుంటున్నాడు. సంగమేశ్వరునికి దక్షిణ భాగాన వీరభద్రస్వామి, ప్రక్కనే పాపవినాశేశ్వర స్వామి, పార్వతీదేవి కొలువుదీరి ఉన్నారు.

ద్వాపర యుగాంతంలో కౌశాంబి పట్టణంలో చంద్ర వంశంలో జన్మించిన హరిస్వామి అనే క్షత్రియుడు ఆ జన్మలో పాప ఫలం కారణంగా మరు జన్మలో గూని గోవిందు అనే బ్రాహ్మణోత్తమునిగా జన్మించి కాశీ విశ్వేశ్వరుడు, భావన్నారాయణ స్వామిని తనకు సాక్ష్యం ఇవ్వమని కాశీలో తపస్సు చేశాడు. తపస్సు ఫలితంగా కాశీ విశ్వేశ్వరుడు, భావన్నారాయణ స్వామి గోవిందుకు సాక్షాత్కరించి అతని వెంట వచ్చారు. గోవిందును వెనుదిరిగి చూడవద్దని ఆదేశించినా, అతను సంగం జాగర్లమూడి సంగమ ప్రదేశంలో వెనుదిరిగి చూడటంతో సంగమేశ్వరుడు అక్కడే నిలిచిపోయి కలియుగంలో పూజలు అందుకుంటున్నాడు.

సంగమేశ్వరుని వెనుక వస్తున్న భావన్నారాయణ స్వామి పొన్నూరులో వెలిసి పూజలందుకుంటున్నాడని ప్రతీతి. సంగమేశ్వరుని ఆనతి మేరకు జాగర్లమూడి వాసులు దేవాలయ మండపాలను నిర్మించగా అత్రి మహర్షి శివలింగ ప్రతిష్ట చేశారు. అప్పటి నుండి సంగమేశ్వర స్వామి ప్రజల పూజలందుకుంటూ సంగం జాగర్లమూడిలో కొలువుదీరాడు. రాచూరు జమిందార్లు ఈ ఆలయానికి నిత్య ధూప, దీప, నైవేద్యాల నిమిత్తం భూములను ఈనాములుగా ఇచ్చారు. సంగం జాగర్లమూడికి చెందిన కొత్త వంశస్థులు చాలా కాలం ధర్మకర్తలుగా వ్యవహరించి దేవస్థానంలో నూతన నిర్మాణాలు జరిపించారు. స్వామి పార్శ్వ భాగంలో త్రిపుర సుందరీ దేవి విగ్రహాన్ని ప్రతిష్టించారు. నవగ్రహ దేవాలయాలు నిర్మించి నవగ్రహ ప్రతిష్టగావించారు. ఏటా మహాశివరాత్రి, విజయదశమి, ఉగాది పర్వదినాలలో ఇక్కడ వైభవంగా ఉత్సవాలు నిర్వహిస్తున్నారు. కార్తీక మాసంలో నిత్య సమారాధనలు జరుగుతున్నాయి.



సంగమేశ్వరాలయం



స్వామివారి మూలవిరాట్

# నూజివీడు సీడ్స్ వారి వినూత్న హైబ్రిడ్ రకాలు

హైబ్రిడ్ మొక్కజొన్న



సంధ్య, రాజా

హైబ్రిడ్ వరి



మాణిక్, మోతి, సోనాల్

హైబ్రిడ్ మిరప



సిరి, అరుణ్, త్రిష

హైబ్రిడ్ ప్రొద్దు తిరుగుడు



శ్రేష్ట, స్వాతి

హైబ్రిడ్ జొన్న



భాగ్యశ్రీ, సోనా

హైబ్రిడ్ సజ్జ



శాంతి, పూజ

హైబ్రిడ్ బెండ



నైనా, మృదుల, శ్రీవాణి

హైబ్రిడ్ వంగ



(NBH-601) కనకదుర్గ

హైబ్రిడ్ టమాటా



సౌమ్య, భాగ్య

F-1 హైబ్రిడ్



విక్రమ్ -117, రాఖీ

లక్షలాది పత్తి రైతుల నమ్మకం - బన్ని బిటి మల్లిక బిటి




## నూజివీడు సీడ్స్ లిమిటెడ్®

6/12, బ్రాడీపేట, గుంటూరు-2, ఫోన్ : 2350779, 2350889

# కాకలు తీరిన యోధుడు కాసు

(ఆన్‌లైన్, నరసరావుపేట)

మారుమూల గ్రామంలో రైతు కుటుంబంలో జన్మించి, అంచలంచలుగా ఎదిగి రాష్ట్ర ముఖ్యమంత్రిగా, కేంద్రంలో సైతం ఎన్నో ప్రతిష్టాత్మక పదవులు అలంకరించారు రాష్ట్రపతి, ప్రధానమంత్రి పదవులు మినహా, దేశంలోని అన్ని అత్యున్నత పదవులన్నింటినీ ఆయన అధిరోహించారు. ముఖ్యమంత్రిగా సుదీర్ఘ కాలం పని చేసి, రాష్ట్ర అభ్యున్నతికి పాటుపడ్డారు. సాగర్ డ్యాంకు క్రస్ట్ గేట్లు ఏర్పాటు చేసి, ఈ ప్రాంతానికి సాగు నీరు అందించటంలో బ్రహ్మానందరెడ్డి విశేషంగా కృషి చేశారు. స్వాతంత్ర్యం ఉద్యమంలో కూడా చురుకైన పాత్ర పోషించారు. 1929లో ఆయన రాజకీయ జీవితాన్ని ఆరంభించారు.

## కాసు ప్రస్థానం ఇలా...

1909 సంవత్సరం జులై 28న గుంటూరు జిల్లాలోని నాదెండ్ల మండలం, తూబాడు గ్రామంలో కాసు బ్రహ్మానందరెడ్డి జన్మించారు. ఆయన బిఎల్ పట్టభద్రుడు. విద్యార్థి దశ నుంచే రాజకీయాల్లో కాసు చురుగ్గా పాల్గొనే వారు. గాంధీయేతత్వాన్ని పుణికి పుచ్చుకొన్న ఆయన ఆలవాట్లనే ఆచరణలో చూపేవారు. ఆయన ఇంటి నుంచి బయటకు వస్తే, తల పై కద్దరు టోపీ విధిగా వుంటుంది. తన టోపీ తిప్పే రీతిని ఇప్పటికీ ప్రత్యేకంగా చెప్పుకొంటారు. తల పై టోపీని తిప్పారంటే, ఒక మంచి ఆలోచనకు ఆయన నాంది పలికినట్లే. ఆంధ్రకేసరి ప్రకాశం పంతులుకు బ్రహ్మానందరెడ్డి ముఖ్యమైన శిష్యుడిగా వున్నారు. టంగుటూరు ప్రకాశం పంతులు, కొండా వెంకటప్పయ్య, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, నడింపల్లి నరసింహారావు శాస్త్రిల స్ఫూర్తితో స్వాతంత్ర్య ఉద్యమంలో కాసు జిల్లాలో జరిగిన అనేక కార్యక్రమాల్లో చురుకైన పాత్రను పోషించారు. మద్రాసులో లా చదివే సందర్భంలో సైమన్ కమిషన్‌ను ఆయన బాయ్‌కాట్ చేశారు. తమిళనాడు ఒక నాటి ముఖ్యమంత్రి అన్నాదురై బ్రహ్మానందరెడ్డికి సహచర విద్యార్థి.

## స్వాతంత్ర్యోద్యమంలో జైలు...

1941 ఫిబ్రవరిలో ఇండివిద్యువల్ సత్యాగ్రహంలో పాల్గొన్న బ్రహ్మానందరెడ్డికి ఆరు నెలలు జైలు శిక్ష పడింది. 1942లో క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్న కాసు, 1943 సెప్టెంబరు 13న అరెస్టయ్యారు. ఆయన 1945 జనవరి 28న జైలు



నుంచి విడుదలయ్యారు. ఏఐసిసిలో సభ్యుడిగా అనేక సంవత్సరాలు పని చేసిన ఆయన, కేంద్రంలో కాంగ్రెస్ ఎగ్జిక్యూటీవ్‌గా ప్రధాన పాత్ర పోషించి లాల్ బహదూర్ శాస్త్రి ప్రధాని కావటానికి కారకులయ్యారు. ఆయన రాజకీయ జీవితం 1929లో ప్రారంభమైంది. 1937లో ప్రకాశం పంతులు ఆశీస్సులతో 1937లో ఒంగోలు బోర్డు అధ్యక్షులుగా ఆయన ఎన్నికయ్యారు. రాజకీయ రంగ ప్రవేశ అనంతరం నరసరావుపేటలో న్యాయవాద వృత్తిని కొంతకాలం నిర్వహించారు. 1946లో మద్రాసు రాష్ట్ర శాసన సభకు జరిగిన ఎన్నికల్లో నరసరావుపేట నియోజకవర్గం నుంచి ఎన్నికయ్యారు. మద్రాసు అసెంబ్లీలో అత్యంత కీలకమైన శాసన సభ్యునిగా పని చేశారు. ఆయనలోని నాయకత్వ లక్షణాలు గుర్తించి, ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శిగా బాధ్యతలు అప్పగించారు. సంజీవయ్య ముఖ్యమంత్రిగా వుండగా, కాసు ఆర్థిక మంత్రిగా పని చేశారు.

## రాష్ట్ర సమైక్యతకు పదవీ త్యాగం...

1964లో బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేశారు. కాంగ్రెస్ ప్రభుత్వంలో అత్యధిక కాలం ముఖ్యమంత్రిగా ఆయన రికార్డు సృష్టించారు. ముఖ్యమంత్రిగా వుండగా, నాగార్జున సాగర్ డ్యాం పై క్రస్ట్ గేట్లను ఏర్పాటు చేయటంలో విశేష కృషి చేశారు. తన జీవితంలో ముఖ్యమైన విశేషాల్లో నాగార్జున సాగర్ క్రస్ట్ గేట్లు ఏర్పాటు చేయటం ముఖ్యమైనదని, లక్షలాది మంది రైతుల పంట పొలాలకు సాగు నీరు అందించి, అన్నదానం కలకాలం చేశానని జ్ఞాపకం వచ్చినప్పుడు తనకు ఒళ్ళు పులకరిస్తుందని పలు సందర్భాల్లో బ్రహ్మానందరెడ్డి చెప్పుకొన్నారు.

## పక్కా గృహాలకు రాష్ట్రం నుంచే శ్రీకారం...

సిఎం పదవీ కాలంలో రూ 10 కోట్లు హడ్కో రుణాన్ని ఎల్ఐసి ద్వారా పొంది రాష్ట్రంలో మొట్టమొదటి సారిగా బలహీన వర్గాల వారికి ఇళ్ళ నిర్మాణం చేపట్టిన పేరుతెచ్చుకొన్నారు. ఉర్దూ బాషకు తెలుగుతో సమాన ప్రతిపత్తిని కల్పించటంతో పాటు, అమలు చేయటంలో కూడా ఆయన ఎంతో కృషి చేశారు. బ్రహ్మానందరెడ్డి నాయకత్వంలో 1964 జనవరిలో 18న గ్రామ పంచాయతీ చట్టం అమలైంది. 1971 సెప్టెంబరు 23వ తేదీ వరకు ముఖ్యమంత్రిగా బ్రహ్మానందరెడ్డి కొనసాగారు. 1964 నవంబరులో గుంటూరులో జరిగిన అఖిల భారత కాంగ్రెస్ కమిటీకి జరిగిన ఎన్నికల్లో కాకాని వెంకటరత్నాన్ని గెలిపించి రాష్ట్ర రాజకీయాల్లో ఆయనదే పైచేయి అని నిరూపించుకొన్నారు. సమైక్యాంధ్రా కోసం శాసన సభలో మెజార్టీ ఉన్నప్పటికీ ముఖ్యమంత్రి పదవికి రాజీనామా చేసి, మహానేతగా పేరొందారు. రాష్ట్ర సమైక్యత కోసం పాటుపడిన వారిలో బ్రహ్మానందరెడ్డి ముఖ్యులు.

## కేంద్ర మంత్రిగా...

కేంద్ర మంత్రిగా పలు శాఖల బాధ్యతలు చేపట్టారు. కమ్యునికేషన్లు, హోంశాఖ, పరిశ్రమల శాఖల మంత్రిగా కేంద్రంలో పని చేశారు.

( తరువాయి 8వ పేజీలో)


మా ఖాతాదారులకు, శ్రేయోభిలాషులకు
దసరా, దీపావళి శుభాకాంక్షలు
తిరుమల
పాలు మరియు పాల పదార్థములు
అసలైన స్వచ్ఛతకు, చిక్కదనానికి
తిరుమల పాలదే !
సిసలైన అభిమానం
తెలుగిళ్ళ వారిదే !!
స్వచ్ఛమైన మనసుతో
ఆదరించారు, ఆంధ్ర
ఆడపడుచులు... స్వచ్ఛమైన
'తిరుమల' పాలను
ఆ అభిమానమే తిరుమలను విజయపథంలో
నడిపిస్తుంది... అదే స్ఫూర్తితో మరిన్ని సరికొత్త
ఉత్పాదనలు, సరికొత్త ప్యాకింగ్‌లలో మీకందిస్తున్నాం.
ఈ విజయం మహిళా లోకానికే అంకితం
అగ్‌మార్క్ ప్రమాణాలతో, తిరుమల నెయ్యి
మరియు ఆవునెయ్యి ఇప్పుడు
మరింత ఆకర్షణీయమైన జార్లలో లభ్యం
APలో తిరుమల నెయ్యి డిస్ట్రిబ్యూషన్ కొరకు
(ఖాళీ ఉన్న ప్రాంతాలకు మాత్రం)
సంప్రదించండి
An ISO 9001 : 2000 Certified Company
బొల్లా బ్రహ్మనాయుడు
మేనేజింగ్ డైరెక్టర్
తిరుమల మిల్క్ ప్రోడక్ట్స్ ప్రై. లిమిటెడ్
డిపో ప్లాట్ 128, విజయపురి కాలనీ, ఆర్.కె.పురం దిల్‌షుక్‌నగర్, హైదరాబాద్-35. ఫోన్ : 24141179/55601179
రిజిష్టర్డ్ ఆఫీస్ : నరసరావుపేట, గుంటూరు జిల్లా. ఫోన్ : 08647-232677
ఫ్యాక్టరీ కడివేడు - గూడూరు, నెల్లూరు జిల్లా. ఫోన్ : 08624-255277
Purity
Quality
THIRUMALA
AGMARK SPECIAL GRADE
GHEE
Manufactured by:
TIRUMALA MILK PRODUCTS (P) LTD
Kadivedu Village, Gudur, Nellore (Dist), AP
Ph : 08624-255277, 255298 Fax: 255288

# కాకలు తీరిన యోధుడు

(6వ పేజీ తరువాయి)

కమ్యూనికేషన్‌ల శాఖ మంత్రిగా టెలిఫోన్ సౌకర్యాన్ని ప్రజలకు మరింత చేరువు చేయటానికి ఆయన కృషి చేశారు. హోంశాఖ మంత్రిగా, కేంద్ర పాలిత ప్రాంతాల్లో రాష్ట్రాలుగా ఏర్పాటు చేసి, వాటికి స్వయం ప్రతిపత్తిని కల్పించటంలో కాసు చేసిన కృషి ఎంతో వుంది. ఆరవ ఫైనాన్స్ కమిషన్ అధ్యక్షుడుగా పని చేశారు.

## రాష్ట్రంలో రెడ్డి కాంగ్రెస్ ఏర్పాటు...

1977లో కాంగ్రెస్ కేంద్రంలో అధికారాన్ని కోల్పోయింది. ఆ తరువాత భారత మాజీ ప్రధాని ఇందిరా గాంధీతో బ్రహ్మానందరెడ్డికి విభేదాలు ఏర్పడ్డాయి. దీంతో అఖిల భారత కాంగ్రెస్ నిలువునా చీలింది. ఒక వర్గానికి ఇందిరాగాంధీ, మరో వర్గానికి కాసు బ్రహ్మానందరెడ్డి నాయకత్వం వహించారు. ఈ సందర్భంలోనే రెడ్డి కాంగ్రెస్ పార్టీని బ్రహ్మానందరెడ్డి స్థాపించారు.

ఈ సందర్భంగా జరిగిన అసెంబ్లీ ఎన్నికల్లో రెడ్డి కాంగ్రెస్ పార్టీ పోటీ చేసింది. కొందరు ఎమ్మెల్యేలుగా కూడా పార్టీ తరపున ఎన్నికయ్యారు. అనంతరం జరిగిన రాజకీయ పరిణామాల్లో 1980లో తిరిగి కాంగ్రెస్ (ఐ)లో బ్రహ్మానందరెడ్డి చేరి, అదే పార్టీపై నరసరావుపేట నుంచి పార్లమెంట్‌కు ఎన్నికయ్యారు. 19 82లో కాంగ్రెస్ సమన్వయ అధ్యక్షుడుగా వున్నారు. మహారాష్ట్ర గవర్నర్‌గా కూడా పని చేశారు. జాతీయ, రాష్ట్ర రాజకీయాల్లో తన దైన బాణిలో రాజకీయాలను నెరపిన మేరు మగధీరుడు కాసు బ్రహ్మానందరెడ్డి. ఆయన 1994 మే 20న హైదరాబాద్‌లో మరణించారు.



సాగర్ డ్యాం ప్రారంభోత్సవంలో అప్పటి భారత ప్రధాని ఇందిరా గాంధీతో కాసు బ్రహ్మానంద రెడ్డి

# నాటి బిలంకొండే... నేటి బెల్లంకొండ

(ఆన్‌లైన్, పిడుగురాళ్ళ)

ప్రతి ఊరికి ఒక చరిత్ర ఉంటుంది. వింటూ పోతే చాలా విచిత్రమనిపిస్తుంది. ఈ ధరా మండలంలో గడిచిపోయిన చరిత్ర అంతరిస్తూనే దాని గుర్తులను విడిచిపెట్టి వెళ్ళిపోతుంది. గతకాలపు పొరల కిందదాగిన చారిత్రక ఆధారాలను పట్టుకుంటే ఆ ఊరి పుట్టు, పూర్వోత్రాలు ఇట్టే తెలిసిపోతాయి. గ్రామాల చరిత్రను, వాటినామాల నేపథ్యాన్ని వివరించే చిన్న ప్రయత్నమే ఈ 'గ్రామనామం'.

గుంటూరు జిల్లాలోని చారిత్రాత్మక ప్రదేశాల్లో పెదకూరపాడు నియోజకవర్గంలోని బెల్లంకొండ ఒకటి. కృష్ణానది దక్షిణతీరంలో విస్తరించుకున్న ప్రాంతమిది. చుట్టూ చిట్టడివి. నల్లని కోటగోడల్లా పొడవుగా నిలిచి వున్న కొండలు. దుప్పు చెట్లు. రాతిమయమైన నేలతో బెల్లంకొండ చూడటానికి చాలా ఆహ్లాదభరితంగా ఉంటుంది. దీని చరిత్ర చాలా పురాతనమైనది. ఇతిహాస కథలతో ముడిపడి రాచరిక పాలనతో కళకళలాడిన ప్రదేశమిది.

## నాడు 'బిలం'కొండ

ప్రస్తుతం బెల్లంకొండగా పిలవబడుతున్న గ్రామం నాడు బిలంకొండగా పిలవబడింది. ఇక్కడి కొండమీది భౌగోళిక స్థితిని బట్టి, బిలం, దొన, ఎత్తయిన శిఖరాలతో నిండి దుర్గమారణ్యంగా ఉండేది. వీటన్నింటితో నిండిన కొండ కాబట్టే దీనిని 'బిలం'కొండగా పిలిచారు. కొండమీద నుండి చూస్తే కనుచూపుమేర కృష్ణానది ప్రవాహ దశ కనులకు విందుచేస్తుంది. ఆనందంతో మనిషిని తన్మయత్వంలో పడేసే పచ్చని చెట్లు, ఆహ్లాదకరమైన వాతావరణం, బండలోనుండి ఊరే స్వచ్ఛమైన నీరు, తేనకంటే తీపిని కలిగిన నీరు ఇక్కడ ఇప్పటికీ కనపడతాయి. ఏకాగ్రతకు, ప్రశాంతతకు నిలయంగా ఉన్న ఈ ప్రదేశంలో భృగుమహర్షి ఆశ్రమాన్ని నెలకొల్పి తపస్సును ఆచరించినట్లు చరిత్ర చెబుతోంది. ఆయనతోపాటు మరెందరో ఋషులు, తపస్సంపన్నులు ఈ కొండమీది గుహల్లో, బిలంలో తపస్సు చేసుకుంటూ ఆత్మానందం, చైతన్యం పొందినట్లు చరిత్ర చెబుతోంది. క్రీ.శ. 1050 నుంచి క్రీ.శ.1290 వరకు వెల్లనాడు, పల్లవనాడులలోని ఈ బిలంకొండ రెండవ గొంకరాజు సామంత రాజ్యంగా ఉంటూ వచ్చిందని తెలుస్తుంది.

## ఇతిహాసాలలో ఇది ఏకచక్రపుర అగ్రహారం

బిలంకొండ నుండి బెల్లంకొండగా పిలవబడుతున్న ఈ ప్రదేశం ఇతిహాసాల్లో కూడా స్థానాన్ని దక్కించుకుంది.

(మిగతా 12లో)



కొండపై నుండి బెల్లంకొండ వ్యూ



రాజులకు తాగునీరిచ్చిన రాతి కొలను

పదవులకు వన్నెతెచ్చిన

# పద్మభూషణుడు


వావిలాల గోపాలకృష్ణయ్య

(ఆన్‌లైన్, సత్తెనపల్లి)

బడుగు వర్గాలకు బాసటగా నిలిచి వారికి ఉపాధి కల్పించడం కోసం అహర్నిశలు శ్రమించిన ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు, పద్మభూషణ్ బిరుదాంకితుడు, సత్తెనపల్లి ముద్దుబిడ్డడు వావిలాల గోపాలకృష్ణయ్య.ఆయన జీవితాన్ని ఒకసారి పునరావలోకనం చేస్తే 1906లో సత్తెనపల్లిలో జన్మించిన వావిలాల నాటి సమాజంలోని రుగ్మతలను దూరం చేయాలనే సదుద్దేశంతో ఎన్నో పోరాటాలను నడిపారు. రైతులు, రైతుకూలీలకు న్యాయం జరిగేందుకు ఎన్నో రైతాంగ పోరాటలు నిర్వహించారు.

సాధారణ వ్యక్తిత్వం కలిగి, అసామాన్యంగా జీవించిన వావిలాల 2003 ఏప్రిల్ 29వ తేదీన పరమపదించారు. కుళ్ళు రాజకీయాలకు వ్యతిరేకంగా గాంధీ సంచితో ఎక్కడికైనా కాలినడకన పోవడం ఆయన నైజం. ఎంఎల్ఏగా ఉన్నా లగ్జరీ జీవితానికి అలవాటుపడక నేటి రాజకీయ రంగానికి తలమానికంగా నిలిచారనడంలో సందేహం లేదు. స్వాతంత్ర్య సమరయోధునిగా, ఎం ఎల్ ఏగా సమాజానికే ఆదర్శప్రాయంగా నిలిచిన వావిలాల చరిత్ర పుటల్లో చిరస్థాయిగా నిలిచిపోయారు.

మద్యపాన నిషేధ ఉద్యమంలో అలుపెరగని పోరాటం సాగించి ఉద్యమాన్ని విజయవంతం చేశారు.

స్వాతంత్ర్య పోరాటానికి సంబంధించిన కమిటీలకు సలహాదారునిగా, రథసారథిగా వ్యవహరించారు. 1952లో అప్పటి ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూతో స్వయంగా మాట్లాడి నాగార్జునసాగర్ ప్రాజెక్టు సాధనలో కీలకపాత్ర వహించారు. ఆంధ్రప్రదేశ్‌లో జవహర్‌లాల్ నెహ్రూ అత్యంత ఆత్మీయంగా గౌరవించే వ్యక్తులలో వావిలాల ఒకరనడంతో సందేహం లేదు.

## వావిలాల నిర్వహించిన పదవులెన్నో.....

1951లో శాంతిసంఘం రాష్ట్ర అధ్యక్షునిగా, ప్రాథమిక విద్యా కమిటీలో సభ్యునిగా, బేసిక్ ఆంధ్రా, వెంకటేశ్వర, ఉస్మానియా, నాగార్జున విశ్వవిద్యాలయాల సెనెట్ సభ్యునిగా పనిచేశారు. అంతేగాకుండా సోవియట్ యూనియన్‌లో జరిగిన శాంతి మహాసభలకు భారత ప్రతినిధిగా, అధికార బాషా కమీషన్‌కు ప్రథమ అధ్యక్షునిగా, ప్రపంచ తెలుగు మహాసభల నిర్వహకునిగా కూడా వావిలాల గోపాలకృష్ణయ్య పనిచేశారు. ముంబై పొట్టి శ్రీరాములు విశ్వ విద్యాలయంలో నిర్వహించిన అఖిలభారత తెలుగు మహాసభలకు ఆయన ప్రతినిధిగా పాల్గొన్నారు. ప్రముఖుల ప్రశంసలతో పాటు పలు పురస్కారాలను అందుకున్నారు.

## పద్మభూషణ్ పురస్కారం

కాకలు తీరిన పార్లమెంటేరియన్లు స్వర్గీయ పుచ్చలపల్లి సుందరయ్య, అచార్య ఎన్‌జి రంగావంటి నాయకులతో ప్రజా ప్రతినిధిగా పనిచేసిన వావిలాల అందరికీ ఆదర్శప్రాయుడుగా నిలిచారు. స్వలాభాపేక్ష లేకుండా నిస్వార్థంగా చేసిన సేవలను గుర్తించిన భారత ప్రభుత్వం పద్మభూషణ్ పురస్కారాన్ని అందించి వావిలాలను ఘనంగా సత్కరించింది. వావిలాల స్మృతికి చిహ్నంగా సత్తెనపల్లి రైల్వేస్టేషన్ రోడ్డులో పైలాన్ ఏర్పాటు చేశారు.

## చరిత్ర సృష్టించిన గోపాలకృష్ణయ్య

1952లో ఏర్పడిన సత్తెనపల్లి శాసనసభ నియోజకవర్గానికి వరుసగా నాలుగుసార్లు స్వతంత్ర అభ్యర్థిగా ఎన్నికై వావిలాల చరిత్ర సృష్టించారు. 1952,1955,1962,1967లో జరిగిన నాలుగు దఫాల ఎన్నికల్లో ఆయన ఘనవిజయం సాధించారు. విచిత్రమైన విషయమేమిటంటే వావిలాల తరువాత 1972 నుంచి నేటివరకు ఎంఎల్ఏగా పనిచేసిన ఏ ఒక్కరూ తిరిగి రెండవసారి గెలుపొందలేదు. శాసనసభ్యునిగా సత్తెనపల్లి ప్రాంత అభివృద్ధికి వావిలాల ఎనలేని కృషిచేశారు. గుంటూరు-మాచర్ల రైల్వే లైనును బ్రాడ్‌గేజ్‌గా మార్చడం, జూనియర్ కళాశాలకు సొంతభవనాల నిర్మాణానికి నిధులు సమకూర్చడం, సత్తెనపల్లి ప్రాంత యువతకు ఉపాధి కల్పించేందుకు శాతవాహన స్పిన్నింగ్ మిల్లును ఏర్పాడుచేయడం, సాగర్ కాలువల ప్రధాన కార్యాలయాలను సత్తెనపల్లిలో ఏర్పాటుచేయడం ఆయన చేసిన పనుల్లో అతిముఖ్యమైనవి.

## మరచిన నేతలు

గోపాలకృష్ణయ్యను నేటి పాలకులు మరిచారు. గోపాలకృష్ణయ్య మృతి అనంతరం సత్తెనపల్లి రైల్వేస్టేషన్ ప్రాంతంలో వావిలాలఘాట్‌ను నిర్మించారు. ఈ ప్రాంతంలో పార్కు ఏర్పాటు చేస్తామని అప్పటి ముఖ్యమంత్రి నారా చంద్రబాబునాయుడు వావిలాల జ్ఞాపకార్థం 70లక్షల రూపాయల నిధులు కూడా మంజూరు చేశారు.

అయినా నేటికి చంద్రబాబు హామీ అమలు కాకపోవటం విశేషం. కాంగ్రెస్ ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తర్వాత సత్తెనపల్లిలో వావిలాల విగ్రహాన్ని ఏర్పాటు చేయించారు. వావిలాలఘాట్ అభివృద్ధికి మాత్రం కృషిచేయలేదు. వావిలాల స్మృతికి చిహ్నంగా ఏర్పాటుచేసిన పైలాన్‌కూడా నేడు శిథిలావస్థలో ఉంది. వావిలాల నివసించిన

(తరువాయి 12వ పేజీలో)

# NARASARAOPETA ENGINEERING COLLEGE

Kotappakonda Road, Yellamanda P.O.NARASARAOPET-522601, (A.P), Ph:08647-230093, 230811

(Approved by AICTE & Affiliated to JNTU, Hyderabad) (Sponsored by **GAYATRI EDUCATIONAL DEVELOPMENT SOCIETY**)

EAMCET Code:NSPE Email: nrtec_principal@yahoo.com Established in 1998 Website: www.nrtenggcollege.com

| Rated as "EXCELLENT" by ABVP<br>Infosys Campus Connect Centre | JAWAHAR KNOWLEDGE CENTER<br>(Center of Excellence)<br>(Going for NBA accreditation) | Rated as one of 32 colleges for innovative practices by AICTE<br>TCS Accrdited |
|---|---|---|

## COURSES OFFERED

**B.Tech**

- C.S.E. - 120
- I.T. - 90
- E.C.E. - 120
- E.E.E. - 60
- M.E. - 60

**P.G.**

- **M.C.A.** (Master of Computer Applications) - 180
- **M.B.A.** (Master of Business Administration) - 60

**P.G.**

- **M.Tech** (Digital Electronics & Communication Systems) - 18
- **M.Tech** (Power & Industrial Drives) - 18
- **M.Tech** (Computer Science & Engineering) - 18
- **M.Tech** (Digital Systems & Computer Electronics) - 18







## Providers of Global UG & PG Quality Technical Manpower

GATE RANKS : Year 2004-24/ 2005-23/ 2006-30/ 2007-25

**FACILITIES:**

● Library with 26,000 books and 166 joumals, periodcals & transactions. ● All laboratories are fully equipped and supported by UPS of 140 KVA and Standby Generators of 125 KVA and 82.5 KVA. ● Total Number of computers: 700. ● Bus facility from Guntur. ● Seperate Hostels for boys in the city & for Girls in the campus. ● Internet facilities to staff & students and SONET facilities. ● English Language Laboratory. ●Training for CATE, GRE, TOEFL, CAT, etc., ● Full fledged Training & Placement Cell.

**CAMPUS INTERVIEWS & PLACEMENT ASSISTANCE :**

● College is **ACCREDITED BY TCS**. ● 265 Engineers of 2006 batch have already got jobs in reputed companies like IBM, Infosys. TCS, Satyam, Vertex, Macromedia, Kenexa, HCL Technologies, Virtusa, SGC Systems, Montek Software, Zoom Technologies, DELL, Southerland, Value Labs, Honeywell, Bharat Electronics, Vijaya Electricals, VST Power Station, HAL, Mastek Technologies, Impetu Soft, Radiant Infosystems, IEG etc., ● 179 Engineers of 2007 batch have already got jobs in Wipro, IBM, Satyam, Syntel, Infosys, Slash Support, Hexawear, Essar steel, Cummins, CES, HCL, etc. ● 118 Engineers of 2008 batch have already got jobs in - TCS, Wipro, Syntel, Infosys. 5 more companies - IBM, Satyam, L&T Infotech, CTS and L&T are going to interview our students in July/Aug 2007.

***Dr.B.V.RAMA MOHANA RAO,*** *PRINCIPAL*

Our another college at Narasaraopet from the academic year 2007-08

## NARASARAOPETA INSTITUTE OF PHARMACEUTICAL SCIENCES

Kotappakonda Road, Yellamanda Post, Narasaraopet, Pin-522601, Ph.No.08647-230811

**B Pharmacy - 60**

Our another college at Guntur: EAMCET CODE:MPLG,

# SRI MITTAPALLI COLLEGE OF ENGINEERING

(Sponsored by SRI MITTAPALLI TRUST), Approved by AICTE, New Delhi & Affiliated to JNTU, Hyd.
Tummalapalem, On NH-5, GUNTUR-522 233, Ph:0863-2288691, 92, 93, 94. Cell: 98485 30315, 98481 51522,

❖ The College in a peaceful location on N.H-5, Between Guntur and Chilakaluripet at Tummalapalem. ❖ Experienced Faculty and Principal are Employed. ❖ Personality development, Training and Placement assistance will be provide. ❖ The College is equipped with adequate library facility, latest computers and laboratory equipments as per AICTE & JNTU norms. ❖ Bus facility from Guntur and seperate Hostel are available.





| B.Tech, COURSES OFFERED: | Intake |
|---|---|
| 1. Computer Science & Engg | 90 |
| 2. Information Technology | 60 |
| 3. Electronics & Communication Engineering | 60 |
| 4. Electrical & Electronics Engineering | 60 |
| 5. MCA (Master of Computer Applications) | 60 |

**Dr.Ing. B.Kanaka Raju,**
B.E. (Mech.) M.e.(Auto), Dr-ING, (Germany)
PRINCIPAL

**Mittapalli Venkata Koteswara Rao**
Founder & Chairman
Narasaraopeta Engineering College &
Sri Mittapalli College of Engineering, Guntur
Narasaraopet Institute of Pharmaceutical Sciences

# పదవులకు వన్నెతెచ్చిన...

(10వ పేజీ తరువాయి)

గృహం కూడా శిథిలావస్థలో ఉంది. నాయకులెవరూ శిథిలావస్థలో ఉన్న పైలాన్ గురించి కూడా పట్టించుకున్న దాఖలాలు లేవు.

పార్కుకోసం కేటాయించిన నిధులు కూడా గుంటూరు మళ్లించినట్టు తెలిసింది. స్వలాభాపేక్ష లేకుండా నిస్వార్థంగా సేవలందించిన వావిలాల స్మృతికి చిహ్నంగా సత్తెనపల్లిలోని పార్కు ఏర్పాటుచేసి పైలాన్‌ను అభివృద్ధి చేసినప్పుడే ఆయనకు నిజమైన నివాళులని పట్టణ ప్రజలు అంటున్నారు. వావిలాల బంధువులు కూడా గుంటూరులో ఉంటూ వావిలాల గ్రంధాలయాన్ని అభివృద్ధి చేయటంపై దృష్టి సారించారు. గుంటూరు తరలించిన నిధులతో కూడా అభివృద్ధి కార్యక్రమాలు చేపడుతున్నట్టు తెలిసింది.

## నూలుమిల్లు తెరిపించడమే వావిలాలకు నిజమైన నివాళి

వావిలాల కలల సాకారమైన శాతవాహణ స్పిన్నింగ్ మిల్లు మూతపడం సత్తెనపల్లి ప్రాంతానికి ప్రధాన సమస్యగా పరిణమించింది. దానిని తిరిగి తెరిపించేందుకు ఇంతవరకు ప్రభుత్వం ఎటువంటి చర్యలు తీసుకోలేదు. మూతపడ్డ శాతవాహన స్పిన్నింగ్ మిల్లు తెరిపించడమే ప్రభుత్వం వావిలాలకు ఇచ్చే ఘననివాళి అని సత్తెనపల్లి ప్రాంత ప్రజలు అంటున్నారు.



అధ్వాన్నంగా మారిన వావిలాల ఘాట్

# నాటి బిలంకొండే...



కొండపై కోటలోకి స్వాగతం పలికే రాతి దర్గా

(8వ పేజీ తరువాయి)

ఇతిహాసాల్లో ఈ బిలంకొండను ఏకచక్రపుర అగ్రహారంగా వ్యవహరించారు. మహాభారత కాలంనాటి పుటలను తిరగేస్తే ఈ బిలంకొండలో పంచ పాండవులు నివశించినట్లు తెలుస్తోంది. పంచపాండవులు అరణ్యావాసం చేస్తూ కొంతకాలం ఇక్కడ నివశించారని, అప్పట్లో బ్రాహ్మణ వేషధారులై ఒక బ్రాహ్మణోత్తముని ఇంట ఆశ్రయం పొందారని చెప్పబడుతోంది. ఇక్కడే కొండమీద బకాసురుడు అనే రాక్షసుడు ఉండి అగ్రహారీకులను బాధిస్తుండగా భీమసేనుడు అతనిని సంహరించినట్లు ఇక్కడి ప్రజలు నమ్ముతారు. ఈ నమ్మకానికి గుర్తుగా బిలంకొండకు అతి సమీపంలో బకాసురుని గుట్ట, భీముని తిప్ప అనే ప్రదేశాలు సాక్షాత్కరిస్తాయి.

## బెల్లంకొండ నామ నేపథ్యం

బిలంకొండ, ఏకచక్రపుర అగ్రహారంగా పిలవబడిన బెల్లంకొండను క్రీ.శ. 1420 ప్రాంతంలో కొండవీడును పాలించిన రెడ్డిరాజులు హస్తగతం చేసుకున్నారు. ఉచ్ఛరణలో మార్పునొంది బిలంకొండ బెల్లంకొండగా వ్యవహరించబడుతుందని గ్రామానికి చెందిన పలువురు తెలిపారు. రెడ్డిరాజుల హయాంలో బెల్లంకొండపైన పెద్దకోట నిర్మాణం జరిగినట్లు ప్రస్తుతం ఉన్న శిథిలాల ద్వారా తెలియవస్తోంది. ఇక్కడి కొండకు అటూ ఇటూ కనిపించే రెండు బురుజులు, లోపలికి స్వాగతం పలికే రాతి కట్టడమైన దర్గా, కొండపైన విశాలమైన ప్రదేశం ఉన్నాయి. వీటితో పాటు సర్వమత సామరస్యానికి దర్పణం పట్టే హైందవ, ముస్లిం ప్రార్ధనా మందిరాలు ఉన్నాయి. రాజులు పాలించిన కాలంలో నడిపిన రథచక్ర గుర్తులు బండలపై ఇప్పటికీ కన్పిస్తున్నాయి.

(మిగతా 17లో)



బెల్లంకొండ కొండపై రాజులు నివాసమున్న రాతిస్తంభం మేడలు



రాజులు ఏలిన కొండపై కొలువున్న నాగేంద్రుడు

# అక్షరజ్యోతి "ఆంధ్రజ్యోతి" కి

# శుభాకాంక్షలు





శ్రీమతి సోనియాగాంధీ
ఎ.ఐ.సి.సి. అధ్యక్షురాలు



డా॥వై.ఎస్. రాజశేఖరరెడ్డి
రాష్ట్రముఖ్యమంత్రివర్యులు

ఆంధ్రజ్యోతి 5 వసంతాలు
పూర్తి చేసుకొని **6వ వసంతం** లోకి
అడుగిడుతున్న శుభతరుణంలో భవిష్యత్తులో
మరెన్నో ఉన్నత శిఖరాలను అధిరోహించాలని
కోరుకుంటూ "**ఆంధ్రజ్యోతి**" యాజమాన్యానికి,
సిబ్బందికిపాఠకులకు తెనాలి పార్లమెంట్ నియోజకవర్గ
ప్రజానీకానికి **దసరా,దీపావళి, క్రిస్టమస్**
మరియు నూతన సంవత్సర
**శుభాకాంక్షలు...**

మీ

# వల్లభనేని బాలశౌరి

**పార్లమెంటు సభ్యులు, తెనాలి**

# మన ఎంపిలు, ఎమ్మెల్యేలు



కన్నా లక్ష్మీనారాయణ
పెదకూరపాడు ఎమ్మెల్యే, రవాణా మంత్రి



మోపిదేవి వెంకటరమణ , కూచినపూడి ఎమ్మెల్యే,
ఓడరేవులు, విమానయాన శాఖ మంత్రి



గాదె వెంకటరెడ్డి, బాపట్ల ఎమ్మెల్యే



తాడిశెట్టి వెంకటరావు, గుంటూరు -2 ఎమ్మెల్యే



గుదిబండి వెంకటరెడ్డి, దుగ్గిరాల ఎమ్మెల్యే



జంగా కృష్ణమూర్తి, గురజాల ఎమ్మెల్యే



రాయపాటి సాంబశివరావు
ఎంపి గుంటూరు



వల్లభనేని బాలశౌరి
ఎంపి తెనాలి



దగ్గుబాటి పురందేశ్వరి, ఎంపి బాపట్ల
కేంద్ర మానవ వనరుల సహాయ మంత్రి



జెడి శీలం
రాజ్యసభ సభ్యుడు



లాల్‌జాన్ బాషా
రాజ్యసభ సభ్యుడు



మేకపాటి రాజమోహన రెడ్డి
ఎంపి నరసరావుపేట



ధూళిపాళ్ల నరేంద్ర
ఎమ్మెల్యే పొన్నూరు



మర్రి రాజశేఖర్
ఎమ్మెల్యే చిలకలూరిపేట



షేక్ నంబూరు సుభాని
ఎమ్మెల్యే గుంటూరు-1



పిన్నెల్లి లక్ష్మారెడ్డి
ఎమ్మెల్యే మాచర్ల



డొక్కా మాణిక్యవరప్రసాద్
ఎమ్మెల్యే తాడికొండ



యర్రం వెంకటేశ్వరరెడ్డి
ఎమ్మెల్యే సత్తెనపల్లి



సోమరౌతు సతీష్ పాల్‌రాజ్
ఎమ్మెల్యే వేమూరు



కాసు కృష్ణారెడ్డి
పౌరసరఫరాల శాఖ మంత్రి



మురుగుడు హనుమంతరావు
సర్వశిక్షా అభియాన్ శాఖ మంత్రి



నాదెండ్ల మనోహర్, తెనాలి ఎమ్మెల్యే



దేవినేని మల్లికార్జునరావు, రేపల్లె ఎమ్మెల్యే



రావి వెంకటరమణ, ప్రత్తిపాడు ఎమ్మెల్యే



మక్కెన మల్లికార్జునరావు, వినుకొండ ఎమ్మెల్యే

# పుడమి పుత్రులకు వ్యవ'సాయం'

(ఆన్‌లైన్-బాపట్ల)

పుడమి పుత్రుల సేవలో 60 వసంతాలు పూర్తిచేసుకొని 61వ సంవత్సరంలోకి అడుగుపెడుతున్న బాపట్ల వ్యవసాయ కళాశాల ఎందరో విద్యార్థులకు, రైతులకు సేవలందించి అగ్రగామిగా నిలిచింది. గుంటూరుజిల్లాలోని బాపట్ల వ్యవసాయ కళాశాల పలు పరిశోధనలు చేస్తూ అత్యున్నత ఫలితాలు సాధించి వ్యవసాయ శాస్త్రవేత్తలకు పుట్టినిల్లుగా అంతర్జాతీయ ఖ్యాతిని గడించింది.

భారతదేశ స్వాతంత్ర్యానికి ముందు బ్రిటిష్ పాలకుల హయాంలో ఆంధ్రరాష్ట్రాన్ని అన్నపూర్ణగా తీర్చిదిద్దే ప్రయత్నంగా దక్షిణాది రాష్ట్రాలలోని కోయంబత్తూరు తర్వాత ఆంధ్రప్రదేశ్‌లోని ప్రప్రథమంగా ఈ కళాశాలను బాపట్లలో 70ఎకరాల విస్తీర్ణంలో 1945 జూలై 11న ప్రారంభించారు. అప్పటి తాలూకా బోర్డు అధ్యక్షుడు పాముల పాటి వెంకట కృష్ణయ్యచౌదరి, వ్యవసాయ సంచాలకులు డాక్టర్ బి.వి.నాథ్, అప్పటి జిల్లా కలెక్టర్ ఎం.డి.సుల్తాన్ మొహిద్దీన్‌ల కృషితో ఆవిర్భవించిన ఈ కళాశాల అప్పటి మద్రాసు సలహాదారుడైన సాంబి వెంకట రామ్మూర్తి ప్రారంభించారు.

## ఉద్దండుల కార్ఖానా

కళాశాలలో పట్టభద్రులైన విద్యార్థులు, జాతీయ,అంతర్జాతీయ స్థాయిల్లో పలురంగాల్లో ఉన్నత కీలక పదవులను నిర్వహిస్తున్నారు.ఐపిఎస్,ఐఎఎస్,ఐఆర్ఎస్, బ్యాకింగ్ రంగాలతో పాటు రాజకీయ, పారిశ్రామిక వేత్తలుగా అత్యున్నత స్థానాల్లో పేరు ప్రఖ్యాతులు గడిస్తున్నారు. అంతర్జాతీయ ఉష్ణమండల వ్యవసాయ పరిశోధన కేంద్రం నైజీరియా మాజీ డైరెక్టర్ డాక్టర్ ఎన్.వి.ఎస్.శాస్త్రి, ఎరిడ్ జాన్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్ సంచాలకులుగా పనిచేసిన డాక్టర్ జి.వెంకటేశ్వర్లు, కేంద్రియ పరిశోధన సంస్థ డైరెక్టర్‌గా పనిచేసిన డాక్టర్ బత్తిన వెంకటేశ్వర్లు, ఆచార్య ఎన్.జి.రంగా వ్యవసాయ విశ్వవిద్యాలయం, వైస్ చాన్స్‌లర్‌గా పనిచేసిన ఐ.వి.సుబ్బారావు, మాజీ కేంద్ర మంత్రి డాక్టర్ ఉమ్మారెడ్డి వెంకటేశ్వర్లు, హైదరాబాదు దూరదర్శిని కేంద్రం డిప్యూటీ డైరెక్టర్ ఆర్.ఆర్.మిశ్రా, డిఐజి మాలకొండయ్య తదితరులు ఈ కళాశాలలో విద్యనభ్యసించిన వారే.

## దినదిన ప్రవర్థమానమై....

కాగా గతంలో ఆంధ్ర విశ్వవిద్యాలయం అనుబంధంగా వున్న ఈ కళాశాల 1964లో ఆంధ్రప్రదేశ్‌లో అగ్రికల్చర్ యూనివర్సిటీ పరిధిలోకి చేర్చారు. ప్రస్తుతం ఆచార్య ఎన్.జి.రంగా అగ్రికల్చర్ యూనివర్సిటీ పరిధిలో వుంది. 1970-71లో రజోత్సవ వేడుకలు, 1994-95లో వ్యవసాయ కళాశాల స్వర్ణోత్సవ వేడుకలు, 2004-2005 వజ్రోత్సవ వేడుకలు జరుపుకొంది. మానవ వనరుల అభివృద్ధి పథకం కింద (ఎ.హెచ్.ఆర్.డి) ప్రపంచ బ్యాంకు, ఎఫ్ఓ సౌజన్యంతో వ్యవసాయ కళాశాల అధ్యాపకులు 11మంది సాంకేతిక విజ్ఞానం పెంపొందించుకోవడానికి విదేశాల్లో శిక్షణ పొందారు. అదే విధంగా అయిదుకోట్ల రూపాయల వ్యయంతో అత్యాధునిక వ్యవసాయ పరికరాలు కొనుగోలు చేసి

(తరువాయి 17వ పేజీలో)



బాపట్ల వ్యవసాయ కళాశాల

# పుడమి పుత్రులకు...

( 16వ పేజీ తరువాయి)

విద్యార్థులకు విద్యా బోధనను ఆడియో విజువల్స్ ద్వారా అందిస్తున్నారన్నారు. వ్యవసాయ పరంగా రైతన్నలకు వ్యవసాయ సాంకేతిక పరిజ్ఞానాన్ని చేరువ చేసేందుకు ప్రతి మూడు సంవత్సరాలకు ఒక గ్రామాన్ని ఎంపిక చేసి వ్యవసాయ రంగంలో వ్యవసాయ ఉత్పత్తులు పెంచేందుకు వ్యవసాయ కళాశాల దత్తత గ్రామం పథకాన్ని అమలు చేస్తోంది. వ్యవసాయ కళాశాల ఆవరణంలో డాక్టర్ బి.వి.నాథ్ ఆ డిటోరియం, రైతులకు అతిథి గృహం, బాలికల వసతి గృహాలు, బాలుర వసతి గృహాలతో పాటు పిజి హాస్టల్,పెవిలియన్, జిమ్ కాంప్లెక్స్ ప్రాంతీయ గ్రంథాలయం, జెసిబోస్ బిల్డింగ్,విద్యార్థుల పరీక్షా కేంద్రాల భవన సముదాయాలు ఉన్నాయి. వీటితో పాటు విద్యార్థుల మానసిక వ్యక్తిత్వ వికాసం కోసం ఆరోగ్య వ్యాయామశాలలను ఏర్పాటు చేశారు. ఎన్ఎస్ఎస్, ఎన్‌సిసి యూనిట్ల విభాగాలు ఉన్నాయి. విద్యార్థుల భవిష్యత్ కోసం స్టూడెంట్ కౌన్సెలింగ్, ప్లేస్‌మెంట్ సెల్, అగ్రికల్చరల్ రీసెర్చి ఇన్ఫర్మేషన్ సెంటర్లు ఏర్పాటు చేశారు.

### శాఖోపశాఖలుగా విస్తరిస్తూ...

ఇంతటి ప్రాముఖ్యత సంతరించుకొన్న కళాశాలకు బాపట్ల-గుంటూరు రోడ్డులో రైల్వేగేట్ వద్ద 400 ఎకరాల విస్తీర్ణం గల వ్యవసాయ క్షేత్రం వుంది. అత్యధిక ప్రాధాన్యత సంతరించుకొన్న బిపిటి వరి వంగడాన్ని తయారు చేసిన ఘనత బాపట్ల శాస్త్రవేత్తలదే. ఈ క్షేత్రంలో పలు వ్యవసాయ పరిశోధన కేంద్రాలతో పాటు, వ్యవసాయ కళాశాలలో 30 రకాల వివిధ భాగాల అధిపతులు,అధ్యాపకులు, వ్యవసాయ కళాశాల అసోసియేట్ డీన్‌గా డాక్టర్ కె.భాస్కరరావు విశేష సేవలందిస్తున్నారు. కళాశాలతో పాటు ఆధునిక కాలానికి కావలసిన టెక్నాలజీ అందించిన దిశగా బాపట్ల వ్యవసాయ ఇంజనీరింగ్ కళాశాల ఏర్పాటు జరిగింది. ఈ కళాశాలకు అసోసియేట్ డీన్‌గా డాక్టర్ టి.వి.సత్యనారాయణ వ్యవహరిస్తున్నారు. వీటితో పాటు ఆచార్య ఎన్.జి.రంగా ఫుడ్ టెక్నాలజీ కళాశాలను హోమ్ సైన్సు కళాశాల ప్రాంగణంలో ఏర్పాటు చేశారు. దీనికి అసోసియేట్ డీన్‌గా డాక్టర్ సి.సుబ్బారెడ్డి వ్యవహరిస్తున్నారు. ఆంధ్రప్రదేశ్ నీటి యజమాన్య ప్రాజెక్టు, మత్స్య పరిశోధనస్థానం,జీడి మామిడి పరిశోధన స్థానం, ఉప్పునీటి పరిశోధన స్థానం, వరి వంగడాల పరిశోధన స్థానం, తమలపాకు పరిశోధన స్థానం బాపట్లలో అనుబంధ రీసెర్చి ఇనిస్టిట్యూట్‌గా పనిచేస్తున్నాయి. ఈ కళాశాల బాపట్లలో ఉండటం బాపట్లకే తలమానికం.

# నాటి బెల్లంకొండే...



ఏనుగులు నడిచినట్లు చెప్పబడుతున్న ద్వారాలివి

(12వ పేజీ తరువాయి)

విశాలమైన కోనేర్లు, నేతి గదులు, రాజులకు చల్లటి నీటినిచ్చే రాతి బండలు, ఏనుగులు నడిచిన ద్వారాలు బెల్లంకొండ గత చరిత్రకు సాక్షీభూతాలవుతున్నాయి.

### ప్రస్తుతం చిన్న పంచాయతీ

ఎంతో చారిత్రక నేపథ్యాన్ని కలిగిన బెల్లంకొండ 1952లో పంచాయతీగా ఏర్పడింది. అతి తక్కువమంది జనాభావున్న ఈ పంచాయతీకి సయ్యద్ సైదా ఆదాం, బద్దూరి పున్నారెడ్డి, దేవరశెట్టి శ్రీనివాసరావు, చావలి ఏసు, గోపయ్య, ఆలా సుబ్బయ్య, బెల్లంకొండ షరీఫ్, ప్రస్తుతం పి. ఎస్.కె. మస్తాన్‌షరీఫ్‌లు సర్పంచులుగా ఎన్నికయ్యారు. పంచాయతీలోని మొత్తం జనాభా సంఖ్య 5వేలు కాగా, మహిళలు 2,400, పురుషులు 2600 మంది ఉన్నారు. వీరిలో ఓటర్లు 2,780 మంది ఉన్నారు. గ్రామంలో సుమారు 100 కుటుంబాల్లో 300 మంది ఎస్‌సి జనాభా, 30 కుటుంబాల్లో 200 మంది ఎస్‌టి జనాభా, 150 కుటుంబాల్లో 700 మంది బిసి జనాభా, 400 కుటుంబాల్లో 4 వేలమంది ఓసి జనాభా నివాసముంటున్నారు. పంచాయతీకి ఏటా ఇంటిపన్ను, నీటిపన్ను, గ్రాంట్లుపై వచ్చే శిస్తు రూపేణా సుమారు 3 లక్షల రూపాయలు ఆదాయం లభిస్తుంది. గ్రామానికి తూర్పున కొత్తపాలెం, ఉత్తరాన బెల్లంకొండ కొండ, దక్షిణాన నందిరాజుపాలెం, పడమరన మాచాయపాలెం సరిహద్దులుగా ఉన్నాయి. ఈ గ్రామంలో నివాసముంటున్న ప్రజల ప్రధాన జీవనాధారం వ్యవసాయం. గ్రామ పరిధిలోని సాగుభూముల్లో వరి, పత్తి, మిరప పంటలు పండుతున్నాయి. కాలక్రమేణా ఎంతో చారిత్రక నేపథ్యమున్న బెల్లంకొండ చిన్న పంచాయతీగానే మిగిలినప్పటికీ గత చరిత్రకు గుర్తులుగా నిలిచిన కట్టడాలు మాత్రం ఇప్పటికీ కనువిందు చేస్తాయి. ఎంతో పెద్దవిగా ఉండే పురాతన దేవాలయాలు, పీర్లచావిడిలు పలువురిని ఆకట్టుకుంటాయి.





సర్వమత సమానం... రాజుల కొండపైని హైందవ, ముస్లింల దేవాలయం

# SIBAR INSTITUTE OF DENTAL SCIENCES

Recognized by Govt. of India, Govt. of A.P.and N.T.R. Health University
Takkellapadu, Guntur - 522 509, Ph: 2292249, 2292149



డా॥ యల్.కృష్ణప్రసాద్
ప్రిన్సిపాల్

సిబార్ దంత వైద్య కళాశాల



మొబైల్ వాహనంలో పార్లమెంటు సభ్యులు శ్రీ రాయపాటి సాంబశివరావుకు పరీక్ష చేస్తున్న సిబార్ వైద్యులు








భజరంగ జూట్ మిల్ కార్మికులకు నిర్వహించిన దంత వైద్య శిబిరం

బోడిపాలెం దంత వైద్య శిబిరం

## సిబార్ దంత వైద్య కళాశాల ప్రత్యేకతలు :

1. ఆధునిక పరికరాలతో, అన్ని దంత విభాగాలతో ఉన్న దంత వైద్యశాల.
2. నిష్ణాతులైన దంత వైద్య నిపుణులు, అనుభవుజ్ఞులైన దంత వైద్య ఆచార్యులతో బి.డి.ఎస్., ఎం.డి.ఎస్., విద్యార్థులకు విద్య నేర్పుతున్న కళాశాల.
3. Medical Subjects Training at Prestigious Govt. General Hospital, Guntur & NRI Medical College.
4. పచ్చని, కాలుష్య రహిత పరిసరాలతో ఏర్పాటు చేయబడి చుట్టుప్రక్కల గ్రామ, పట్టణ ప్రజలకు అందుబాటులో వున్నది.
5. విద్యార్థులకు మానసిక ప్రశాంతత, మనోవికాసము, పెంపొందించుటకు అందుబాటులో యోగా శిక్షణ.
6. విద్యార్థులకు, తల్లిదండ్రులకు కౌన్సింగు చేయుటకు ప్రత్యేక ఏర్పాటు.
7. విద్యార్థిని, విద్యార్థులకు అన్ని వసతులతో విడిగా హాస్టల్ సౌకర్యం ఏర్పాటు చేయటమైనది. రుచికరమైన ఆహారంతో అందుబాటులో మెస్.
8. విద్యార్థుల శరీర దారుఢ్యంనకు ఇన్ డోర్, అవుట్‌డోర్ ఆటల సదుపాయం మరియు అందుబాటులో ఉన్న వైద్యనిపుణులు మరియు శిక్షకులు.

## సిబార్ దంత వైద్య కళాశాల ప్రత్యేక చికిత్స విభాగాలు :

1. సాధారణ దంత వైద్య విభాగము (Oral Medicine)
2. దంత శస్త్ర చికిత్సా విభాగము (Oral Surgery)
3. రూట్ కెనాల్ చికిత్సా విభాగము (Conservative Dentistry)
4. ఎత్తు, వంకర పళ్లు సరిచేయు విభాగము (Orthodontics)
5. పళ్లు కట్టు విభాగము (Prosthodontics)
6. చిన్న పిల్లల పళ్ల విభాగము (Pedodontics)
7. దంతరోగ నిర్ధారణ విభాగము (Oral Pathology)
8. సామాజిక సేవా విభాగము (Community Dentistry)
9. చిగుళ్ళ వ్యాధుల చికిత్సా విభాగము (Periodontics)

### ఉచిత దంత వైద్య శిబిరాలు

**డా॥ ఎల్.సుబ్బారావు,** యం.యస్., గారి ఆధ్వర్యంలో కమ్యూనిటీ డెంటిస్ట్రీ విభాగము నిర్వహణలో వివిధ గ్రామాలలో వారానికి రెండు ఉచిత దంత వైద్య శిబిరాలు జిల్లాలోని అన్ని గ్రామాలలో నిర్వహిస్తున్నారు. ఈ దంత వైద్య శిబిరాలలో ఉచితంగా దంత వైద్య పరీక్షలు నిర్వహించి మందులు పంపిణీ చేస్తున్నారు. మరియు హెచ్.ఐ.వి. ఎయిడ్స్ గురించి అవగాహన సదస్సులు కూడా నిర్వహిస్తున్నారు.

**❊ కోస్తా ఆంధ్రలో ఉన్న ఒకే ఒక M.D.S. & B.D.S. కోర్సులు ఉన్న దంత వైద్య కళాశాల ❊**

# దాచేపల్లిలో సిరులు రాలుస్తున్న సిమెంట్

## మరో మూడు పరిశ్రమల ఏర్పాటుకు సన్నాహాలు

స్ఫూర్తి ప్రదాతలకు పుట్టినిల్లుగా ఉన్న దాచేపల్లి ప్రముఖ సిమెంటు ఉత్పాదక కేంద్రంగా విలసిల్లబోతోంది. అపారమైన సున్నపురాయి నిల్వలు గల ఈ ప్రాంతంపై పారిశ్రామికవేత్తలు దశాబ్దాల క్రితమే దృష్టిసారించారు. ఇటీవల సిమెంటు పరిశ్రమ బూమ్ ప్రభావంతో ఒక్కసారిగా పలు కంపెనీలు కొత్తగా తమ సిమెంటు వ్యాపారానికి ఈ ప్రాంతాన్ని అనుకూలమైనదిగా నిర్ణయించుకొని పథకాలకు శ్రీకారం చుట్టారు.



శ్రీనగర్‌లోని ఆంధ్రా సిమెంట్ ఫ్యాక్టరీ

(ఆన్‌లైన్, దాచేపల్లి)

భూగర్భ వనరుల ఆసరా, అందివచ్చిన రైలు, రోడ్డు సౌకర్యాల మూలంగా దాచేపల్లి మండలం పారిశ్రామికంగా అభివృద్ధి చెందనుంది. సిమెంటు పరిశ్రమ కేంద్రంగా కొత్తపుంతలు తొక్కనున్నంది.

### 5వేల మంది కార్మికులకు ఉపాధి

సున్నపురాయిని ముగ్గుగా చేసి వివిధ ప్రాంతాలకు సరఫరా చేయటం, దానిని కోళ్లమేతగాను, పంచదార పరిశ్రమలోనూ, పలు కెమికల్ పరిశ్రమల్లో ముగ్గును వాడతారు. స్థానిక సున్నపురాయి క్వారీలలో సుమారు 5వేల మంది కార్మికులు ఉపాధి పొందుతున్నారు. స్థానికంగా సున్నపురాయి ఆధారితంగా 27 పల్వరైజ్డ్ మిల్లులు ఉన్నాయి. 1950 ప్రాంతంలో విజయవాడలో నెలకొల్పిన ఆంధ్రాసిమెంట్స్ కర్మాగారానికి అవసరమైన సున్నపురాయి కోసం మండలంలోని నడికూడిలో సుమారు 400 ఎకరాల భూమిలో మైన్స్‌ను ప్రారంభించింది.

### ఆంధ్రాసిమెంట్స్‌తో ఆరంభం

1983లో గామాలపాడు శివారులో ఆంధ్రాసిమెంట్స్ సంస్థ దుర్గా సిమెంట్స్ పేరుతో నూతనంగా కర్మాగారాన్ని స్థాపించింది. కర్మాగారానికి అవసరమైన లైమ్‌స్టోన్ నిమిత్తం ఫ్యాక్టరీకి ఆనుకునే గామాలపాడు మైన్స్‌ను ప్రారంభించింది. సాలీనా లక్ష టన్నుల సున్నపురాయి ఉత్పత్తి ఈ మైన్స్‌లో జరుగుతోంది. సుమారు 4వేల మెట్రిక్ టన్నుల సిమెంటును ఈ సంస్థ ఉత్పత్తి చేస్తూ వందలాది కుటుంబాలకు ఉపాధి కల్పిస్తోంది. దీనికి అనుబంధంగా మరికొన్ని కుటుంబాలు జీవనం సాగిస్తున్నాయి.

### మరో మూడు కర్మాగారాలకు ఏర్పాట్లు

ఇటీవల కాలంలో సిమెంటుకు అనూహ్యంగా డిమాండ్ ఏర్పడటంతో పలువురు పారిశ్రామిక వేత్తలు సిమెంటు రంగంవైపు దృష్టి సారించి కర్మాగారాలు స్థాపించుటకు చేసిన అన్వేషణలో వారికి దాచేపల్లే అనువైన ప్రాంతంగా కన్పించింది. దీంతో ప్రస్తుతం మండల పరిధిలో మరో మూడు సిమెంటు కర్మాగారాల నిర్మాణానికి సన్నాహాలు జరుగుతున్నాయి.

దాచేపల్లికి చేరువలోనే నడికూడి- బూదవాడల మధ్య 'అంబుజా' సిమెంట్స్ భారీ కర్మాగారం నిర్మాణం నిమిత్తం సుమారు 700 ఎకరాల భూమిని కొనుగోలుచేసింది. ఫ్యాక్టరీ నిర్మాణం త్వరలో చేపడతారని తెలుస్తోంది. అనతికాలంలో మార్కెటింగ్ పరంగా పేరుప్రఖ్యాతలు పొందిన మైహోం సిమెంట్స్ సంస్థ సిమెంటు కర్మాగారం నిర్మాణానికి గామాలపాడు, శ్రీనగర్‌లలో సుమారు 8 ఎకరాల భూమిని కొనుగోలుచేసి మరో మూడునెలలో కర్మాగారం శంకుస్థాపనకు సన్నాహాలు చేస్తోంది.

(మిగతా 20వ పేజిలో)



మైహోం సిమెంట్స్ కర్మాగారం నిర్మాణానికి కొనుగోలు చేసిన పంటపొలాలు

# దాచేపల్లిలో సిరులు రాలుస్తున్న సిమెంట్

(19వ పేజీ తరువాయి)

దీంతో ఏడాది క్రితం వరకు ఈప్రాంతంలో 60,70వేలు పలికిన భూమిధర ఇప్పుడు లక్షల్లో ఉంది. అదేవిధంగా తంగెడ, ముత్యాలంపాడు గ్రామాల పరిధిలో 'భవ్యా' సిమెంట్స్ సంస్థకూడా కర్మాగారం నిర్మాణం నిమిత్తం సుమారు 600 ఎర కాల భూమిని కొనుగోలు చేసింది. తక్కెళ్లపాడు, పెద గార్లపాడు గ్రామాల మధ్య మరో ప్రముఖ సిమెంటు సంస్థ కర్మాగారం నిర్మాణానికి స్థల సేకరణకు సిద్ధ మౌతుంది. అదేవిధంగా కేంద్రస్థాయిలో పదవి నిర్వ హిస్తున్న ఒక ప్రజాప్రతినిధికి చెందిన కంపెనీ సిమెంటు కర్మాగార నిర్మాణానికి పొందుగల, శ్రీన గర్ గ్రామాల మధ్య స్థల పరిశీలన జరిపినట్లు తెలి సింది.

ఈ ఫ్యాక్టరీల నిర్మాణాలు ప్రారంభమైతే సిమెంటు ఉత్పత్తికి దాచేపల్లి కేంద్ర స్థానం కాగలదు. అద్దంకి- నార్కట్‌పల్లి స్టేట్‌హైవే నాలుగు రోడ్ల మార్గంగా మార్చుటకు ప్రభుత్వం పచ్చజెండా ఊప టంతో రోడ్డురవాణా సౌకర్యం మరింత సులభంకాగ లదు. అదేవిధంగా తంగెడ- మట్టపల్లిల మధ్య కృష్ణా నదిపై రోడ్డు వంతెన నిర్మాణానికి ప్రభుత్వం ఇప్ప టికే నిర్ణయం తీసుకోవటంతో దాచేపల్లి నుండి నల్గొండ జిల్లాలోని కోదాడ, ఖమ్మం జిల్లాకు రవాణా సౌకర్యం మరింత అనుకూలంగా ఉంటుంది. నడి కూడి- శ్రీకాళహస్తిల మధ్య కొత్త రైలు మార్గం నిర్మిం చాలన్న దీర్ఘకాల ప్రతిపాదన వచ్చే రైల్వే బడ్జెట్‌లో అనుమతి రాగలదని తెలుస్తోంది.

దీంతో ఒకప్పుడు వెనుకబడిన ప్రాంతంగా, తొండలు గుడ్డులు పెట్టే ప్రాంతం, దేనికి పనికిరాని భూములుగా పరిగణించిన పొలాల నుండి నేడు సిమెంటు రూపంలో సిరులు కురుస్తుండటంతో మండల ప్రజల్లో హర్షాతిరేకాలు వ్యక్తమవుతు న్నాయి. ఏదేమైనప్పటికీ రానున్న కాలంలో మండ లంలో నిరుద్యోగ సమస్య పూర్తిగా తీరిపోతుందని, ఉపాధి అవకాశాలు మెండుగా లభిస్తాయని తద్వారా మండలం ఆర్థికంగా ఎంతో ప్రగతి సాధిస్తోంది.



ముగ్గు పరిశ్రమకు పేరుగాంచిన నడికూడిలోని పల్వరైజ్డ్ మిల్లులు

పారిశ్రామిక ప్రపంచంలో

# కాంతిపుంజం

**మారుమూల పల్లెలోపుట్టి మహోన్నతులుగా పెరిగిన వారు చాలామంది మనకు కనిపిస్తారు. అటువంటి వ్యక్తులలో అంతర్జాతీయ గుర్తింపు పొందిన వ్యక్తి వెలగపూడి రామకృష్ణ. గుంటూరు జిల్లా ఆణిముత్యాలలో ఒకరైన వెలగపూడి ఉన్నత లక్ష్యాల దిశగా తన జీవితానికి బాటలు వేసుకున్నారు. చిన్న తనంలోనే పంచదార తయారుచేయడంలో ప్రయోగాలు చేసి బాల పారిశ్రామిక వేత్తగా పేరు సంపాదించారు. చెరుకు ముక్క లను తలుపుచెక్కల సందున నలిపి రసాన్ని చిన్నపిడతలో పట్టి, పొయ్యిమీద కాచి చెక్కర తయారీకి ఏనాడో శ్రీకారం చుట్టారు. దక్షిణభారతంలో పారిశ్రామికీకరణకు పాదులు వేసిన వెలగపూడి సేవలు చిరస్మరణీయం.**



వెలగపూడి రామకృష్ణ

(ఆన్‌లైన్ - నగరం)

వెలగపూడి రామకృష్ణ పరిశ్రమల స్థాపన ద్వారా దేశ ఆర్థికాభి వృద్ధికి బాటలు వేశారు. బ్రిటీష్ ప్రభుత్వంలో లేబర్ కమిషనర్‌గా నియమితుడైన తొలి భారతీయుడిగా చరిత్ర సృష్టించారు. ఐ.సి.ఎస్ అధికారిగా, పారిశ్రామికవేత్తగా, విద్యావేత్తగా ఆయన అందించిన సేవల దృష్ట్యా వెలగపూడి రామకృష్ణను ప్రతిష్టాత్మకమైన కాకతీయ వంశాంకురంగా అభివర్ణించారు ప్రొఫెసర్ ఎన్‌జి రంగా. జన్మభూమి పట్ల ఆరాధనతో స్థాపించిన పంచదార ఫ్యాక్టరీ విఫలం కావడంతో ఆయన 1969లో నగరంలో డిగ్రీకళాశాల నిర్మాణానికి సకలసౌక ర్యాలు సమకూర్చారు. వెలగపూడి రామకృష్ణ నగరం మండలం బెల్లంవారిపాలెంలో 1896లో సుబ్బయ్య, కాంతమ్మ దంపతులకు జన్మించారు. రేపల్లె, తెనాలిలలో హైస్కూలు చదువు ముగించుకుని 1913లో ఉన్నత విద్యకోసం ఇంగ్లండు వెళ్ళారు. ఎడింబరో, ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయాలలో గణితం, తత్వశాస్త్రం, ఫిజిక్స్, కెమిస్ట్రీ, బయాల జిలను అధ్యయనం చేశారు. 1920లో ఆయన ఐ.సి.ఎస్‌కు ఎంపికై నారు. 1922లో ఇసిస్ ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులై తిరిగి వచ్చిన వెంటనే చెంగల్పట్టు జిల్లాకు అసి స్టెంటు కలెక్టరుగా నియమితులైనారు. బ్రిటీష్ ఇండియాలో ఆయన చెయ్యని ఉద్యోగం లేదు. అండర్ సెక్రటరీ, కలెక్టర్, డిస్ట్రిక్ట్ మెజిస్ట్రేటు, పరిశ్రమలశాఖ డైరెక్టరు, కేంద్ర ప్రభుత్వ డిప్యూ టీసెక్రటరీ, నేషనల్ సర్వీసెస్ లేబర్‌ట్రిబ్యూనల్ చైర్మన్, పారిశ్రామిక సలహాదారు, డెవలప్ మెంట్ కమిషనర్, మద్రాసు ప్రభుత్వ ఎక్స్‌అఫీ షియో (మిగతా 21వ పేజీలో)

## పారిశ్రామిక ప్రపంచంలో కాంతిపుంజం

(20వ పేజి తరువాయి)

సెక్రటరీ, లేబర్ కమిషనర్, జయపూర్ దివాన్ తదితర పదవులను నిర్వహించి 1947లో ఉద్యోగానికి రాజీనామా సమర్పించారు. లేబర్‌కమిషనర్‌గా ఆదివాసీల జీవనవిధానాన్ని మెరుగుపరిచేందుకు ప్రత్యేక శ్రద్ధ చూపారు. పరిశ్రమలతోపాటు సాంకేతిక విద్యపై ఆయనకు మక్కువ ఎక్కువ. ఉయ్యూరులో పాలిటెక్నిక్, కాకినాడ, వాల్తేరులలో ఇంజనీరింగ్ కళాశాలలు వెలగపూడి రామకృష్ణ కృషి ఫలితంగానే ఏర్పడ్డాయి. బొగ్గువాయువుతో వాహనాలు నడిపే ప్రక్రియకు ఆయనే ఆద్యుడు. రెండోప్రపంచయుద్ధకాలంలో ఏర్పడ్డ పెట్రోలు కొరత నుంచి వాహనాలను ఆదుకునేందుకు ఆయన చేసిన కృషి మానవజాతి మరువరానిది. కృషికి తగినట్లుగా ఆయనను బ్రిటీష్ ప్రభుత్వం సి.ఐ.ఇ(భారత సామ్రాజ్య స్నేహితుడు) అనే బిరుదుతో గౌరవించింది. జయపూర్ దివానుగా ఉన్నసమయంలో మాచ్‌ఖండ జలవిద్యుత్ ప్రాజెక్టు మార్బుల్ స్టోన్ ఫ్యాక్టరీలు, డిస్టిలరీలు, పెంకుల తయారీ పరిశ్రమలు, పంచదార పరిశ్రమలు, ఫెర్రో మాంగనీసు ఫ్యాక్టరీలు, తదితర అనేక కర్మాగారాలు ఏర్పాటు చేసిన ఘనత వెలగపూడి రామకృష్ణదే. 1934లో ఉయ్యూరులో సహకారచక్కెర కర్మాగారం ఏర్పాటు చేశారు.

### 1941లో కెసిపి సంస్థ ఏర్పాటు

1941లో కెసిపి సంస్థను ఏర్పాటుచేసి నష్టాల్లో వున్న పరిశ్రమలకు ఊపిరి పోశారు. ప్రాజెక్టుల నిర్మాణానికి కూడా ఆయన అందించిన సహకారం చెప్పుకోతగ్గది.

### 1958లో మాచర్లలో సిమెంటు ఫ్యాక్టరీ నిర్మాణం

1958లో మాచర్లలో సిమెంటు ఫ్యాక్టరీని నిర్మించి నాగార్జున సాగర్, శ్రీశైలం జలవిద్యుత్ ప్రాజెక్టుల నిర్మాణానికి సిమెంటు సరఫరా చేశారు. రాజకీయ రంగంలో కూడా రాణించిన రాజనీతిజ్ఞుడు వెలగపూడి రామకృష్ణ. చట్ట నిర్మాణ సభలకు, చట్టసభలకు కూడా ఆయన ఎంపికైనారు.

### మద్రాసు శాసన మండలిలో సభ్యత్వం

1952లో మద్రాసు శాసనమండలి ఆయనకు సభ్యత్వాన్నిచ్చి గౌరవించింది. ఆసియాలోనే అతి పెద్దదయిన కెసిపి వర్క్‌షాపును మద్రాసులో ఏర్పాటు చేసి అనుబంధంగా పాలిటెక్నిక్ కాలేజిని కూడా పెట్టారు. తెనాలిలో డిగ్రీకళాశాల స్థాపనకు(1952లో) లక్షరూపాయల భూరివిరాళం ఇచ్చిన ఉదారుడు. ఆయన నగరంలో డిగ్రీకాలేజి ఏర్పాటుకు నిధులతోపాటు 30 ఎకరాల స్థలం, సిబ్బంది నివాసాలకు పక్కాభవనాలు సమకూర్చి జన్మభూమి రుణం తీర్చుకున్న ముక్తసంగుడాయన. ప్రొఫెసర్ ఎన్‌జిరంగా, వివిగిరి వంటి ప్రముఖుల సాంగత్యంలో విప్లవాలకు శ్రమదానం చేసిన కృషీవలుడు వెలగపూడి రామకృష్ణ. ప్రభుత్వాలకేగాక ప్రముఖులకు కూడా సలహాదారుగా ఆయన పేరెన్నికగన్నారు.

# కృష్ణాతీరం

## ఆధ్యాత్మిక సుగంధాల నిలయం



శ్రీ సంగ నాగమల్లేశ్వరస్వామి ఆలయం

(ఆన్‌లైన్...తాడేపల్లి)

కృష్ణాతీరం ఆధ్యాత్మికతా నిలయంగా పేరుగాంచి భక్తజనులను భక్తి పారవశ్యంలో ముంచుతూ... ఆనందసాగరంలో ఓలలాడిస్తోంది. గుంటూరు జిల్లా తాడేపల్లి మండలంలోని సీతానగరం వద్ద, కరకట్ట వద్ద కృష్ణాతీరానికి వస్తే అక్కడి ఆలయాలు, ఆశ్రమాలు భక్తులను భక్తిపారవశ్యంలో తేలియాడేవిధంగా చేస్తున్నాయి.

కృష్ణాతీరాన సీతానగరంలో సుమారు వందేళ్ల క్రితమే స్వయంభువుగా వెలసిన శ్రీమద్ వీరాంజనేయ సమేత కోదండరామాలయం కనిపిస్తూ వుంటుంది. ప్రతిముఖ్య పండుగలకు, కార్తీకస్నానాలకు, పుణ్యస్నానాలకు కృష్ణాతీరానికి విచ్చేసిన భక్తజనులు తప్పనిసరిగా ఈ ఆలయం వద్దకు విచ్చేసి ప్రత్యేక పూజలు నిర్వహించి వెళ్తూవుంటారు. ప్రస్తుతం ఈ ఆలయం మరింత అభివృద్ధి చెందేవిధంగా చూసేందుకు విజయవాడ కనకదుర్గమ్మ ఆలయం వారు దత్తత తీసుకుని కాటేజిలు నిర్మించి భక్తులకు సౌకర్యాలు ఏర్పాటు చేసేందుకు కృషి చేస్తున్నారు. ఈ ఆలయంలో శ్రీ రాజరాజేశ్వర స్వామి ఆలయం ప్రసిద్ధి గాంచింది. ఈ ఆలయానికి సమీపంలో శివాలయం, పక్కనే కృష్ణాతీరంలో శ్రీ అయ్యప్పస్వామి వారి ఆలయం, దర్శనమిస్తాయి. అయ్యప్ప స్వామివారి ఆలయాన్ని కొండపైన ఏర్పాటు చేశారు. శ్రీమద్ వీరాంజనేయస్వామివారి ఆలయానికి ఎదురుగా పుష్కరఘాట్‌ల వద్ద (మిగతా 22పేజిలో)



జీయర్ స్వామి వారి ఆశ్రమం



చినజీయర్ స్వామివారి ఆశ్రమంలో పూజ చేస్తున్న వేద విద్యార్థులు

# కృష్ణాతీరం

(21వ పేజి తరువాయి)

శ్రీ సంగ నాగమల్లేశ్వరస్వామి వారి ఆలయం ప్రసిద్ధి చెందింది. ఈ ఆలయానికి సమీపంలోని రామకృష్ణామిషన్ పేరు ప్రఖ్యాతులు పొందినది.

## ఆశ్రమాలు

సీతానగరంలో కృష్ణాతీరాన శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చినజీయరుస్వామి వారి ఆశ్రమం దేశంలోనే పేరు ప్రఖ్యాతులు గాంచింది. శ్రీ స్వామివారి ఆధ్వర్యంలో ఏర్పాటైన జీయరు ఎడ్యుకేషనల్ ట్రస్టు వేద విశ్వవిద్యాలయాన్ని ఏర్పాటు చేసి వేదాన్ని, ఉపనిషత్తులను తదితర విద్యలను వేద విద్యార్థులకు బోధించి వేదాల పరిరక్షణకు కృషి చేస్తున్నారు. కాగా, కృష్ణాతీరాన కరకట్ట మార్గంలో శ్రీ గణపతి సచ్చిదానంద స్వామివారికి జయదుర్గాతీర్థం పేరు ప్రఖ్యాతులు గాంచింది. (మిగతా 23లో)



దత్తపాదుకలు



సీతానగరం శ్రీమద్ వీరాంజనేయస్వామి

## అభివృద్ధి పథంలో వినుకొండ నియోజక వర్గం



శ్రీ మక్కెన మల్లికార్జునరావు
శాసనసభ్యులు, వినుకొండ



శ్రీ కాసు వెంకట కృష్ణారెడ్డి
రాష్ట్ర పౌరసరఫరాల శాఖామాత్యులు



శ్రీ కన్నా లక్ష్మీ నారాయణ
రాష్ట్ర రవాణా శాఖామాత్యులు



శ్రీ మోపిదేవి వెంకటరమణ
ఓడలు, రేవుల శాఖామాత్యులు



శ్రీ మురుగుడు హనుమంతరావు
సర్వశిక్ష అభియాన్ శాఖామాత్యులు



శ్రీమతి నేదురుమల్లి రాజ్యలక్ష్మి
శిశు సంక్షేమ & జిల్లా ఇన్‌ఛార్జి

- పంచాయతీరాజ్‌లో 120 కీ॥మీ తారు రోడ్ల నిమిత్తం ( పియంజియస్‌వై) మరియు నా బోర్డు పథకం క్రింద 20 పనులకు మంజూరు కాబడిన నిధులు 25.06 కోట్లు.
- రహదారులు మరియు భవనముల శాఖ అభివృద్ధి పనుల నిమిత్తం 75కిలోమీటర్ల తారు రోడ్లు మరియు ఏనుగుపాలెం బ్రిడ్జి నిర్మాణం కొరకు మంజూరుకాబడిన నిధులు 16.72కోట్లు .
- యన్‌యస్‌పి కాలువ పనులు మరియు ఆటోమిషన్ కొరకు మంజూరు కాబడిన నిధులు 9.75 కోట్లు.
- విధ్యుత్ శాఖలో నాలుగు సబ్ స్టేషన్లు మరియు వివిధ పనుల నిమిత్తం మంజూరు కాబడిన నిధులు 8.43కోట్లు.
- నియోజకవర్గ వివిధ గ్రామాలలో 7కిలోమీటర్లు సిసి.రోడ్డు కొరకు (జడ్‌పి/యంపి/యంయల్‌ఎ) మరియు మండల పరిషత్ నిధుల నుండి 750 పనులకు గాను మంజూరైన నిధులు 7.83 కోట్లు.
- నియోజకవర్గంలోని గ్రామాలలో త్రాగునీరు అభివృద్ధి పథకముల (అర్.డబల్యూ. యస్) క్రింద మంజూరు కాబడిన నిధులు 8.40కోట్లు.
- ఇందిరప్రభ సమగ్ర భూమి అభివృద్ధి పథకము మరియు వాటర్ షెడ్ పథకము క్రింద మంజూరు కాబడిన నిధులు 5.06కోట్లు .
- వినుకొండ పురపాలక సంఘ అభివృద్ధి పనుల నిమిత్తం మంజూరు కాబడిన నిధులు 3.33 కోట్లు .
- గృహనిర్మాణ ఆధ్వర్యంలో 9.598 గృహములకు మంజూరు కాబడిన నిధులు 26.19కోట్లు.
- ఎత్తు పోతల పథకం క్రింద 1.130 ఎకరములకు సాగు నీటిని అందించుటకు మంజూరు కాబడిన నిధులు 3.18 కోట్లు .
- మైనర్ ఇరిగేషన్ అభివృద్ధి ఎర్రవాగు చెరువు మరియు ఇతర చెరువుల అభివృద్ధి పనులకు మంజూరు కాబడిన నిధులు 2.40 కోట్లు.
- డిపిఇపి క్రింద 86 స్కూలు భవనములు నిర్మాణం కొరకు మంజూరు కాబడిన నిధులు 1.161 కోట్లు .
- సాంఘీక సంక్షేమ శాఖ అభివృద్ధి పనుల నిమిత్తం యస్.సి.2, యస్.టి. 3, హాస్పటల్స్ నిర్మాణం కొరకు మరియు హాస్టల్స్ రిపేరు కొరకు మంజూరైన నిధులు 1.27 కోట్లు
- జిల్లా పరిషత్ స్కూలు అభివృద్ధి కొరకు నాబోర్డు ద్వారా మంజూరు కాబడిన నిధులు 1.05కోట్లు



శ్రీ వై.యస్. రాజశేఖర రెడ్డి
రాష్ట్ర ముఖ్యమంత్రి వర్యులు

## కృష్ణాతీరం

(22 తరువాయి)

దత్త పాదుకలు ఇక్కడ ప్రతిష్ఠించారు. ప్రతినెలలో ఇక్కడ ప్రత్యేక పూజలు, పండుగలప్పుడు యజ్ఞాలు సైతం స్వామిజీ పర్యవేక్షణలో జరుపుతూ వుంటారు. వెంకటపాలెం వెళ్లే దారిలో కరకట్ట వద్ద శ్రీ కృష్ణుని ఆలయం 'ఇస్కాన్' ఏర్పాటు చేయబడింది.

(మిగతా24లో)



శ్రీమద్ వీరాంజనేయస్వామి ఆలయం









# కృష్ణాతీరం...

(23 పేజి తరువాయి)

శ్రీకృష్ణుని భక్తులు అధికంగా ఇక్కడకు విచ్చేసి భక్తిభావంతో పండుగలప్పుడు ప్రత్యేక పూజలు నిర్వహిస్తుంటారు. కాగా, కృష్ణా తీరానికి సుమారు రెండు కిలోమీటర్ల దూరంలో తాడేపల్లి మండల పరిషత్ కార్యాలయానికి సమీపంలో పూజ్యశ్రీ మాతా శివచైతన్యానందిని ఆధ్వర్యంలోని చైతన్యతపోవన్ పేరు గాంచింది. ఇక్కడి వానప్రస్థకుటీర్, పాఠశాల పేరు గాంచాయి. దీనితో కృష్ణాతీరం ఆధ్యాత్మికతా వైభవంతో విలసిల్లుతుందని చెప్పవచ్చు.



శ్రీ అయ్యప్ప స్వామివారి ఆలయం



కరకట్ట రోడ్డులోని ఇస్కాన్ ఆలయం



కృష్ణాతీరంలోని జయదుర్గాతీర్థం

# రైతు సంక్షేమం కోరే వై.యస్. నాయకత్వాన్ని బలపరచాలి


శాసన మండలి ఛైర్మన్ చక్రపాణి, తనయుడు మోహన్‌సాయికృష్ణతో ఎమ్మెల్సీ డాక్టర్ రాయపాటి శ్రీనివాస్


శ్రీమతి సోనియాగాంధి
ఎఐసిసి అధ్యక్షురాలు


శ్రీ వై.ఎస్. రాజశేఖరరెడ్డి
రాష్ట్రముఖ్యమంత్రి


స్వర్గీయ ఇందిరాగాంధి


స్వర్గీయ రాజీవ్‌గాంధి


లాంఫారం రైతు సదస్సులో సిఎం డాక్టర్ వైయస్‌కు జ్ఞాపికను అందిస్తున్న ఎంపి రాయపాటి, ఎమ్మెల్యే వరప్రసాద్

ఆంధ్రజ్యోతి 5

ఆంధ్రుల
అభిమాన పత్రిక
ఆంధ్రజ్యోతి
నాల్గవ వార్షికోత్సవం సందర్భంగా
ఆంధ్రజ్యోతి
యాజమాన్యానికి, సిబ్బందికి శుభాకాంక్షలు

**సోనియాగాంధి నాయకత్వంలో ప్రధాని**
**మన్‌మోహన్‌సింగ్ ప్రభుత్వంలో రాష్ట్రంలో**
**ముఖ్యమంత్రి డా॥ వైఎస్ రాజశేఖరరెడ్డి నాయకత్వంలో**

★ రాష్ట్ర ప్రభుత్వం పేద ప్రజల సంక్షేమానికి నిరంతరం కృషిచేస్తుంది.
★ పేద ప్రజలకు ఉచిత విద్యుత్ అమలు
★ అప్పుల భారంతో ఉన్న రైతులకు విద్యుత్ బకాయిల రద్దు.
★ 25 పైసల వడ్డీకే డ్వాక్రా సంఘాలకు రుణాలు
★ 25 రూపాయల మినిమమ్ విద్యుత్.

బిల్లులు చెల్లించే ప్రజలకు పదిరూపాయల సబ్సిడీ...
ఇంకా ఎన్నెన్నో మేలైన పథకాలు అమలు చేస్తున్న
కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు మద్దతు తెలుపుదాం.


కేంద్ర మంత్రి ఆస్కార్ ఫెర్నాండెజ్ దంపతులను సత్కరిస్తున్న డాక్టర్ రాయపాటి శ్రీనివాస్


నగరపాలక సంస్థ ఎన్నికల సందర్భంగా కార్పోరేటర్‌గా పోటీచేస్తున్న సాయికృష్ణకు మద్దతుగా ప్రచారం నిర్వహిస్తున్న పిసిసి ఛీఫ్ కేశవరావు, ఎమ్మెల్యేలు వరప్రసాద్, వెంకటరమణ


2004 ఎన్నికల ప్రచారానికి విచ్చేసిన సోనియాను గజమాలతో సత్కరిస్తున్న రాయపాటి సోదరులు


ఎమ్మెల్సీగా ప్రమాణ స్వీకారం చేసిన సోదరుడు డాక్టర్ శ్రీనివాస్‌ను అభినందిస్తున్న ఎంపి రాయపాటి


ఎమ్మెల్సీగా ఎన్నికైన డాక్టర్ రాయపాటిని అభినందిస్తున్న సిఎం డాక్టర్ వైయస్


శాసన మండలి సభ్యుడిగా ప్రమాణ స్వీకారం చేస్తున్న డాక్టర్ రాయపాటి శ్రీనివాస్


రాయపాటి సాంబశివరావు
ఎం.పి., గుంటూరు


రాయపాటి సాయి మోహనకృష్ణ
1వ డివిజన్ కార్పొరేటర్


డా॥ రాయపాటి శ్రీనివాస్
ఎమ్మెల్సీ

# 'కోయీా - నహీ - నూర్'

## 'పులిచింతల'తో కనుమరుగు కానున్న కోళ్లూరు

## కోహినూర్ చరిత్ర

గుంటూరు జిల్లాలోని కోళ్లూరును సింహకేతుమహరాజు పాలించే వాడు. తన కుమారుని జ్ఞాపకార్థం కోడలికి తరుణంగా ఇచ్చిన కోడలూరే కోళ్లూరుగా ప్రసిద్ధి చెందిందని చరిత్ర చెబుతోంది. ఓ రైతు పాలం దున్నుతుండగా వెలుగులు విరజిమ్ముతూ ఒక రాయి దొరకడంతో దాన్ని తమ ప్రభువుపై భక్తితో రాజు వద్దకు తీసుకు వెళ్లాడు. అది చూసిన ఆ రాజు 'కోయీా - నహీ - నూర్' అన్నట్లు చెబుతారు. దీంతో అప్పటి నుంచి ఆ వజ్రానికి 'కోహినూర్' వజ్రంగా వినుతి కెక్కినట్లు నానుడి.



కోళ్లూరు సమీపంలో వజ్రం దొరికిన ప్రదేశం ఇదే..

కోహినూర్ వజ్రం



ప్రసిద్ధిగాంచిన ప్రసన్నాంజనేయుని దేవాలయం

గుంటూరు జిల్లాలోని కోళ్లూరును పూర్వం సింహకేతు మహారాజు ఈ ప్రాంతాన్ని పాలించే వారు. యుద్ధంలో కుమారుడు చనిపోతే కోడలికి తరుణంగా ఇచ్చిన కోడలూరే కోళ్లూరుగా ప్రసిద్ధి చెందిందని చరిత్ర చెబుతోంది. మహమ్మదీయుల దండయాత్రతో సింహకేతు పరిపాలించిన సింహపురి ముస్లింరాజుల పరమైంది. ఓ రోజు మధ్యాహ్నం రైతు పొలం దున్నుతున్న సమయంలో వెలుగులు విరజిమ్మే రాయి ఒకటి దొరికిందని చెబుతారు. ప్రభువుపై అత్యంత భక్తి ఉన్న రైతు తనకు దొరికిన వెలుగుల రాయిని ముస్లిం రాజువద్దకు తీసుకొచ్చాడు. వెలుగులు విరజిమ్ముతున్న ఆరాయిని చూసి ముస్లిం ప్రభువు కోయీా-నహీ-నూర్ (ఎక్కడా లేదు వజ్రం) అన్నాడని చెబుతారు. అదే కోహినూర్‌గా చరిత్రకెక్కిందని ఈ ప్రాంతంలో నానుడి. ప్రపంచ ప్రసిద్ధిగాంచిన ఈ కోహినూర్ వజ్రం కోళ్లూరు-వెంకటాయపాలెం గ్రామాల మధ్యలోని గద్దల బోడులో దొరికిందని ప్రచారంలో ఉంది. ఇప్పుడు కోహినూర్ కాలగర్భంలో కలిసిపోనుంది. పాదుషాల సిగనే సింహాసనంగా చేసుకున్న కోహినూర్ వజ్రం దొరికిన కోళ్లూరు పులిచింతల ప్రాజెక్టు ముంపు గ్రామాల్లో ఉంది. ప్రస్తుతం నిర్మాణ దశలో ఉన్న ప్రాజెక్టు పనులు పూర్తయితే మొదట మునిగిపోయేది ఈ చారిత్రక గ్రామమే.

కోళ్లూరులో కేవలం ప్రసిద్ధి గాంచిన కోహినూర్ వజ్రమేకాదు మరెన్నో విలువైన వజ్రాలు, వైఢూర్యాలు విరివిగా లభ్యమయ్యేవని చరిత్ర చెబుతోంది. సింహకేతు పరిపాలించే రోజుల్లోనే సిద్ధి, బుద్ధి అనే వ్యాపారులు ఈ ప్రాంతాన్ని వజ్రాలకోసం వడపోసినట్లు చెబుతారు. ఇప్పుడు కూడా వర్షాలు పడిన తర్వాత కోళ్లూరు పరిసరప్రాంతాల్లో వజ్రాలు ఎక్కువగా దొరుకుతుండడం గమనార్హం. కృష్ణానది పక్కనే ఉన్న ఈ ప్రాంతం ఖనిజ సంపదకేకాక భక్తి, ముక్తికి ప్రసిద్ధి చెందింది. కోళ్లూరులో నెలవై ఉన్న ప్రసన్నాంజనేయ స్వామి కరుణా కటాక్షాలవల్లే పులిచింతల నిర్మాణం తలపెట్టిన ఎన్టీఆర్, చంద్రబాబు ప్రభుత్వాలు కూలిపోయాయని స్థానికుల వాదన. ప్రస్తుతం ఇంగ్లండుకు చెందిన విక్టోరియా మహారాణి వారసుల వద్ద ఉన్న కోహినూర్ వజ్రానికి సంబంధించిన ఈ కథ తరతరాలుగా ఇక్కడ ప్రచారంలో ఉంది. ఈ ప్రాంతం ఇంతటి చారిత్రక ప్రసిద్ధి చెందిన దైనందునే ఎన్నో ఏళ్లపాటు స్థానికులు పులిచింతల ప్రాజెక్టు నిర్మాణాన్ని తీవ్రంగా వ్యతిరేకించారు. దీనికి మావోయిస్టులు మద్దతుపలికారు. రాజశేఖరరెడ్డి ప్రభుత్వం ప్రాజెక్టు నిర్మాణాన్ని ప్రతిష్టాత్మకంగా తీసుకోవడం, మావోయిస్టుల ప్రాబల్యం తగ్గడంతో పనులు ముమ్మరంగా సాగుతున్నాయి. ఇక భవిష్యతులో ఇక్కడ కోహినూర్ దొరికిన 'కోళ్లూరు ఉండేద'ని చదువుకోక తప్పదు మరి.

– ఆన్‌లైన్, పిడుగురాళ్ల, బెల్లంకొండ



# 'పల్నాటి బెబ్బులి' కన్నెగంటి హనుమంతు

తరతరాల పరపీడనకు చరమగీతం పాడి చిరకాల సుమధుర స్వప్నం 'స్వాతంత్ర్యం' సాకారం చేసుకోవాలని ఎందరో వీరకిశోరాలు కత్తులతో కోలాటాలు ఆడారు. ఉరికొయ్యలను ఉయ్యాలలుగా, తెల్లదొరల తుపాకీ గుండ్లను పూల చెండ్లుగా ఆహ్వానించారు. వీరంతా స్వేచ్ఛా వాయువుల కోసం దీక్షా కంకణులై రగిలిన సమర జ్వాలాగ్నికి సమిధలయ్యారు. ఈ కోవకు చెందిన వీరులలో 'పల్నాటి బెబ్బులి' కన్నెగంటి హనుమంతు ఒకరు.

### బ్రిటిష్ పాలకులకు సింహస్వప్నం హనుమంతు

హనుమంతు పేరు వింటేనే బ్రిటిష్ అధికారులకు వెన్నులో చలిపుట్టేది. నాటి బ్రిటిష్ ప్రభుత్వానికి సింహ స్వప్నమైన హనుమంతు శ్వేత జాతి ప్రభుత్వానికి వ్యతిరేకంగా పుల్లరి ఉద్యమం నడిపి వారి తుపాకీ గుండ్లకు బలయ్యారు. స్వాతంత్ర్య పోరాట చరిత్రలో హనుమంతు వీరగాథ ఒక ఉజ్వల ఘట్టంగా రూపొందింది. 1870 లో దుర్గి మండలం మించాలపాడులో వెంకటప్పయ్య, అచ్చమ్మ అనే దంపతులకు జన్మించారు. వ్యవసాయ కుటుంబంలో పుట్టిన కన్నెగంటి హనుమంతు 1920లో కాంగ్రెస్ పార్టీ ఇచ్చిన సహాయ నిరాకరణ పిలుపు ఆయన్ని స్వాతంత్ర్య పోరాటం వైపునకు నడిపింది.

### సహాయ నిరాకరణ పిలుపునాటికి పల్నాటి పరిస్థితి

సహాయ నిరాకరణ ఉద్యమం నాటికి పల్నాడు ప్రాంతంలో 91 గ్రామాలున్నాయి. మూడు తాలూకాల స్థాయిలో విస్తీర్ణం కలిగి 1,92,039 జనాభా వుంది. పాలరాయి, సిమెంట్‌రాయి, ఇనుప గనులు విస్తారంగా వుండడంతోపాటు విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయగల ఎత్తిపోతల జలపాతం అందుబాటులోవుంది. వేలాది ఎకరాల సార్వంతమైన భూములు వున్నా ప్రజలు కూటికి, గుడ్డకి అల్లాడిపోవాల్సిన దుస్థితినెలకొంది. పల్నాడుకు ఎలాంటి నీటి వనరులు లేవు. పూర్తిగా వర్షాధారం పైనే ప్రజల జీవనాధారం. సకాలంలో వర్షాలు లేక, పండలు పండక ఏటా కరువు కాటకాలు సంభవించడం పరిపాటైంది. పొలాలు పండినా, ఎండినా శిస్తులు మాత్రం చెల్లించక తప్పేదికాదు. మరోవైపు గ్రామాధికారులు ప్రజలను రాబందుల్లా పీక్కుతినేవారు. ఫారెస్ట్ గార్డుల ఆగడాలు శృతిమించాయి. పశువుకు రెండు రూపాయల చొప్పున అడవి పుల్లరి (సెస్సు) చెల్లిస్తేనే పశువులను మేత కోసం అడవిలో అనుమతిస్తున్నారు. బ్రిటిష్ పాలకులదురాగతాలను

(మిగతా29లో)



రూథర్‌ఫర్డ్ నిర్మించిన కన్నెగంటి పాత సమాధి

# 'పల్నాటి బెబ్బులి' కన్నెగంటి హనుమంతు



నిర్మాణంలో వున్న కన్నెగంటి హనుమంతు నూతన ఘాట్

(28వ పేజీ తరువాయి)

ఎండగట్టే లక్ష్యం తో హనుమంతు ప్రజలను శిస్తులు చెల్లించవద్దని పిలుపునిచ్చారు. పల్నాడులో శిస్తు చెల్లింపుల నిరాకరణను ప్రోత్సహించిన హనుమంతు పై ప్రభుత్వం కక్షగట్టింది. మరోవైపు హనుమంతు ప్రజలను సమైక్యపరుస్తూ అధికారులకు అన్ని సహాయ సహకారాలను నిలిపివేయాలని ఆదేశించారు. బానిస సంకెళ్ళ నుంచి ప్రజలను విముక్తుల్ని చేయాలనే కర్తవ్యదీక్షతో ప్రజలను విప్లవశక్తిగా మార్చారు. కన్నెగంటి పిలుపుతో ప్రజలు శిస్తులు కట్టడం మానేశారు. అధికారులకు మంచినీళ్ళు కూడా పుట్టటం లేదు. బట్టలు ఉతకడం, క్షవరం చేయడం వంటి పనులు స్తంభించిపోయాయి. దీంతో ప్రభుత్వం పల్నాటి ఉద్యమాన్ని అణచివేయటానికి మన్యం తిరుగుబాటును నిరంకుశంగా అణచిన రూథర్‌ఫర్డ్‌ను జిల్లా కలెక్టర్‌గా ఇక్కడ నియమించింది.

### పల్నాటి పై మిలటరీ దాడులు

పల్నాడులో సమర్థవంతంగా జరుగుతున్న సహాయ నిరాకరణ ఉద్యమాన్ని నీరుగార్చటానికి ప్రభుత్వం పోలీస్, మిలటరీ దాడులకు పాల్పడింది. మొదట రామాపురం, జెట్టిపాలెం, జంగమహేశ్వరపురం తదితర గ్రామాల పై పోలీస్, మిలటరీ దాడులు జరిగాయి. ఈ సందర్భంగా పోలీసులు ఇళ్ళలో జొరబడి యదేచ్ఛగా దోచుకున్నారు. స్త్రీల పై అమానుషంగా అత్యాచారాలను జరిపారు. అనేకమందికి కాళ్ళు, చేతులు విరిచారు. దాడికి గురైన గ్రామాలు తప్ప మిగిలిన గ్రామాలు బ్రిటిష్ పాలకులకు లొంగలేదు. శిస్తు చెల్లింపు నిరాకరణను ప్రజలు యధాతథంగా పాటిస్తూనే వున్నారు. హనుమంతు అనుక్షణం ప్రజలను సమైక్యపరచి ఉత్తేజితుల్ని చేయడంతో ఉద్యమం తీవ్రరూపం దాల్చింది. మించాలపాడు గ్రామ ప్రజలంతా హనుమంతుకు అండగా నిలిచారు. ఈ నేపథ్యంలో రూథర్‌ఫర్డ్ కన్నెగంటికి ధనాశ చూపి ఉద్యమం నుంచి వైదొలిగించడానికి వ్యూహరచన చేశాడు. తమ లక్ష్యసాధన కోసం బ్రిటిష్ పాలకులు కోలగుట్ల కరణం సదాశివయ్యను హనుమంతు వద్దకు రాయబారిగా పంపారు. హనుమంతును కలిసిన శివయ్య 'ఉద్యమాన్ని ఆపి ప్రభుత్వానికి అనుకూలంగా మసలుకో... నిన్ను జమిందార్ని చేయిస్తా...

(మిగతా 30లో)

# 'పల్నాటి బెబ్బులి' కన్నెగంటి హనుమంతు

(29వ పేజీ తరువాయి)

పేస్కేన్ నీ ఇష్టం వచ్చినంత ఇవ్వచ్చు...' అన్ని దుర్భోద చేశారు. సదాశివయ్య మోసపూరిత మాటలు హనుమంతులో పట్టరాని ఆగ్రహాన్ని తెచ్చాయి. 'ఉద్యమం నా ఊపిరి... ప్రజలే నా సర్వశ్వం... ఉద్యమాన్ని విరమించుకొని ప్రజలకు ద్రోహం చేయం...' అని హనుమంతు గర్జించారు.

మించాలపాడు కేవలం 125 కుటుంబాలు కలిగిన ఓ కుగ్రామం. గ్రామానికి మూడు వైపులా కొండలు, ఉత్తరం దిక్కున దట్టమైన అడవి కలిగి వుంది. 1922 ఫిబ్రవరి 22న మహా శివరాత్రి పర్వదినం వేడుకల్లో గ్రామ ప్రజలు ఆనందోత్సవాలతో నిమగ్నమై వున్న సమయాన తెల్లదొరలు వంద మంది మిలటరీ దళంతో మించాలపాడుకు బయలుదేరారు. కోలగుట్ల కరణం సదాశివయ్య, దుర్గి సబ్ ఇన్‌స్పెక్టర్ రాఘవయ్య మిలటరీ దళాన్ని అనుసరిస్తున్నారు. అదే సమయంలో ఊరికి దక్షిణ భాగంలో కొండ లోయవద్ద వున్న బావికి మంచినీళ్ళ కోసం వచ్చిన మించాలపాడు పశువుల్ని మిలటరీ దళం ముట్టడించింది. అనంతరం వాటిని ముటుకూరు బందెల దొడ్డికి తోలుకువెళ్తున్న మిలటరీ దళానికి హనుమంతు అల్లుడు పసుపులేటి చిన్నయ్య అడ్డుతగిలి తమ పశువుల్ని వదలమని కోరగా పోలీసులు అతనిని తుపాకీ మడమతో కొట్టి తీవ్రంగా హింసించారు. దీంతో ఆగ్రహించిన పశువుల కాపలాకు వచ్చిన రైతులు పోలీసుల పై రాళ్ళురువ్వారు. ఇందుకు ఆగ్రహించిన మిలటరీ దళం లాఠీచార్జ్ జరిపి రైతులను చెదరగొట్టారు. విషయం తెలుసుకున్న హనుమంతు నిరాయుధుడుగానే పోలీసులతో పోరుసల్పేందుకు బయలుదేరారు. ఆయనను గ్రామ ప్రజలు కూడా అనుసరించారు. ఆరు అడుగుల ఎత్తు... విశాలమైన ఛాతి... దట్టమైన కోర మీసం... బలిష్టమైన బాహువులు కలిగి తలపాగ ధరించి వస్తున్న కన్నెగంటిని చూడగానే పోలీసులు, మిలటరీ దళం వెన్నులో వణుకుపుట్టింది. భయంతో కంపించిపోతున్న కరణం సదా శివయ్య 'కన్నెగంటి హనుమంతు మన దగ్గరకు వస్తే బతకనివ్వడు... కాల్చండి..' అంటూ హెచ్చరించడంతో పోలీసులు హనుమంతు పై తుపాకులు ఎక్కుపెట్టి గుళ్ళవర్షం కురిపించారు. హనుమంతు కుడి డొక్కను చీల్చుకొని రక్తం కాలువలయ్యింది. ఈ సంఘటనలో హనుమంతు పాలేరు ఎల్లంపల్లి శేషు అక్కడికక్కడే నేలకొరిగాడు. మరో 28 మంది క్షతగాత్రులయ్యారు. రక్తపు మడుగులో పడివున్న హనుమంతు కొన ఊపిరితో దాహం.. దాహం అని కలవరిస్తున్నప్పటికీ బ్రిటిష్ అధికారులు కర్కశులై మంచినీళ్ళు ఇవ్వకుండనే తుపాకీ మడమతో హనుమంతు గొంతు పై నొక్కి తీవ్రంగా గాయపరిచారు. ఆ రోజు రాత్రి ఏడున్నర వరకు ప్రాణాలతోవున్న హనుమంతు తుదిశ్వాస విడిచారు. పోలీసులు హనుమంతు భౌతిక కాయాన్ని రాత్రంతా అక్కడే వాగులో వుంచి కాపలాకాసారు. హనుమంతు శవాన్ని ఆయన బంధువులకు కూడా ఇవ్వటానికి తెల్లదొరలు నిరాకరించారు. మరుసటి రోజు హనుమంతు మృతదేహాన్ని కోలగుట్ల సమీపంలో వున్న దంతెవాగు వద్దకు తరలించి శవ పరీక్షల అనంతరం ఖననం చేశారు.

హనుమంతు మరణానంతరం మరుసటి రోజు మరో 50 మంది మిలటరీ సిబ్బంది ఊళ్ళోకి ప్రవేశించారు. అప్పటికే గ్రామ ప్రజలంతా కొండల్లో తలదాచుకొని వుండగా నడవలేని వృద్ధులు, పిల్లలు మాత్రమే గ్రామంలో మిగిలిపోయారు. ఇదే అదునుగా భావించిన పోలీసులు, మిలటరీ సిబ్బంది ఇళ్ళల్లో జొరబడి నగలు,డబ్బు కొల్లగొట్టారు. మేకలను, కోళ్ళను అందిన మేరకు కోసుకుతిన్నారు. హనుమంతును కాల్చి చంపిన వార్త పల్నాడు తాలూక అంతటా దావానలంలా వ్యాపించింది. దీంతో సహాయ నిరాకరణ ఉద్యమం నిర్వహిస్తున్న ప్రజల నడుం విరిగినట్లై నైతిక శక్తి క్షీణించింది. గత్యంతరం లేక ప్రజలు శిస్తులు చెల్లించడం ప్రారంభించారు. నాలుగో నాడు కొండల్లో దాగి వున్న ప్రజలు గ్రామంలోకి అడుగుపెట్టారు. కొంపలన్నీ మిలటరీ, పోలీసు సిబ్బందిచే దోచుకోబడి ఊరంతా బీభత్స స్థితిలో దర్శనమివ్వడంతో ప్రజలు కన్నీటి పర్యంతమయ్యారు. పోలీసులు గ్రామానికి చెందిన 40 మంది ముఖ్యులను అరెస్టు చేశారు. ఒక్కొక్కరికి 150 రూపాయల జరిమానాతో పాటు ఆరు మాసాల కఠిన కారాగార శిక్ష పడింది. నలబోతుల వెంకయ్యకు మాత్రం 200 రూపాయల జరిమానాతో పాటు 9 నెలల శిక్ష విధించారు.హనుమంతును నిర్దాక్షిణ్యంగా కాల్చి చంపించినప్పటికీ నాటి జిల్లా కలెక్టర్ రూథర్‌ఫర్డ్‌కు హనుమంతు పై కసి తీరలేదు. దంతెవాగులో వుంచిన హనుమంతు శవాన్ని ప్రజలు ఫోటో తీసుకుంటామని కోరినప్పటికీ రూథర్‌ఫర్డ్ ఏమాత్రం అంగీకరించలేదు. హనుమంతును సమాధి చేసిన పిదప గోరి కట్టించి, శిలాఫలకం వేయించాడు. అయితే కొద్దిరోజులకు రూథర్‌ఫర్డ్ ఆ శిలాఫలకాన్ని పెకిలించి హనుమంతు భార్యకు కానుకగా పంపి అపహాస్యం చేశాడు. ఇంకా కసి తీరని రూథర్‌ఫర్డ్ మరో నెల రోజుల తరువాత రూథర్‌ఫర్డ్ మించాలపాడు వెళ్ళి హనుమంతు పేర వేసిన శిలాఫలకాన్ని బయటకు తెప్పించాడు. దానిని ముక్కలు ముక్కలుగా పగులగొట్టించి బావిలో పడేసి తన కసినంతా ప్రదర్శించాడు.

హనుమంతు సమాధి నిర్మించిన దంతెవాగు మించాలపాడు కొండల్లో పుట్టి కోలగుట్ల ప్రక్క నుంచి ఆత్మకూరు చెరువుగుండా మాచర్ల మీదుగా చంద్రవంకై ప్రవహిస్తూ ఎత్తిపోతల వద్ద 66 అడుగుల ఎత్తు నుంచి కిందకు జాలువారుతోంది. నాటి నుంచి నేటి వరకు హనుమంతు వాగు ప్రవహిస్తూనే వుంది... ఎత్తిపోతల ఘోషిస్తూనే వుంది... ఎత్తిపోతల ఘోష పలనాటి స్వతంత్ర్య ఘోష... అది స్వాతంత్ర్యాన్ని సిద్ధింపచేసిన హనుమంతు ఆత్మఘోష...

మాతృదేశం కోసం అశువులు బాసిన హనుమంతు సమాధికి ఇటీవల దాక ఎటువంటి భద్రత లేదు. 1946లో ఆచార్య రంగా హనుమంతు సమాధిని సందర్శించి సమాధి మరమ్మతులకు కొంతమేర ధన సహాయం చేశారు. కాలక్రమంలో హనుమంతు సమాధికి రక్షణ కరువై ముళ్ళపొదల మధ్యలో చిక్కి శిథిలావస్థకు చేరి దీన స్థితికి అద్దంపట్టింది. ఈ నేపథ్యంలో తెలుగుదేశం పార్టీ ఆధ్వర్యంలో పల్నాటి వీరుల విగ్రహ ప్రతిష్టా కమిటి ఏర్పాటై హనుమంతు సమాధి పునర్నిర్మాణానికి నడుం బిగించింది.

రాష్ట్ర ఎక్సైజ్ రిటైర్డ్ జాయింట్ కమిషనర్ మిరియాల అనంతరామయ్య ఆధ్వర్యంలో 2004, ఫిబ్రవరి 23న మాచర్ల పట్టణం నడిబొడ్డున హనుమంతు కాంస్య విగ్రహాన్ని ఆవిష్కరించారు. అప్పటి రాష్ట్ర వైద్య ఆరోగ్య శాఖా మంత్రి డాక్టర్ కోడెల శివప్రసాదరావు చేతులమీదుగా కన్నెగంటి హనుమంతు కాంస్య విగ్రహం ప్రతిష్టకు నోచుకుంది. విగ్రహ ప్రతిష్టతో ఆగక రెండు లక్షల రూపాయల వ్యయంతో కోలగుట్లలోని హనుమంతు సమాధి పునర్నిర్మాణపు పనులకు కూడా శ్రీకారం చుట్టారు. అప్పట్లో సమాధి నిర్మాణపు పనులు కొంతమేర జరిపి అసంపూర్తిగా నిలిపివేశారు. అసంపూర్తిగా వున్న సమాధిని వెంటనే పూర్తి చేయడానికి పల్నాటి వీరుల విగ్రహ ప్రతిష్టా కమిటీ పూనుకోవాలని ప్రజలు కోరుతున్నారు.

– ఆన్‌లైన్ –దుర్గి

# ఆంధ్రజ్యోతి ఐదవ వార్షికోత్సవ శుభాకాంక్షలు



స్వర్గీయ రాజీవ్ గాంధి
మాజీ ప్రధాని



శ్రీమతి సోనియాగాంధి
ఎఐసిసి అధ్యక్షురాలు



డా॥ వై.ఎస్. రాజశేఖరరెడ్డి
రాష్ట్ర ముఖ్యమంత్రివర్యులు



శ్రీ రాయపాటి సాంబశివరావు
పార్లమెంటు సభ్యులు, గుంటూరు



అశేష ఆంధ్రుల అభిమాన
దినపత్రిక ఐదు వసంతాలు
దిగ్విజయంగా పూర్తిచేసుకున్న
సందర్భంగా ఆంధ్రజ్యోతి
యాజమాన్యానికి, సిబ్బందికి
హృదయపూర్వక శుభాకాంక్షలు..
ప్రత్తిపాడు నియోజకవర్గ ప్రజలకు
దసరా, రంజాన్, దీపావళి శుభాకాంక్షలు ...

పార్టీ కార్యకర్తలకు, ప్రజలకు, శ్రేయోభిలాషులకు
దసరా శుభాకాంక్షలు తెలియజేస్తూ..
ఈ దసరా, రంజాన్, దీపావళి మీకు సకల
శుభాలు కలుగచేయాలని కోరుకుంటూ...

## రావి వెంకటరమణ

శాసనసభ్యులు, ప్రత్తిపాడు నియోజకవర్గం

# ప్రాచ్య సంస్కృతికి పట్టుగొమ్మ
# అమరావతి శిల్పం


ప్రాచీన కళకు సజీవ రూపం

(అమరావతి - ఆన్‌లైన్)

క్రీ.పూ. బౌద్ధేంద్ర శిల్పి తన కళానైపుణ్యంతో గండు శిలలను మైనపు ముద్దలుగా మార్చి ఆ ముద్దలపై తన మధుర భావనలను శిల్పాల ద్వారా దివ్యకృతులను కల్పించారు. మహాశిల్ప సంపదకు పుట్టినిల్లుగా వెలసి ఆంధ్ర రాజులకు రాజధానియై, ప్రాచ్య సంస్కృతికి పట్టుగొమ్మయై, లలిత కళామృత కలశంబై అలరారిన అమరావతి ఆంధ్రుల స్వర్గసీమ అనడంతో అతిశయోక్తి లేదు. యావత్ భారత దేశంలో బౌద్ధ ధర్మచరిత్రలో అమరావతి, నాగార్జునకొండ రెండూ విశిష్ట స్థానాన్ని పొందాయి.

శాతవాహనుల పాలనకు ముందే ఆంధ్ర శిల్పులు బుద్ధభగవానుని దివ్యస్మృతికి నిర్మించిన శిల్పనీరాజనం అమరావతి స్థూపం. ఆ స్థూపాన్ని మౌర్యచక్రవర్తి అశోకుడుకి ముందే ఆంధ్ర దేశాన్ని పాలించిన నాగరాజు ప్రారంభించగా అనంతరం అశోకుడు దానిని అభివృద్ధిచేశాడు.

శాతవాహనుల కాలంలో అమరావతి స్థూపం వృద్ధి చెందమేకాకుండా వింత శోభను సంతరించుకుని దక్షిణాపద బౌద్ధ చరిత్రలో ప్రముఖ స్థానం ఆక్రమించుకుంది. ఆచార్య నాగార్జునుని కాలంలో మహాచైత్యం చుట్టూ శిల్ప చిత్ర ఫలకాలు నిర్మించినట్లు తెలుస్తోంది.

మహా చైత్యం మొత్తం నాలుగు దఫాలుగా అభివృద్ధి సంతరించుకుందని తెలుస్తోంది. కాలక్రమంలో మహాచైత్యం శిథిలమవగా దానిని 1958లో డాక్టర్ రాయప్రోలు సుబ్రహ్మణ్యం ఆధ్వర్యంలో జరిపిన తవ్వకాలలో పెద్ద ఎత్తున శిల్పాలు, స్ఫటిక భరిణలలో నిక్షిప్తంచేసిన సువర్ణ పుష్పాలతో కూడిన బుద్ధుని ధాతువులు లభ్యమయ్యాయి. 1973-74లో శ్రీ ఇహవ, కార్తికేయ శర్మ జరిపిన తవ్వకాలలో బయల్పడిన అనేక నాణాలు, శిల్ప శాసనాల వల్ల మహాచైత్యం క్రీ.పూ. 3వ శతాబ్దంలో నిర్మితమైనట్లు తెలుస్తోంది. 1979లో కల్నల్ కాలిన్ మెకంజి ఈ స్థూపాన్ని చూసి దానిపై రచనలు చేశారు. స్వాతంత్ర్యానికి

(మిగతా 36లో)

> **"తరాలు మారినా, నాగరికత సంతరించుకుంటున్నా, మానవజాతి సంఘటనలు కనుమరుగైనా, నాటి సంస్కృతి, ఆచార వ్యవహారాలు, భవిష్యత్ తరాలకు కళ్లకు కట్టినట్లుగా చూపించేదే శిల్పం. ప్రపంచానికి శిల్పసంపద పట్ల ఆసక్తిని, ఆవశ్యకతను చాటింది అమరావతి శిల్పం మాత్రమేనని చెప్పక తప్పదు."**


అమరావతి స్థూపం

# విజయ దశమి...దీపావళి శుభాకాంక్షలు

## నరసరావుపేట పార్లమెంట్ నియోజక వర్గ సర్వతోముఖాభివృద్ధికి కృషి



శ్రీమతి సోనియాగాంధీ
యుపిఎ ఛైర్మన్, ఎఐసిసి అధ్యక్షురాలు

డాక్టర్ మన్మోహన సింగ్ గారు
భారత ప్రధాని

డాక్టర్ వైఎస్.రాజశేఖరరెడ్డి గారు
రాష్ట్ర ముఖ్యమంత్రి

నరసరావుపేట పార్లమెంట్ నియోజక వర్గ ప్రజలకు,
కాంగ్రెస్ పార్టీ నాయకులు, కార్యకర్తలు, అభిమానులు,
శ్రేయోభిలాషులకు

**విజయ దశమి, దీపావళి శుభాకాంక్షలు...**

ఈ పర్వదినాలు అందరికీ సకల శుభాలు
కలుగజేయాలని కోరుకుంటూ ....



ప్రజా పత్రికగా ఎనలేని పాఠకుల అభిమానాన్ని
చూరగొన్న **ఆంధ్రజ్యోతి** దిన పత్రిక అభివృద్ధి
దిశలో పయనిస్తూ ఐదు సంవత్సరాలు పూర్తి చేసుకొన్న
శుభ తరుణంలో **ఆంధ్రజ్యోతి యాజమాన్యానికి...సిబ్బందికి**
మా హృదయ పూర్వక శుభాభినందనలు.

నరసరావుపేట పార్లమెంట్ నియోజక వర్గ ప్రజల సమస్యల పరిష్కారానికి, నియోజక వర్గ సర్వతో ముఖాభివృద్ధికి నావంతు కృషి చేస్తున్నాను. గత మూడున్నర ఏళ్ళుగా నియోజక వర్గ అభివృద్ధిలో భాగంగా పలు ప్రగతి కార్యక్రమాలు చేపట్టడం జరిగింది. నియోజక వర్గంలోని గ్రామాల్లో తాగు నీటి సమస్య పరిష్కారానికి, సాగు నీటి సమస్య నివారణకు, విద్యా రంగ అభివృద్ధికి ప్రత్యేక శ్రద్ధ కనబరుస్తున్నాను. పార్లమెంట్ సభ్యులకు కేటాయించే నిధులను విద్యా రంగానికి, శాశ్విత నిర్మాణాలకు ఖర్చు చేయుచున్నాను.

మరెన్నో అభివృద్ధి కార్యక్రమాలు...ప్రగతి పనుల అమలుకు ప్రజల అండదండలు ఆశిస్తూ...



సదా మీ సేవలో...

# మేకపాటి రాజమోహనరెడ్డి

పార్లమెంట్ సభ్యులు, నరసరావుపేట పార్లమెంట్ నియోజక వర్గం



అమరావతి దేస్థానం

# పంచారామాల్లో మొదటిది అమరారామం

(అమరావతి -ఆన్‌లైన్)

పరమశివునికి పవిత్రమైన దేవాలయాలుగా పేరుగాంచిన పంచారామాలలో మొదటిది, అగ్రగామిగా నిలిచినది అమరావతిలోని అమరారామమైన అమరేశ్వరాలయం. కలియుగ కైలాసంగా, దక్షిణ కాశిగా భక్తులచే కొనియాడబడుతూ పూజలందుకుంటోంది. ఆలయ ప్రాంగణం మూడు ప్రాకారాలలో నిర్మితమై ఉత్తరవాహిని గా పిలువబడుతున్న కృష్ణా తీరాన ప్రతిష్టించబడిన ఈ ఆలయం భక్తులకు కొంగు బంగారం.

## అమరారామ ఆవిర్భావం...

పూర్వం రాక్షసుడైన తారకుడు పెట్టిన బాధలు తాళలేక దేవతలు పరమేశ్వరుని శరణువేడారు. శివుడు తన కుమారుడైన కుమారస్వామిని అతనిపై యుద్ధంచేసి దేవతలకు కలిగిన బాధను తొలగించాలని ఆదేశించాడు. వెంటనే కుమారస్వామి తారకునితో యుద్ధం చేస్తుండగా తారకుని మెడలోని ఆత్మల వివాహం ఐదు ముక్కలు గా పగిలి ఐదు ప్రదేశాలలో పడినాయి. వాటిలో మొదటిది అమరావతిలోని అమరేశ్వర లింగము. దీనిని దేవలోకాధిపతి దేవేంద్రుడు ఆశ్వీయుజ శుద్ధ దశమినాడు ముక్కోటి దేవతల సాక్షిగా ప్రతిష్టించి బంగారుపూలలో పూజించాడని పురాణాలు చెబుతున్నాయి. రెండవ కుమార రామము పశ్చిమ గోదావరి జిల్లా భీమవరం లోను, మూడవది సామర్లకోటలోని భీమ రామం, నాల్గవది పాలకొల్లులోని క్షీరరామం, ఐదవది తూర్పుగోదావరిలోని ద్రాక్షరామం,

(మిగతా 36లో)

## దేవస్థానంలోని పథకాలు...

* ప్రతి ఏడాది గోత్రనామాలతో అభిషేకానికి రూ. 516లు
* శాశ్వత నిత్యాన్నదాన పథకానికి రూ. 1,116
* ప్రతి దినం అభిషేకం ఏడాది పొడవునా రూ. 3,016
* అష్టోత్తరం ఏడాదికి రూ. 1,516
* కార్తీక మాసం నెలరోజులు అభిషేకానికి రూ. 516గా నిర్ణయించారు.



ఉత్సవాల్లో భక్త జన సందోహం

# అభివృద్ధి పథంలో తాడికొండ నియోజకవర్గం



ఎపిసిసి అధ్యక్షురాలు సోనియాగాంధితో ఎంపి రాయపాటి, ఎమ్మెల్యే డొక్కా మాణిక్య వరప్రసాద్



డాక్టర్ కత్తి పద్మారావును సన్మానిస్తున్న తాడికొండ ఎమ్మెల్యే శ్రీ డొక్కా మాణిక్య వరప్రసాద్



పెదకాకానిలో ఇందిరమ్మ లబ్ధిదారులకు శాంక్షన్ లేఖలు అందజేస్తున్న ఎమ్మెల్యే వరప్రసాద్



తాడికొండలో జరిగిన ఏరువాక కార్యక్రమంలో పాల్గొన్న కలెక్టర్ రఫత్, ఎస్.పి. లడ్హా, ఎమెల్యే డొక్కా మాణిక్య వరప్రసాద్



**శ్రీమతి సోనియాగాంధీ**
ఎపిసిసి అధ్యక్షురాలు



**డా॥ వై.ఎస్. రాజశేఖరరెడ్డి**
రాష్ట్ర ముఖ్యమంత్రి



**శ్రీ రాయపాటి సాంబశివరావు**
పార్లమెంట్‌సభ్యులు, గుంటూరు



**డా॥ రాయపాటి శ్రీనివాసరావు**
ఎమ్మెల్సీ



**శ్రీ జె.డి. శీలం**
రాజ్యసభసభ్యులు

INDIRAMMA
ఇందిరమ్మ

కొత్తనెత్తుటి అలజడితో
మా అక్షరం మీ ఆయుధం అంటూ
పత్రికా రంగంలో సంచలనం సృష్టిస్తూ వార్తలలో నవ్యత,
సవ్యతకు నాంది పలుకుతూ అంచెలంచెలుగా అభివృద్ధి
చెందుతూ తెలుగు పాఠకుల ఆదరాభిమానాలు చూరగొనుతున్న
**ఆంధ్రజ్యోతి** నాలుగు వసంతాలు పూర్తిచేసుకుని దిగ్విజయంగా
పయనిస్తున్న సందర్భంగా పత్రికా యాజమాన్యానికి, పాఠకులకు,
సిబ్బందికి నియోజకవర్గ ప్రజలకు, కాంగ్రెస్ పార్టీ నాయకులు
మరియు కార్యకర్తలకు, అభిమానులకు
నా హృదయపూర్వక
శుభాకాంక్షలు ...

- ★ ముఖ్యమంత్రి డా॥ వైఎస్ నాయకత్వంలో రాష్ట్రంలో రైతుల సంక్షేమానికి అనేక కార్యక్రమాలు చేపట్టడం
- ★ రాజీవ్ పల్లెబాట సంధర్భంగా ముఖ్యమంత్రి వైఎస్ ఇచ్చిన హామీలు నెరవేర్చుట
- ★ ఉచిత విద్యుత్ అమలుకు అందరూ సహకరించాలి



సదా ప్రజాసేవలో

# డి. మాణిక్య వర ప్రసాదరావు

## శాసనసభ్యులు, తాడికొండ



అమరలింగేశ్వరస్వామి, పార్వతీదేవి

## పంచారామాలలో మొదటిది అమరారామం

(34వ పేజీ తరువాయి)

అమరారామములలోని ఆలయాలన్నీ అమరావతిని పరిపాలించిన రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు సర్వాంగ సుందరంగా నిర్మించాడు. ఆలయ అభివృద్ధికి స్థిరాస్తుల రూపంలో నిధులందజేశారు. ప్రతి ఏడాది మాఘ బహుళ చతుర్దశినాడు అర్ధరాత్రి రెండుగంటలకు బాలచాముండేశుని, అమరేశ్వరస్వామి వార్ల కళ్యాణాన్ని ఆస్థాన అర్చకులు జరుపుతారు. ఇక్కడ మూడు ప్రాకారాలుగా ఉన్న దేవాలయంలో ఉపాలయాలున్నాయి. మొదటి ప్రా కారంలో ప్రణవేశ్వరుడు, కాశీవిశ్వేశ్వరుడు, ఉమామహేశ్వరుడు, దత్తాత్రేయస్వామి పాదుకలు, జ్వాలాముఖి అమ్మవారు, పార్థీవేశ్వరుడు, సోమేశ్వరుడు, వీరచంద్రుడు, మహిషాసురమర్ధిని, కోశలేశ్వరుడు కొలువై ఉన్నారు. రెండవ ప్రాకారంలో కాలభైరవుడు, కుమారస్వామి, ఆంజనేయస్వామి, నవగ్రహాలు, అన్నదాన ప్రాంగణం, శ్రీకృష్ణదేవరాయలు తులితుంగిని తులాభారములున్నాయి. మూడవ ప్రాకారం నైరుతీ దిశలో శ్రీశైల మల్లేశ్వరుడు, ఈశాన్య భాగంలో చండీశ్వరుడు, ఆగ్నేయ భాగంలో శ్రీకాళహస్తీశ్వరుడు, తూర్పున సూర్య భగవానుడు కొలువై ఉన్నారు. క్షేత్రపాలకుడిగా వేణుగోపాలస్వామి ఉత్తరం వైపున ఉన్నాడు. ఆలయానికి వచ్చే భక్తుల సౌకర్యార్థం వసతిగృహాలు, విజయవాడ, గుంటూరు, సత్తెనపల్లి పట్టణాల నుంచి బస్ సర్వీసులున్నాయి.

### ఉత్సవ కార్యక్రమాలు...

ప్రతి విజయదశమికి శ్రీదేవి శరన్నవరాత్రి ఉత్సవాలు, కార్తీక మాసంలో ప్రత్యేక పూజలు, మహాశివరాత్రి పర్వదినానికి అభిషేకాలు, రథోత్సవం వైభవంగా భక్తిశ్రద్ధలతో జరుపుతారు. ఈ ఆలయంతోపాటు అమరావతిలో కన్యకాపరమేశ్వరి, శ్రీ లలితా సాయిబాబు, ఆంజనేయస్వామి, కోదండ రామాలయం, గీతామందిరం, విఘ్నేశ్వరస్వామి ఆలయంలో ఉన్నాయి.

## ప్రాచ్య సంస్కృతికి పట్టుగొమ్మ అమరావతి శిల్పం

(32వ పేజీ తరువాయి)

పూర్వం మహాచైత్యంలోని మెరుగైన శిల్ప సంపదను లండన్, బ్రిటీష్ మ్యూజియానికి తరలించారు. తరువాత జరిగిన తవ్వకాలలో బయల్పడిన శిల్పశేషాలను ప్రస్తుతం అమరావతి పురావస్తు ప్రదర్శన శాఖలలో ప్రజల సౌకర్యార్థం ఏర్పా టు చేశారు. ఆనాటి శిల్పకళలో అప్పటి సాంఘిక పరిస్థితులు, ప్రజా జీవన విధానం, సంగీతానికి సంబంధించి అమరావతి శిల్పం అద్దంపడుతోంది. రాజులు, రాణులు, ప్రజలు అప్పుడు ధరించిన ఆభరణాలు, దుస్తులను శిల్పాలలో చిత్రించారు. పురావస్తు ప్రదర్శన శాలలో శిల్పాలను తిలకిస్తూ దాని చరిత్రను తెలుసుకొని ప్రతి ఒక్కరికి ఆనందం, ఆశ్చర్యం కలగకమానదు. పురావస్తు ప్రదర్శన శాలలో మూడు భాగాలలో ఏర్పాటుచేసిన శిల్ప సంపద, మహాచైత్యం నమూనా, బౌద్ధ సాన్నిహిత్యానికి దగ్గరచేస్తాయి. క్రీ.పూ బౌద్ధక్షేత్రంగా ధాన్యకటకం పేరు తో విరాజిల్లిన నగరం నేడు అమరావతి, ధరణికోట గ్రామాలు గా పేరుగాంచాయి. గత చరిత్ర ఆధారంగా 2005లో లక్షలాది మంది బౌద్ధభిక్షువులు, వారి మతాధిపతి దలైలామా నిర్వహించిన కాలచక్ర మహాసభలలో అమరావతిలో బౌద్ధ విశిష్టతపట్ల ప్రపంచదేశాలకు తెలిసేలా చేసింది. అమరావతి ప్రజలకు బౌద్ధ సంస్కృతి దర్శనమిచ్చింది. ప్రపంచానికి శిల్ప సంపదపట్ల అవగాహన కల్గించిన అమరావతి శిల్పం అందాలు తిరిగి ప్రజలకు సాక్షాత్కరించేలా 'ధ్యానబుద్ధ' ప్రాజెక్ట్‌పై దాని రూపకర్త ఆర్ మల్లికార్జునరావు సిమెంట్‌తో శిల్ప రాజాలను చిత్రీకరిస్తున్నారు. దీని ద్వారా అమరావతి శిల్పం మరింత ప్రాచుర్యాన్ని సంతరించుకోనుంది.



శిల్ప సౌందర్యం



ధ్యానబుద్ధ ప్రాజెక్ట్



## గుంటూరు నగర చరిత్రలో ముఖ్యమైన ఘట్టాలు

(ఆన్‌లైన్ - గుంటూరు సిటీ)

| సంవత్సరం | ఘట్టం |
|---|---|
| 1763 | లాలాపేటలో పెద్దమసీదు నిర్మాణం |
| 1788 | ఆంగ్లేయుల పరిపాలన ప్రారంభం |
| 1810 | మస్తాన్‌దర్గా నిర్మాణం |
| 1818 | జిల్లా కోర్టు భవనం ప్రారంభోత్సవం |
| 1843 | బిఆర్ స్టేడియం సమీపంలో కోడిగుడ్డు సత్రం నిర్మాణం |
| 1844 | ఇన్‌స్పెక్షన్ బంగ్లా ప్రారంభం |
| 1846 | చలమయ్య సత్రం ఆవిర్భావం |
| 1865 | ఆర్ అగ్రహారం, నల్లచెరువులో నీటి నిల్వ చెరువుల తవ్వకం |
| 1866 | గుంటూరు పట్టణాన్ని మునిసిపాలిటీగా ప్రకటన |
| 1869 | మద్రాసు బ్యాంకు ఏర్పాటు |
| 1885 | ఎసి కళాశాల ప్రారంభోత్సవం |
| 1888 | బళ్ళారి - విజయవాడ రైల్వేలైను నిర్మాణం |
| 1904 | కూరగాయలు, చేపల మార్కెట్ల నిర్మాణాలు |
| 1905 | వెంగళాయపాలెంలో బ్రిటిష్ పాలకులచే వాటర్‌వర్క్స్ నిర్మాణం |
| 1911 | కలెక్టరేట్ నిర్మాణం |
| 1914 | గుంటూరు - తెనాలి మధ్య రైల్వేలైను నిర్మాణం |
| 1922 | మోతిలాల్‌నెహ్రూ తొలిసారి గుంటూరు పర్యటన |
| 1927 | గుంటూరు - మాచర్ల మధ్య రైల్వేలైను నిర్మాణం |
| 1952 | సంగం జాగర్లమూడిలో వాటర్‌వర్క్స్ నిర్మాణం |
| 1954 | గుంటూరులో హైకోర్టు ప్రారంభం |
| 1964 | తొలిప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ గుంటూరు రాక |
| 1980 | తక్కెళ్లపాడు హెడ్‌వాటర్‌వర్క్స్ నిర్మాణానికి శంకుస్థాపన |
| 1990 | తక్కెళ్లపాడు వాటర్‌వర్క్స్ ప్రారంభోత్సవం |
| 1994 | గుంటూరు కార్పొరేషన్‌గా ఆవిర్భావం |

# అక్షర జ్యోతి ఆంధ్రజ్యోతికి శుభాభినందనలు



స్వర్గీయ యన్.టి.ఆర్



శ్రీ నారా చంద్రబాబు నాయుడు
రాష్ట్ర టి.డి.పి. అధ్యక్షులు



ప్రజా పత్రికగా ఎనలేని పాఠకుల అభిమానాన్ని చూరగొన్న **ఆంధ్రజ్యోతి** దిన పత్రిక అభివృద్ధి దిశలో పయనిస్తూ ఐదు సంవత్సరాలు పూర్తి చేసుకొన్న శుభ తరుణంలో **ఆంధ్రజ్యోతి యాజమాన్యానికి...సిబ్బందికి** మా హృదయ పూర్వక శుభాభినందనలు.

## దసరా, దీపావళి శుభాకాంక్షలు

తెలుగుదేశం పార్టీ నాయకులు, కార్యకర్తలు, అభిమానులు, ప్రజలకు, శ్రేయోభిలాషులకు విజయ దశమి, దీపావళి శుభాకాంక్షలు తెలియజేస్తూ ఈ పర్వదినాలు అందరికీ సకల శుభాలు కలుగ చేయాలని కోరుకుంటూ...

### పల్లెపల్లెకు...వార్డు వార్డుకు టి.డి.పి.

రాష్ట్రంలో ప్రజా వ్యతిరేక పాలన సాగుతున్నది. కాంగ్రెస్ ప్రభుత్వ పాలనలో అవినీతి, అక్రమాలు, అరాచకాలు యథేచ్ఛగా జరుగుతున్నాయి. ప్రజల ప్రాణాలకు, ఆస్తులకు రక్షణ లేకుండా పోయింది. కనీస సమస్యలను పరిష్కరించటంలో ప్రభుత్వం ఘోరంగా విఫలమైంది. ఈ నేపథ్యంలో ప్రజా సమస్యలు తెలుసుకొని వాటి పరిష్కారానికి కృషి చేసేందుకై పల్లెపల్లెకు, వార్డు వార్డుకు తెలుగుదేశం కార్యక్రమం జరుగుతున్నది. ఈ కార్యక్రమం పట్ల ప్రజల నుంచి విశేష స్పందన లభిస్తున్నది. ప్రజలు తమకు తెలియజేసే సమస్యల పరిష్కారానికి కృషి చేస్తాం. ఎక్కడైనా ఎవరికైనా అన్యాయం జరిగితే వారి పక్షాన తెలుగుదేశం పోరాడుతుంది. ప్రజా సమస్యల పరిష్కారంలో తెలుగుదేశం పార్టీ నాయకులు, కార్యకర్తలు భాగస్వాములు అవుతారని ఆశిస్తూ...

సదా మీ సేవలో...

# డాక్టర్ కోడెల శివప్రసాదరావు

టి.డి.పి. అధికార ప్రతినిధి, రాష్ట్ర మాజీ మంత్రి వర్యులు
నరసరావుపేట

# 'శిలపై శిల్పాలు చెక్కేవారు..!'

## దుర్గిలో జాలువారుతున్న కళాకాంతులు



2003లో జరిగిన వరల్డ్ మైనింగ్ ఎక్స్‌పో ఎగ్జిబిషన్‌లో దుర్గి శిల్ప కళా సోయగాలను తిలకిస్తున్న అప్పటి పర్యాటక శాఖామంత్రి గీతారెడ్డి

దుర్గిలో అనాదిగా శిల్ప కళ నిత్యనూతనంగా వికసించి పరిమళిస్తూ పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తోంది. అక్కడ ప్రభవిస్తున్న శిల్ప కళాఖండాలు ఖండాంతర ఖ్యాతిని ఆర్జిస్తున్నాయి. ప్రతి ఏటా ఎందరో దేశ విదేశీయ పర్యాటకులు ఇక్కడి శిల్ప సోయగాలను తిలకించి పులకరించిపోతుంటా రు. అంగుళం నుంచి ఆరు అడుగులు ఎత్తు కలిగిన సైజుతో పలు భంగిమలలో శిల్పాలను చెక్కడంలో దుర్గి శిల్పులు సిద్ధ హస్తులని చెప్పడంలో అతిశయోక్తి లేదు. క్రీ.శ.12 శతాబ్దంలోనే దుర్గిలో శిల్పకళకు బీజం పడింది. ఆ సమయంలో ప్రకృతి వైపరీత్యమో లేక శత్రురాజుల దాడుల ఫలితమో తెలియదు కానీ ద్వారకాపురి పూర్తిగా ధ్వంసమైంది. దాంతో ప్రాణాలతో మిగిలినవారు దారివేముల అనే ప్రాంతా నికి వచ్చి స్థిరపడ్డారు. వెంటనే శత్రుక్షయం కోరుతూ వారు దుర్గాదేవి విగ్రహాన్ని ప్రతిష్ఠాపన చేసి తాము నివశిస్తున్న ప్రదేశానికి దుర్గాదేవి పేరిట 'దుర్గి'గా నామకరణం చేశారు. నేటికీ కొంతమంది శిల్పులు తమ వంశపారంపర్యంగా వస్తున్న కళను త్యజించలేక శిలలకు ప్రాణంపోస్తూ జీవన యాత్ర సాగిస్తున్నారు.



రాధాకృష్ణుల రాస క్రీడలు



వయ్యారాలొలికిస్తున్న నర్తకి



మృదుమధురమైన బుద్ధుని రూపం

(ఆన్‌లైన్, దుర్గి)

దుర్గిలో ప్రభుత్వ ఆధ్వర్యంలో నడుస్తున్న నాగార్జున శిల్ప కళ శిక్షణా కేంద్రంతోపాటు శ్రీ వెంకటేశ్వర శిల్ప కళాశాల, శ్రీ వేణుగోపాలస్వామి శిల్పకళాశాల, దుర్గాదేవి శిల్ప కళాశాలలు వున్నాయి. ఈ శిల్ప కళాశాలల నుంచి నిరంతరం శిల్ప కళాఖండాలు ప్రాణం పోసుకొని విశ్వవ్యాప్తంగా ఎగుమతై స్వదేశ శిల్పకళకు గొప్ప ప్రాచుర్యాన్ని సంపాదించిపెడుతున్నాయి. దుర్గి శిల్ప కళాశాలల్లో ప్రాణం పోసుకుంటున్న రాతి విగ్రహాలలో దేవతామూర్తులే కాక పల్లె పడుచు, శిశువుకు పాలు ఇస్తున్న మాతృమూర్తి, దర్పణ సుందరి, వయ్యారాలు ఒలికించే సుందరాంగుల విగ్రహాలు ప్రధానంగా వుంటాయి. వన్నె తగ్గిన శిల్ప కళలో కొత్త క్రాంతిని ప్రవహింపజేయడానికి ఇక్కడ శిల్పులు కృషి సల్పుతూ రాళ్ళలో అపురూప కళాఖండాల అన్వేషణ కోసం కారు చీకట్లో కాంతిపుంజాల్లా దూసుకుపోతున్నారు.

### దుర్గి శిల్ప కళా చరిత్ర బహు ప్రాచీనం

క్రీస్తుశకం 12వ శతాబ్దంలోనే దుర్గిలో శిల్పకళకు బీజం పడింది. తొలుత కొంతమంది శిల్పులు పెందోట నుంచి ద్వారకాపురికి వలస వచ్చి ఇక్కడే స్థిరపడి జీవనం సాగిస్తుండేవారు. మహాయాన బౌద్ధమతాన్ని రూపొందించిన ఆచార్య నాగార్జునుడు పెందోట నివాసి అని కొందరి భావన. 12వ శతాబ్దంలోనే ప్రకృతి వైపరీత్యమో లేక శత్రురాజుల

(మిగతా 39లో)

# 'శిలలపై శిల్పాలు చెక్కినారు'



శిల్పకళాకారుల నైపుణ్యానికి చిహ్నం ఈ నర్తకి

(38వ పేజీ తరువాయి)

దాడుల ఫలితమో ద్వారకాపురి పట్టణం పూర్తిగా విధ్వంసమైంది. ఆ సంఘటనలో ప్రాణాలతో మిగిలిన వారు కొందరు దారివేముల అనే ప్రాంతానికి తరలివచ్చి ఆ గ్రామాన్ని నిర్మించుకున్నారు. ద్వారకాపురికి చెందిన మరి కొందరు బతికి బయటపడ్డ కొద్దిమంది శిల్పులతో నేటి దుర్గి ప్రాంతాని కి వచ్చి స్థిర పడ్డారు. వారు ఈ ప్రాంతానికి వచ్చిన వెంటనే శత్రుక్షయం కోరుతూ దుర్గాదేవి విగ్రహాన్ని ప్రతిష్టాపన చేసి తాము నివశిస్తున్న ప్రదేశానికి దుర్గాదేవి పేరిట 'దుర్గి' అను నామకరణం చేశారు. ఇదంతా యదార్థమని చెప్పడానికి నిదర్శనంగా దుర్గిలో నేటికీ ప్రాచీన దుర్గాదేవి ఆలయం వుండడం గమనార్హం. దుర్గిలో 15వ శతాబ్దం నాటికి శిల్ప కుటుంబాల సంఖ్య 300 చేరినట్లు కొందరి అభిప్రాయం. ఇక్కడ కాకతీయుల కాలం నాటి క్రీ.శ.1127లో నాగేశ్వర, ఓంకారేశ్వర ఆలయాలు, క్రీ.శ. 1160లో వేణుగోపాల స్వామి ఆలయం, క్రీ.శ. 1140లో వీరభద్ర ఆలయం, స్థానిక శిల్పులచే నిర్మించినట్లు ఆయా శిలాశాసనాలు స్పష్టం చేస్తున్నాయి. మాచర్లలోని ప్రాచీన చెన్నకేశవ, వీరభద్రాలయాలు, అమరావతి, నాగార్జునకొండలో నిర్మించిన బౌద్ధ స్థూపాల నిర్మాణం వెనుక దుర్గి శిల్పుల పాత్ర వున్నట్లు కూడా పలువురు విశ్వసిస్తున్నారు. కాలక్రమంలో శిల్ప కళాపోషకులు కరువై అన్నిచోట్ల క్షీణదశకు చేరింది. రాజులు, రాజ్యాలు అంతరించడంతో శిల్ప కళకు ఈ దుస్థితి దాపురించింది. దీంతో కమనీయ శిల్పాలను మలిచే శిల్పుల బతుకుల్లో చిమ్మచీకట్లు కమ్ముకున్నాయి. అహర్నిశలు బండల మాటున గుండెలు మోగించి మనోజ్ఞ శిల్ప కళాఖండాలను సృజించినా పూట గడవడం కష్టంగా మారింది. ఈ నేపథ్యంలో ఎందరో శిల్ప కళాకారులు శిల్ప వృత్తికి స్వస్తి చెప్పి ఇతర వృత్తులను ఆశ్రయించారు. మిగిలిన కొద్దిమంది శిల్పులు వంశ పారంపర్యంగా పుణికి పుచ్చుకున్న శిల్ప కళను త్యజించలేక శిలలకు ప్రాణం పోసి జీవనయాత్ర సాగిస్తున్నారు. దుర్గి శిల్పులు కూడా ఇదే బాటలో ప్రయాణిస్తూ శిల్ప కళాసేవకే తమ జీవితాలను అంకితం చేస్తున్నారు.





దుర్గి శిల్ప కళాకారుల అద్భుత సృష్టి ఈ శిల్పాలు



శంకుచక్రదారి శ్రీ వెంకటేశ్వర స్వామి

## ట్రైనింగ్ సెంటర్‌ను పునరుద్ధరించాలి - చెన్నుపాటి

ప్రభుత్వ ఆధ్వర్యంలో నడుస్తున్న ఇక్కడ శిల్ప కళాశాలలో శిల్ప కళను అభ్యసించే ఔత్సాహికుల కోసం ట్రైనింగ్ సెంటర్‌ను పునరుద్దరించాలని శిల్ప కళాకారుల సంఘం అధ్యక్షులు చెన్నుపాటి సీతారామయ్య ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు. ఏడాది క్రితం ట్రైనింగ్ సెంటరును మూసివేశారని చెబుతూ తిరిగి ఏర్పాటుచేస్తే రెండేళ్ళ పాటు కోర్సు కొనసాగిస్తే ఎంతోమంది శిల్పులు తయారవుతారని పేర్కొన్నారు. టూరిజం శాఖ ఇక్కడ శిల్ప కళ టెక్నాలజి పార్కు ఏర్పాటు చేయాలన్న సంకల్పంతో రూ.10 లక్షలు మంజూరు చేసినా ఆచరణలోకి రాలేదని ఆవేదన వ్యక్తంచేశారు. శిల్పాల తయారీకి ఉపయోగిస్తున్న రాయి ఇక్కడి నుండి ఇతర రాష్ట్రాలకు అక్రమ రవాణా జరుగుతుండడంతో స్థానిక శిల్పులకు రాయి కొరత ఏర్పడిందని పేర్కొన్నారు. అక్రమ రవాణాను నిరోధించేందుకు ప్రభుత్వం చర్యలు తీసుకోవాలని సూచించారు.



చెన్నుపాటి సీతారామయ్య, శిల్ప కళాకారుల సంఘం అధ్యక్షుడు

## శిల్ప కళాభివృద్ధికి ప్రభుత్వ తోడ్పాటు

గాలిలో దీపంలో కొట్టుమిట్టాడుతూ ఆరిపోయే దశకు చేరుతున్న శిల్ప కళను రక్షించి శిల్పులలో దాగి వున్న సృజనాత్మక శక్తిని వెలికి తీసే సంకల్పంతో రాష్ట్ర ప్రభుత్వం 1962లో దుర్గిలో

(మిగతా 40లో)



గాంధీజీ బసచేసిన కచేరి స్థానంలో నిర్మించిన భవనం



ముప్పాళ్ళ గ్రామ వ్యూ

# నేటికీ ఇక్కడ గాంధీ స్మరణ

**చేనేతను ధరించండి.. అందు కోసం పత్తిని పండించి విదేశీ వస్త్రాలను విడనాడండని గాంధీజీ గుంటూరు జిల్లా ఈపూరు మండలం ఆరేపల్లి ముప్పాళ్ళ గ్రామప్రజల నుద్దేశించి స్వాతంత్రోద్యమ సమయంలో ఉద్బోధించారు.**

ముప్పాళ్ళ గ్రామానికి చెందిన పాలడుగు వెంకట్రాయుడు, గోపాలుని రామలింగయ్య గాంధీజీని ముప్పాళ్ళకు తీసుకవచ్చి వెండి, బంగార నాణెములతో తులాబారం తూచి వాటిని స్వాతంత్రోద్యమానికి విరాళంగా అందజేశారు.

ముప్పాళ్ళ గ్రామంతో పాటు చుట్టుపక్కల గ్రామాలవారు కూడా గాంధీజీని చూడటానికి తండోపతండాలుగా వచ్చారు. అడుగడుగునా గాంధీజీ దంపతులకు హారతులు పడుతూ స్వాతంత్రోద్యమానికి తమవంతు విరాళాలను అందజేశారు. గ్రామప్రజలు చూపిన ఆదరాభిమానాలకు గాంధీజీ దంపతులు ఎంతో సంతోషించారు.



ముప్పాళ్ళలో జాతిపితకు నేటి స్థితి

దేశ స్వాతంత్ర్య సంగ్రామం ఉద్యమంలో వీరోచితంగా పోరాడటమే కాకుండా అడుగడుగునా బ్రిటీషువారి కర్ర పెత్తనానికి అడ్డు తగులుతూ గాంధీ నాయకత్వంలో స్వాతంత్ర్యోద్యమానికి స్వచ్ఛంధంగా భూరి విరాళాలు సమకూర్చిన అనేక గ్రామాల్లో ఈపూరు మండలం ఆరేపల్లి ముప్పాళ్ళ గ్రామానికి అగ్రపీఠం లభిస్తుంది. బ్రిటీషు దమననీతికి వ్యతిరేకంగా తలపెట్టిన దండి సత్యాగ్రహానికి ముందు 1927 మేనెలలో మహాత్మా గాంధీ ఆంధ్రా పర్యటనకు వచ్చినప్పుడు ఆరేపల్లి ముప్పాళ్ళ గ్రామానికి వచ్చాడు. గ్రామంలో గాంధీజీ దంపతులిరువురికి ఘనస్వాగతం లభించింది. ముప్పాళ్ళ గ్రామంలో గాంధీజీ దంపతులు ఒకరోజు రాత్రి బసచేయడం ఆ గ్రామచరిత్రలో మరుపురాని సంఘటన అయింది. గాంధీజీ దంపతులు బసచేసిన భవనం ప్రదేశంలో ప్రస్తుతం స్టేట్‌బ్యాంకు కొనసాగుతుంది. ఆరేపల్లి ముప్పాళ్ళ గ్రామపరిధిలో భారత స్వాతంత్ర్యోద్యమానికి తమ వంతు విరాళంగా మహాత్మాగాంధీకి వెండి రూపాయలతోను, బంగారు ఆభరణాలతోను ఆయన బరువు తులాబారం చూశారు. ఆ తులాబారం ముప్పాళ్ళ గ్రామానికి గుంటూరు జిల్లాలోనే ఎనలేని గౌరవాన్ని తెచ్చిపెట్టింది. ఇంతటి అరుదైన సంఘటనకు మహాత్మాగాంధీజీ పులకించిపోయారు.ఆరేపల్లి ముప్పాళ్ళ గ్రామప్రజల నుద్దేశించి దాదాపు గంటకు పైగా ఉపన్యసించారని అప్పటి సమకాలీనులు తెలిపారు. గాంధీజీ దంపతులు అలనాడు ముప్పాళ్ళ గ్రామం రావడంతో గ్రామంలో పండుగ వాతావరణం నెలకొంది. పలనాటి ప్రాంతంలో అలనాటి పోలీసు పద ఘటనలతో ఆరేపల్లి ముప్పాళ్ళ గ్రామం దేశస్వాతంత్ర్య ఉద్యమ చరిత్రలో గుర్తింపును పొందింది. విశ్వమంతటికి వెలుగుబాటైన మహాత్మా గాంధీజీ ఆ గ్రామానికి రావడంతో గ్రామస్తుల ఆనందానికి అవధులు లేకుండా పోయాయి.

– ఆన్‌లైన్ – ఈపూరు

# 'శిలలపై శిల్పాలు చెక్కే వారు'

(39వ పేజీ తరువాయి)

శిల్ప కళా శిక్షణ కేంద్రాన్ని నెలకొల్పింది. పరిశ్రమల శాఖ ఆధ్వర్యంలో ఏర్పాటైన ఈ శిక్షణ కేంద్రంలో మొదటి రెండేళ్ళలో ఆరుగురు మాత్రమే శిల్పకళల శిక్షణ పొందారు. ఆ తరువాత వందల సంఖ్యలో ఈ శిక్షణ కేంద్రం నందు శిక్షణ పొంది నైపుణ్యం సాధించారు. శిల్పుల మేదస్సుకు మరింత పదును పెట్టి, శిల్ప తయారీలో అవసరమైన సూచనలు, సలహాలు ఇవ్వడానికి నాగార్జున స్టోన్ క్వారింగ్ వర్కర్స్ కో–ఆపరేటివ్ ఇండస్ట్రియల్ సొసైటీ ఆవిర్భవించి కృషి సల్పుతోంది. రెండేళ్ళ క్రితం ఇక్కడి శిల్పులకు వృత్తి నైపుణ్యత సాధించడానికి రీజనల్ డిజైన్ అండ్ టెక్నికల్ డెవలప్‌మెంట్ సెంటర్(బెంగుళూరు) ఆధ్వర్యాన వర్క్‌షాప్ నిర్వహించారు.

## దుర్గి శిల్పులకు సముచిత సత్కారం

మురిపాలు జాలువారే దుర్గి శిల్పాలు సందర్శకులను ఇట్టే ఆకట్టుకుంటాయి. 1984లో హైదరాబాద్‌లో వినాయక చవితి ఉత్సవాల సందర్భంగా నిర్వహించిన 'విఘ్నేశ్వర విగ్రహప్రదర్శన'లో దుర్గి విగ్రహాల అందచందాలను తిలకించిన ఆనాటి రాష్ట్ర ముఖ్యమంత్రి ఎన్‌టి రామారావు మంత్రముగ్ధులై దుర్గి శిల్పుల శిల్ప కళా నైపుణ్యాన్ని ప్రశంసిస్తూ ఘనంగా సన్మానించారు. అంతటితో ఆగక ఆ తరువాత కొద్దికాలానికే ఆయన తన సతీమణి లక్ష్మీపార్వతితో వచ్చి దుర్గి శిల్ప కళాకేంద్రాలను స్వయంగా సందర్శించి ఆనందించారు.

మాజీ ముఖ్యమంత్రి టి.అంజయ్య కూడా దుర్గి శిల్పుల శిల్ప కళాసేవకు గుర్తుగా శిల్ప కళాకేంద్రం ప్రధానాచార్యులు ఈశ్వర భిక్షమాచారిని సముచిత రీతిన సన్మానించి సత్కరించారు. 1996లో 'స్టోనా 96' పేరిట బెంగుళూరులో నిర్వహించిన ప్రపంచ శిల్ప విగ్రహ ప్రదర్శనలో పాల్గొనే నిమిత్తం కేంద్ర ప్రభుత్వం దుర్గి శిల్ప కళా కేంద్రానికి ఆహ్వానం పంపడం ఈ శిల్ప కళా కేంద్రం గొప్పతనానికి నిదర్శనం.

## ప్రభుత్వం చేయూతనిస్తే శిల్ప కళకు పునరుజ్జీవం

కఠిన శిలలపై శిల్పాలు చెక్కి సృష్టికి అందాలు తెచ్చినా తమకు మాత్రం మోడుబారిన జీవితమే మిగులుతుందని దుర్గి కళాకారులు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. ఆరు అడుగుల శిల్పం చెక్కాలంటే ఇరువురు శిల్పులు నెల రోజుల పాటు శ్రమించాలని, శిల్పంలో ఏ ఒక్క భాగం దెబ్బతిన్నా తమ శ్రమ అంతా వృధా అవుతుందన్నారు.

ప్రభుత్వం ఆర్థిక రుణసాయం చేస్తే శిల్ప కళాకేంద్రం నిర్మించుకొని శిల్ప కళారాధనకే అంకితమవుతామని శ్రీ వెంకటేశ్వర శిల్ప కళాశాల శిల్పులు అభిప్రాయపడుతున్నారు. శిల్ప కళాభివృద్ధికి ప్రభుత్వం హైస్కూల్ స్థాయిలో ప్రతి క్లాస్‌కు వారానికి ఒక పిరియడ్ చొప్పున కేటాయించి శిల్పాచార్యులచే శిల్ప కళ పై విద్యార్థులకు శిక్షణ ఇప్పించాలని శిల్పి ఎర్రోజు నరసింహాచారి ప్రభుత్వానికి సూచించారు.

శిల్ప కళకు కాణాచి అయిన దుర్గిలో ఆ కళ మున్ముందు కూడా ఇలాగే పల్లవించాలంటే ప్రభుత్వ ప్రోత్సాహం తప్పనిసరి. ప్రభుత్వ ఉద్యోగాల కోసం వెంపర్లాడక శిల్ప కళనే జీవనోపాధిగా మలచుకొని అనల్ప శిల్ప కళాచాతుర్య శక్తితో అపురూప కళాఖండాలను వెలయిస్తున్న దుర్గి శిల్పుల కృషి అభినందనీయం.



# అక్షరజ్యోతి 'ఆంధ్రజ్యోతి'కి అభినందనలు

అక్షరమే ఆయుధంగా, అవినీతి, అన్యాయాలు, అక్రమాలపై అక్షర సమరం చేస్తూ అయిదు వసంతాలు పూర్తిచేసుకుని ఆరవ వసంతంలోకి అడుగు పెడుతున్న 'ఆంధ్రజ్యోతి'కి అభినందనలు.

రేపల్లె నియోజకవర్గ ప్రజలకు రంజాన్, దసరా, దీపావళి, క్రిష్టమస్ పర్వదినాల సందర్భంగా శుభాకాంక్షలు తెలియచేస్తూ... ఈపండుగ పర్వదినాలు అందరిలోగిళ్ళలో సుఖ,సంతోషాలు నింపాలని ఆకాంక్షిస్తూ... అభినందనలతో...



లంకగ్రామాల్లో ద్విచక్రవాహనాలపై పర్యటిస్తున్న ఎమ్మెల్యే దేవినేని మల్లిఖార్జునరావు



సద్భావనార్యాలీలో పాల్గొన్న రేపల్లె ఎమ్మెల్యే దేవినేని మల్లిఖార్జునరావు.



కళ్యాణమస్తు సామూహిక వివాహ కార్యక్రమంలో వధూవరులకు నూతన వస్త్రాలు బహుకరిస్తున్న ఎమ్మెల్యే దేవినేని.



ఇందిరమ్మ పథకం లబ్ధిదారునికి పక్కాగృహం డాక్యుమెంటేషన్ అందచేస్తున్న ఎమ్మెల్యే దేవినేని మల్లిఖార్జునరావు.



చెరుకుపల్లిలో రైతులకు పవర్ స్ప్రేయర్లు పంపిణీ చేస్తున్న ఎమ్మెల్యే దేవినేని మల్లిఖార్జునరావు.



వెల్లటూరు బ్యాంక్‌కెనాల్‌పై నిర్మిస్తున్న వంతెన నిర్మాణపనులను పరిశీలిస్తున్న ఎమ్మెల్యే దేవినేని, ఎంపి బాలశౌరి,మంత్రి జీవన్‌రెడ్డి.

## శ్రీ దేవినేని మల్లిఖార్జునరావు

శాసనసభ్యులు,

రేపల్లె అసెంబ్లీ నియోజకవర్గం


బిసి కాలనీలో మంచి నీటిని సరఫరా చేస్తున్న ట్యాంకర్


కండ్లకుంటలో క్యాన్సర్ వైద్య శిబిరం కోసం తరలివచ్చిన వాహనం


నరసరావుపేటలో ట్రస్ట్ నిర్వహించిన రక్తదాన శిబిరం

## 'చిన్ని' ఆశయసాధనలో...

# శ్రమిస్తున్న కోడెల ఛారిటీస్

(ఆన్‌లైన్, నరసరావుపేట)

పేదలకు విస్తృతమైన సేవలు అందించే లక్ష్యంతో డాక్టర్ కోడెల సత్యనారాయణ ట్రస్ట్ పని చేస్తున్నది. ఆయన తండ్రి మంత్రిగా వున్నా తాను మాత్రం సాధారణ విద్యార్థిగానే భావించాడు. కష్టపడి చదివి ఎముకుల చికిత్సా విధానంలో బంగారు పతకాన్ని సాధించాడు.

ఎంఎస్ పూర్తవ్వగానే కార్పొరేట్ ఆస్పత్రుల వైపు పరుగులు తీయకుండా సామాన్య ప్రజలకు సేవలు అందించాలనే తలంపుతో సింగరేణి ఆస్పత్రిలో ప్రభుత్వ ఉద్యోగిగా పని చేశాడు. పేద ప్రజల స్పందనను తెలుసుకొన్నాడు. అక్కడ పని చేసే సమయంలో మందులు లేకుంటే సొంత డబ్బు వెచ్చించి రోగులకు మందులు కొని ఇచ్చేవాడు. ఇలా ఆస్పత్రిలోని తోటి వైద్యులు, సింగరేణి కార్మికుల మన్ననలను అందుకొన్నాడు. ఆయనే మాజీ మంత్రి డాక్టర్ కోడెల శివప్రసాదరావు చిన్న కుమారుడు డాక్టర్ కోడెల సత్యనారాయణ.

అలాంటి ఆదర్శ వైద్యుడు అందరూ ముద్దుగా పిలుచుకొనే **'చిన్ని'** కారు ప్రమాదంలో మరణించాడు. ఆయన ఆశయాలకు అనుగుణంగా ప్రజలకు సేవలు అందించేందుకై తండ్రి, టిడిపి అధికార ప్రతినిధి డాక్టర్ కోడెల శివప్రసాదరావు, ఆయన పెద్ద కుమారుడు డాక్టర్ కోడెల శివరామకృష్ణల ఆధ్వర్యంలో చిన్ని పేరు పై ధర్మ సంస్థను ఏర్పాటు చేశారు. ఈ ట్రస్ట్ ద్వారా పేదలకు విశేషమైన వైద్యసేవలను అందిస్తున్నారు. రక్తదాన శిబిరాలను నిర్వహించి ఆపదలో వున్న వారిని ఆదుకొనేందుకు ట్రస్ట్ తరుపున బ్లడ్ ప్యాకెట్లను రక్తనిధికి అందజేస్తున్నారు. గుంటూరు జిల్లాతో పాటు రాష్ట్రంలో ఇతర ప్రాంతాలలో కూడా ట్రస్ట్ ఆధ్వర్యంలో పలు సేవా కార్యక్రమాలు నిర్వహించారు.

* నరసరావుపేట నియోజక వర్గంలోని కుంకలగుంట, కండ్లకుంట గ్రామాలలో మెగా వైద్య శిబిరాలను ట్రస్ట్ నిర్వహించింది. వందలాది మందికి వైద్య పరీక్షలు జరిపి ఉచితంగా మందులు పంపిణీ చేశారు. హైదరాబాద్‌లోని బసవ తారకం రామారావు మెమోరియల్ క్యాన్సర్ ఫౌండేషన్, ఇండో అమెరికన్ క్యాన్సర్ ఇనిస్ట్యూట్ రీసెర్చ్ సెంటర్ సహకారంతో క్యాన్సర్ వైద్య పరీక్షలు నిర్వహించి అవసరమైన రోగులకు ఇనిస్ట్యూట్‌లో వైద్య సేవలు అందజేస్తున్నారు.
* వైద్య శిబిరాలతో పాటు ప్రాణాపాయ స్థితిలో వుండే రోగులను ఆదుకొనేందుకు మెగా రక్తదాన శిబిరాలు నిర్వహించారు. నరసరావుపేట భువనచంద్ర టౌన్ హాల్‌లో నిర్వహించిన రక్తదాన శిబిరంలో రికార్డు స్థాయిలో దాతల నుంచి 419 యూనిట్ల రక్తసేకరణ జరిగింది.


డాక్టర్ కోడెల సత్యనారాయణ

* తెనాలి మండలం, పెదరావూరులో క్యాన్సర్ వ్యాధి నిర్ధారణ శిబిరాన్ని నిర్వహించటంతో పాటు సుమారు 650 మందికి ఉచితంగా వైద్య పరీక్షలు నిర్వహించి మందులు అందజేశారు.
* గత వేసవిలో తాగు నీటి ఇబ్బందులను దృష్టిలో వుంచుకొని పట్టణంలో ట్రస్ట్ ఐదు చోట్ల చలివేంద్రాలను ఏర్పాటు చేసింది. అలాగే పేదలు నివశించే కాలనీలకు ట్యాంకర్ ద్వారా ఉచితంగా నీటి సరఫరా చేస్తున్నారు.
* వైద్య శిబిరాలలో క్యాన్సర్ వున్నట్లుగా గుర్తించిన రోగులకు హైదరాబాద్‌లోని బసవ తారకం క్యాన్సర్ ఇనిస్ట్యూట్‌లో వైద్య సేవలు అందించేందుకై వారికి రాయితీతో రైల్వే పాసులను పంపిణీ చేశారు.
* తెనాలి మండలం, అంగలకుదురులో వైద్య శిబిరం నిర్వహించి 800 మందికి వైద్య పరీక్షలు జరిపి ఉచితంగా మందులు పంపిణీ చేశారు.

ఇలా ట్రస్ట్ ఆధ్వర్యంలో పేదలకు వైద్య సేవలతో పాటు సామాజిక సేవా కార్యక్రమాలను అందిస్తున్నారు. తన కుమారుడు డాక్టర్ కోడెల సత్యనారాయణ ఆశయాలకు అనుగుణంగా విస్తృత స్థాయిలో సేవలను ప్రజలకు అందించనున్నట్లు డాక్టర్ కోడెల శివప్రసాదరావు పేర్కొన్నారు. ట్రస్ట్ సేవలను ఇంకా విస్తృతం చేస్తామని సత్యనారాయణ సోదరుడు డాక్టర్ కోడెల శివరామకృష్ణ చెప్పారు.



# 'ఆంధ్రజ్యోతి'కి 5వ వార్షికోత్సవ శుభాకాంక్షలు



శ్రీమతి సోనియాగాంధీ
ఎఐసిసి అధ్యక్షురాలు.



డాక్టర్ వైయస్ రాజశేఖరరెడ్డిగారు
ముఖ్యమంత్రి



శ్రీమతి దగ్గుబాటి పురంధరేశ్వరిగారు
కేంద్ర మానవవనరుల శాఖమంత్రి

ప్రజాపత్రికగా ఎనలేని అభిమానాన్ని సంపాదించుకున్న 'ఆంధ్రజ్యోతి' దినపత్రిక అభివృద్ధి దిశలో పయనిస్తూ అయిదు వసంతాలు పూర్తిచేసుకున్న శుభసందర్భంలో 'ఆంధ్రజ్యోతి'కి హృదయపూర్వక శుభాకాంక్షలు.

ఆంధ్రజ్యోతి 5

కాంగ్రెస్‌పార్టీ కార్యకర్తలకు,
ప్రజలకు, శ్రేయోభిలాషులకు
రంజాన్, దసరా, దీపావళి
శుభాకాంక్షలు. అభినందనలతో....



రేపల్లె మండలం కాంగ్రెస్‌పార్టీ కార్యకర్తల సమావేశంలో ప్రసంగిస్తున్న రాష్ట్రమంత్రి ఎంవి రమణరావు.



రేపల్లె మండలంలో బేతపూడిలో విద్యార్థులకు స్కూల్‌బ్యాగ్‌లు పంపిణీ చేస్తున్న మంత్రి ఎంవి రమణరావు.



నిజాంపట్నం మండలం కోనఫలంలో ఐఏవై పక్కాగృహాల కాలనీ శిలాఫలకాన్ని ఆవిష్కరిస్తున్న మంత్రి మోపిదేవి.



నిజాంపట్నంలో మహిళలకు ఐస్‌బాక్సులు పంపిణీ చేస్తున్న మంత్రి ఎంవి రమణరావు తదితరులు.



నగరంలో ఆర్‌యండ్రెయిన్ మరమ్మత్తు పనులు ప్రారంభిస్తున్న మంత్రి ఎంవి రమణరావు.



నగరం-పూడివాడ రోడ్డు పనులను ప్రారంభిస్తున్న మంత్రి ఎంవి రమణరావు, కేంద్రమంత్రి పురంధేశ్వరి, జడ్‌పి ఛైర్‌పర్సన్ విజయమ్మ.



నియోజకవర్గ కేంద్రమైన కూచినపూడిలో కార్యకర్తలకు, అభిమానులకు అభివాదం చేస్తున్న రాష్ట్రమంత్రి ఎంవి రమణరావు.

## మోపిదేవి వెంకట రమణరావు

రాష్ట్రమౌళిక సదుపాయాలు, ఓడరేవులు, విమానయాన, సహజవాయువు, పెట్టుబడుల శాఖమంత్రివర్యులు

# భక్తులకది 'సంజీవ'ని

**గతంలో విప్లవం వర్థిల్లాలి.. మావోయిజం.. నక్సలిజం.. స్టాలిన్.. లెనిన్ల పేర్లు వినిపించే ఆ కొండపై నేడు శంభోశంకర.. హరహర మహదేవ.. అనే భక్తుల శివనామస్మరణతో ఆ ప్రాంతం మార్మోగిపోతుంది.**



ఆహ్లాదకరమైన సంజీవని కొండ

(ఆన్‌లైన్ - వినుకొండ)

త్రేతాయుగంలో రామ, రావణాసుర యుద్ధ సమయంలో మేఘనాథుడు సంధించిన బాణానికి స్పృహ కోల్పోయిన లక్ష్మణుడిని హనుమంతుడు సంజీవని పర్వతాన్ని తీసుకువచ్చి అందులోని సంజీవని చెట్టు మూలికతో రక్షించాడని రామాయణంలో పేర్కొన్నారు. ఆనాటి సంజీవనివృక్షం ఉందో లేదో కానీ వినుకొండ నియోజకవర్గంలోని ఈపూరు మండలం బొమ్మరాజుపల్లి గ్రామానికి సమీపాన ఉన్న కొండలో నిక్షిప్తమైన వృక్షరాజాల గాలులతో రోగాలు నివారణవుతున్నాయన్న భక్తుల నమ్మకంతో ఆ కొండకు సంజీవనికొండగా భక్తులు పిలుచుకుంటున్నారు. మూడునెలల క్రితం వరకు ఆ ప్రాంతానికి పగలు వెళ్ళాలంటే భయపడే జనం నేడు వేలాదిమంది భక్తులు రాత్రివేళ జాగారం చేయడం విశేషం. సాధారణ వ్యాధులతో పాటు క్యాన్సర్ లాంటి ప్రాణాంతక జబ్బులు సైతం కొండపై జాగారం చేస్తే మటుమాయమవుతాయన్న భక్తుల నమ్మకంతో ప్రతి సోమవారం కొండ ప్రాంతం భక్తులరద్దీతో కిటకిటలాడుతుంది. కొండపై స్వయంభువుగా వెలసిన శివుడిని భక్తులు కోటయ్యగా కొలుస్తున్నారు. శివుడు తొలుత సంజీవని కొండపై తపస్సు చేశాడని కొండపై గల మృగాల ఘీంకారాలకు తపస్సు భంగం కలిగిన కోటయ్యస్వామి ఇక్కడి నుండి త్రికూట పర్వతానికి వెళ్లాడని అదినేడు కోటయ్య కొండగా పేరుగాంచింది. కోటయ్యస్వామి శివలింగంగా కొండపై వెలిశాడని భక్తుల నమ్మకం.

అయితే సుమారు 500 సంవత్సరాలుగా కొండపై ఉన్న శివలింగం మరుగున పడిపోయింది. కొండపై మేతకు వెళ్లిన మేకలు, పశువులు, వాటిని పరిరక్షించే కాపరులకు దెబ్బలు తగిలిన సమయంలో వెంటనే మాయమయ్యేవని చెబుతుండేవారు. కాలగమనంలో కొందరు భక్తులు కొండపైన ఉన్న కోటయ్యస్వామిని దర్శించి అక్కడే జాగారం చేశారు. క్యాన్సర్ లాంటి ప్రాణాంతక వ్యాధులు సైతం మటుమయమైనట్లు స్వస్థత పొందిన రోగులు చెప్పడంతో కొండకు వచ్చే భక్తుల సంఖ్య పెరిగింది. కొంత కాలంగా ప్రతిసోమవారం సుమారు 20 వేల మందికి పైగా భక్తులు సంజీ వని కొండకు వచ్చి స్వామిని దర్శించి జాగారం చేస్తున్నారు. గుంటూరు జిల్లాలోని పలు ప్రాంతాల భక్తులతో పాటు నల్గొండ, కృష్ణ, ప్రకాశం జిల్లాలకు చెందిన భక్తులు వాహనాలలో కొండవద్దకు చేరుకుని నాలుగు కి.మీ. ఎత్తులో గల కొండనెక్కి స్వామిని దర్శించి రోగాల విముక్తి కోసం శివనా మస్మరణ చేస్తున్నారు.

క్రమేణా సాధారణ రోజుల్లో సైతం భక్తుల సంఖ్య పెరిగి పోతుంది. స్వామి వారికి ఈపూరుకు చెందిన వి.శివప్రసాదశాస్త్రి పూజలు నిర్వహిస్తున్నారు. కొండపై భక్తుల సంఖ్య పెరగడంతో ఆదాయం కూడా పెరిగింది. వారానికి 40 వేలకు పైగా ఆదాయం చేకూరడంతో సంజీవనికొండ తమ పరిధిలో దంటూ ఆదాయం తమకే దక్కాలని భద్రుపాలెం, ముప్పాళ్ళ గ్రామాల వారు ఘర్షణ పడుతున్నారు. కొండపైకి వెళ్లేందుకు సరైన రోడ్డు సౌకర్యం లేదు. తాగేందుకు మంచినీరు లేదు.



సంజీవని కొండపై పూజలందుకుంటున్న కోటయ్యస్వామి



భక్తులతో కిటకిటలాడుతున్న సంజీవనికొండ

కొండరాళ్ల మధ్యే భక్తులు జాగారం చేస్తున్నారు. ఈనేపథ్యంలో దేవాదాయశాఖ కొండను తమ ఆధీనంలోకి తీసుకుని ప్రత్యేక ట్రస్టును ఏర్పాటు చేసి కొండపై వచ్చే ఆదాయం ద్వారా భక్తులకు మెరుగైన సౌకర్యాలు అందిస్తే భక్తుల సంఖ్య కూడా పెరుగుతుంది. ఈ విషయంలో ప్రత్యేక శ్రద్ధ వహిస్తే సంజీవనికొండ రాష్ట్రంలోనే ప్రసిద్ధ పుణ్యక్షేత్రంగా మారుతుంది.

### కణితి మాయం: వీరాంజనేయులు

సంజీవనికొండపై జాగారం చేయడంతో చేతికున్న కణితి మటుమాయమైందని బొమ్మరాజుపల్లికి చెందిన యర్రంశెట్టి వీరాంజనేయులు తెలిపాడు. ఆపరేషన్ ద్వారా కణితి తొలగించాలని నిర్ధారించిన డాక్టర్లు సైతం ఆశ్చర్యపోయారని తెలిపాడు. సంజీవని కొండ మహిమ కారణంగానే తాను పూర్తి ఆరోగ్యవంతుడినయ్యానని ఆనందంతో తెలిపాడు.

### కళ్లు కనిపిస్తున్నాయి: సామ్రాజ్యం

70 ఏళ్ల వృద్ధురాలైన తనకు కళ్లు కనిపించేవి కాదని సంజీవనికొండపై కోటయ్యస్వామి దర్శనంతో తనకు స్పష్టంగా చూపు కన్పిస్తుందని దుర్గి మండలం ధర్మవరంకు చెందిన గనిశెట్టి సామ్రాజ్యం తెలిపారు. రెండేళ్లుగా కంటిజబ్బుతో బాధపడుతున్న తాను విముక్తిరాలినైనందుకు మొక్కు తీర్చేందుకు స్వామివారిశిలను కొండపై ప్రతిష్ఠించారు.

### కాళ్లు వస్తాయని ఆశ: సుబ్బారావు

కొండనెక్కి స్వామిని దర్శించి జాగారం చేస్తే రోగాలు నయమవుతాయని చెప్పడంతో కుటంబసభ్యుల సాయంతో వచ్చానని వికలాంగుడైన సుబ్బారావు తెలిపాడు. ఈ విధంగా అనేక వ్యాధులు గల జనం విముక్తికోసం కొండనెక్కి స్వామివారిని దర్శించి జాగారం చేస్తున్నారు.

# విద్యా పరిశోధనల్లో మేటి నాగార్జున వర్సిటీ



యూనివర్సిటీ ప్రవేశ ద్వారం

(ఆన్‌లైన్ - ఆచార్య నాగార్జున యూనివర్సిటీ)

దేశవ్యాప్తంగా వేగంగా అభివృద్ధి చెందుతున్న విద్య పరిశోధనలలో తనకంటూ ప్రత్యేకతను సంతరించుకున్న ఆచార్య నాగార్జున యూనివర్సిటీ అందరి దృష్టినీ ఆకర్షిస్తోంది. అడుగడుగునా అభివృద్ధి సాధించడానికి అంకిత భావంతో పనిచేసే సిబ్బంది వారికి దిశా నిర్దేశం చేసే అధికారగణం, ఫలితాలను ప్రత్యక్షంగా చూపే విద్యార్థులు ఆచార్య నాగార్జున యూనివర్సిటీకి పేరుతెస్తున్నారు. దీనిలో భాగంగా అభివృద్దే మంత్రంగా వడివడిగా అడుగులు వేస్తూ విద్య, పరిశోధన, రాజకీయ, సామాజిక రంగాలకు ఎంతో మంది ప్రముఖులను అందించిన ఘనత దీని సొంతం.



వాణిజ్య భవన సముదాయం



త్వరలో అందుబాటులోకి రానున్న డైక్‌మెన్ కాన్ఫరెన్స్ కమ్ సెమినార్‌హాల్

## పుట్టుపూర్వోత్తరాలు...

ప్రముఖ బౌద్ధ తత్వ శాస్త్రవేత్త ఆచార్య నాగార్జునుడు పేరుతో ఏర్పడిన కృష్ణా, గుంటూరు, ప్రకాశం జిల్లాల్లో విద్యా కుసుమాలు వికసింప చేస్తుంది. ఆచార్య నాగార్జున యూనివర్సిటీ కృష్ణాతీరాన వందల సంవత్సరాల క్రితం ఈ ప్రాంతం గొప్ప విజ్ఞాన కేంద్రంగా విలసిల్లింది.

ప్రపంచం నలుమూలలల నుంచి అధ్యాపకులను, విద్యార్థులను ఆకర్షించింది. ఈ విషయాన్ని గుర్తించిన నేటి పాలకులు గుంటూరు, విజయవాడ మధ్య మంగళగిరికి సమీపంలో ఐదవ నెంబరు జాతీయ రహదారి పక్కన సుమారు 394 ఎకరాల విస్తీర్ణంలో ఆచార్య నాగార్జున యూనివర్సిటీని 1976, సెప్టెంబరు 11న అప్పటి రాష్ట్రపతి డాక్టర్ ఫక్రుద్దీన్ అలీ అహ్మద్ చేతులమీదుగా ప్రారంభింపచేశారు. అప్పటి నుంచి విద్యా సంబంధ విషయాలలో విశేష కృషి చేస్తూ పరిశోధనలో దేశ, విదేశ ఖ్యాతిని ఆర్జిస్తూ వస్తుంది. యూనివర్సిటీ సుమారు 45 విభాగాలతో విరాజిల్లుతూ తన పరిధిని మూడు జిల్లాలకు విస్తరించుకుంది. సుమారు 406 అనుబంధ కళాశాలలో డిగ్రీ, పిజి, ఇంజనీరింగ్, ఎడ్యుకేషన్, లా, ఫార్మసీ, ఓరియంటల్ లాంగ్వేజ్ కోర్సులను నిర్వహిస్తుంది. ఒంగోలు, నూజివీడు కళాశాలలో రెండు పిజి సెంటర్లను ఏర్పాటు చేసి వాటి అభివృద్ధిలో కూడా కీలకపాత్ర వహిస్తుంది.

## క్యాంపస్ కళాశాలలు, మెగా నిర్మాణాలు

31వ వ్యవస్థాపక దినోత్సవాన్ని క్యాంపస్ కళాశాలను సెప్టెంబరు 11న నిర్వహించారు. ఈ సందర్భంగా మొట్టమొదటిసారిగా వర్శిటీకి అనుబంధంగా పనిచేస్తున్న కళాశాలలో ఉత్తమ నిర్వహణను ప్రాతిపదికగా ప్రథమ, ద్వితీయ బహుమతులను ప్రకటించి ప్రోత్సహించారు. జ్ఞాన సంపదను విజ్ఞాన సౌధ రూపంలో జనులకు అందిస్తున్న వర్సిటీకి మౌలిక, ఆధునిక సౌకర్యాల కల్పనలో భాగంగా ఆచార్య వి బాలమోహన్ దాస్ వైస్ చాన్సలర్ అయిన తరువాత 1.05 కోట్ల రూపాయలతో ఓపెన్ ఎయిర్ ఆడిటోరియం, రూ. 50 లక్షల ఖర్చుతో స్టూడెంట్ సెంటర్ రూ. 75 లక్షల ఖర్చుతో గ్రంథాలయం అభివృద్ధి చేయనున్నారు.

రూ. 25 లక్షలతో బాలుర వసతి గృహాన్ని, రూ. 25 లక్షలతో నూజివీడు పిజి సెంటర్ బాలికల వసతి గృహం, రూ. 30 లక్షలతో అకడమిక్ బిల్డింగ్, రూ. 25 లక్షల ఖర్చుతో కేంద్రీయ ప్రయోగశాలపై నిర్మిస్తున్న కంప్యూటర్ ప్రయోగశాల, రూ. 2 కోట్లతో వాణిజ్య భవన్ , రూ. 6.5 కోట్లతో పరిపాలనా భవన్, రూ. 25 కోట్లతో పరిపాలనా భవన్, దూర విద్యా భవన్, రూ. కోటితో బొమ్మిడాల డిపార్ట్‌మెంట్ ఆఫ్ హ్యూమన్ రిసోర్స్ మేనేజ్‌మెంట్, రూ. కోటితో హిందీ భవన్, రూ. 2 కోట్లతో పరీక్షా భవన్, వాణిజ్య భవన్‌లు రూ. 4 కోట్లతో డైక్‌మెన్ సెమినార్ కమ్ ఆడిటోరియం, రూ. 4.05 కోట్లతో స్పోర్ట్స్ హాస్టల్‌ను నిర్మించారు. నిర్మిస్తున్నారు.

సాక్షాత్తూ భూటాన్ మహారాజు జిగ్‌మిసింగ్‌యే వాంగ్‌చుక్ చేతుల మీదుగా 1982లో మహాయాన బౌద్ధ మతం ఏర్పాటు కావడం ఆచార్య నాగార్జునినిపై వర్సిటీకున్న గౌరవ ప్రపత్తులను, అంకిత భావాన్ని తెలియజేస్తుంది. జర్నలిజం అండ్ మాస్ కమ్యూనికేషన్ యంబిఎ, యంసిఎ క్యాంపస్ విద్యార్థులకు

(మిగతా 47వ పేజీలో)

"కానివి కావు కావు తన కర్మవశంబులు పోవు పోవు
రా రానివి రావు రావు జిత రాక్షస లేనివి లేవు లేవు
మీ ధ్యానమె లావు లావు హరిదాసుడ నన్నిక బ్రోవు బ్రోవు
మీ దీనుని కావు దుర్గిపురి దేవ రమేశ త్రిలోకవందితా"

# పల్నాటి 'పోతన' సుబ్రహ్మణ్య కవి


సుబ్రహ్మణ్య ఆలయ ముఖద్వార గోపురం

అంటూ వేలాది కీర్తనలను విరచించి పల్నాటి ప్రజల ఆరాధ్యదైవంగా వెలుగొందుతున్నారు శ్రీ చిరుమామిళ్ళ సుబ్రహ్మణ్య కవి. భక్తి సాహిత్య చరిత్రలో పల్నాటి పోతన్నగా సుప్రసిద్దులైన సు బ్రహ్మణ్యకవి పరమపదించి 124 సంవత్సరాలు గడిచినా ఆయన సృజించిన అమూల్య భక్తిసాహిత్యం ఆయన్ని అమరున్ని చేసింది. దుర్గి మండలం ధర్మవరానికి చెందిన సుబ్రహ్మణ్యం 1802లో నరసయ్య, తిరుమలాంబ అనే పుణ్య దంపతులకు జన్మించారు. ఆయన బాల్య దశనుం డే జ్ఞాన, వైరాగ్యాలను అలవర్చుకొని మోక్షమా ర్గం కోసం పరితపించేవారు. త్రికాలజ్ఞాని అద్దంకి తాతాచార్యుల వద్ద గురోపదేశం పొందే మహాభాగ్యం సుబ్రహ్మణ్యంకు లభించింది. వ్యవసాయ వృత్తిలో స్థిరపడిన ఆయన పగలంతా పొలం పనులు చేయటం,

(మిగతా47లో)


సుబ్రహ్మణ్య కవి

# నిర్మాణాల రాజు 'శ్రీచక్ర' సిమెంట్

(ఆన్‌లైన్, నరసరావుపేట)

పటిష్టమైన కట్టడాలకు విశిష్టమైన సిమెంట్‌గా శ్రీ చక్ర సిమెంట్ పేరెన్నికగన్నది. 25 ఏళ్ళుగా సిమెంట్ మార్కెట్ రంగంలో శ్రీ చక్ర ప్రత్యేక స్థానాన్ని సాధించింది. రాష్ట్రంలో పేరెన్నిక గన్న సిమెంట్ సంస్థలలో శ్రీ చక్ర సిమెంట్ ఒకటి. రెండు దశాబ్దాలకు పైగా తనదైన అనుభవ సారాన్ని, ప్రావీణ్యతను కలబోసి, నాణ్యమైన సిమెంట్ అందిస్తోంది. శ్రీ చక్ర సిమెంట్ 1985 సంవత్సరంలో శ్రీ పార్ధసారధి సిమెంట్ ఇండస్ట్రీస్ లిమిటెడ్ అనే పేరుతో మార్కెట్‌లో ప్రవేశించింది. తరువాత గోల్డ్ స్టార్ సిమెంట్‌గా పేరు మార్చుకొని ప్రస్తుతం శ్రీచక్ర సిమెంట్‌గా మార్కెట్‌లో స్థిరపడింది.

ఎన్నో కంపెనీలు, మరెన్నో పేర్లతో మార్కెట్‌ను ముంచెత్తినా ఆ పోటీని తట్టుకొని అంకిత భావంతో ఉన్నత ప్రమాణాలు కలిగిన సిమెంట్‌ని వినియోగదారులకు అందించటమే లక్ష్యంగా పెట్టుకొని తన దైన ముద్రను వేసింది. గుంటూరు జిల్లాలో పల్నాడుగా ప్రసిద్ధి గాంచిన కారంపూడి మండలంలో నరసింహపురి అనే గ్రామంలో శ్రీచక్ర ఫ్యాక్టరీ నిర్వహించబడుతుంది. అత్యంత ఆధునికమైన సాంకేతిక ప్రమాణాలు కలిగిన డ్రైప్రాసెస్ టెక్నాలజీని ఆధారంగా చేసుకొని సంస్థ ఉత్పత్తులను ప్రారంభించింది. నాణ్యమైన సున్నపు రాయి గనులు అతి దగ్గరలో వున్నందున సిమెంట్ ఉత్పత్తికి అవసరమైన ముడి పదార్థాల కొరత లేదు. రోటరీ కిల్న్, సస్పెన్షన్ ప్రిహీటర్,

(మిగతా 47లో)


శ్రీ చక్ర సిమెంట్ ఫ్యాక్టరీ

# పల్నాటి 'పోతన' సుబ్రహ్మణ్య కవి

(46వ పేజీ తరువాయి)

చీకటి పడగానే దుర్గి వేణుగోపాలుని సన్నిధికి చేరి స్మరించడం దినచర్యగా వుండేది. ప్రతి రోజు బాగా పొద్దు పోయాక దుర్గి చేరుకుంటున్న ఈ భక్తాగ్రేశ్వరుడు వేణుగోపాలస్వామితో సంభాషించేవాడని అందరూ విశ్వసిస్తుంటారు.

### బాసిల్లుతున్న సుబ్రహ్మణ్య కవి రచనలు

తను సృజించిన భక్తిసాహిత్యమంతటినీ దుర్గి వేణుగోపాల స్వామికే అంకితమిచ్చి భక్తపోతన, త్యాగరాజు, రామదాసు, అన్నమయ్యలాంటి వాగ్గేయకారుల సరసన చేరారు. ఆయనచే విరచితమైన వాటిలో శతకములు, మాలికలు, స్తోత్రములు, భక్తచరితములు, సీసార్ధములు, కంథార్ధములు, దరువులు, తద్యములు, కీర్తనలు, దండకములు, చూర్ణికలు, ద్విపదములు ఆణిముత్యాలై బాసిల్లుతున్నాయి.

### సుబ్రహ్మణ్య ప్రదర్శించిన అద్భుత మహిమలు

సుబ్రహ్మణ్య కవి ఆ రోజులలో ప్రదర్శించిన మహిమలు నేటికీ పల్నాడు ప్రాంతంలో ప్రజలు కథలు కథలుగా చెప్పుకుంటారు. ఒకరోజు దుర్గి వేణుగోపాలుని ఆలయం ఎదుట రెండు ఆబోతులు భీకర పోరాటం చేస్తూ ప్రజల్ని భయకంపితుల్ని చేస్తున్నాయి. ఈ సమయంలో ధర్మవరంలో వున్న సుబ్రహ్మణ్యం అక్కడ నుంచే ఈ దృశ్యాన్ని గాంచి 'తొలగిపోండి' అని గద్దించగా అప్పటిదాకా పోట్లాడుకుంటున్న ఆ ఆబోతులు రెండు తలవంచుకొని తమ దారిన వెళ్ళాయట.

మరోసారి తన పూజా మందిరంలో సుబ్రహ్మణ్యం ధ్యాన నిమగ్నంలో వుండగా గర్విష్టి అయిన చిన్నకోడలు ఆదెమ్మ దేవతార్చన పెట్టెను కాలితో తన్నుకుంటూ వెళ్ళింది. 'దేవతార్చన పెట్టెను తాకిన కాళ్ళు వుండునా' అని సుబ్రహ్మణ్యం నోటి నుంచి అసంకల్పితంగా వాక్కు వచ్చింది. అంతే.. తెల్లవారేసరికి ఆదెమ్మ రెండు కాళ్ళు నిద్ర మంచంలోనే ఊడిపోయి వున్నాయి. సుబ్రహ్మణ్యం దుర్గిలో ఓ వ్యాపారికి రుణగ్రస్తుడై వున్నాడు. ఇలా సుబ్రహ్మణ్య కవి లెక్కకు మించిన అద్భుత మహిమలెన్నింటినో ప్రదర్శించారట.

మధురభక్తితో దుర్గి వేణుని వశపరుచుకున్న సుబ్రహ్మణ్యం 1882లో స్వగ్రామమైన ధర్మవరంలో దైవసాయుజ్యం పొందారు. ప్రతి సంవత్సరం ఆయన సిద్ధిపొందిన బహుళ పుష్య అష్టమి (బుధవారం) రోజున ధర్మవరంలో ఆరాధనా మహోత్సవాలు జరగడం ఆనవాయితీగా వస్తుంది. వచ్చే జనవరిలో సుబ్రహ్మణ్య గురుస్వామి 125వ ఆరాధనోత్సవాలు వైభవంగా నిర్వహించటానికి ఇప్పటి నుండే సన్నాహాలు మొదలయ్యాయి. ఒక చేత్తో కలాన్ని, మరో చేత్తో హలాన్ని పట్టి కవన, వ్యవసాయ రంగాలను పునీతం చేసి పల్నాటి ప్రజలకు ఇలవేల్పుగా విరాజిల్లుతున్న సుబ్రహ్మణ్య కవిని ప్రజలు సుబ్బదాసు, అయ్యవారు, గురుస్వామి, తాతగారు లాంటి నామాలతో పిలుచుకొని భక్తిశ్రద్ధలతో ఆరాధిస్తుంటారు. సుబ్రహ్మణ్య కవి జీవిత చరిత్రను ప్రముఖ నవలా రచయిత్రి అడవి సూర్యకుమారి 'జ్ఞానాజ్ఞి' పేరిట నవలగా రచించి ఆవిష్కరించడం విశేషం.

– ఆన్‌లైన్, దుర్గి



మెగా స్పోర్ట్స్ హాస్టల్

# విద్యా పరిశోధనల్లో మేటి నాగార్జున వర్సిటీ

(45వ పేజీ తరువాయి)

దేశంలోనే మొదటిసారిగా లాప్‌టాప్‌లను కొనుక్కోవడానికి బ్యాంక్ ద్వారా రుణ సహాయం అందజేయనున్నారు. ప్రపంచీకరణ నేపథ్యంలో భారత ఆర్థిక రంగాన్ని పరిపుష్టంచేయడంలో సేవా రంగం పాత్ర గ్రహించి యూనివర్సిటీ కళాశాలలో టూరిజం అండ్ హాస్పిటాలిటీ మేనేజ్‌మెంట్, హ్యూమన్ రిసోర్స్ మేనేజ్‌మెంట్ వంటి కోర్సులను ఆరంభించింది.

### వర్సిటీకి ప్రత్యేకాకర్షణలు ఇవే

సుమారు రూ. 4.05 కోట్ల వ్యయంతో ఏ యూనివర్సిటీలో లేని విధంగా నిర్మించిన స్పోర్ట్స్ హాస్టల్ వర్సిటీకే ప్రత్యేక ఆకర్షణగా నిలుస్తోంది. డైక్‌మెన్ కాన్ఫరెన్స్ కమ్ సెమినార్ హాల్, పరీక్షాభవన్, పరిపాలనా భవన్, దూరవిద్య భవన్‌లు వర్సిటీకి నూతన అందాలను చేకూరుస్తున్నాయి.

### క్రీడలకుపెట్టింది పేరు

క్రీడలకు అవసరమైన మౌళిక సదుపాయాలపై దృష్టి సారించడంతో అనేక జాతీయ స్థాయి పోటీలకు వర్సిటీ ఆతిధ్యమిచ్చిది. అఖిల భారత అంతర విశ్వ విద్యాలయాల ఆర్చరీ (2005-06), అఖిల భారత అంతర విశ్వవిద్యాలయాల పురుషుల బాల్ బ్యాడ్మింటన్ (2006-07), దక్షిణ భారత అంతర మండలుల అంతర విశ్వవిద్యాలయాల మహిళల కబడ్డీ (2006-07), జాతీయ అంతర జోనల్ జూనియర్ అథ్లెటిక్ పోటీలను ఇదే నెలలో గుంటూరు అథ్లెటిక్ అసోషియేషన్‌తో కలసి వర్సిటీలో ఎంతో ప్రతిష్టాత్మకంగా నిర్వహించి పలువురి ప్రశంసలను అందుకుంది.

### బహుళ కోర్సులు

ఎప్పటికప్పుడు విద్యా వ్యాప్తిలో తనదైన ముద్ర వేస్తూ కోస్తా ప్రాంత వసులకు విద్యా సేవలను అందజేస్తున్న నాగార్జున యూనివర్సిటీలో డిగ్రీ, పిజి కళాశాలలో మొత్తం లక్షా 30 వేల మంది విద్యార్థులు విద్యను అభ్యసిస్తున్నారు. సామాన్యుడు పరిశోధనకు చేయూత నివ్వడానికి వర్సిటీలో టెక్నో ఎంట్రో ప్రెన్యూవర్ ప్రోగ్రాం (టెప్)ను, విద్యార్థుల పరిశోధనకు సలహాలు ఇవ్వడానికి ప్రత్యేక కేంద్రాలను ఏర్పాటు చేశారు. 1994లో యంహెచ్ ఆర్‌యం, 2001లో ఫుడ్ అండ్ న్యూట్రిషనల్ సైన్సెస్, 2003లో యంఎ జర్నలిజం అండ్ మాస్ కమ్యూనికేషన్, 2007లో హిందీ, యంపియాడ్ వంటి వినూత్న కోర్సులను ప్రవేశపెట్టిన ఘనత యూనివర్సిటీదే. మరింత నాణ్యమైన విద్యను అందించేందుకు అమెరికాలోని సెంట్రల్ మిచ్చిగాన్ యూనివర్సిటీలో అవగాహన ఒప్పందాన్ని కుదుర్చుకొంది.

# నిర్మాణాల రాజు 'శ్రీచక్ర' సిమెంట్

(46వ పేజీ తరువాయి)

ప్రీకాల్సినర్ యంత్రాల సాయంతో సాలుకి ఐదు లక్షల వరకూ సిమెంట్‌ను ఉత్పత్తి చేస్తున్నది. రానున్న కాలంలో 13 లక్షల టన్నుల ఉత్పత్తిని సాధించే దిశగా శ్రీ చక్ర సిమెంట్ అభివృద్ధి పథంలో పయనిస్తున్నది. చైర్మన్ ఎన్.కృష్ణమోహన్, మేనేజింగ్ డైరెక్టర్ ఇవిఎస్ఆర్. ఆంజనేయులుల సారధ్యంలో శ్రీచక్ర సిమెంట్ ముందుకు సాగుతుంది. శ్రీచక్ర 53 గ్రేడ్, 43 గ్రేడ్ సిమెంట్‌లను ఉత్పత్తి చేస్తుంది.

# బహు భేషైన సర్కారు బ(గు)డి

★ కార్పొరేట్‌కు ధీటుగా విద్యాబోధన ★ గురుబ్రహ్మల చొరవే కీలకం

★ విద్యార్థుల సంఖ్యలో దక్షిణ భారతదేశంలోనే రికార్డు

(ఆన్‌లైన్, పిడుగురాళ్ల)

'రూపాయి తీసుకోరు. పొద్దునా సాయంత్రం ప్రైవేటు చెబుతారు. చదువుకూడా బాగుంటుంది. అట్లాంటప్పుడు వేలకువేలు తగలేసి ప్రైవేటు పాఠశాలకెందుకని మాపిల్లల్ని ఇక్కడే చేర్పించా'.

**– బైరపోగు సమాధానం విద్యార్థిని తల్లి**

'నాకు ఒకప్పుడు ఊళ్లో పాఠశాలుండేది. 500 మంది విద్యార్థులుండేవాళ్లు. ఎప్పుడైతే గవర్నమెంటు బడిలో చదువు బాగా చెబుతున్నారో అప్పుడే పిల్లల్ని అక్కడ చేర్పించాలని తల్లి దండ్రులు నిశ్చయించుకున్నారు. నాదగ్గరున్న 500 మంది ఇదే స్కూల్లో చేరారు. పిల్లలు పోయిన తర్వాత నేను మాత్రం ఏంచేసేది?. బడిమూసేసి ప్రభుత్వ పాఠశాలలోనే విద్యా వాలంటీరుగా పనిచేస్తున్నా'.

**– రామిశెట్టి కోటేశ్వరరావు, ప్రైవేటు పాఠశాల పాత యజమాని**



పెదగార్లపాడు వ్యూ

ప్రతిరోజూ ఠంచనుగా తెల్లవారుజామున 4 గంటలకే బడిబెల్లు మోగుతుంది. అంటే పిల్లలకు ప్రైవేటు సమయం అయ్యిందన్న మాట. ఈ హడావిడి రాత్రి 8 గంటల వరకు కొనసాగుతూనే ఉంటుంది. అంతా విద్యార్థుల ఇష్టం. చెప్పేదాన్ని విద్యార్థి కష్టం లేకుండా అర్థం చేసుకునేలా చూడటం అక్కడి ఉపాధ్యాయుల ప్రత్యేకత. అందరూ ఇష్టపడుతున్నారని, అట్లా ఐతేనే బడికొస్తామని అంటున్నారని ఈమధ్యకాలంలో అక్కడ ఆంగ్ల విద్యాబోధన జరుగుతుంది. ఇంతకీ ఇదంతా ఏకార్పొరేట్ పాఠశాలలోనో జరుగుతుందనుకుంటే భ్రమపడినట్లే. ఇంత జరుగుతుందికూడా మన సర్కారు బడిలోనే. ప్రభుత్వ పాఠశాలలో విద్యార్థుల సంఖ్యను పెంచేందుకు అక్కడి ఉపాధ్యాయులు అంతశ్రమపడుతున్నారు. సుమారు 11 సంవత్సరాలకు వారిశ్రమ ఫలించింది. ఇప్పుడా మండల పరిషత్ ప్రాథమిక పాఠశాలలో మొత్తం 1080 మంది విద్యార్థులు ప్రభుత్వ పాఠాలు వల్లెవేస్తున్నారు. గుంటూరు జిల్లా దాచేపల్లి మండలం పెదగార్లపాడు గ్రామంలో అంతమంది విద్యార్థులున్న ఈ ఆదర్శ పాఠశాల దక్షిణ భారతదేశంలోనే పెద్దదని విద్యాశాఖ చెబుతుంది.

**అతడు... ఆమె... ఆపాఠశాల !**

పెదగార్లపాడులోని ప్రభుత్వ ప్రాథమిక పాఠశాలలో మొదట్లో విద్యార్థుల సంఖ్య నామమాత్రంగానే ఉండేది. 1995లో అసలు విద్యార్థులే లేని ఆపాఠశాలలో సర్పంచ్ పురంశెట్టి అంకులు చొరవతో ఒక విద్యావాలంటీరును ఏర్పాటు చేయటం జరిగింది.

(మిగతా 49వ పేజీలో)

# బహు భేషైన సర్కారు బ(గు)డి


విద్యార్థులతో కిక్కిరిసిన తరగతి గది

(48వ పేజీ తరువాయి)

1996కు ఉపాధ్యాయుడ్ని ప్రభుత్వం నియమించటంతో విద్యార్థులసంఖ్య 45కు చేరింది. నియమించబడిన ప్రభుత్వ ఉపాధ్యాయుడు లింగిరెడ్డి వెంకట్రామిరెడ్డికి ఆవూరు సొంతూరు కావటంతో పాఠశాలను ఒక కొలిక్కి తెచ్చేందుకు నడుంకట్టారు. హిందీ పండిట్‌గా ట్రైనింగ్‌చేసి ఉద్యోగం రాక ఖాళీగా ఉన్న ఆయన భార్య అనితతో కలసి పాఠశాలలో ఉచితంగా ప్రైవేటుచెప్పటం ప్రారంభించారు.

దాంతో గ్రామస్తుల కన్ను ప్రభుత్వ పాఠశాలపై పడింది. విద్యార్థుల సంఖ్య 1997కు గణనీయంగా పెరిగి 185కు చేరింది. మరికొంతమంది ఉపాధ్యాయులను ప్రభుత్వం నియమించటం, వచ్చినవారు వెంకట్రామిరెడ్డి దంపతులతోపాటు ఎక్కువ సమయాన్ని విద్యార్థులకోసం కేటాయించటంతో సంఖ్య భారీగా పెరిగేందుకు దోహదపడింది.

దీంతో అప్పటివరకు ఆగ్రామంలో ఉన్న 5 ప్రైవేటు పాఠశాలలు క్రమక్రమంగా మూతపడటం ప్రారంభించాయి. 1999లో మండలపరిషత్ ప్రాథమికోన్నత పాఠశాలగా అప్‌గ్రేడ్ చేయించటంలోనూ, 2001లో జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలగా అప్‌గ్రేడ్ చేయించటంలోనూ ఉపాధ్యాయుల చొరవ కీలకమైంది. ఈ ఏడాది ఒకే పాఠశాలలో నడపబడుతున్న ప్రాథమిక, ఉన్నత తరగతుల్లో మొత్తం 1080 మంది విద్యార్థులు విద్యనభ్యశిస్తున్నారు.

## ఊరివారి సహకారం !

ప్రభుత్వ పాఠశాలలో విద్యార్థుల సంఖ్యను పెంచేందుకు అత్యాధునిక బోధనా పద్ధతులను అవలంబించి గ్రామంలో విద్యాభివృద్ధికోసం పాటుపడుతున్న ఉపాధ్యాయులకు ఊరివాళ్ల నుంచి అదేరకమైన స్పందన లభించింది.

వందలాదిమంది విద్యార్థులు ఉన్నప్పటికీ కేవలం 3 గదులు మాత్రమే ఉండటంతో అదనపు తరగతిగదులు నిర్మించేందుకు, తరగతి గదుల్లో విద్యుత్, ఫ్యాన్లు ఏర్పాటు చేసేందుకు, పాఠశాల ఇతర మౌలిక సదుపాయాల కల్పనకు గ్రామస్తులు ఇతోధికంగా సహకరించటం జరిగింది. ఈమధ్యకాలంలోనూ జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల నిర్మాణానికి అవసరమైన మూడెకరాల స్థలం కొనుగోలుకు గ్రామానికి చెందినవారే సహకరించారు. దీనికితోడు గ్రామ మాజీ సర్పంచ్ పురంశెట్టి అంకులు కూడా నడుంకట్టి అదనపు తరగతిగదుల నిర్మాణంలో తగిన చొరవ చూపించటం గమనించదగిన విషయం.


గ్రామస్తుల సహకారంతో నిర్మించబడుతున్న హైస్కూలు

## ఉత్తమ ఫలితాలు !

పెదగార్లపాడు పాఠశాలలోని ఉపాధ్యాయుల చొరవ కేవలం విద్యార్థులను ఆకర్షించేందుకు పరిమితం కాలేదు. పాఠశాలకు వచ్చిన విద్యార్థులకు అర్థమయ్యే రీతిలో ప్రయోగాత్మకంగా పాఠాలను చెప్పి ఉత్తమ ఫలితాలను సాధించేందుకు ఎంతో కృషి చేశారు. పాఠశాల ప్రాథమికోన్నత పాఠశాలగా అప్‌గ్రేడ్ చేయబడిన తరువాత 2000 సంవత్సరంలో 64మంది 7వ తరగతి పరీక్షలకు హాజరుకాగా, అందరూ పాసైయ్యారు. 2001, 2002, 2003 సంవత్సరాల్లోనూ ఇదేరకంగా నూటికి నూరుశాతం ఉత్తీర్ణతను సాధించారు.

2004లో 68మంది హాజరుకాగా, 65మంది విద్యార్థులు, 2005లో 72మంది హాజరుకాగా, 70మంది విద్యార్థులు, 2006లో 68మంది హాజరుకాగా, 65మంది విద్యార్థులు, 2007లో 84మంది హాజరుకాగా 81మంది విద్యార్థులు ఉత్తీర్ణతను సాధించారు. 10వ తరగతిలోనూ 90 శాతం ఉత్తీర్ణత సాధించటం గమనించదగ్గ విషయం. ఈ పాఠశాల ఇంకా అభివృద్ధి చేందాలని మనస్ఫూర్తిగా కోరుకుందాం.


పెదగార్లపాడు ప్రాథమిక పాఠశాల


ప్రధానోపాధ్యాయుడు
లింగిరెడ్డి వెంకట్రామిరెడ్డి


UPL
ఫంజిలైజర్ ప్రభావం
సాఫ్ + యూరియా
కలిపి వాడండి
SAAF
UREA 46%N
ఆరోగ్యవంతమైన పంటతో అధిక దిగుబడులు- అధిక లాభాలు పొందండి
సాఫ్ + యూరియా కలిపి వాడండి
ఫంజిలైజర్ ప్రభావం యొక్క
ద్వివిధ లాభాలు పొందండి
ఫంజిలైజర్ అంటే ఎరువుతోపాటు తెగుళ్ళ మందుల ప్రభావం కూడా పొందడం
మోతాదు
సాఫ్ 500 గ్రాములను 20-25 కిలోల యూరియాతో కలిపి వాడండి.
వాడవలసిన సమయం
• నాట్లు వేసిన తరువాత మొదటికోటా యూరియాతో కలిపి వాడండి.
• వరి నారుమళ్ళలో కూడా వేసే ఎరువులతో పాటు కలిపి వాడుకోవచ్చని సిఫారసు చేయడమైనది.
సాఫ్‌ను డి.ఎ.పి వంటి కాంప్లెక్స్ ఎరువులతో పాటు కలిపి వాడుకోవచ్చును.
సాఫ్‌ను ఫంజిలైజర్‌గా ఉపయోగించుటవలన ప్రయోజనాలు
• ఆరోగ్యవంతమైన మరియు బలమైన వేరువ్యవస్థ - దీనిమూలంగా పోషకాలను గ్రహించడం పెరుగుపడుతుంది.
• పంట బాగా దుబ్బుచేస్తుంది.
• వేరువ్యవస్థబాగా విస్తరిస్తరించటం వలన నీటి ఎద్దడిని తట్టుకొనే శక్తి పెరుగుతుంది.
• హెల్మింథోస్పోరియం అకుమచ్చ తెగులు బారినుండి రక్షణ కల్పిస్తుంది.
• తొలిదశలలోని పొడ తెగులు మరియు అగ్గి తెగులు బారినుండి రక్షణ కల్పిస్తుంది. పంటకు తొలిదశలలో టీకాలాగా పనిచేస్తుంది.
• యూరియా నిదానంగా కరిగేలా చేయడం ద్వారా మొక్క బాగా సంగ్రహించేలా తోడ్పడుతుంది.
• జింకువంటి సూక్ష్మ పోషకాలను అందిస్తుంది.
• పంట దిగుబడులను, గింజ మిల్లింగ్ నాణ్యతను పెంచుతుంది.
• ఎరువులను చల్లడం, తెగుళ్ళ మందులను వాడటం అనే రెండు పనులు ఒకేసారి జరగడం వలన కూలీ ఖర్చులు తగ్గుతాయి.
వేలాదిమంది అభ్యుదయ రైతులచే వాడబడినది
నాణ్యమైన అధిక సంతృప్తికరఫలితాలు సాధించారు.
యునైటెడ్ ఫాస్ఫరస్ లిమిటెడ్
యునైటెడ్ ఫాస్ఫరస్ లిమిటెడ్, యునిఫాస్ హౌస్, మధుపార్క్, 11వ రోడ్, ఖర్ (వెస్ట్), ముంబయి - 400 052


UPL
Agriculture is our culture
కాంకర్
+
సాఫ్
CONQUER
HEXACONAZOLE 5% E.C.
SAAF
United Phosphorus Limited
ఎకరానికి 400 మి.లీ.
ఎకరానికి 350 గ్రా.
వరిపైరులో సమగ్ర తెగుళ్ళ నివారణకు కాంకర్ మరియు సాఫ్ వాడండి.
మాగుడు తెగులు / పాముపొడ ఎండాకు తెగులు / సుతలు ఎండుట
దుబ్బుకుళ్ళు మరియు జింక్, మాంగనీస్ లోప నివారణకు
యునైటెడ్ ఫాస్ఫరస్ లిమిటెడ్, ముంబయి
(25 దేశాలలో ఆఫీసులు కలిగి, 110 దేశాలకు పురుగు మందులను ఎగుమతి చేస్తున్న ఏకైక భారతీయ బహుళజాతి సంస్థ)

## తేనెలూరే

# పాల సపోటాలకు ప్రసిద్ధి చిలువూరు

(ఆన్‌లైన్ - దుగ్గిరాల)

చిన్నారుల నుండి వృద్ధుల వరకు నోరూరించే పాల సపోటాలకు గుంటూరు జిల్లా చిలువూరు గ్రామం రాష్ట్రంలోనే ప్రసిద్ధిగాంచింది. చిలువూరు పరిసర గ్రామాలలో సుమారు మూడు వేల ఎకరాల సపోటా తోటలు సాగు చేస్తున్నారు. మెట్ట పంట అయిన సపోటా సాగు లాభసాటిగా ఉండటంతో ఇటీవల కాలంలో నీరు సక్రమంగా అందే మాగాళ్లలో కూడా సాగు చేస్తున్నారు. మొక్క దశ నుండి ఎనిమిదేళ్ల కాలంలో సపోటాలు కోతకు వస్తాయి. చిలువూరు, కొండూరు, మంచికలపూడి, పెనుమూలి, తుమ్మపూడి గ్రామాలతో పాటు శేకూరు, వల్లభాపురం, మున్నంగి, చినవడ్లపూడి, పెదవడ్లపూడి, రేవేంద్రపాడు పరిసర ప్రాంతాలలో కూడా సపోటా సాగు చేస్తున్నారు.

ఎకరానికి మూడు వేల రూపాయలు ఎరువులకు ఖర్చవుతుండగా, 15 నుంచి 20 వేల రూపాయల వరకు సపోటా తోటలు కౌలు ధర పలుకుతోంది. రాష్ట్రంలోని సూర్యాపేట, హైదరాబాద్, వరంగల్, విజయవాడ తదితర పట్టణాలతో పాటు రాష్ట్రంలోని గోదావరి, కనగాలకు చిలువూరు పాల సపోటాలు ఎగుమతి అవుతున్నాయి.

ఒక్క చిలువూరు గ్రామంలోనే 1500 మందికిపైగా రైతు కూలీలు సపోటా తోటలపై ఆధారపడి జీవిస్తున్నారు. సుమారు 600 మంది ప్రతి రోజూ పరిసరాలలోని పట్టణాలు, గ్రామాలలో రిటైల్‌గా అమ్మకాలు జరిపేందుకు వెళ్తుంటారు. రెండు విడతలుగా సపోటాలను కోత కోస్తుంటారు. మొదటి విడత ఫిబ్రవరి నెలాఖరు నుంచి జూన్ నెల వరకు, రెండో విడత డిసెంబర్ నుంచి జనవరి నెలాఖరు వరకు కోత కోస్తారు. 20 రోజుల వ్యవధిలో ఐదు నుంచి ఆరు పర్యాయాలు ఈ విధంగా సపోటాలను కోసి ఎగుమతి చేస్తారు. ప్రతి రోజూ సీజన్‌ను బట్టి 50 నుంచి 150 బస్తాల వరకు ఎకరానికి కోత కోస్తుంటారు. మహిళలు కూడా రోజు కూలీ సపోటాల కోతకు 90 రూపాయల వరకు ఆర్జిస్తున్నారు.

దశాబ్దాల నుండి సపోటాలపైనే వేలాది కుటుంబాలు ఆధారపడి జీవిస్తున్నారు. చెన్నయ్ - విజయవాడ ప్రధాన రైలు మార్గంలో ఉన్న చిలువూరు గ్రామంలో సపోటాల ఎగుమతికి సరైన సదుపాయాలు లేకపోవడంతో దళారులపైనే రైతులు ఆధారపడాల్సి వస్తోంది. బహిరంగ వేలం, మార్కెట్ సదుపాయం లేక దళారులదే పై చేయిగా ఉండటంతో పట్టణాల్లో భారీగా ధర పలికే సపోటాలను అతి తక్కువ ధరకు రైతు అమ్ముకోవాల్సి వస్తోంది. ఇంత పెద్ద ఎత్తున సపోటా విస్తీర్ణం ఉన్నప్పటికీ రైతులకు గిట్టుబాటు ధర పొందేందుకు మార్కెట్ ఏర్పాటు చేయకపోవడం పెద్ద లోటుగా కనిపిస్తుంది. ఏడాది పొడవునా కష్టపడినా పది వేల రూపాయలకు మించి రైతులకు లాభాలు లభించడం లేదంటే అతిశయోక్తిగా అనిపించక మానదు.

# అరటికి పెట్టింది పేరు కొల్లిపర



కళకళలాడుతున్న అరటి తోట

(ఆన్‌లైన్ - కొల్లిపర)

కృష్ణా పశ్చిమ డెల్టాలో అరటి సాగుకు కొల్లిపర మండలం పెట్టింది పేరుగా ఉంది. ఈ ప్రాంతంలో సుమారుగా 2500 హెక్టార్లు మెట్ట భూముల్లో అరటి సేద్యం జరుగుతుండగా, సమీపంలోని కృష్ణా నది లంక భూముల్లో వెయ్యి ఎకరాలకు పైగా రైతులు అరటి సాగు చేపడుతున్నారు. ఈ ప్రాంత రైతులు ఎక్కువగా కర్పూర, చెక్కరకేళి, అమృతపాని రకాలను సాగు చేస్తారు. అరటి పంట విస్తారంగా ఉండటంతో దళారీలతో పని లేకుండా రైతులు తమకు అందుబాటులో రైతు అరటి మార్కెట్‌ను ఏర్పాటు చేసుకోవడం ఈ ప్రాంత రైతుల చైతన్యానికి నిదర్శనం. మొట్టమొదట ఒక్క మార్కెట్‌తో ప్రారంభమై దినదినాభివృద్ధి చెంది నేడు 12 మార్కెట్లకు చేరుకోవడం విశేషం. రైతులు, రైతు కూలీలు, మార్కెట్ కూలీలు, సన్న, చిన్నకారు వ్యాపారస్తులకు అరటి పంట జీవనాధారంగా మారింది. ఈ ప్రాంతం నుంచి ఇతర రాష్ట్రాలకు కూడా అరటి గెలలు ఎగుమతి అవుతాయి. అరటి చెట్ల నుంచి గజ్జను తీసి కొంతమంది జీవనాధారం పొందుతున్నారు. అరటి ఆకులను కోసి హోటళ్లకు విక్రయిస్తూ ఆదాయాన్ని పొందుతున్నారు. అయినా రైతులు అరటికి పెట్టుబడులు అధిక మోతాదులో పెట్టవలసి ఉంది. దీనికి తోడు అతివృష్టి, అధిక ఉష్ణోగ్రత, విద్యుత్ కోత, సీజన్‌లో వచ్చే తుపానులు, వీటన్నింటికి ధరలు నిలకడగా లేకపోవడం అరటి రైతులను దెబ్బతీస్తున్నాయి.

ప్రకృతి అనుకూలంగా ఉండి రైతుకు ఆశించిన దిగుబడులు వస్తే దానికి తోడు గిట్టుబాటు ధర కూడా లభిస్తే అరటి రైతు లాభాలను కళ్ల చూడవచ్చు. జిల్లాలోని నలుమూలల నుండి కొల్లిపర మార్కెట్‌కు వ్యాపారస్తులు వచ్చి అరటి గెలలను కొనుగోలు చేస్తారు. సీజన్‌లో రోజుకు సుమారు 20 లారీల వరకు అరటి గెలలను ఎగుమతి చేస్తారు.

ఎకరం పొలంలో వెయ్యి అరటి మొక్కలు నాటిల్సి ఉంది. మొక్కలు, ఎరువులు, నీరు, దుక్కులు, కౌలుకు 50 వేల రూపాయల వరకు ఖర్చువుతున్నట్లు రైతులు తెలుపుతున్నారు. గెలకు సుమారు 80 రూపాయల చొప్పున ధర పలికితే, ఖర్చులు పోను 40 వేల రూపాయల వరకు ఆదాయం లభిస్తుంది. గతంలో అరటి చెట్లకు బీమా సౌకర్యం ఉందని, దీనిని మరలా ప్రభుత్వం పునరుద్ధరించితే రైతులు ప్రకృతి విపత్తుల నుండి కొంత మేర నష్టాన్ని పూడ్చుకోగలుగుతారు.

# రైతు సేవలో గుంటూరు మార్కెట్ యార్డు


డా॥ వై.యస్.రాజశేఖరరెడ్డి
ముఖ్యమంత్రివర్యులు


శ్రీ కన్నా లక్ష్మీనారాయణ
రాష్ట్ర సహకార, రవాణా శాఖామాత్యులు


శ్రీ మురుగుడు హనుమంతరావు
రాష్ట్ర సర్వశిక్షా అభియాన్ శాఖామాత్యులు


శ్రీ మోపిదేవి వెంకటరమణ
రాష్ట్ర ఓడలు, విమానయాన, చౌమురు పెట్టుబడుల శాఖామాత్యులు


శ్రీ కాసు వెంకట కృష్ణారెడ్డి
రాష్ట్ర పౌర సరఫరాలు, మరియు తూనికల శాఖామాత్యులు


శ్రీ మారెప్ప గారు
మార్కెటింగ్ శాఖామాత్యులు


శ్రీమతి నేదురుమల్లి రాజ్యలక్ష్మీ
జిల్లా ఇన్‌చార్జ్ మంత్రి


శ్రీమతి కూచిపూడి విజయమ్మ
జిల్లాపరిషత్ ఛైర్‌పర్సన్


శ్రీ మహమ్మద్ అలీ రఫత్
కలెక్టర్, గుంటూరుజిల్లా

INDIRAMMA
ఇందిరమ్మ


బాధ్యతలు స్వీకరిస్తున్న ఛైర్మన్ అప్పిరెడ్డి




యార్డులో మిర్చి నాణ్యతను పరిశీలిస్తున్న ఛైర్మన్ అప్పిరెడ్డి, కార్యదర్శి శివరామయ్య తదితరులు


గొర్రెలమండిని పరిశీలిస్తున్న ఛైర్మన్ అప్పిరెడ్డి


విశ్రాంతి భవనంలో రైతులతో చర్చిస్తున్న ఛైర్మన్ అప్పిరెడ్డి

- ✶ ఆసియా ఖండములోనే పేరెన్నికగన్న గుంటూరు మార్కెట్ యార్డ్ రైతుల సంక్షేమానికి పెద్దపీట వేస్తుంది.
- ✶ రైతుబంధు పథకం అమలు చేస్తున్నాము.
- ✶ రైతులకు 5 నుంచి 10 శాతానికి తమ సరుకుకు రుణాలు ఇస్తున్నాము.
- ✶ ఒక్కొక్క రైతుకు కనీసం రూ.75000లోపు ఋణాలు అందచేస్తాము.
- ✶ ఆధునిక వ్యవసాయ పద్ధతులు తెలియజేయడం కోసం వ్యవసాయ శాస్త్రవేత్తల ద్వారా రైతులకు శిక్షణా తరగతులు నిర్వహిస్తున్నాము.
- ✶ కోఆర్డినేటర్ ద్వారా వ్యవసాయ రంగంలో రైతులకు మెళకువలు తెలియజేయుచున్నాము.
- ✶ తరువాత దశలలో ఈ కార్యక్రమాలు అన్ని గ్రామాలకు విస్తరిస్తాతయి.
- ✶ ప్రత్తిపాడు, వట్టిచెరుకూరు, గుంటూరు రూరల్, పెదకాకాని మండలాల రైతులకు కావలసిన ఎరువులు, పురుగు మందులను సరఫరా చేస్తాము.
- ✶ రైతులు, రైతుబంధు పథకాన్ని ఉపయోగించుకోవడం కోసం అవగాహన కార్యక్రమాన్ని ఏర్పాటు చేస్తున్నాము.
- ✶ రైతుల వద్ద వసూలు చేసే మార్కెట్ ఛార్జీలను నియంత్రించాము.
- ✶ గతంలో టిక్కీకి రూ.15 నుండి రూ.17 వరకు ఉన్న ఛార్జీలను రూ. 7.50 లకు తగ్గించాము.
- ✶ దీనిని నియంత్రించడానికి 24 గంటలు నిఘాను ఏర్పాటు చేశాము.
- ✶ దీని కోసం ఫిర్యాదు విభాగాన్ని కూడా ఏర్పాటు చేశాము.
- ✶ స్పైసెస్ బోర్డు ద్వారా సబ్సిడీపైన రైతులకు టార్పాలిన్ పట్టాలను సరఫరా చేస్తున్నాము.
- ✶ రైతుల సంక్షేమం కోసం వైద్య, ఆరోగ్య శిబిరాలను ఏర్పాటు చేస్తున్నాము.
- ✶ పశువుల వైద్య శిబిరాలను నిర్వహించి పాడి పరిశ్రమను పెంపొందించడానికి రైతులకు కావలసిన సహాయ సహకారాలను అందచేస్తున్నాము.
- ✶ కాటాలలో జరిగే మోసాలను నివారించడం కోసం ఈ సంవత్సరం యార్డు మొత్తంలో ఎలక్ట్రానిక్ కాటాలను ఏర్పాటు చేశాము.
- ✶ యార్డ్‌కు తెచ్చిన సరుకునకు ఉద్యోగులు, వ్యాపారుల సమక్షంలోనే రైతుల అంగీకారంతో ధరను నిర్ణయిస్తున్నాము.
- ✶ దిగుమతులు, ఎగుమతుల వివరాలను రైతులు తెలుసుకోవడం కోసం యార్డును కంప్యూటరైజేషన్ చేయబోవుచున్నాము.
- ✶ రైతుల సమక్షంలోనే కాటాలు వేస్తున్నాము.
- ✶ రైతు బంధు పథకాన్ని అమలు చేయడానికి నిధుల కొరత లేదు. రాబోయే సీజన్‌లో ఎక్కువ కోల్డ్ స్టోరేజీలు అద్దెకు తీసుకుని రైతుల సరుకులు నిల్వచేసుకొనే అవకాశాన్ని కల్పిస్తున్నాము.
- ✶ ఉద్యానవన శాఖ ద్వారా చిల్లీ డ్రైయర్స్‌ను అందిస్తున్నాము.
- ✶ రైతులు మిర్చిని ఆరబెట్టుకోవటం కోసం ప్లాట్‌ఫారాలు నిర్మించుకోవడానికి సబ్సిడీలు అందచేస్తున్నాము.
- ✶ రైతులు పండించే మిర్చి ఎగుమతులకు తగిన విధంగా వుండటానికి సెమినార్లు నిర్వహిస్తున్నాము.
- ✶ మిర్చి అమ్మకాలలో ఏదైనా ఇబ్బందులు వస్తే 24 గంటలలో సమస్యను పరిష్కరిస్తున్నాము.
- ✶ యార్డ్ ఆవరణలో సిబ్బంది ఎవరైనా అవకతవకలకు పాల్పడినా, రైతులకు ఏ సమస్యలు వచ్చినా అధికారుల దృష్టికి తెస్తే వెంటనే పరిష్కరిస్తాము.
- ✶ గుంటూరు మార్కెట్ యార్డ్‌లో మీకు ఏ సమాచారం కావాలన్నా 0863-2233699, 2232847 అనే ఫోన్ నంబర్లకు ఫోన్ చేసి సలహాలను పొందవచ్చును.
- ✶ రైతులకు ఈ సంవత్సరం తక్కువ రేటులో యార్డు ద్వారా యూరియా అందజేశాం.
- ✶ ఈ సంవత్సరం ఫిబ్రవరి నుండి యార్డులో 20 లక్షల టిక్కీలు అమ్మకం చేశాం.


యం.శివరామయ్య
సెక్రటరీ
గుంటూరు మార్కెట్ యార్డు

## పాలకవర్గ సభ్యులు

శ్రీ లేళ్ళ అప్పిరెడ్డి, ఛైర్మన్, శ్రీ పొడుచూరి వెంకటేశ్వర్లు, వైస్ ఛైర్మన్
శ్రీ దేవరశెట్టి సత్యనారాయణ, శ్రీ కుర్ర పాములు, శ్రీ నూకవరపు హరికృష్ణ,
శ్రీ రాజపుత్ర సత్యసింగ్, శ్రీ షేక్ రెహమాన్ షరీఫ్, శ్రీ దాసరి జాన్ బాబు,
శ్రీ మన్‌దాడి సుబ్బారావు, శ్రీమాకిరెడ్డి శ్రీనివాసరెడ్డి, శ్రీ బొట్టిశెట్టి వెంకట్రావు,
శ్రీ సిరసాని శ్రీనివాసరావు, శ్రీమతి కాకుమాను పద్మావతి, శ్రీమేదా లక్ష్మయ్య,
శ్రీ మర్రివెంకటశివయ్య


శ్రీ లేళ్ళ అప్పిరెడ్డి గారు
గుంటూరు మార్కెట్ యార్డ్ చైర్మన్



వ్యవసాయ ఇంజనీరింగ్ కళాశాల

# రజతోత్సవాలకు సిద్ధమవుతున్న వ్యవసాయ ఇంజనీరింగ్ కళాశాల

(ఆన్‌లైన్-బాపట్ల)

భారతదేశంలోనే ప్రధాన వృత్తి అయిన వ్యవసాయ రంగాన్ని ఆధునీకరించి తద్వారా రైతులకు ఆధునీక పరిజ్ఞానంపై అవగాహన కల్పించడంతో పాటు సాంకేతిక పరిజ్ఞానాన్ని వినియోగించి సులువైన పద్ధతుల ద్వారా వ్యవసాయం చేయడానికి నిరంతరం కృషి చేస్తున్న వ్యవసాయ ఇంజనీరింగ్ కళాశాల. గుంటూరు జిల్లా బాపట్ల పట్టణంలో ఆచార్య ఎన్‌జి రంగా వ్యవసాయ విశ్వవిద్యాలయం పరిధిలో రాష్ట్రంలో మొట్ట మొదటిసారిగా 1983లో వ్యవసాయ ఇంజనీరింగ్ కళాశాలను ప్రారంభించారు. సువిశాలమైన స్థలంలో కోట్లాది రూపాయల నిధులను వెచ్చించి ఆధునిక పరిశోధన స్థానాలను ఏర్పాటు చేసి పరిశోధన దిశగా విశ్వవిద్యాలయాన్ని తలపించేలా కళాశాలను ఏర్పాటు చేశారు. రాష్ట్రంలో ఒకే కళాశాల కావడం సీట్ల సంఖ్య తక్కువగా ఉండటంతో దేశవ్యాప్తంగా వ్యవసాయ ఇంజనీర్ల కొరతను తీర్చలేకపోతున్నారు. గత నాలుగు సంవత్సరాలుగా వ్యవసాయ ఇంజనీరింగ్ కోర్సు పట్ల విద్యార్థుల్లోను, తల్లిదండ్రుల్లోను అవగాహన కలగడం వలన ఈ కోర్సుకు ప్రస్తుతం డిమాండు ఎక్కువగా వుంది. ప్రస్తుతం కోర్సు పూర్తి చేసిన విద్యార్థులనే కాక కోర్సులో నూతనంగా చేరుతున్న విద్యార్థుల్ని సైతం కొన్ని కంపెనీలు ముందుగానే ఉపాధి కల్పిస్తామంటూ అగ్రిమెంట్‌లు చేసుకోవడం విశేషం.

## ఎంపిక విధానం

రాష్ట్ర ప్రభుత్వం నిర్వహిస్తున్న ఎంసెట్ పరీక్ష ద్వారా ఎంపిక చేస్తారు. కేవలం ఇంటర్మీడియట్‌లో ఎంపిసి విద్యార్థులు మాత్రమే అర్హులు. ప్రారంభంలో 20 సీట్లలో ప్రారంభమైన కళాశాల ప్రస్తుతం 30 సీట్లతో నడుపుతున్నారు. ఇవి కాక జాతీయ స్థాయిలోని ఐసిఎఆర్ ద్వారా మరో అయిదు సీట్లు అదనంగా భర్తీ చేస్తారు. అయితే ఐసిఎఆర్ ద్వారా భర్తీ అయ్యే సీట్లలో ఇతర రాష్ట్రాలకు చెందిన విద్యార్థులు మాత్రమే ఉంటారు.

## కోర్సుల వివరాలు

నాలుగు సంవత్సరాల బిటెక్ ఎజి (30+5సీట్లు), సంవత్సరానికి అయిదువేల రూపాయల ఫీజులు చెల్లించ వలసి ఉంటుంది.



అసోసియేట్ డీన్ డాక్టర్ టివి సత్యనారాయణ

రెండు సంవత్సరాల ఎంటెక్ ఎజి - మూడు విభాగాలు, సంవత్సరానికి అయిదు వేల రూపాయలు ఫీజులు చెల్లించ వలసి ఉంటుంది.

సాయిల్ అండ్ వాటర్ ఇంజనీరింగ్ (మూడుసీట్లు)

ఫామ్ మిషనరీ అండ్ పవర్ (మూడుసీట్లు)

అగ్రికల్చరల్ ప్రాసెస్ అండ్ ఫుడ్ ఇంజనీరింగ్ (మూడుసీట్లు)

## ఉన్నత విద్యావకాశాలు

బిటెక్ ఎజి నాలుగు సంవత్సరాల కోర్సుపూర్తి చేసిన వారు ఎంటెక్ ఎజి, ఎంసిఎ, ఎంబిఎ, ఇండస్ట్రియల్ ఇంజనీరింగ్, ఇండస్ట్రియల్ మేనేజ్‌మెంట్, కంప్యూటర్ సైన్సు, మాస్టర్ ఆఫ్ రీజనల్ ప్లానింగ్, అగ్రిబిజినెస్ మేనేజ్‌మెంట్, ఫుడ్ సైన్సు అండ్ టెక్నాలజీ కోర్సులతో పాటు ఇతర దేశాలైన అమెరికా, ఇంగ్లాండ్, జర్మనీ, ఆస్ట్రేలియా, నెదర్లాండ్, కెనడా దేశాలలో జిఆర్ఇ, టోఫెల్ అర్హత పరీక్షల ద్వారా ఎంఎస్ కోర్సు చేయవచ్చు. దేశంలోని ఐఐటి ఖరగ్‌పూర్, అలహాబాద్ అగ్రికల్చరల్ ఇనిస్టిట్యూట్‌తో పాటు 25 విశ్వవిద్యాలయాలు పిజి కోర్సులకు అవకాశాలు కల్పిస్తున్నాయి.

ఎంటెక్ ఎజి రెండు సంవత్సరాల పిజి కోర్సు పూర్తి చేసిన వారు పిహెచ్‌డి కోర్సు చేయడానికి అర్హులు. దేశంలోనే 15 విశ్వవిద్యాలయాల్లోను, ఇతర దేశాలలోని విశ్వవిద్యాలయాలు పిహెచ్‌డి కోర్సును ఆఫర్ చేస్తున్నాయి.

## ఉపాధి అవకాశాలు

విద్య, పరిశోధన రంగాల్లో, పారిశ్రామిక రంగాల్లో ఉపాధి అవకాశాలు అత్యధికంగా ఉన్నాయి. ఇప్పటి వరకు ఈ కోర్సు పూర్తి చేసిన వ్యవసాయ ఇంజనీర్లు ఉపాధి లేదు అనే సందర్భం ఎక్కడ చోటు చేసుకోలేదు. దేశంలో ఉన్న డిమాండుకు సరిపడ వ్యవసాయ ఇంజనీర్ల శాతం పెరగడం లేదు. ఆధునిక యంత్ర పరిజ్ఞానాన్ని వ్యవసాయదారులకు అందించే రంగంలో వీరికి ఉపాధి అవకాశాలు ఎక్కువగా వుంటున్నాయి. కేంద్ర గ్రామీణాభివృద్ధి శాఖ, సంప్రదాయేతర ఇంధన వనరుల అభివృద్ధిశాఖ, జాతీయ జలవనరులశాఖ, ఐసిఎఆర్, సిఎస్ఐఆర్, డిఎస్‌టి, మైక్రో ఇరిగేషన్ కంపెనీలు, వాటర్ సెక్టార్‌లో కన్సల్‌టెంట్ కంపెనీలు, పేరుగాంచిన ట్రాక్టర్ కంపెనీలు, ఉపాధి అవకాశాలు కల్పిస్తున్నాయి. విద్యార్థులు బిటెక్ మూడవ సంవత్సరంలో ఉన్నప్పుడే

(మిగతా 55వ పేజీలో...)

# రజతోత్సవాలకు సిద్ధమవుతున్న ...

(54వ పేజీ తరువాయి...)

వివిధ కంపెనీలు క్యాంపస్ సెలక్షన్‌లు నిర్వహించి ఎంపిక చేసుకొంటున్నారు. బిటెక్ పూర్తి చేసిన వారికి ప్రారంభంలో నెలకు 10 నుంచి 25 వేల రూపాయల వరకు, ఎంటెక్ పూర్తి చేసిన వారికి నెలకు 20 నుంచి 40వేల రూపాయల వరకు వేతనం అందజేస్తున్నారు.

## పరిశోధనాత్మక బోధన

దేశంలో వ్యవసాయ ఇంజనీర్ల కొరత తీర్చడానికి రాష్ట్రంలో వ్యవసాయ ఇంజనీరింగ్ కళాశాలలు పెరగవలసిన అవసరం ఉందని, ప్రస్తుతం కళాశాలలో అధికశాతం పరిశోధనాత్మక బోధన అందిస్తున్నామని భారత వ్యవసాయ ఇంజనీర్ల సమాఖ్య ఎపి చాప్టర్ చైర్మన్, కళాశాల అసోసియేట్ డీన్ డాక్టర్ టి.వి.సత్యనారాయణ అన్నారు. ఇప్పటికే కళాశాలలో సీట్ల సంఖ్య పెంచాలని, రాష్ట్రంలో నూతనంగా ఏర్పాటు చేయనున్న ఐఐటిలో వ్యవసాయ ఇంజనీరింగ్ విభాగం ఏర్పాటు చేయాలని రాష్ట్ర ముఖ్యమంత్రి దృష్టికి, కేంద్ర మానవ వనరులశాఖ మంత్రి దృష్టికి తీసుకెళ్ళినట్లు తెలిపారు. కళాశాలలో స్థానిక విద్యార్థులతో పాటు బీహార్, రాజస్తాన్, జార్ఖండ్ రాష్ట్రాలకు చెందిన విద్యార్థులు విద్య నభ్యసిస్తున్నారని అన్నారు. ఉన్నత విద్యకు విద్యార్థులకు అవసరమైన ఫెలోషిఫ్‌లు అందిస్తున్నారని అన్నారు. యుఎస్ఎకు చెందిన ఫౌండేషన్ ఫర్ ఎకనామిక్ ఎక్స్‌లెన్సీ, ముంబాయికి చెందిన టాటా ఎండోమెంట్ ఫెలోషిఫ్, ఆచార్య ఎన్‌జి రంగా వ్యవసాయ విశ్వవిద్యాలయం ఫెలోషిఫ్‌తో పాటు ఇతర కంపెనీలు విద్యార్థులకు ఫెలోషిఫ్‌లు అందిస్తున్నాయని అన్నారు.

మొత్తం ఎనిమిది సెమిష్టర్‌లు ఉంటాయని, ఆరు సెమిష్టర్‌లు పూర్తి బోధనాంశాలు, ఏడు,ఎనిమిది సెమిష్టర్‌లు థియరీతో పాటు ప్రాజెక్ట్ వర్కు వుంటుందన్నారు.

చివరి సంవత్సరం ప్రారంభానికి ముందు పేరెన్నికగన్న పరిశ్రమల్లో ఒక నెల ప్రాక్టికల్ ట్రైనింగ్ ఉంటుందన్నారు.

# రాజకీయ యోధుల పుట్టిల్లు తెనాలి

(ఆన్‌లైన్, తెనాలి)

తెలుగుజాతి పరాక్రమ కీర్తి చంద్రికలను దిశదిశలా వ్యాపింపజేసిన ఘన చరిత్ర గల గుంటూరు జిల్లాలో తెనాలి ప్రాంతానికి ఒక ప్రత్యేక స్థానం ఉంది. 'ఇచట పుట్టిన చిగురు కొమ్మయినా చేవ కలిగి ఉండు' అన్నట్లుగా మొక్కవోని రాజకీయ ధీరతకు తెనాలి ప్రాంతం అనాదిగా, ఆటపట్టుగా ఉంటూ వస్తోంది. ఎత్తులతో చిత్తులు చేసే రాజకీయ వైకుంఠపాళిలో నిచ్చెనలెక్కి ఉన్నత స్థానాలను అందుకున్న ఎందరో రాజకీయ నేతలకు పుట్టినిల్లుగానే కాక, నిచ్చెనలు జారి రాజకీయ వలస వచ్చిన మరి కొందరు నేతలకు అదృష్టపు మెట్టినిల్లుగా కూడా తెనాలి ప్రసిద్ధి కెక్కింది. రాష్ట్ర రాజకీయాలను సైతం ఒక మలుపు తిప్పగల ఎందరో రాజకీయ యోధానయోధులను తెనాలి తీర్చిదిద్దింది. ఒకనాడు రామలింగని పేరు చెబితే తెనాలి గుర్తుకు వచ్చేది. నేడు తెనాలి పేరు చెబితే స్ఫురణకు వచ్చేది మాత్రం రాజకీయ ఉద్దండులే. అలాంటి వారిలో తెనాలి మునిసిపల్ చైర్మన్‌గా రాజకీయ జీవితానికి నాంది పలికి రాష్ట్ర చరిత్రలో ప్రతిష్టాత్మక మంత్రి వర్గం నీలం సంజీవరెడ్డి మంత్రి వర్గంలో పురపాలక, దేవాదాయ శాఖల మంత్రిగా పని చేసి సేవలందించిన ఆలపాటి వెంకట్రామయ్యను తెనాలి ప్రథమ యోధగా చెప్పవచ్చు. మంత్రిగా పదవి చేపట్టి వచ్చిన ఆలపాటిని ఏనుగు అంబారీపై ఊరేగించి ఆయన పట్ల గల గౌరవాభిమానాన్ని ఈ ప్రాంత ప్రజానీకం చాటుకుంది. ఇప్పటికి వెంకట్రామయ్య పేరు వినగానే తెనాలి ప్రజలకు ఆనాటి అంబారీ ఊరేగింపు కళ్ళల్లో కదలాడుతుంది. వెంకట్రామయ్యకు సమఉజ్జీగా రాజకీయ వేత్తగా గుర్తింపు పొందిన వారిలో నన్నపనేని వెంకట్రావు అగ్రగణ్యులు. తెనాలిలో ప్రథమంగా డిగ్రీ కళాశాలను స్థాపించి విద్యావేత్తగా కూడా నన్నపనేని వినుతికెక్కారు. ఈ కళాశాల (విఎస్‌ఆర్ అండ్ ఎన్‌విఆర్) ఇప్పటికీ రాష్ట్రంలో పెద్ద కళాశాలల్లో ఒకటిగా పరిగణించబడుతోంది. ఆనాటి రాజకీయమూర్తిత్రయంగా పేరొందిన ఆలపాటి, నన్నపనేని కాంగ్రెస్ పార్టీకి చెందిన వారు కాగా, రావి అమ్మయ్య కార్మిక ఉద్యమంలో కాకలు తీరిన కమ్యూనిస్టు పార్టీకి చెందిన వారు. ఆయన కృషివల్లనే ఈ ప్రాంతంలో కమ్యూనిజం పునాదులు వేసుకుని నేటికీ నిలబడగలుగుతోంది. తెనాలి పరిసర ప్రాంతానికి చెందిన రాజకీయ వేత్తలలో అందరికన్నా ముందుగా చెప్పదగిన వారు కల్లూరి చంద్రమౌళి. స్వాతంత్ర్యోద్యమం, మరెన్నో ఉద్యమాలలో కీలకపాత్ర నిర్వహించిన చంద్రమౌళి ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో మంత్రిగా పని చేశారు. రాజకీయ ఆధ్యాత్మికరంగాలను సమభావంతో చూసిన కల్లూరి రాజకీయ రంగంలతో ఒక ఆణిముత్యం. కేంద్ర మంత్రిగా భారత ప్రథమ ప్రధాని నెహ్రూ ప్రశంసలందుకున్న కొత్తరఘురామయ్య కూడా తెనాలి ప్రాంతం వారే. కాసు బ్రహ్మానందరెడ్డి మంత్రి వర్గంలో పని చేసిన వెనిగళ్ళ సత్యనారాయణ ఇక్కడకు సమీపంలోని దుగ్గిరాలకు చెందిన వారు. మత్స్యశాఖ మంత్రిగా ఆయన ఈ ప్రాంత సర్వతోముఖా భివృద్ధికి కృషి చేశారు. నిజాంపట్నం చేపల హార్బర్‌కు ప్రథమ రూపశిల్పి సత్యనారాయణేనని ఇప్పటికీ ఎవరినడిగినా చెబుతారు. రాజకీయంగా లబ్ద ప్రతిష్ఠులైన పుతుంబాక శ్రీరాములు (పెదపాలెం), అవుతు రామిరెడ్డి సీనియర్ (కొల్లిపర) ఈ ప్రాంతానికి చెందిన వారే.

## రెండవ తరం

తెనాలి రాజకీయ చరిత్ర ద్వితీయ అధ్యాయంలో చెప్పుకోదగిన రాజకీయ వేత్తలు చాలా మంది ఉన్నారు. వారిలో మున్సిపల్ చైర్మన్‌గా ప్రజలలో ఒక పదిలమైన స్థానాన్ని నిలుపుకొని శాసన సభ్యునిగా, రాష్ట్ర పౌర సరఫరాల శాఖా మాత్యునిగా పని చేసిన అన్నాబత్తుని సత్యనారాయణ ఒకరు. ఆయన హయాంలో తెనాలి ప్రాంతం గణనీయంగా అభివృద్ధి సాధించింది. ఆలపాటి వెంకట్రామయ్య అనుంగు తనయ, 17 సంవత్సరాల పాటు శాసన సభలో తెనాలి నియోజక వర్గానికి ప్రాతినిధ్యం వహించి, జిల్లా పరిషత్ తొలి మహిళా అధ్యక్షురాలైన దొడ్డపనేని ఇందిర మహిళా రాజకీయవేత్తగా రాణించి ఈ ప్రాంతానికి చెరిగిపోని ఖ్యాతిని తెచ్చిపెట్టారు.

అన్నాబత్తుని సత్యనారాయణ తర్వాత తెనాలి నుంచి శాసనసభకు ఎన్నికైన మాజీ ముఖ్యమంత్రి నాదెండ్ల భాస్కరరావు ఈ ప్రాంతానికి చెందిన వారే. మున్సిపల్ చైర్మన్‌గా, ఎమ్మెల్యేగా పని చేసిన డాక్టర్ రావి రవీంద్రనాథ్ ఈ ప్రాంతాన్ని అభివృద్ధి పథంలో నడిపించారు.

ఇంకా ప్రతిపక్షంలో ఉంటే ప్రభుత్వ పక్షాన్ని, ప్రభుత్వంలో ఉంటే ప్రతిపక్షాన్ని గడగడలాడించే నేర్పు, వాక్చాతుర్యం కలిగిన కొణిజేటి రోశయ్య (వేమూరు), రాజకీయాలలో ఉన్నత విలువలను అభిలషించిన మాజీ మంత్రి ఆలపాటి ధర్మారావు, మహిళా ఉద్యమాలతో రాజకీయ జీవితాన్ని ప్రారంభించిన నన్నపనేని రాజకుమారి, మాజీ మంత్రి, రాజ్యసభ మాజీ సభ్యులు యడ్లపాటి వెంకట్రావు, మరో మాజీ మంత్రి గొల్లపూడి వేదాంతరావు, నవ తరానికి చెందిన గోగినేని ఉమ, ఆలపాటి రాజేంద్రప్రసాద్, ప్రస్తుతం తెనాలి శాసన సభ్యుడు నాదెండ్ల మనోహర్, పార్లమెంట్ సభ్యుడు వల్లభనేని బాలశౌరి మొదలైన వారు రాజకీయంగా పూర్వీకుల అడుగుజాడలలో నడుస్తూ ఈ ప్రాంత అభివృద్ధికి కృషి చేస్తున్నారు.

# వ్యాపార పంటలకు నెలవు కొల్లూరు మండలం

(ఆన్‌లైన్ - కొల్లూరు)

ఎటు చూసినా పచ్చదనం, కళకళ లాడే మెట్ట పైరులు, మరోవైపు కృష్ణమ్మ పరవళ్లు, సమృద్ధిగా భూ గర్భ జలాలు, 365 రోజులు పంటలతో అలరాడే లంక గ్రామాలు కొల్లూరు మండలానికే తల మానికంగా చెప్పవచ్చు. మండల పరిధి లోని కృష్ణా పరివాహక ప్రాంత లంక గ్రామాలలోని పెసర్లంక, ఆవులవారి పాలెం, గాజుల్లంక, పెదలంక, చింత ల్లంక, సుగ్గునలంక, చిలుమూరులంక, పోతార్లంక, తిప్పలకట్ట, కిష్కింధ పాలెం, తోకలవానిపాలెం, జువ్వల పాలెం, తడికలపూడి భూములు వాణిజ్య పంటలకు పెట్టింది పేరుగా ఉన్నాయి. ఈ ప్రాంతంలో పసుపు, కంద, అరటి, చెరుకు, తమలపాకు, మొక్కజొన్న, చిలకడదుంప పంటలను విస్తారంగా సాగు చేస్తారు. కొల్లూరు కరకట్ట దిగువన ఉన్న లంక గ్రామాల లోని భూమి వాణిజ్య పంటలకు అగ్ర స్థానంగా ఉన్నాయి. సుమారు ఆరు వేల హెక్టార్ల మెట్ట భూముల్లో ఈ వాణిజ్య పంటలను పండిస్తున్నారు. మండల పరిధిలోని ఈపూరు, చిలు మూరు, పోతార్లంక, తిప్పలకట్ట గ్రామాలలో తమలపాకు తోటలకు పెట్టింది పేరు. ఇక్కడి తమలపాకును మహారాష్ట్ర, చెన్నయ్, తమిళనాడు, కల కత్తాలకు ఎగుమతి చేస్తారు. మరి కొన్ని వ్యవసాయ ఉత్పత్తులైన అరటి, కంద ఉత్పత్తులను తమిళనాడు, ఒరిస్సా, మహారాష్ట్ర, పశ్చిమబెంగాల్ తదితర ప్రాంతాలకు ఎగుమతి అవుతుంది. తద్వారా ఆయా ప్రాంతాల ద్వారా ఖట్మాండ్, సౌదీ దేశాలకు ఎగుమతి చేస్తారు. ఇతర జిల్లాల రైతులు నాణ్యా మైన విత్తనం కోసం ఇక్కడి నుండి కందను కొనుగోలు చేసి తీసుకు వెళ్తారు. దేశ వ్యాప్తంగా పేరు గాంచిన దుగ్గిరాల పసుపు యార్డుకు ఎక్కువ మొత్తంలో పసుపును లంక గ్రామాల నుండే వెళ్తుంది. ఈ ప్రాంత రైతులు ప్రకృతి వైపరీత్యాలను సైతం తట్టుకుని వ్యవసాయం మీద ఉన్న మక్కువతో వాణిజ్య పంటలను సాగు చేస్తారు.



కొల్లూరు మండలంలో సాగు చేస్తున్న అరటి, కంద, పసుపు తోటలు కళకళలాడుతున్న దృశ్యం



డా॥ఎస్.జాన్‌డేవిడ్ అయ్యగారు
వ్యవస్థాపకులు
ఎయంజి ఇండియా ఇంటర్నేషనల్

1968 2007

# ఎ యం జి ఇండియా ఇంటర్నేషనల్

## H.O. చిలకలూరిపేట, గుంటూరు జిల్లా



డా॥అరుణ్ కుమార్ కె.మహంతి
డైరెక్టర్
ఎయంజి ఇండియా ఇంటర్నేషనల్

ఎ.ఎం.జి. ఇండియా ఇంటర్నేషనల్ స్వదేశీ క్రైస్తవ స్వచ్ఛంద సేవాసంస్థ. డా॥ఎస్. జాన్‌డేవిడ్ ఈ సంస్థ వ్యవస్థాపకులు. డా॥అరుణ్ కుమార్ కె.మహంతి ఈ సంస్థ డైరెక్టర్. ఈ సంస్థ చేసే సేవలన్నీ ఉచితం. కుల, మత, జాతి విచక్షణ లేకుండా శారీరకంగా, మానసికంగా మరియు ఆధ్యాత్మికంగా వెనుకబడిన వారిని, వారి బిడ్డలను మరియు దిక్కులేని, సంరక్షణ లేని పిల్లలను అన్ని విధాల పెంచి, పోషించి అభివృద్ధి పథంలో ముందుకు నడిపించి చేయూత నిచ్చుటయే ఎ.ఎం.జి. సంస్థ ముఖ్యోద్దేశ్యం. తిండి, బట్ట, విద్య, వైద్య మరియు ఆధ్యాత్మికంగా చేయు సేవలన్నీ ఉచితం. ఆంధ్రప్రదేశ్‌లోని 7 కోస్తాజిల్లాలైన, నెల్లూరు, ప్రకాశం, గుంటూరు, కృష్ణా, తూర్పుగోదావరి, విశాఖపట్నం, విజయనగరం మరియు ఒరిస్సా రాష్ట్రములోని టిట్లాగర్, బలంగీర్ మరియు జగత్‌సింగ్‌పూర్, తమిళనాడు రాష్ట్రములోని చెన్నై నందు ఈ సంస్థ యొక్క సేవలు అమలు జరుగుచున్నవి.



ఎయంజి సంస్థ ద్వారా ఉత్తమ రీతిలో సేవా కార్యక్రమాలు చేస్తున్నందుకు గాను సంస్థ డైరెక్టర్ అరుణ్‌కుమార్ మహంతిని సత్కరిస్తున్న ముఖ్యమంత్రి డాక్టర్ వైఎస్ రాజశేఖరరెడ్డి

## ఎయంజి ప్రాజెక్టుల వివరాలు

**చిలకలూరిపేట** : ఎయంజి హైస్కూల్, ఎయంజి జూనియర్ కాలేజి, ఎయంజి డిగ్రీ కాలేజి, ఎయంజి డైక్‌మెన్ ఐటిసి, ఎయంజి బిఇడి కాలేజి, ఎయంజి బైబిల్ కాలేజి, డే కేర్ సెంటర్స్, మిల్క్ ప్రాజెక్ట్స్, ఫ్రీ క్లినిక్స్ / హాస్పిటల్స్, ఓల్డ్ ఏజ్ హోమ్స్, అడల్ట్ ఎడ్యుకేషన్ సెంటర్స్, టిబి, కుష్టు వ్యాధిగ్రస్తులకు రేషన్ పంపిణీ, **గణపవరం** :టిబి, చెస్ట్ డిసీజెస్ హాస్పిటల్, **విశాఖపట్నం:** ఎయంజి ఇంగ్లీష్ మీడియం స్కూల్ (భీమిలి), ఎయంజి ఇంగ్లీష్ మీడియం జూనియర్ కాలేజి (భీమిలి), బిఇడి కాలేజి (భీమిలి), కుట్టుశిక్షణా కేంద్రం (అనకాపల్లి), వృద్ధులకు సహాయం, మిల్క్ ప్రాజెక్టులు, కుష్టు వ్యాధి గ్రస్తులకు పునరావాసం (విజయనగరం,సింహాచలం), లిటరేచర్ మినిస్ట్రీ, **కాకినాడ** : ఎయంజి కుట్టు శిక్షణా కేంద్రాలు, డే కేర్ సెంటర్స్, ఎయంజి ఇంగ్లీష్ మీడియం స్కూల్, మిల్క్ ప్రాజెక్ట్, అడల్ట్ ఎడ్యుకేషన్, ఫ్రీ క్లినిక్, ఓల్డ్ ఏజ్ హోమ్, **ఏలేశ్వరం** : ఎయంజి ఇంగ్లీష్ మీడియం స్కూల్, ఒకేషనల్ ట్రైనింగ్ సెంటర్, ఫ్రీ హెల్త్ క్లినిక్, అడల్ట్ ఎడ్యుకేషన్ సెంటర్, **పరిమితడక** : ఎయంజి ఇంగ్లీష్ మీడియం స్కూల్, ఒకేషనల్ ట్రైనింగ్ సెంటర్, ఫ్రీ హెల్త్ క్లినిక్, అడల్ట్ ఎడ్యుకేషన్ ప్రోగామ్, గ్రామాలలో వైద్య క్యాంపులు, **చీరాల / ఓడరేవు** : ఎయంజి స్ట్రీట్ చిల్డ్రన్ హోమ్, డే కేర్ సెంటర్, ఎయంజి ఇంగ్లీష్ మీడియం స్కూల్, ఫ్రీ క్లినిక్, అడల్ట్ ఎడ్యుకేషన్ సెంటర్, నర్సింగ్ స్కూల్,కమ్యూనిటీ డెవలప్‌మెంట్స్, **విజయవాడ** : ఎయంజి స్ట్రీట్ చిల్డ్రన్ హోమ్, మిల్క్ ప్రాజెక్ట్, డే కేర్ సెంటర్, ఫ్రీ క్లినిక్, **రాజవోలు** : ఎయంజి హైస్కూల్, ఎయంజి కంటి ఆసుపత్రి, **కడియం** : ఎయంజి కంటి ఆసుపత్రి, **బొమ్మూరు** : ఎయంజి హైస్కూల్, ఎయంజి జూనియర్ కాలేజి, **రాజమండ్రి** : ఎయంజి డే కేర్ సెంటర్, ఫ్రీ క్లినిక్, కుట్టు శిక్షణా కేంద్రాలు, అడల్ట్ ఎడ్యుకేషన్ సెంటర్స్, స్ట్రీట్ చిల్డ్రన్ హోమ్, హోమ్ ఆఫ్ హోప్ సెంటర్, కుష్టు వ్యాధిగ్రస్తులకు రేషన్ పంపిణీ, **పెద్దాపురం** : ఎయంజి ఓల్డ్ ఏజ్ హోమ్, ఎయంజి కుట్టు శిక్షణా కేంద్రం, **సామర్లకోట** : ఎయంజి హోమ్ ఆఫ్ హోప్ సెంటర్, స్ట్రీట్ చిల్డ్రన్ హోమ్, **టిట్లాగర్** : లెప్రసీ ప్రాజెక్ట్, టిబి ప్రాజెక్ట్, చిల్డ్రన్ హోమ్



ఎయంజి సంస్థ ద్వారా క్షయవ్యాధిగ్రస్థులకు ఉత్తమ రీతిలో సేవలు అందించినందుకు గాను సంస్థ డైరెక్టర్ అరుణ్‌కుమార్ మహంతిని సత్కరిస్తున్న రాష్ట్ర గవర్నర్ ఎన్.డి.తివారి

## ఎయంజి ప్రాజెక్టుల ద్వారా సహాయం పొందుతున్న లబ్దిదారుల వివరాలు

| వివరాలు | లబ్దిదారులసంఖ్య (సుమారు) |
|---|---|
| 1. పిల్లల సంరక్షణ, విద్య | 14,400 |
| 2. మిల్క్ ప్రాజెక్ట్స్ | 3,300 |
| 3. డే కేర్ సెంటర్స్ | 7,000 |
| 4. హెల్త్ ప్రాజెక్ట్స్ | 21,000 |
| 5. వయోజన విద్య | 13,100 |
| 6. సాంకేతిక విద్య | 1,600 |
| 7. ఓల్డ్ ఏజ్ హోమ్స్ | 6,700 |
| 8. పునరావాస కార్యక్రమాలు | 9,100 |
| 9. కుష్టువ్యాధిగ్రస్తుల పునరావాసం | 4,100 |
| 10. కమ్యూనిటీ వర్క్షర్లు | 1,600 |
| 11. జీవిత ఖైదీల పిల్లలు | 200 |
| 12. ఆత్మహత్యలు చేసుకున్న రైతుల పిల్లలు | 1,000 |
| 13. హెచ్ఐవి / ఎయిడ్స్ బాధితులు | 1,000 |
| 14. హెచ్ఐవి / ఎయిడ్స్ బాధితుల పిల్లలు | 1,000 |
| **మొత్తం లబ్దిదారులు** | **85,100** |

## ప్రభుత్వ అభివృద్ధి పథకాలకు ఎయంజి భూరి విరాళాలు

| | (రూ.) |
|---|---|
| చిలకలూరిపేటలో మంచినీటి పథకానికి | – 4.5 కోట్లు |
| చిలకలూరిపేట మురికివాడలలో మంచినీటి పైపులైన్లకు | – 50 లక్షలు |
| మురికివాడల అభివృద్ధిపథకానికి | – 2 కోట్లు |
| మదర్ థెరిస్సా కాలనీ ఎలక్ట్రీసిటీ కొరకు | – 6 లక్షలు |
| పారిశుద్ధ్య సిబ్బంది గృహ సముదాయంకు | – 11.52 లక్షలు |
| 4వ వార్డులో డ్రైనేజికి, పట్టణ అభివృద్ధి పథకంకు | – 4 లక్షలు |
| గుంటూరులో వయోజన విద్య నభ్యసిస్తున్న పేదమహిళలకు ఉచిత కంటి అద్దాలకు | – 7 లక్షలు |
| నరసరావుపేటలో చంద్రబాబునాయుడు కాలనీ | – 21 లక్షలు |
| కాకినాడలో జనరల్ హాస్పిటల్‌లో సి.టి.స్కాన్‌కు | – 50 లక్షలు |
| కాకినాడలో మంచినీటి పథకంకు | – 30 లక్షలు |
| ఏలేశ్వరం రోడ్లు మరియు డ్రైనేజికి | – 2.5 లక్షలు |
| అమలాపురం మహిళల అభివృద్ధి కొరకు ప్రాజెక్టుకు | – 10 లక్షలు |
| ఒరిస్సాలో జగత్‌సింగ్‌పూర్ స్కూల్ బిల్డింగ్‌కు | – 4 లక్షలు |
| గుంటూరులో జిల్లా టి.బి.హాస్పటల్ అభివృద్ధి కొరకు | – 10 లక్షలు |
| నరసరావుపేటలో మురికివాడల అభివృద్ధి పథకం | – 1 కోటి |
| నాగార్జున యూనివర్సిటీ ఆడిటోరియం నిర్మాణంకొరకు | – 2 కోట్లు |
| స్వర్ణభారతి నగర్, గుంటూరు గృహనిర్మాణం కొరకు | – 1.27 కోట్లు |
| సునామీ గృహనిర్మాణం మరియు గృహనిర్మాణ సహాయాలు | – 3.5 కోట్లు |

### వరద బాధితులకు నిత్యావసర వస్తువుల పంపిణీ

2005 సెప్టెంబరు, అక్టోబరు నెలలలో కురిసిన భారీ వర్షాల కారణంగా వచ్చిన వరదల వలన నష్టపోయిన 3,700 మంది బాధితులకు 35 లక్షల రూపాయల వ్యయంతో ఎయంజి సంస్థ భారీ ఎత్తున సహాయం అందించింది. తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలలో వరదలు వచ్చిన సమయంలో ఆహారపు పొట్లాలు అందచేయడమేకాక ఒక్కొక్క కుటుంబానికి 10 కిలోల బియ్యం, 2 కిలోల కందిపప్పు, 1 కిలో వంటనూనె, 2 దుప్పట్లు, చీరెలు, సబ్బులు పంపిణీ చేయడం జరిగింది.

### ఆత్మహత్య చేసుకున్న రైతుల పిల్లల సంరక్షణ

ఆంధ్రప్రదేశ్‌లోని 23 జిల్లాలకు చెందిన ఆత్మహత్య చేసుకున్న రైతుల పిల్లలకు ప్రతి సం॥ 60 లక్షల రూపాయల సహాయంతో స్కూల్ బ్యాగ్స్, పుస్తకాలు, స్కూలు / కాలేజి ఫీజు మరియు ప్రతి నెల కొంత ఆర్థిక సహాయం అందించబడు తున్నది.

### ఖైదీల పిల్లల సంరక్షణ

ప్రతి సం॥ 5 సెంట్రల్ జైళ్ల జీవిత ఖైదీల పిల్లలకు పుస్తకాలు, యూనిఫాం, స్టేషనరీ, షూస్, స్కూల్‌బ్యాగ్స్, స్కూలు / కాలేజి ఫీజు మరియు ఖైదీల భార్యలకు ఉపాధి సహాయం అందించ బడుతున్నది.

### హెచ్ఐవి / ఎయిడ్స్ బాధితులకు ప్రతినెలా నిత్యావసర వస్తువులు మరియు వారి పిల్లల సంరక్షణ

◆ 1,000 మంది ఎయిడ్స్ బాధితులకు ప్రతి ఒక్కరికి నెలకు 10 కేజీల బియ్యం, 2 కేజీల పప్పు, 1 కేజీ వంట నూనె, 4 సబ్బులు ఇవ్వడం జరుగుచున్నది.

◆ వారి పిల్లలకు ప్రతినెలా ఆర్థిక సహాయం మరియు బట్టలు, స్కూల్ బ్యాగ్స్ కూడా ఇవ్వడం జరుగుచున్నది.

### సునామీ బాధితులకు ఎయంజి భారీ సహాయం

* కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు జిల్లాలలోని 4,700 మంది సునామీ బాధితులకు పెద్ద ఎత్తున సహాయం
* 3 కోట్ల రూపాయల విలువ చేసే బియ్యం, కందిపప్పు, వంట పాత్రలు, దుస్తులు, చేపల వలలు పంపిణీ
* సునామీ బాధిత మత్స్య కారుల బోటు ఇంజన్ల మరమ్మత్తుల కోసం ఆర్థిక సహాయం
* సునామీ బాధితుల గృహ నిర్మాణానికి 4 జిల్లాలలో 3000 గృహాల నిర్మాణానికి 3 కోట్ల రూపాయల ఆర్థిక సహాయం

# నాణ్యతకు మారుపేరు కొల్లూరు ఇటుకలు



కొల్లూరు ఇటుక బట్టీలు

(ఆన్‌లైన్ - కొల్లూరు)

సీజన్ వచ్చిందంటే చాలు వేల మంది కార్మికులతో లంక గ్రామాలు కళకళలాడుతాయి. ఇటుకల అచ్చులతో మైదానాలన్నీ నిండాల్సిందే. కోట్ల సంఖ్యలో ఉత్పత్తి అయ్యే కొల్లూరు ఇటుకకు ఉన్న గిరాకీ మళ్ళీ సీజన్‌కు ఒక ఇటుకను కూడా మిగల్చదు. 'కొల్లూరు ఇటుకలు తెప్పించండి బ్రదర్' అంటూ మాజీ ముఖ్యమంత్రి స్వర్గీయ నందమూరి తారక రామారావు సినీ పరిశ్రమ నిర్మాణాల రోజుల్లో అన్న మాటలు చూస్తే కొల్లూరు ఇటుకకు ఎంత ప్రాముఖ్యత ఉందో అర్థమవుతుంది. గతంలో చుట్టు పక్కల జిల్లాలకే పరిమితమైన రవాణా నేడు రాష్ట్ర వ్యాప్తమైంది. కొల్లూరు ఇటుకకు రాష్ట్ర వ్యాప్తంగా పేరు రావడానికి కారణంగా ఇక్కడ లంక గ్రామాలలో దొరికే మట్టి, రాయి సైజు, అత్యంత శ్రద్ధతో బట్టీని కాల్చే తీరు నాణ్యతను మరింత పెంచింది. ఇటుకకు ఉపయోగించే మట్టిని పరిశీలిస్తే మట్టి, ఇసుక సమపాళ్లలో ఉండటం వల్ల ఇటుకకు సిద్ధం చేసేటప్పుడు పశువులతో బాగా తొక్కించి రాయిని పటిష్ఠంగా ఉంచేందుకు దోహదపడుతుంది. ఇతర ప్రాంతాలలో పచ్చి ఇటుకను కాల్చేందుకు ఊక (వరి పొట్టు) మాత్రమే వాడి ఇటుకను కాలుస్తారు. కొల్లూరు ఇటుకను మాత్రం కాల్చేందుకు ఎక్కువ మొత్తంలో రాక్షస బొగ్గును వాడుతారు. దీని వల్ల రాయి మరింత నాణ్యంగా తయారవుతుంది. ఇటుక బట్టీలలో వాడేందుకు బొగ్గును కొత్తగూడెం, కటక్‌ల నుంచి దిగుమతి చేసుకుంటారు. కొల్లూరు ఇటుకను 20 అడుగల పై ఎత్తు నుండి కిందకు పడి వేసినా ఏ మాత్రం దెబ్బ తినకుండా ఉండటం ప్రత్యేకంగా చెప్పవచ్చు. ఇటుక పరిశ్రమ దాదాపు 60 సంవత్సరాల క్రితమే ఈ ప్రాంతంలో పునాదులు వేసుకుంది. ఇటుక పరిశ్రమ వల్ల రాష్ట్రంలోని అనేక ప్రాంతాల నుంచి వేలాది మంది సీజన్‌లో ఇక్కడికి వచ్చి ఉపాధి పొందుతున్నారు. ఇక్కడ తయారు చేసిన ఇటుకను ఇతర ప్రాంతాలకు రవాణా చేయడానికి సుమారు 200 లారీలున్నాయి. వీటి ద్వారా కూడా కొన్ని వందల మంది ఉపాధి పొందుతున్నారు. ఇప్పటికీ రాష్ట్రంలో హైదరాబాద్, ఇతర ప్రాంతాల వాళ్ళు కొల్లూరు ఇటుకను కోరి తెప్పించుకుంటారు. ఈ మధ్య కాలంలో ఇటుక రాయి ముడి సరుకులైన మట్టి, ఊక, బొగ్గు ధరలు విపరీతంగా పెరగడంతో ఇటుక బట్టీ వ్యాపారులు కూడా పెట్టుబడి ఎక్కువ కావడం వల్ల ఇటుక రాయి ధరలను పెంచక తప్పలేదు.

ఇతర ప్రాంతాలలో ఫ్లై యాష్ బ్రిక్స్ పరిశ్రమలు ఉన్నప్పటికీ గృహ నిర్మాణ దారులు కొల్లూరు ఇటుక రాయి ధర భారీగా ఉన్నా ఏ మాత్రం డిమాండ్ తగ్గ లేదు మరింతగా ఇటుక రవాణా కావడం విశేషం.

# ఆయన చిత్రాలు చూసి ప్రకృతి సైతం పులకిస్తుంది



సూర్యదేవర సంజీవ్‌దేవ్

(ఆన్‌లైన్ - దుగ్గిరాల)

బొమ్మంటే నాకిష్టం... నిమ్మంటే నాకిష్టం... దానిమ్మంటే ఇష్టం లేని అమ్మంటే ఇష్టం... అంటూ చిత్రకారులకూ... సాహితీవేత్తలకూ చిరపరిచితుడైన ప్రకృతి చిత్రకారుడిగా విదేశీయుల చేత కూడా శభాష్ అనిపించుకున్న కీర్తిశేషులు సూర్యదేవర సంజీవ్‌దేవ్ గురించి తెలియని వారుండరు. గుంటూరు జిల్లా దుగ్గిరాల మండలంలోని తన మామ ఊరైన తుమ్మపూడిలో తన జీవితాన్ని ముగించిన సంజీవ్‌దేవ్ కృష్ణాజిల్లా నందిగామ మండలంలో 1914లో జన్మించారు. ఐదవ తరగతి వరకు మాత్రమే చదువుకున్న ఆయన 16వ ఏటనే హిమాలయాలకు వెళ్లి ప్రముఖ రష్యన్ 'నికోలస్ రోరిక్'తో కలిసి గడిపారు. బెంగాలీ ప్రముఖ రచయిత రవీంద్రనాథ్ ఠాగూర్ రచించిన పద్యాన్ని బెంగాలీలోనే కొన్ని నిమిషాలలో నేర్చుకుని చదివి వినిపించి ఆయన మెప్పుపొందారు. హిందీ, బెంగాల్, ఇంగ్లీష్, సంస్కృత భాషలలో అనేక రచనలను చేశారు. ఆయన చిత్రాలు, ఆయన రచనలకు, లేఖలకు ముగ్ధుడైన ప్రముఖ సినీ దిగ్గజం అక్కినేని నాగేశ్వరరావు తుమ్మపూడిలోని ఆయన స్వగృహమైన 'రసరేఖ'కు వచ్చి ఆయనను కలిశారు. బెయో సింఫనీ (జీవనరాగం), క్రియేటివ్ ఎనాలసిస్ (సృష్టి విశ్లేషణ), హర్‌లైఫ్ వంటి ఇంగ్లీషు రచనలతో పాటు బ్లూగ్లూమ్స్ వంటి పద్య రచన కూడా చేశారు. తెలుగులో రసరేఖ, తెగిన జ్ఞాపకాలు, లేఖల్లో సంజీవ్‌దేవ్, సంజీవ్ దిల్ లేఖలు వంటి 18 రచనలు ఆయన చేశారు. అనేక మంది రచనలకు ఆయన పీఠికలు వ్రాసేవారు. ఎందరో రచయితల్లా కాక ఈర్ష్య, ద్వేషాలను దరి చేరనీయని అజాత శత్రువుగా, స్నేహశీలి, మనోజీవి, ఆంతరంగిక జీవిగా పేరుగాంచారు.





సంజీవ్‌దేవ్ గీసిన అరుదైన కొన్ని ప్రకృతి చిత్రాలు

మేధావులకు ఆయన లేఖలు వ్రాసే వారు, వారు వ్రాసిన సందేహాలకు ప్రత్యుత్తరాలు వ్రాసేవారు. వాటిని కాంతిపుంజీలుగా ఇటీవలే అచ్చు వేయించే ప్రయత్నం జరిగింది. పలుమార్లు ఫైన్ ఆర్ట్స్ ఇంటర్వ్యూలకు న్యాయనిర్ణేతగా వెళ్లేవారు, ఉపన్యాసాలిచ్చేవారు, సన్మానాలకు దూరంగా మెలిగేవారు, అవార్డులను ఆయన సున్నితంగా తిరస్కరించేవారు. రాజకీయ, వ్యాపార దృక్పధాలకు దూరంగా మెలిగేవారు. ఎవరైనా మీరేమి చేస్తారని అడిగితే 'కల్చర్ అండ్ అగ్రికల్చర్' అని బదులిచ్చేవారు. చిత్రకళ మీద ఆయన ఆంధ్ర, కర్నాటకలలో అనేక ఉపన్యాసాలిచ్చారు. ప్రముఖ ఫిలాసఫర్ ఆచార్య క్రొత్తసచ్చిదానంద మూర్తి, జస్టిస్ ఆవుల సాంబశివరావు, రవీంద్రనాథ్ ఠాగూర్ మేనల్లుడు అసిత్‌కుమార్ ఆల్దాల్, ప్రముఖ చిత్రకారుడు అడవి బాపిరాజు, ఫిలాసఫర్ జిడ్డు కృష్ణమూర్తి, రచయిత బుచ్చిబాబు వంటి ఎందరో ప్రముఖులు, మేధావులతో ఆయనకు ప్రపంచ వ్యాప్తంగా అనుబంధం ఉంది. ఆయన యాభై ఏళ్ల చరిత్రను కంఠోపాఠంగా చెప్పగలిగే మేథావి అంటే అతిశయోక్తి కాదేమో. అంతటి జ్ఞాపక శక్తి ఆయన కుందంటారు సన్నిహితులు. ఆయన గీసిన చిత్రాలను 'రసరేఖ' అన్న పేరుతో నిర్మించిన తుమ్మపూడిలో ఆయన ఇంటిలోని హాలులో అందంగా పొందు పరిచారు.

**మనిషి జీవిస్తాడు మరణించే వరకూ, ఎంత కాలం జీవించినా ఇంకా జీవించాలనే కోర్కె మిగిలే ఉంటుంది. ఎక్కువ మందిక మరణించిన తర్వాత కూడా జీవించాలని ఉంటుంది. మరణించడం మీద రోతే జీవితంపైన ప్రీతికి కారణం. మనిషి ఆ రోతను, ప్రీతిని దూరం చేసుకున్నప్పుడు మాత్రమే సుఖపడతాడు, ఆనంద జీవిగా మారుతాడు. 'నా మరణాన్ని నేను చూడాలి' అంటూ చమత్కరించే ఆయన 1999 ఆగస్టు 25న భౌతికంగా ఈ లోకానికి దూరమయ్యారు. చిత్రకారునిగా, రచయితగా చిరస్మరణీయంగా నిలిచిపోయారు.**

# ప్రగతి పథంలో జిల్లా పరిషత్


డా॥ వై.యస్. రాజశేఖర రెడ్డి
రాష్ట్ర ముఖ్యమంత్రివర్యులు


శ్రీ కన్నా లక్ష్మీ నారాయణ
రాష్ట్ర రవాణాశాఖ మాత్యులు


శ్రీ మురుగుడు హనుమంతరావు
రాష్ట్ర సర్వశిక్షా అభియాన్ శాఖామాత్యులు


శ్రీ కాసు వెంకట కృష్ణారెడ్డి
రాష్ట్ర ఆహార, పౌర సరఫరాలు & తూనికలు, కొలతల శాఖామాత్యులు


శ్రీ మోపిదేవి వెంకటరమణరావు
రాష్ట్ర మౌలిక సదుపాయాలు, ఓడరేవులు, విమానయాన, సహజ వనరుల శాఖామాత్యులు


శ్రీ మహమ్మద్ ఆలీ రఫత్
గుంటూరు జిల్లా కలెక్టర్


శ్రీమతి నేదురమల్లి రాజ్యలక్ష్మి
జిల్లా ఇన్‌చార్జ్ శాఖామాత్యులు


ముప్పలనేని శేషగిరిరావు
గుంటూరు జిల్లా కాంగ్రెస్ అధ్యక్షులు


జె.సి. దివాకర్
పంచాయితీరాజ్ శాఖామంత్రి


తూములూరులో ఎ.ఐ.సి.సి. అధ్యక్షురాలు సోనియాగాంధిని సన్మానిస్తున్న కూచిపూడి సాంబశివరావు


తూములూరులో సోనియాగాంధిని సన్మానిస్తున్న జడ్.పి. ఛైర్ పర్సన్ కూచిపూడి విజయమ్మ

## రైతు సంక్షేమం కోరే వై.యస్. నాయకత్వమును బలపర్చాలి

రాష్ట్రంలో వై.యస్. రాజశేఖరరెడ్డి నాయకత్వంలో కాంగ్రెస్ ప్రభుత్వము పేద ప్రజలు, రైతుల సంక్షేమునకు కృషిచేస్తుంది. ఉచిత విద్యుత్తు, ఆత్మహత్యలు చేసుకొన్న కుటుంబములకు పునరావాసము, పావలా వడ్డీలకే డ్వాక్రా సంఘములకు ఋణములు, రాజీవ్ నగరబాట, రాజీవ్ పల్లెబాట, ప్రజాపదం, పట్టణంలో పేదలకు రూ॥ 1200/-కు బాలలు, రాజీవ్‌గృహ కల్ప, ఇందిరమ్మ ఆదర్శ గ్రామాల అభివృద్ధి వంటి పథకములలో ప్రజలకు ఎన్నో సేవా కార్యక్రమములను చేపట్టింది. వై.యస్. పాలనను మెచ్చుకొన్న ప్రజలు ఇటీవల మున్సిపాలిటీలు స్థానిక ఎన్నికలలో అద్భుతమైన తీర్పు ఇచ్చారు. రాష్ట్ర ప్రభుత్వం చేపట్టుతున్న అన్ని పథకాలకు ప్రజలు అండగా ఉండాలని కోరుతున్నాము.


సోనియాగాంధికి మెమెంటో అందజేస్తున్న జడ్.పి. ఛైర్ పర్సన్ కూచిపూడి విజయమ్మ


ఇందిరమ్మ లబ్ధిదారులకు చెక్కులు పంపిణీచేస్తున్న ఎ.ఐ.సి.సి. అధ్యక్షురాలు సోనియాగాంధి, జడ్.పి. ఛైర్ పర్సన్ కూచిపూడి విజయమ్మ


తూములూరు దళితవాడలో పర్యటిస్తున్న ఎ.ఐ.సి.సి. అధ్యక్షురాలు సోనియాగాంధి


రెండో విడత ఇందిరమ్మ కార్యక్రమాన్ని శంఖుస్థాపన చేస్తున్న ఎ.ఐ.సి.సి. అధ్యక్షురాలు సోనియాగాంధి, ముఖ్యమంత్రి రాజశేఖర రెడ్డి


కూచిపూడి సాంబశివరావు
రాష్ట్ర గ్రంథాలయ సంస్థ ఛైర్మన్


కూచిపూడి విజయమ్మ
ఛైర్ పర్సన్, జిల్లా పరిషత్, గుంటూరు

# స్వాతంత్ర్య సంగ్రామంలో తెనాలి యోధుల త్యాగం



తెనాలి రణరంగ చౌక్‌లోని అమరవీరుల స్మారక స్థూపాలు

(ఆన్‌లైన్, తెనాలి)

స్వాతంత్ర్య సంగ్రామంలో తెనాలి ప్రాంతం కీలకపాత్ర నిర్వహించింది. స్వాతంత్ర్య సాధనలో తెనాలి ప్రముఖ స్థానాన్ని పొందడం వెనుక అనేక మంది త్యాగమూర్తులు త్యాగం ఇమిడి ఉంది. తమ జీవితాన్ని ఉద్యమానికి ఎందరో ధారపోసి తెనాలికి కీర్తిప్రతిష్టలు సంపాదించారు. అందుకే భారత జాతీయోద్యమ చరిత్రలో తెనాలి సంఘటనలకు సముచిత స్థానం ఉంది. 1920-47 మధ్య కాలంలో జాతీయోద్యమానికి తెనాలి తాలూకాలో అపూర్వ స్పందన వచ్చింది. ఆస్తులను సైతం త్యాగం చేసి దేశభక్తిప్రేరణతో స్వరాజ్య సాధనే ధ్యేయంగా ఉద్యమించి అసువులు బాసిన వారు కొందరైతే, రెండు సంవత్సరాలు వరకు జైలు జీవితం గడిపిన వారు అనేక మంది ఉన్నారు. 1932 జూన్, జూలై నెలల్లో 104 మందిని శాసనోల్లంఘన సందర్భంగా ప్రభుత్వం అరెస్టు చేసి జైలుకు పంపింది. ఉద్యమంలో భాగంగా 1940లో స్వచ్ఛందంగా అరెస్టయిన వారి సంఖ్య వందల్లో ఉంది. క్విట్ ఇండియా సందర్భంగా 1942 ఆగస్టు 12న తెనాలిలో జరిగిన ప్రజాందోళన, పోలీసు బలగాలతో జరిగిన ముఖాముఖి పోరాటం, ఈ సందర్భంగా రైల్వే ఆస్తులకు కలిగిన నష్టం జాతీయ నాయకుల దృష్టిని ఆకర్షించింది. ఈ పోరాటంలో ఏడుగురు మృతి చెందారు. ఈ వార్త దావానలంలో వ్యాపించి బ్రిటీష్ సామ్రాజ్యవాదుల దృష్టిలో నిలిచింది. రైతులు స్వరాజ్య ఉద్యమంలో పెద్ద ఎత్తున పాల్గొన్నారనటానికి దాఖలాలు ఉన్నాయి.

## తెనాలిలో జాతీయ పాఠశాల

జాతీయోద్యమంలో తొలితరం నాయకులైన బాలగంగాధర తిలక్, అనీబిసెంట్ నాయకత్వాన హోం రూల్ ఉద్యమం ప్రారంభమైంది. విదేశీ వస్తు బహిష్కరణ, స్వదేశీ వస్తు వినియోగానికి ప్రోత్సాహం, జాతీయ విద్యాలయాల స్థాపన ఈ ఉద్యమ లక్ష్యాలు. 1907లో మచిలీపట్నంలో ఏర్పాటైన జాతీయ పాఠశాలలో తెనాలి ప్రాంతానికి చెందిన కొందరు శిక్షణ పొంది 1920 ప్రాంతంలో తెనాలిలో జాతీయ పాఠశాల ప్రారంభించారు. జాతీయవాదులకు ఈ పాఠశాల స్థావరంగా పని చేసింది. సత్యాగ్రహ ఉద్యమానికి అంకురార్పణగా 1921 మార్చి 21న విజయవాడలో అఖిలభారత కాంగ్రెస్ సమావేశం రాష్ట్రంలో వేలాది యువకులను ఆకర్షించింది. తెనాలి ప్రాంతం నుంచి కన్నెగంటి సూర్యనారాయణ, కుప్పా ఆంజనేయశర్మ, శరణు రామస్వామి చౌదరి, వి.సీతారామయ్య హాజరయ్యారు. దీని ప్రభావంతో తెనాలిలో సహాయ నిరాకరణ కార్యక్రమం ప్రారంభమైంది. 1930లో మహాత్మాగాంధీ నాయకత్వంలో సహాయ నిరాకరణ సత్యాగ్రహానికి స్పందించి బందరులో నేషనల్ కాలేజి, ఏలూరులో జాతీయ విద్యాలయం ఏర్పాటు కాగా, తెనాలిలో మల్లాది దేవేంద్రుని సారధ్యంలో గోఖలే జాతీయ పాఠశాల, కొల్లూరులో మరో జాతీయ పాఠశాల వెలిశాయి. పన్నుల నిరాకరణోద్యమంలో తెనాలికి చెందిన శరణు రామస్వామి చౌదరి గ్రామ గ్రామానా తిరిగి ఉద్యమం వ్యాప్తి చేశారు.

## విదేశీ వస్త్ర బహిష్కరణ

ఖద్దరు ఉద్యమ వ్యాప్తికి గాంధీజీ దేశ పర్యటన జరుపుతూ విదేశీ వస్త్ర బహిష్కరణ పిలుపునిచ్చారు. అప్పట్లో ఐతానగర్‌లో ఈదర అమ్మయ్య ఇంటి ముందు విదేశీ దుస్తుల దహనానికి శ్రీకారం చుట్టారు. అమ్మయ్య తన విదేశీ కోట్లు, షర్టు దహనం చేశారు. ఖద్దరు ఉద్యమ కాలంలో గాంధీజీకి తెనాలి ప్రాంతవాసులు ఎక్కువ మొత్తంలో విరాళాలిచ్చారు.

## ఉప్పు సత్యాగ్రహం

ఉప్పు సత్యాగ్రహంలో తెనాలి ప్రాంతీయులు 1930 నాటికి 400 మంది జాతీయోద్యమంలోకి ప్రవేశించారు. కూచిభొట్ల ప్రభాకరశాస్త్రి (కొల్లూరు), చింతమనేని భావయ్య (సంగం జాగర్లమూడి), రావి రంగారావు (తెనాలి), అప్పసాని సాంబయ్య చౌదరి (వేటపాలెం), శరణు రామస్వామి జైలు శిక్ష కూడా అనుభవించారు. తెనాలిలో కొల్లా కనకవల్లి తాయారమ్మ జైలు శిక్ష అనుభవించారు. 1930లో గుంటూరుయడవల్లివారి సత్రంలో ఏర్పాటు చేసిన సత్యాగ్రహ శిబిరాన్ని మూసేయటానికి ప్రభుత్వం రిజర్వు దళాలను పంపారు. దీనికి నాగళ్ల కృష్ణయ్య శిబిర దళాధిపతిగా ఉన్నారు. ఆయన పోలీసుల ప్రవేశాన్ని అడ్డుకోగా లాఠీ దెబ్బలతో నేలకొరిగారు. ఈ దృశ్యాల్ని చూసి ఆచార్య రంగా భారతీదేవి కలెక్టర్‌ను కలిసి నిరసనను వ్యక్తం చేశారు. ఈ సంఘటన చూసిన శాంతి కాముకులందరూ కృష్ణయ్య సహనాన్ని మెచ్చుకున్నారు. అప్పటి నుండీ వారిని గాంధీ కృష్ణయ్య అంటూ పిలిచేవారు.

## రైతు ఉద్యమం

ప్రపంచాన్ని ముంచెత్తిన ఆర్థిక సంక్షోభం (1929-33) ఆంధ్రలో రైతుల వెన్ను విరిచింది. అప్పుడు రైతు రక్షణ కోసం ఆచార్య ఎన్జీ రంగా గ్రామ గ్రామాన రైతు రక్షణ సమితులు ఏర్పాటు చేశారు. జాతీయోధ్యమాన్ని రైతు ఉద్యమం దెబ్బ తీస్తుందని కొందరు వ్యతిరేకించినా గూడవల్లి రామబ్రహ్మం ఆచార్య రంగాకు సహకరించారు. ఫలితంగా 1931 తెనాలిలో

(మిగతా 64వ పేజీలో...)



# అన్నదాతలను ఆదుకుంటున్న పాడిపరిశ్రమ

(ఆన్‌లైన్ - శావల్యాపురం)

పాలకు గిట్టుబాటు ధరలేక, సరియైన మార్కెటింగ్ సౌకర్యంలేక పాడి రైతులు నానా ఇబ్బందులు పడేవారు. పాడిపరిశ్రమపై అనాసక్తిని చూపేవారు. ఇది 1995 సంవత్సరానికి ముందు పరిస్థితి. సరళీకృత ఆర్థిక విధానాల మూలంగా ప్రైవేట్ డెయిరీలు పుట్టగొడుగుల్లా పుట్టుకురావడంతో ఆ పరిస్థితి పూర్తిగా మారిపోయింది. ప్రస్తుతం పాడిపరిశ్రమే ప్రధాన జీవనాధారంగా మారిపోయింది. వెనుకపడ్డ వినుకొండ ప్రాంతానికి ప్రైవేట్ డెయిరీలు వరంగా మారాయి. అన్నదాతలు వ్యవసాయం కన్నా పాడిపరిశ్రమ పైనే ఎక్కువ మక్కువ చూపుతున్నారు. ప్రైవేట్ డెయిరీల ఆరోగ్యకరమైన పోటీ వల్ల పాల ఉత్పత్తులు గణనీయంగా పెరగటంతో తలసరి ఆదాయం కూడా పెరుగుతుందనే అంశాన్ని ప్రైవేటు డెయిరీలు నిరూపించాయి. గతంలో సంగం డెయిరీ మాత్రమే పాలు సేకరిస్తున్న నేపథ్యంలో పాల సంఘాలు గ్రామాల్లో ఏదో ఒక వర్గం ఆధీనంలోనే ఉండేవి. దీంతో ప్రత్యర్థి వర్గాల వారు పాల దిగుబడుల పట్ల అశ్రద్ధ చూపేవారు. ఈ పరిస్థితుల్లో ప్రైవేట్ డెయిరీలు రావడంతో అన్ని వర్గాల వారికి వెసులుబాటు కలిగింది. వినుకొండ ప్రాంతం నుంచి హైమా, హేమా, తిరుమల, హెరిటైజ్, జెర్సి, మురళీకృష్ణ, విఘ్నేశ్వర, సీతారామ, మోహన్, శాయిగంగ, సంగం తదితర డెయిరీలవారు పాలను సేకరిస్తున్నారు.




వినుకొండలోని హైమా డెయిరీ పాల శీతలీకరణ కేంద్రం

ఇవికాక త్వరలో ఈ ప్రాంతంలో పాడి పరిశ్రమలోకి రిలయన్స్ సంస్థ కూడా రంగప్రవేశం చేయనుంది. ప్రైవేట్ డెయిరీల నిర్వాహకులు పాలసేకరణను పెంచుకునేందుకు పోటీపడుతూ గేదెల కొనుగోలుకు భారీగా రుణాలు ఇస్తున్నారు. అంతేకాక బ్యాంకుల ద్వారా కూడా రుణాలు అందజేసే ఏర్పాటు చేస్తున్నారు. దీంతో రైతులు పాడిగేదెల పెంపకంపై దృష్టి సారిస్తుండటంతో పాల దిగుబడులు గణనీయంగా పెరుగుతున్నాయి. తద్వారా అన్నదాతలు ఆర్థికాభివృద్ధి వైపు పయనిస్తుండటం శుభ పరిణామం. ప్రైవేట్ డెయిరీలే కాకుండా బ్యాంకర్లు కూడా నేరుగా రైతులకు గేదెల కొనుగోలుకై రుణాలిస్తున్నారు. పదిరోజుల కొకసారి పాల బిల్లులు చెల్లిస్తున్న నేపథ్యంలో ఏడాది పొడవునా పాడిరైతుల చేతుల్లోకి డబ్బులు వస్తుండటంతో కుటుంబ ఖర్చులకు వెసులుబాటు కలుగుతుంది. ముఖ్యంగా పాడిగేదెల పెంపకాన్ని మహిళలే చేపడుతుండటంతో వారి పురోభివృద్ధికి డెయిరీలు తోడ్పాటునందిస్తున్నాయి.

నియోజకవర్గ పరధిలోని పాలసేకరణ కేంద్రాల వల్ల దాదాపు 1500 మందికి ఉపాధి కలుగుతుంది. ఈ ప్రాంతంలో పాడిపరిశ్రమ వల్ల అదనపు ఆదాయం సమకూరి పేద, మధ్యతరగతి కుటుంబాలు ఆర్థికాభివృద్ధిని సాగిస్తున్నాయి. ఉన్నతవర్గాల వారు సైతం పాడిగేదెల పెంపకంపై మక్కువ చూపడం శుభపరిణామం.

# స్వాతంత్ర్య సంగ్రామంలో...

(62వ పేజీ తరువాయి...)

ఆఖిలాంధ్ర రైతు మహాసభ జరిగింది. మహాసభకు అధ్యక్షత వహించిన రామబ్రహ్మం రైతులను ఆకట్టుకునేలా ప్రసంగించారు. సత్యాగ్రహ శిబిరాలను కొంతకాలం పర్యవేక్షించారు. 1940లో రెండో ప్రపంచ యుద్ధం జరుగుతుండగా గాంధీజీ మూకుమ్మడి సత్యాగ్రహాలు వద్దని, వ్యక్తి సత్యాగ్రహాలు మాత్రమే చేయాలని సూచించారు. తెనాలి తాలూకా పెదరావూరులో వ్యక్తి సత్యాగ్రహం నిర్వహిస్తున్న శరణు రామస్వామి, రెండో ప్రపంచ యుద్ధంలో ప్రభుత్వానికి సహకరించ వద్దంటూ ఉపన్యసిస్తుండగా నిర్బంధంలోకి తీసుకున్నారు. అదే రోజున తెనాలిలో రావి సత్యనారాయణ, నన్నపనేని వెంకట్రావువ్యక్తి సత్యాగ్రహం చేయగా నిర్బంధించి తిరుచునాపల్లి జైలుకు పంపారు.

## క్విట్ ఇండియా ఉద్యమం (1942)

బ్రిటీష్ సామ్రాజ్య వాదులను తరిమేందుకు ప్రారంభించిన క్విట్ ఇండియా ఉద్యమం పిలుపునకు మంచి స్పందన లభించింది. ఉత్సాహంగా ప్రారంభమైన సత్యాగ్రహాన్ని చల్లార్చేందుకు బ్రిటీష్ ప్రభుత్వం అదే రాత్రి గాంధీజీ, అఖిల భారత కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ అగ్ర నాయకులను అరెస్ట్ చేసి అజ్ఞాత ప్రదేశానికి తరలించింది. ముంబై సమావేశంలో పాల్గొన్న కల్లూరి చంద్రమౌళి, వెలువోలు సీతారామయ్య, పుతుంబాక శ్రీరాములు, అవుతు సుబ్బారెడ్డి, శరణు రామస్వామి తెనాలి తిరిగి వచ్చారు. స్థానిక ఓల్డ్ టౌన్‌లోని వెర్రెయ్య మేడపై గల జిల్లా కాంగ్రెస్ కార్యాలయంలో ఏర్పాటు చేసిన సమావేశంలో ఎఐసిసి రూపొందించిన కార్యాచరణను వివరించారు. గాంధీజీ అరెస్టుకు నిరసనగా మరుసటిరోజు పట్టణ బంద్‌కు పిలుపునిచ్చారు. ఆ వెంటనే పోలీసులు ఈ సమావేశాన్ని చెదరగొట్టి నాయకుల్ని అరెస్టు చేశారు. పట్టణ కాంగ్రెస్ అధ్యక్ష, కార్యదర్శులుగా ఉన్న నన్నపనేని వెంకట్రావు, రావి అమ్మయ్యల నాయకత్వంలో తాలూకా హైస్కూల్ విద్యార్థులు వేలాదిమంది ప్రదర్శన నిర్వహించారు. రైల్వేస్టేషన్ సమీపంలోని ఒక హోటల్ బంద్ పాటించలేదని ఫర్నీచర్, సామాగ్రి బయటపడేశారు. రైల్వే స్టేషన్‌లో ఫ్రూట్‌స్టాల్, హోటల్‌ను కూడా మూయించారు. స్పెన్సర్ క్యాంటీన్‌లో ప్రవేశించి మద్యం సీసాలను ధ్వంసం చేశారు. ముందుగా నార్త్ క్యాబిన్ దగ్గరలోని ఆయిల్ ట్యాంక్‌కు నిప్పంటించారు. రెండు వ్యాగన్లలో గల షాహి డక్కన్ సిగరెట్ ప్యాకెట్ల దిండ్లను ఫ్లాట్‌ఫారంపై వేసి తగుల బెట్టారు. స్టేషన్‌ను కూడా దగ్ధం చేశారు. అదే సమయంలో చెన్నై నుంచి నైన్ డౌన్ పాసింజర్ రైలు వచ్చి ఫ్లాట్ ఫారంపై ఆగింది. ప్రయాణీకుల్ని దించాక నాలుగు బోగీల్లో కిరోసిన్ పోసి నిప్పంటించారు. అక్కడ నుంచి కొత్తపేటలోని సబ్ ట్రెజరీ కార్యాలయాన్ని తగులబెట్టేందుకు నిర్ణయించుకున్న ప్రదర్శకులు స్టేషన్ రోడ్డు దాటి మలుపు తిరుగుతుండగా పోలీసులు వచ్చి ప్రదర్శకులను చుట్టుముట్టారు. దీంతో ప్రజలు ద్వేషాగ్ని కట్టలు తెంచుకుంది. ప్రస్తుతం పెట్రోలు బంక్ ఉన్న చోట గల కట్టెల అడితీలోని కట్టెల్ని పోలీసులపైకి విసిరారు. మధ్యాహ్నానికి జిల్లా కలెక్టర్, ఎస్‌పి బస్సులో రిజర్వు పోలీసులతో తెనాలి చేరుకున్నారు. పోలీసులు చేసిన హెచ్చరికలను ప్రజలు ఖాతరు చేయలేదు. అధికారులు కాల్పులకు ఆదేశాలిచ్చారు. మాజేటి సుబ్బారావు, శ్రీగిరి లింగం, లక్ష్మీనారాయణ, తమ్మినేని సుబ్బారెడ్డి, గాలి రామకోటయ్య, ప్రయోగ రాఘవయ్య, జాస్తి అప్పయ్య పోలీసుల తూటాలకు బలయ్యారు. తెనాలి రైల్వేస్టేషన్ దగ్ధం చేసిన కొద్ది గంటల్లోనే దుగ్గిరాల రైల్వే స్టేషన్ కూడా తగుల బెట్టారు. దీనితో సైనికులు ప్రజలను చితగ్గొట్టారు. పలువురిని అరెస్ట్ చేసి ప్రత్యేక కోర్టులో విచారించి శిక్షలు విధించారు. ఇవి చాలవన్నట్లు తెనాలి ప్రజలపై రెండు లక్షల అపరాధ పన్ను విధించారు. అరెస్ట్ అయిన వారిలో అప్పటి మున్సిపల్ చైర్మన్ రావి సత్యనారాయణ, వారి సోదరులు రావి అమ్మయ్య ఉన్నారు. ఈ తెనాలి పోరాటం అప్పటి బ్రిటీష్ ప్రధాని విన్‌స్టన్ చర్చిల్, సింగపూర్‌లో ఉన్న నేతాజీ దృష్టికి కూడా వెళ్లింది. ఈ సంఘటనను బెర్లిన్, టోక్యో రేడియోలు ప్రసారం చేశాయి. పోలీసులతో పోరాటం జరిగిన స్థలాన్ని 'రణరంగ చౌక్'గా నామకరణం చేశారు.

1959లో మున్సిపల్ చైర్మన్ ఆలపాటి వెంకట్రామయ్య ఈ ప్రదేశంలో ఏడుగురు అమరవీరుల స్మృతికి చిహ్నంగా ఏడు స్థూపాలను నిర్మించారు. అదే సంవత్సరం డిసెంబర్ 20న అప్పటి ఎఐసిసి అధ్యక్షుడు కామరాజ్ నాడార్ ఈ స్థూపాలను ఆవిష్కరించగా, ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డి, కాసు బ్రహ్మానందరెడ్డి, దామోదరం సంజీవయ్య, వెనిగళ్ళ సత్యనారాయణ పాల్గొన్నారు.

### వైదిక ప్రచారంలో

# ఆర్య సమాజం పునీతం

(ఆన్‌లైన్ - అమృతలూరు)

వైదిక ధర్మ ప్రచారంలో ఆర్య సమాజం పునీతమవుతున్నది. అమృతలూరు మండలం కూచిపూడిలో ఉన్న ఆర్య సమాజం ఆరు దశాబ్దాలకుపైగా వేద ధర్మ ప్రచారంలో నిమగ్నమైంది. 1939లో ప్రారంభించిన ఆర్య సమాజం నేటికీ వేద ధర్మాలను ప్రచారం చేస్తూ ఉంది. కూచిపూడికి చెందిన కావూరి గోపయ్య ఉపాధ్యాయునిగా పనిచేస్తూ సంస్కృతాన్ని కూడా అధ్యయనం చేయాలనే తలంపుతో ఎదురైన ఇబ్బందులు ఆర్య సమాజం దిశగా ఆలోచింప చేశాయి. ఆనాడు సమాజంలో శూద్రుడు సంస్కృతం, వేదం అభ్యసించే అవకాశం లేకపోవడంతో పట్టుదలతో సంస్కృతాన్ని అభ్యసించారు. ఉత్తర భారతదేశం పర్యటించి పండితుల వద్ద తర్క శాస్త్రం, సంస్కృతం అవపోసన పట్టారు. స్వామి దయానంద సరస్వతి స్థాపించిన ఆర్య సమాజాన్ని అధ్యయనం చేశారు. ఆర్య సత్యాగ్రహంలో పాల్గొన్నారు. ఉత్తర భారతదేశ పర్యటన ముగించుకుని వచ్చిన ఆయన గ్రామంలో కొంత కాలం యోగి లాగా జీవితం గడపడం ప్రజలను ఆశ్చర్య పరిచింది. పండిత విద్యాసాగర్, పండిత గంగా ప్రసాద్ ప్రోద్బలంతో గ్రామంలో ఆర్య సమాజాన్ని స్థాపించారు.



కూచిపూడిలోని ఆర్య సమాజ భవనం

యువకులకు యజ్ఞోపవీత ధారణ చేసి సంధ్యా అగ్ని హోత్రాలు నేర్పారు. దయానంద సరస్వతి రచించిన సత్యార్థ ప్రకాస్‌ను పురాణంగా చెబుతూ గ్రామస్తులను, మహిళలను సమాజం దిశగా మళ్లించారు. రాష్ట్రంలో పలు చోట్ల ఆర్య సమాజాలను స్థాపించి వేద ధర్మ ప్రచారం చేశారు. సభల్లో పాల్గొని చేసిన ప్రవచనంకు గాను లభించిన పారితోషికంతో తన తల్లిదండ్రుల పేరిట గ్రంథాలయాన్ని ఏర్పాటు చేసి సమాజానికి అందుబాటులో ఉంచారు. ప్రతి ఏటా వార్షికోత్సవాన్ని నిర్వహిస్తూ వేలాది గ్రంథాలను ప్రజలకు ఉచితంగా అందజేసేవారు. వేద ధర్మాలపై ఆయన 60కి పైగా గ్రంథాలను రచించారు. ఆంధ్ర విశ్వ విద్యాలయం కళాప్రపూర్ణ బిరుదును ఇవ్వగా పలు సమాజాలు తగు రీతిన సత్కరించాయి. పండిత గోపదేవ్ శాస్త్రిగా పేరు గాంచిన ఆయన వేద ధర్మ ప్రచారానికి చేస్తున్న కృషిని పలువురు రాష్ట్ర ప్రముఖులు ప్రశంసించారు. అప్పటి రాష్ట్ర గవర్నర్ కృష్ణ కాంత్ దంపతులు కూడా కూచిపూడిలో జరిగిన వార్షికోత్సవంలో పాల్గొన్నారు.

ఎన్టీఆర్, పలువురు రాష్ట్ర ప్రముఖులు ఆర్య సమాజ వార్షికోత్సవాల్లో పాల్గొని గోపదేవ్ శాస్త్రి కృషిని కొనియాడారు. ఇహపర సుఖాలను వదలి, తన జీవితాన్ని వేద ధర్మ ప్రచారానికే అంకితం చేసి ఎందరో ప్రజలను ఆధ్యాత్మికత వైపు నడిపిన గోపదేవ్ శాస్త్రి 1996 అక్టోబరు 21న పరమ పదించారు. ఆయన లేకపోయినా ఆయన శిష్యులు ఆర్య సమాజ సిద్ధాంతాలను, ఆశయాలను కొనసాగిస్తూ ఏటా వార్షికోత్సవాలను నిర్వహిస్తున్నారు. కావూరి శత్రుంజయ, జాస్తి గిరిబాల, మాఘం కృష్ణమూర్తి తదితరులు ఆర్య సమాజాన్ని నిర్వహిస్తున్నారు.

# అభివృద్ధి చెందిన గోవాడ పురాతన శైవక్షేత్రం



గోవాడలోని బాలకోటేశ్వరస్వామి ఆలయం

(ఆన్‌లైన్ - అమృతలూరు)

అమృతలూరు మండలం గోవాడలోని పురాతన శైవ క్షేత్రం అభివృద్ధి చెందింది. దశాబ్దం క్రితం వరకు వసతుల సమస్యతో ఉన్న ఆలయం ట్రస్ట్ బోర్డు, అధికారుల సహకారంతో అభివృద్ధి దిశగా అడుగులు వేస్తోంది. జిల్లాలో ప్రసిద్ధి గాంచిన దేవాలయాల్లో ఒకటైన గోవాడలోని శ్రీబాల కోటేశ్వరస్వామి ఆలయానికి గొప్ప చరిత్ర ఉంది. మహా శివరాత్రి పర్వదినం వైభవంగా జరిగే ఆలయాల్లో ఇది ఒకటి. ఈ పుణ్య క్షేత్రానికి ఎనిమిది శతాబ్దాల చరిత్ర ఉంది. వారం రోజుల పాటు ఈ క్షేత్రంలో శివరాత్రి ఉత్సవాలు జరుగుతుంటాయి. భక్తుల కోరికలు తీర్చే ఈ స్వామిని మహా శివరాత్రి పర్వదినాన ఈ ప్రాంత భక్తులు తప్పకుండా స్వామి వారిని దర్శిస్తారు. గోవాడ గ్రామానికి సుమారు కిలో మీటర్ దూరంలో ఉన్న ఈ ఆలయం పూర్వం సోమేశ్వరస్వామి ఆలయంగా ప్రసిద్ధి పొందింది. 11వ శతాబ్దంలో చోళ రాజుల పాలనలో ఈ ఆలయ ప్రాంతం దగ్గుమిల్లి అనే గ్రామంగా పిలువబడేది. ఈ గ్రామంలో జైనులు ఎక్కువగా నివసించేవారు. 12వ శతాబ్దంలో బౌద్ధులు, వీర శైవులు మధ్య ఘర్షణలు చెలరేగి, వీర శైవులు దగ్గుమిల్లిలోని జైనులపై పడి అరాచకం సృష్టించారు. దీంతో భయపడిన జైనులు గ్రామానికి దూరంగా ఉత్తరాన పొలాల్లో పశువులను ఉంచి నివాసం ఏర్పరచుకున్నారు. క్రమంగా నివాసం అక్కడకు మారడంతో ఆ ప్రాంతం గోవాడగా మారింది. దగ్గుమిల్లిలోని ప్రజలంతా క్రమంగా వెళ్లిపోవడంతో గ్రామం శిథిలమైంది. గ్రామంతో పాటు సోమేశ్వరస్వామి ఆలయం కూడా శిథిలమైంది. ప్రముఖ కవి శ్రీనాధకవి సార్వభౌముడు దగ్గుమిల్లికి చెందిన తిప్పన్న కుమార్తెను వివాహమాడి సోమేశ్వర స్వామిని అర్చిస్తూ శృంగార నైషధం రచించాడని తెలుస్తోంది. కాలచక్ర గమనంలో 20 శతాబ్దం వచ్చింది. బ్రాహ్మణ కోడూరుకు చెందిన కూచిపూడి తిరుపతిరాయుడు బాటసారుల కోసం చెరువు తవ్వించే కార్యక్రమానికి విరాళాల సేకరణకు గోవాడ వచ్చారు. గోవాడలో విరాళాల పని చూసుకుని, ఆలయం మీదుగా కావూరు వెళ్లి విరాళాలు సేకరించి తిరిగి వస్తూ ఆలయాన్ని సందర్శించారు. భక్తి పారవశ్యంతో అక్కడ నిద్రించిన ఆయనకు ఈశ్వర ప్రభోదం కలిగి 1904లో ఆలయ నిర్మాణానికి శ్రీకారం చుట్టారు. గ్రామస్తుల సహకారంతో ఆలయ నిర్మాణం పూర్తి చేసి 1907 ఏప్రిల్ 25న ప్రతిష్ఠ చేశారు. ఆనాటి నుండి ప్రతి ఏటా గ్రామస్తులు ప్రభ కట్టుకుని వచ్చి ఉత్సవాలు నిర్వహించడం ప్రారంభించారు. గ్రామంలో రాజకీయాల కారణంగా గ్రామస్తులు ప్రభ కట్టుకుని వచ్చే ఆచారం ఆగిపోవడంతో దేవాదాయశాఖ ఆధ్వర్యంలో ఆలయం వద్ద ప్రభ ఏర్పాటు చేస్తున్నారు. మహా శివరాత్రి పర్వదినం వారం రోజులపాటు జరిగేది. సుమారు 20 ఏళ్ల పాటు పశు ప్రదర్శనలు, ఎడ్ల పందాలు వైభవంగా నిర్వహించేవారు. గత దశాబ్దకాలంలో దాతల సహకారంతో ఆలయానికి మహా ముఖ మండపం, కార్యాలయ విస్తరణ, క్యూ లైన్లు, గర్భ గుడిలో గ్రానైట్ ఏర్పాటు, ముఖ ద్వారం, అష్టకోణ నవ గ్రహాలయం, క్షేత్ర పాలకునిగా ఆంజనేయ స్వామి ఆలయం నిర్మించారు. ద్వాదశ జ్యోతిర్లింగ శిలాఫలకం, పొంగలి షెడ్డు నిర్మించారు. ఆలయ ప్రాంగణంలో నిర్మించిన ప్రాథమిక పాఠశాల భవనం, మరుగుదొడ్లు మహా శివరాత్రికి అధికారుల వసతికి ఉపయోగ పడుతున్నాయి. ఆలయ సమీపంలో ఆర్యవైశ్య, పద్మశాలీ, బ్రాహ్మణ సత్రాలు మహా శివరాత్రి యాత్రీకులకు పెద్ద ఎత్తున అన్నదానం చేస్తున్నాయి. తెనాలి, రేపల్లె, బాపట్ల, పొన్నూరు ప్రాంతాల నుండి ప్రతి ఏటా యాత్రీకులు స్వామిని సందర్శిస్తుంటారు.

### ఆలయం చేరుకునే మార్గం...

ఈ ఆలయం వద్దకు నేరుగా చేరుకునేందుకు బస్సు సదుపాయం లేదు. తెనాలి - చెరుకుపల్లి మార్గంలోని గోవాడ గ్రామంలో దిగి సుమారు ఒక కిలో మీటర్ నడిచి వెళ్లాలి. చెరుకుపల్లి - పొన్నూరు మార్గంలో ప్రయాణిస్తే ఈ ఆలయంకు అత్యంత సమీపంలో దిగవచ్చు. ఆలయం ప్రతి రోజూ ఉదయం, సాయంత్రం భక్తుల దర్శినార్థం తెరిచే ఉంచుతారు. ఈ ఆలయానికి ఈశాన్యంగా అరుదైన అష్టకోణ నవగ్రహాలయాన్ని 1986లో నిర్మించారు. భార్య, వాహన, ఆయుధ, పీఠ సమేత నవగ్రహాలు విదిక్కులలో ప్రతిష్ఠించడం ఈ ఆలయం విశిష్టత.


'ఆంధ్రజ్యోతి'కి పంచమ వార్షికోత్సవ శుభాకాంక్షలు
ఆంధ్రజ్యోతి 5
అక్షరాన్ని ఆయుధంగా మలచి
ప్రజల మన్ననలతో ఇంతింతై...
పంచమ వార్షికోత్సవంలోకి
అడుగిడిన ఆంధ్రుల ప్రియ పత్రిక
'ఆంధ్రజ్యోతి'కి హృదయపూర్వక
శుభాకాంక్షలు.
శాఖమూరి నారాయణ ప్రసాద్ (చిన్న)
జిల్లా పరిషత్ మెంబర్స్ అసోసియేషన్ అధ్యక్షులు
శ్రీ పిన్నెల్లి రామకృష్ణారెడ్డి గారు
జిల్లా ప్రణాళిక
సంఘ సభ్యులు, మాచర్ల
శ్రీ భూషణం చెన్నయ్య
Z.P.T.C. దాచేపల్లి
శ్రీ శీలం రవి
Z.P.T.C. కాకుమాను
శ్రీ మేడికొండ సుధాకర చంద్రహాసరావు
Z.P.T.C. రేపల్లె
శ్రీ మందాడి వెంకటపున్నారావు
Z.P.T.C. సత్తెనపల్లి

# శతాబ్ది ఉత్సవాల దిశగా

# తెనాలి మున్సిపాలిటీ

(ఆన్‌లైన్ - తెనాలి)

రాజకీయ, వాణిజ్య, వ్యవసాయ రంగాలలోనే కాక సంగీత, నాటక, వైజ్ఞానిక, శాస్త్ర సాంకేతిక, సినీ, కళా, సాహితీ, సాంస్కృతిక రంగాల్లో పేరెన్నిక గన్న తెనాలి పట్టణం ఆంధ్రాప్యారిస్‌గా రాష్ట్రంలోనే ఒక ప్రత్యేకత సంతరించుకుంది. వివిధ రంగాల్లో ఎందరో ఉద్దండుల్ని తీర్చిదిద్దింది. స్వాతంత్రోద్యమంలో కీలకపాత్ర వహించింది. వివిధ రంగాల్లో నేటికీ తెనాలి తన సంప్రదాయాన్ని, ప్రత్యేకతను, విలక్షణ సంస్కృతిని నిలబెట్టుకుంటూనే ఉంది. ప్రస్తుతం జిల్లాలో అతి పెద్ద మున్సిపాలిటీగా ఉన్న తెనాలి ఒకనాడు మైనర్ పంచాయతీగా ఉండి, ఆ తర్వాత మేజర్ పంచాయతీ స్థాయికి ఎదిగి 1909లో మున్సిపాలిటీగా మారింది. 1965 నుంచి స్పెషల్ గ్రేడ్ మున్సిపాలిటీ స్థాయి వచ్చింది.

ఈ మున్సిపాలిటీకి తొలి చైర్మన్‌గా డిప్యూటీ కలెక్టర్ పి.నాగేశ్వరరావు పంతులు 1910 నుండి 1912 వరకు పని చేశారు. ఆ తర్వాత పి.కామరాజు పంతులు (1912), సి.భక్తవత్సలం నాయర్ (1913-16) నియమితులు కాగా, ఆ తర్వాత సివి.సుబ్రహ్మణ్య శాస్త్రి చైర్మన్‌గా ఎన్నికయ్యారు. (1920-21) పిల్లలమర్రి ఆంజనేయులు పంతులు (1921 నుంచి 1925 వరకు) సాహితీవేత్త సంస్కర్త త్రిపురనేని రామస్వామి 1934లో ఎన్నికై 1938 వరకు చైర్మన్‌గా పని చేశారు. స్వాతంత్ర్య యోధుడు రావి సత్యనారాయణ 1938లో ఎన్నికై 1943 వరకు, మళ్ళీ 1948లో ఎన్నికై 1949 వరకు పని చేయగా, 1943 నుంచి 1944 వరకు షేక్ అబ్దుల్ వహాబ్ సాహెబ్, 1944 నుండి 1945 వరకు కన్నెగంటి వీరయ్య, 1946 నుండి 1947 వరకు న్యాయవాది వేదాంతం లక్ష్మీనారాయణ చైర్మన్‌గా వ్యవహరించారు.



ఆలపాటి వెంకట్రామయ్య హయాంలో నిర్మితమైన మున్సిపల్ కార్యాలయ భవనం

స్వాతంత్ర్యం తర్వాత 1949 నుంచి 1952 వరకు, 1952 నుంచి 1955 వరకు, తిరిగి 1956 నుంచి 1958 వరకు సామ్యవాది నన్నపనేని వెంకట్రావు మూడు పర్యాయాలు చైర్మన్‌గా ఎన్నికయ్యారు. హేతువాది, హ్యూమనిస్టు ఉద్యమ ప్రముఖుడు, న్యాయవాది ఆవుల గోపాలకృష్ణమూర్తి 1955 నుంచి 1956 వరకు చైర్మన్‌గా ఉన్నారు. ఇక, ఆలపాటి వెంకట్రామయ్య 1959లో చైర్మన్‌గా ఎన్నికై, 1962లో మున్సిపాలిటీ శాఖ మంత్రిగా నియమితులు కావడంతో ఈ పదవికి రాజీనామా చేశారు. ఆ మీదట తవ్వా శ్రీరాములు 1962 నుంచి 1964 వరకు చైర్మన్‌గా పని చేశారు. 1967 నుంచి 1972 వరకు బండ్ల పుల్లయ్య, 1981 నుంచి 1982 వరకు అన్నాబత్తుని సత్యనారాయణ, 1982 నుంచి 1986 వరకు, తిరిగి 1987 నుంచి 1992 వరకు డాక్టర్ రావి రవీంద్రనాథ్, 1995 నుంచి 2000 వరకు ఆలమూరి విజయలక్ష్మి కుమారి ఈ పదవిని అధిష్టించారు. 2000 నుంచి 2005 మార్చి వరకు యడ్ల గంగాధరరావు కొనసాగారు. ప్రస్తుతం డాక్టర్ తాడిబోయిన మస్తానమ్మ చైర్‌పర్సన్‌గా ఉన్నారు. గతంలో ఆలపాటి వెంకట్రామయ్య, నన్నపనేని వెంకట్రావు, అన్నాబత్తుని సత్యనారాయణల హయాంలో పట్టణంలో గణనీయమైన అభివృద్ధి జరిగిందనే చెప్పాలి. ఆలపాటి హయాంలో ఓవర్‌బ్రిడ్జి నిర్మాణం, మున్సిపల్ కార్యాలయ భవనానికి నిధులు మంజూరు, భూగర్భ మురుగు పారుదల పథకానికి ఆమోదం, అదే విధంగా రక్షిత మంచినీటి పథకానికి నిధుల విడుదల, 1942 క్విట్ ఇండియా ఉద్యమ అమర వీరుల స్థూపాల నిర్మాణం, జెఎంజె మహిళా కళాశాల, ప్రభుత్వ ఐటిఐ ఏర్పాటు జరిగాయి.

నన్నపనేని వెంకట్రావు హయాంలో పటిష్టమైన సిమెంట్ రోడ్ల నిర్మాణం జరిగింది. పేదల పూరిళ్లపై పన్నును నన్నపనేని రద్దు చేశారు. సైకిళ్లు, ఎడ్లబండ్లపై పన్ను రద్దు పర్చారు. పట్టణ మాస్టర్ ప్లాన్ ఆయన రూపొందించారు. అన్నాబత్తుని సత్యనారాయణ హయాంలో ప్రధాన వీధుల్లో ఆక్రమణల్ని సాహసోపేతంగా తొలగించి వీధుల్ని విశాలపర్చారు. నిర్మాణం పనుల్లో నిర్దుష్టమైన నాణ్యత ఉండేలా చూశారు. ఆయన హయాంలో పురవేదిక, పండ్ల మార్కెట్ ఏర్పాటయ్యాయి. త్రిపురనేని రామస్వామి హయాంలో గాంధీ మున్సిపల్ కూరగాయల మార్కెట్ ఏర్పాటైంది. జాతరలు, జంతు బలుల నిషేధం అమలైంది.

డాక్టర్ రావి రవీంద్రనాధ్ హయాంలో మురుగు దొడ్లు, రోడ్ల నిర్మాణం, మురికి వాడల్లో అభివృద్ధి పనులు చేశారు. యడ్ల గంగాధరరావు హయాంలో మున్సిపల్ ఆదాయాన్ని పెంచే షాపింగ్ కాంప్లెక్సుల నిర్మాణం, మురికి వాడల అభివృద్ధి, ఎపియుఎస్‌పి నిధులు, పట్టణంలో 90 శాతం సిమెంట్ రోడ్ల నిర్మాణం జరిగింది. ఇలా తెనాలి చైర్మన్లుగా పని చేసిన వారంతా వారి హయాంలో పట్టణాభివృద్ధికి ఎంతో కృషి చేశారు, చేస్తున్నారు.

# కర్లపాలెం మండల ముఖచిత్రం

(ఆన్‌లైన్-కర్లపాలెం)

సముద్రతీర ప్రాంతమైన మండల కేంద్రమైన కర్లపాలెంలో 20 గ్రామ పంచాయతీలు ఉన్నాయి. అందులో మూడు మేజర్ పంచాయతీలు కాగా 17 మైనరు పంచాయతీలు. ఒక్కొక్క పంచాయతీకి ఒక ఘన చరిత్ర ఉంది. వాణిజ్య పంటల ఎగుమతుల్లో ప్రధానమైనది రొయ్యల సాగు. సముద్రపుటంచున ఉన్న గాడిదిబ్బ,పేరలి, తుమ్మలపల్లి, పెదపులుగువారిపాలెం, నర్రావారిపాలెం, గణపవరంలతో పాటు బుద్దాం, కర్లపాలెం గ్రామాల్లో రొయ్యల సాగు చేస్తున్నారు. 17 వేల ఎకరాల్లో వరి మినుము పండిస్తున్నారు. బుంగపోత కార్మికులు మెరక భూముల్లో వేరుశనగ పంట పండించడం ఇక్కడి విశేషం. అలాగే కూర మిరప, కాయకూరల తోటలు,పూలతోటలను బుంగపోతపై పండిస్తారు. బాపట్ల నియోజకవర్గ రాజకీయాల్లో కర్లపాలెం నుంచి కొందరు క్రియాశీలక పాత్ర పోషించడం జరుగుతోంది. 1990వ సంవత్సరంలో కర్లపాలెం మండలం ఏట్రవారిపాలెం గ్రామానికి చెందిన చీరాల గోవర్ధనరెడ్డి బాపట్ల శాసనసభ్యులుగా ఎన్నికయ్యారు. అలాగే బుద్దాం గ్రామానికి చెందిన పెనుమెత్స అచ్యుతరామరాజు, గణపవరం గ్రామస్థుడు గూడూరి రాజేంద్రప్రసాద్‌లు బాపట్ల వ్యవసాయ మార్కెటింగ్ యార్డు చైర్మన్‌లుగా పనిచేశారు. నియోజకవర్గ రాజకీయాల్లో కర్లపాలెం మండలంకు ప్రత్యేకత ఉందని పలువురు రాజకీయ మేధావులు వ్యాఖ్యానిస్తారు. మండల కేంద్రంలోని ఐలాండ్ సెంటర్‌లో జాతిపిత మహాత్మాగాంధీ,అమరజీవి పొట్టి శ్రీరాములు, భారత రాజ్యాంగ నిర్మాత డాక్టర్ బిఆర్ అంబేద్కర్, మాజీ ముఖ్యమంత్రులు స్వర్గీయ నందమూరి తారక రామారావు, కాసు బ్రహ్మానందరెడ్డిల విగ్రహాలను పోటీ పడి మరీ ఏర్పాటు చేశారు. గతంలో ఇక్కడ అయిదు ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘాలుండేవి. ప్రస్తుతం అవి గణపవరం, పేరలి, యాజలి, చింతాయపాలెం, నల్లమోతువారిపాలెం మొత్తం కలిసి చింతాయపాలెం సొసైటీగా ఏర్పాటు చేశారు. బుద్దాం సహకార సంఘం అలాగే ఉంచారు. దీంతో ఇక్కడ రెండు సహకార సంఘాలు పనిచేస్తున్నాయి. చైతన్య గోదావరి గ్రామీణ బ్యాంకు, యూనియన్ బ్యాంకులు ప్రజలకు, రైతులకు, డ్వాక్రా మహిళలకు సేవలందిస్తున్నాయి. ప్రాథమిక ఆరోగ్యకేంద్రం, మండల ప్రజాపరిషత్ కార్యాలయం, తహసిల్దార్ కార్యాలయం, పోలీసుస్టేషన్, పశువైద్యశాలకు ప్రభుత్వ భవనాలున్నాయి.

ఏట్రవారిపాలెం గ్రామంలో వేంచేసియున్న శ్రీ మద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి తిరునాళ్ళ వేడుకను ఇక్కడ ఘనంగా నిర్వహిస్తారు. కర్లపాలెంలోని గ్రామదేవత పెద్దింటమ్మ గుడివద్ద ప్రతి ఆదివారం భక్తులు అత్యధిక సంఖ్యలో మొక్కులు తీర్చుకుంటారు. విద్యుత్ లోఓల్టేజ్ సమస్యను పరిష్కరించేందుకు బుద్దాం గ్రామంలో విద్యుత్ సబ్‌స్టేషన్‌ను నిర్మించారు.

### మండల ఫోన్ నెంబర్లు

| | |
|---|---|
| మండల పరిషత్ కార్యాలయం | 272261 |
| తహసిల్దార్ కార్యాలయం | 272271 |
| పోలీసుస్టేషన్ | 272233 |
| విద్యుత్ సబ్‌స్టేషన్ | 272277 |
| వ్యవసాయాధికారి | 9985486061 |
| ప్రాథమిక ఆరోగ్య కేంద్రం | 9985957957 |



శ్రీ పాదర్తి వెంకన్న గారు 1896 సం॥లో శ్రీ పాదర్తి వెంకన్న గారి ధర్మ సత్రము నిర్మించినారు. ఈ సత్రములో నివాసముండు బాట సారులకు మరియు భక్తులకు ఆధ్యాత్మికతను అలవరచుటకు దైవప్రార్థనలు చేసుకొను నిమిత్తము సత్రము ఎదురుగా "శ్రీ ఆంజనేయ స్వామి" వారి ఆలయ నిర్మాణము. రైలుపేట, గుంటూరులో శ్రీ పాదర్తి వెంకన్న గారు గావించినారు.

ప్రతినిత్యము శ్రీ స్వామి వారికి "పాంచారాత్ర" ఆగమము ప్రకారము పూజా కార్యక్రమములు జరుపబడుచున్నవి.

శ్రీ స్వామి వారి ఆలయముచుట్టూ 108 ప్రదక్షణములు 7 మంగళవారములు చేసినచో కోరిన కోర్కెలు నెరవేరును.

శ్రీ స్వామి వారి ఆలయములో శ్రీ కోదండరామస్వామి, లక్ష్మణస్వామి, సీతమ్మ వార్ల ఉప ఆలయము కలదు.

స్వామి వారి ఆలయమున జరుపు ముఖ్య పండుగలు.
1) ఉగాది 2) హనుమజయంతి 3) కృష్ణాష్టమి 4) దసరా 5) దీపావళి 6) సంక్రాంతి. 7) శ్రీరామ నవమి.

జి. విజయలక్ష్మి
బి.ఎ.
మేనేజరు

'ఆంధ్రజ్యోతి' కి
## పంచమ వార్షికోత్సవ శుభాకాంక్షలు

వినూత్న వార్తలతో సంచలనాలు సృష్టిస్తూ
అనతికాలంలోనే అగ్రశ్రేణి దినపత్రికగా
వెలుగొందుతున్న 'ఆంధ్రజ్యోతి' కి
పంచమ వార్షికోత్సవ శుభాకాంక్షలు...



**వణుకూరి శ్రీనివాసరెడ్డి**
పాత మర్లాయపాలెం వ్యవసాయ పరపతి సహకార సంఘం, అధ్యక్షులు

## ఖాదీ గ్రామీణ పరిశ్రమలను ప్రోత్సహిస్తున్న రాష్ట్ర ప్రభుత్వం



డా॥వై.యస్.రాజశేఖరరెడ్డి గారు, ముఖ్యమంత్రివర్యులు · శ్రీ కన్నా లక్ష్మీనారాయణ, రవాణా శాఖామాత్యులు · శ్రీ ముదుగుడు హనుమంతరావు, సర్వశిక్షా అభియాన్ మంత్రివర్యులు · శ్రీ మోపిదేవి వెంకట రమణ, పౌరిక సరుసాయాల శాఖామాత్యులు · శ్రీ కాసు వెంకట కృష్ణారెడ్డి, ఐటిశా, పౌరసరఫరాల శాఖామాత్యులు · శ్రీమతి వేదురుపల్లి రాజ్యలక్ష్మి, జిల్లా ఇన్‌ఛార్జి మంత్రివర్యులు · శ్రీ మహమ్మద్ అలీ రఫత్, కలెక్టర్ · శ్రీమతి కూచిపూడి విజయ, జడ్.పి.చైర్మన్ · శ్రీ గొల్లపల్లి సూర్యారావు, ఖాదీ గ్రామీణ పరిశ్రమల శాఖామంత్రి

**రాష్ట్ర ప్రభుత్వం ఖాదీ గ్రామీణ పరిశ్రమలను ప్రోత్సహించడానికి అనేక రాయితీలను కల్పిస్తోంది**

**ప్రభుత్వం ఇస్తున్న రాయితీలు :**

➤ గ్రామీణ ప్రాంతములోని నిరుద్యోగ యువతీ, యువకులకు ఉపాధికల్పన నిమిత్తము కుటీర పరిశ్రమలను ప్రోత్సహించుచూ 25 నుండి 30 శాతము వరకు మధ్యంతర సబ్సిడిని ఏర్పాటు చేయుచున్నారు. ➤ గాంధీ సిద్ధాంతమునకు వ్యతిరేకమయిన (1) పొగాకు (2)మద్యము (3) మాంసము సంబంధిత పరిశ్రమలకు ఈ పథకము వర్తించదు. ➤ కలుషితమైన ఎరువులు, పురుగుమందులు వాడకము తగ్గించి చౌవుడు బారిన భూములు సారవంతము చేసి మంచి పోషకములతో దిగుబడులు పెంచు ఉద్దేశ్యముతో రైతులు ఈక్రింది పరిశ్రమలను స్థాపించుటకు ప్రోత్సహిస్తున్నాం. ➤ వర్మికంపోస్ట్ (Bio Fertilisers), ➤ వేపపిండి & వేపనూనె (Bio Pesticides), ➤ తేనెటీగల పరిశ్రమ



తేనే పరిశ్రమ




➤ఏదైన పరిశ్రమ గాని/వ్యాపారము గాని, వ్యవసాయమునకు సంబంధించిన పంటలు, టీ.,కాఫీ, రబ్బరు చెట్ల పెంపకము, పూలతోట పెంపకము, చేపల పెంపకము, పందుల పెంపకము, కోళ్ళ పెంపకము మరియు పశువుల పెంపకము (గేదెలు, ఆవులు, గొర్రెలు మొదలగునవి) ఈ పథకము వర్తించదు.

➤పర్యావరణ కాలుష్యమును కలిగించు పథకములు : పాలిథిన్ సంచులు (20 మైక్రాన్లకు తక్కువగా వున్నవి) మరియు ఏదైనా వస్తువుల ఉత్పత్తుల వలన పర్యావరణ కాలుష్యము కలుగునో ఆ పరిశ్రమలు ఖాదీ గ్రామీణ పరిశ్రమల క్రిందకు రావు. రవాణా వాహనాలు.



శ్రీ రంగస్వామి
డిప్యూటీ డైరెక్టర్
ఆంధ్రప్రదేశ్ ఖాదీ గ్రామీణ పరిశ్రమల మండలి
గుంటూరు జిల్లా

*Space Donated By :*

| | | | |
|---|---|---|---|
| **సబ్బుల తయారీ**<br>ప్రొ. శ్రీ బచ్చు రమేష్, S/o నాగేశ్వరరావు<br>గంగానమ్మ పేట, తెనాలి టౌన్, గుంటూరు | **ఇటుక తయారి**<br>శ్రీమతి కల్లెం రాణి, W/o శ్రీనివాసరావు<br>కొల్లూరు (V&M), గుంటూరు | **ఇటుక తయారి**<br>శ్రీమతి క్రోసూరి అరుణశ్రీ W/o అప్పయ్య<br>కొల్లూరు (V&M), గుంటూరు | **ఇటుక తయారి**<br>శ్రీమతి కమ్మెల నాంచారమ్మ W/o సాంబశివరావు<br>కొల్లూరు (V&M), గుంటూరు |
| **వర్మికంపోస్టు తయారి**<br>శ్రీమతి కూచిపూడి వాణి, W/o రత్నరాజు<br>అంకిరెడ్డిపాలెం (గ్రా), గుంటూరు రూరల్ (మం) | **వర్మికంపోస్టు తయారి**<br>శ్రీమతి పెరికల భాస్కరరావు, S/o కోటయ్య<br>కొల్లూరు (గ్రా & మం) | **వర్మికంపోస్టు తయారి**<br>శ్రీమతి ఎర్రా సరస్వతి, W/o అక్కేశ్వరరావు<br>చదలవాడ (గ్రా), వేమూరు (మం) | **వర్మిసెల్లి తయారి**<br>శ్రీమతి కె.వెంకటరత్నం, W/o శ్రీనివాసరావు<br>జొన్నలగడ్డ (గ్రా), నరసరావుపేట (మం), గుంటూరు జిల్లా |

# సహకారోద్యమానికి తలమానికం తెనాలి



తెనాలిలోని జిల్లా కేంద్ర సహకార బ్యాంకు ప్రధాన కార్యాలయం

(ఆన్‌లైన్ - తెనాలి)

రైతు దేశానికి అన్నదాత మాత్రమే కాదు. దేశ ఆర్థిక వ్యవస్థలో కీలకమైన వ్యక్తి. మన దేశ ఆర్థిక వ్యవస్థకు వెన్నుదన్నుగా నిలుస్తున్న రైతాంగం తరతరాలుగా రుణ భారంతో కృంగిపోవడాన్ని అరికట్టి తద్వారా సర్వతోముఖ గ్రామీణ వికాసానికి బాట వేయాలని మేధావులలోను, ప్రభుత్వంలోను గత శతాబ్ద కాలంలో కలిగిన ఆలోచన ఫలితమే సహకారోద్యమ ఆవిర్భావం. పెట్టుబడుల కోసం దేవిరించాల్సిన దుస్థితిలో రైతాంగం ప్రప్రథమంగా 1904లో తీసుకువచ్చిన అఖిల భారత సహకార చట్టం సహకారోద్యమానికి చేయూతనిచ్చి ముందుకు నడిపించింది. నిస్వార్థపరులైన నాయకులు, గ్రామీణ యువకులు చట్టం ఇచ్చిన చేయూతతో ఉద్యమంలోకి ఉరికి పలు సహకార పరపతి సంఘాలను స్థాపించారు. మన జిల్లాలో ప్రథమంగా 1906 అక్టోబరు 21వ తేదీన సూరేపల్లిలో సహకార పరపతి సంఘాల రిజిస్టరైంది. జిల్లా వ్యాప్తంగా పనిచేయడం ప్రారంభించాయి. తెనాలి డివిజన్‌లో తొలిసారిగా స్వర్గీయ కొమ్మూరు కాశీ విశ్వనాథం 1906 జనవరి 15న తెనాలి అర్బన్ బ్యాంక్‌ను స్థాపించి సహకారోద్యమానికి శ్రీకారం చుట్టారు. 1904లో సహకార చట్టం అమలులోకి వచ్చిన వెంటనే తొలి సహకార రిజిస్ట్రార్ ఆర్.రామచంద్రరావు తెనాలి డివిజన్ అంతటా విస్తృతంగా పర్యటించి గ్రామాలలోని రైతులను, ఉత్సాహవంతులను ప్రోత్సహించి సహకార సంఘాల స్థాపనకు వారిని కార్యోన్ముఖులను చేయడంతో గ్రామాలలో సంఘాలు ఆవిర్భవించాయి. పరస్పర సహకారమే శ్రేయోదాయకం అన్న మూల సూత్రంపైన సహకార సంఘ పునాదులు ఏర్పడ్డాయి. ఆర్థిక సమానత్వం, వ్యాపార వ్యవహారాలలో పోటీ నివారణ, వ్యక్తి సంఘానికి - సంఘం అందరికీ అనే పవిత్ర ఆశయాలతో సహకార నిర్మాణం ఆరంభమైంది. ప్రజా బాహుళ్యం నుంచి డిపాజిట్ల రూపేణా సేకరించిన నిధులతో సహకార సంఘాలకు ఆర్థిక వనరులు సమకూర్చి సహకారోద్యమాన్ని పటిష్టవంతం చేయాలనే ధ్యేయంతో ఆనాటి అవిభక్త మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం జిల్లా సహకార బ్యాంకుల స్థాపనకు నడుం బిగించింది. అందులో భాగంగా ఆంధ్రప్రదేశ్‌లో మొట్టమొదటి సారిగా గుంటూరు జిల్లా కేంద్ర సహకార బ్యాంకు వెలసింది. గుంటూరు జిల్లాలో అన్ని రంగాలలో ముందంజ వేసిన తెనాలి పట్టణంలో కఠెవరానికి చెందిన గోళ్లమూడి సూర్యనారాయణ ఛీఫ్ ప్రమోటర్‌గా 1904 భారత సహకార చట్టం కింద 1910 నవంబరు 28న ఈ బ్యాంక్ తెనాలి డిస్ట్రిక్టు అర్బన్ బ్యాంక్‌గా రిజిస్టరై, ఆ మరుసటి సంవత్సరం మార్చి 17 నుంచి పని చేయనారంభించింది. అదే రోజున తెనాలి తాలూకా నుంచి 77 మంది, రేపల్లె తాలూకా నుంచి 50 మంది, మరో 16 మంది ప్రభుత్వోద్యోగులతో తొలి మహాసభ జరిగింది. ఈ పెద్దల పెట్టుబడి ధనమే బ్యాంకుకు మూల ధనమైంది. అప్పుడే జంపాల వెంకట సుబ్బారాయుడు అధ్యక్షునిగా మొదటి పాలక వర్గం ఎన్నికైంది. బ్యాంక్ పనిచేయడం ప్రారంభించిన తర్వాత 1911 మే ఏడవ తేదీన వెంబాకం దేశికాచారి 20 వేల రూపాయలు డిపాజిట్ చేశారు. 1916లో బ్యాంకు పేరు గుంటూరు జిల్లా కో-ఆపరేటివ్ బ్యాంకింగ్ యూనియన్ లిమిటెడ్ గాను, 1928లో గుంటూరు జిల్లా కో-ఆపరేటివ్ బ్యాంక్ గాను, 1933లో గుంటూరు జిల్లా కేంద్ర సహకార బ్యాంక్‌గా మారి ప్రస్తుతం అదే పేరుతో కొనసాగుతోంది. జంపాల వెంకట సుబ్బారాయుడు అధ్యక్షునిగా ఉన్న పాలక వర్గం 1911 నుంచి మూడేళ్ల పాటు పని చేసింది. బ్యాంకు స్థాపన జరిగిన తర్వాత సహకార వ్యవస్థ పుంజుకుని అప్పటి వరకు గ్రామాలలో పని చేస్తున్న సహకార సంఘాలు బ్యాంకు సభ్యత్వాన్ని పొంది ఆర్థిక సహాయం అందుకోవడం ప్రారంభించాయి. వెంకట సుబ్బారాయుడు తర్వాత 1914 - 18 కాలంలో గోళ్ళమూడి సూర్యనారాయణ బ్యాంకు పాలక వర్గ అధ్యక్షునిగా వ్యవహరించారు. ఆ తర్వాత యల్లంరాజు వెంకట సుబ్బారావు, లక్కరాజు సంగమేశ్వరరావు, లక్కరాజు రామకృష్ణయ్య పంతులు, కొండముది శ్రీరాములు పంతులు, గాదె సింహాచలం పంతులు, కొప్పువరపు వెంకట్రావు;డాక్టర్ కాకుమాను వుళ్ళక్కి, జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరి, గాదె నరసింహం పంతులు, మంగళగిరి పరవస్తుదాసు, దాసరి శ్రీమన్నారాయణ చౌదరి, ఆలపాటి వెంకట్రామయ్య, కన్నెగంటి రెడ్డెమ్మ,

(మిగతా 71వ పేజీలో...)

# సహకారోద్యమానికి...

( 70వ పేజీ తరువాయి...)

కాను వెంగళరెడ్డి, పుతుంబాక శ్రీరాములు, వెనిగళ్ళ సత్యనారాయణ, మాతలపాటి హనుమంతరావు, మారౌతు సీతారామయ్య, గుంటుపల్లి వెంకట అప్పారావు, మానం వెంకటేశ్వర్లు జిల్లా కేంద్ర సహకార బ్యాంకు అధ్యక్షులుగా పని చేశారు. ప్రస్తుతం కుర్రి పున్నారెడ్డి అధ్యక్షులుగా పని చేస్తున్నారు.

రాష్ట్రంలోని ఉన్నతమైన సహకార బ్యాంకులలో ఒకటిగా ఈ బ్యాంకును తీర్చిదిద్దిన మహనీయులలో స్వర్గీయ ఆలపాటి వెంకట్రామయ్య, కాను వెంగళరెడ్డి, వెనిగళ్ళ సత్యనారాయణలను ప్రముఖులుగా చెప్పవచ్చు. ఆలపాటి వెంకట్రామయ్య 1950 నుంచి 62 వరకు బ్యాంకు అధ్యక్షునిగా వ్యవహరించి బ్యాంకు కార్యకలాపాలను విస్తరింపచేశారు. బ్యాంకు చరిత్రలోనే ఆలపాటి పాలనాకాలం సువర్ణాక్షరాలతో లిఖించదగినది. ఆయన యాజమాన్యంలో బ్యాంకు స్వరతోముఖాభివృద్ధి చెందడమే కాక సహకారోద్యమానికి ఒక విశిష్ట స్థానం సమకూర్చింది. డిపాజిట్ల సేకరణ, ఇతరత్రా గానీ ఆలపాటి హయాంలో బ్యాంకు గణనీయమైన అభివృద్ధి సాధించింది. 1950లో ఆయన పదవి చేపట్టే సమయానికి మూడు లక్షల షేరు ధనం పదేళ్లకు 18 లక్షల 50 వేలకు పెరిగింది. బ్యాంకు వ్యాపారం 59 లక్షల నుంచి కోటి 86 లక్షల రూపాయలకు చేరుకుంది. తక్కువ ఆదాయం గల వర్గాలకు గృహ వసతి కల్పించాలన్న సంకల్పంతో శ్రీవెంకటేశ్వర కో-ఆపరేటివ్ హౌస్ బిల్డింగ్ సొసైటీ స్థాపనకు ప్రోత్సాహాన్నిచ్చారు. అయితే వెంకట్రామయ్య మరణానంతరం ఈ సంస్థలు మూలనపడ్డాయి. అది నుంచి చేస్తూ బ్యాంకు అధ్యక్షునిగా పని చేసిన వారు అత్యధికులు తెనాలి డివిజన్‌కు చెందిన వారే ఉండటం విశేషం. విస్తృతమైన మాగాణి భూములు కలిగి ఉన్న కారణంగా ఈ ప్రాంతంలో రైతుల అవసరాలను తీర్చేందుకు సహకార వ్యవస్థ బాగా వేళ్ళూనుకుంది.

తెనాలి ప్రాంతంలో సహకార ఉద్యమ వ్యాప్తికి ఆచార్య రంగా, కల్లూరి చంద్రమౌళి, మంతెన వెంకట్రాజు, నన్నపనేని వెంకట్రావు, పుతుంబాక శ్రీరాములు, వెలువోలు సీతారామయ్య, వెనిగళ్ళ సత్యనారాయణ, దాసరి వెంకట సుబ్బారావు, చింతమనేని శివరామయ్య చౌదరి, గట్టినేని కోటయ్య చౌదరి విశిష్ట సేవలందించారు.

తెనాలి అర్బన్ బ్యాంక్, విశ్వనాథ్ కో-ఆపరేటివ్ బిల్డింగ్ సొసైటీల అభివృద్ధికి నిర్విరామ కృషి చేశారు. జంపని సహకార చక్కెర కర్మాగారానికి షేరు ధనం వసూలు చేసి కర్మాగారం స్థాపనకు శ్రీకారం చుట్టారు.

# భక్తుల పాలిట పెన్నిధి వైకుంఠవాసుని సన్నిధి



శ్రీ లక్ష్మీ పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వర స్వామి

(ఆన్‌లైన్ - తెనాలి)

కళలకు కాణాచిగా, ధర్మ దాతృత్వాలకు పెన్నిధిగా, ఆంధ్రా ప్యారిస్‌గా ఖ్యాతినార్జించిన తెనాలి పట్టణంలో అంతర్భాగమై, రేపల్లె రైల్వే బ్రిడ్జి సమీపంలోని వైకుంఠపురంలో నిర్మితమైన శ్రీలక్ష్మీపద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వర స్వామి దేవస్థానం దేశంలోని దివ్య క్షేత్రాలలో ఒకటిగా ప్రసిద్ధికెక్కింది. శాంతికి, ప్రశాంతికి నిలయమైన వాతావరణంలో నిర్మించబడిన ఈ దేవాలయం కమనీయంగాను, కన్నుల పండువగాను, కామితార్థదాయకంగాను విలసిల్లుతోంది. నిత్య కళ్యాణం పచ్చతోరణంగా విలసిల్లే శ్రీ వేంకటేశ్వరుడు భక్తాభీష్ట వరదుడై లక్ష్మీపద్మావతీ సమేతంగా పరమ ప్రసన్న శోభలు చిందిస్తూ బహుముఖ వైభవోపేతుడై విరాజిల్లుతున్నాడు. రాష్ట్రంలోని వేలాది భక్తులకు ఈ క్షేత్రం పవిత్ర యాత్రా స్థలమై వేనోళ్ళ కొనియాడబడుతున్నది. అపర తిరుపతిగా పిలువబడే వైకుంఠపురం దేవస్థానంలో స్వస్తిశ్రీ పరీధావీ నామ సంవత్సరం నిజ వైశాఖ బహుళ పంచమి శుక్రవారం స్వామి వారి విగ్రహ ప్రతిష్ట జరిగింది. అంతకు ముందు ఈ క్షేత్రానికి సంబంధించిన ప్రాశస్త్యం ఇలా ఉంది.

దేవస్థానం సంస్థాపకులైన తుళ్ళూరు బాల నరసింహారావు గౌడ్‌కు శ్రీవేంకటేశ్వర స్వామి నాగేంద్రుని రూపంలో స్వప్నంలో సాక్షాత్కరించి వైకుంఠపురస్థలం పరమ పవిత్రమైనదని, ఇక్కడ తనకో దేవాలయాన్ని నిర్మించవలసిందిగా ఆజ్ఞాపించి అంతర్ధానమయ్యారు. ఈ స్వప్న ఫలితంగా బాల నరసింహారావు గౌడ్ సంఘ సేవ పరాయణులతో కలిసి దేవాలయ నిర్మాణానికి సంకల్పించారు. లక్ష్మీ పద్మావతీ సమేతంగా స్వామి వారి విగ్రహాలను తయారు చేయించి ఒక శుభ ముహూర్తాన ప్రతిష్ఠించారు. అప్పటి నుంచి ఈ క్షేత్ర మహత్యం దిన దిన ప్రవర్ధమానమై లక్షలాది మంది భక్తులు ఇక్కడకు వచ్చి స్వామి వారిని దర్శించి తరిస్తున్నారు.

దేవస్థాన వ్యవసాపకులు బాల నరసింహారావు గౌడ్ స్వామి వారిని సందర్శించడానికి వచ్చే భక్తుల రాకపోకలకు వీలుగా దేవస్థానం స్థలం పక్కనే ప్రవహిస్తున్న తూర్పు కాల్వపై కాలి వంతెన నిర్మించారు. కాలక్రమంలో భక్తుల రద్దీ పెరగడంతో కాలి వంతెనకు ఎగువన పెద్ద వంతెన నిర్మించారు. అనతి కాలంలోనే దేవస్థానం గణనీయమైన అభివృద్ధి సాధించింది. ప్రతి సంవత్సరం ఇక్కడ దాదాపు రెండు వేలకు పైగా వివాహాలు స్వామి వారి సన్నిధిలో జరుగుతుంటాయి. దూర ప్రాంతాల నుంచి వచ్చే భక్తుల కోసం వివాహాలు, అన్నప్రాసనలు జరుపుకునే భక్తుల కోసం అన్ని సదుపాయాలు ఉన్నాయి. దేవస్థానం ఆవరణలో విశాలమైన పొంగలి షెడు, కళ్యాణ మండపాలు ఉన్నాయి. భక్తులు మొక్కుబడులు చెల్లించేందుకు ఎల్లప్పుడు నీటి వసతి గల ప్రత్యేక కేశ ఖండన శాల ఉంది. క్రేన్ సంస్థల అధినేత గ్రంధి సుబ్బారావు స్వామి వారికి రాజగోపురం నిర్మించారు. భక్తుల సహకారంతో స్వామి వారికి బంగారు కిరీటం, శ్రీస్వామి, అమ్మవార్లకు రజత వస్త్రాలు, రజత మకర తోరణాలు, రజత పాద పీఠాలు అలంకరించారు. శ్రీనివాసుని దర్శించ వచ్చే భక్త జనులకు తిరుమలలో మాదిరిగా శాశ్వత నిత్యాన్నదాన పథకాన్ని వైకుంఠపురం దేవస్థానంలో అమలు చేస్తున్నారు. ఎంతో మంది దాతలు ఈ పథకానికి విరాళాలు అందిస్తున్నారు. దాతల విరాళాలను శాశ్వత నిత్యాన్నదాన పథకం కింద బ్యాంకులలో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేసి తద్వారా వచ్చే వడ్డీతో నిత్యాన్నదాన కార్యక్రమం నిర్వహిస్తున్నారు.

సాధారణ భక్తులు కూడా ఈ పథకంలో పాలు పంచుకుని వారి సహాయాన్ని అందించాలనే ఉద్దేశ్యంతో దేవస్థానం వారు విరాళాల పరిధిని గణనీయంగా విస్తరించారు. ఇటీవల దేవస్థానం ప్రాంగణంలో ఆగమ పాఠశాలను కూడా ప్రారంభించారు. ఏటా స్వామి వారి బ్రహ్మోత్సవాలు, తెప్పోత్సవం, ఇతర ఉత్సవాలు వైభవంగా జరుగుతుంటాయి.

# ఆ గ్రామానికి తొలి మహిళా సర్పంచ్



వట్టిప్రోలు సునీత

(ఆన్‌లైన్ - వేమూరు)

తెనాలి డివిజన్‌లో కళా రంగ ప్రముఖులకు, ఆయుర్వేద వైద్య రంగానికి, ప్రవాస భారతీయ నివాసితులకు, చారిత్రక చరిత్ర కలిగిన పేరెన్నికగన్నది జంపని గ్రామం. మేజర్ గ్రామంగా 1966లో గుర్తింపబడి అన్ని రంగాలలో ఎంతో అభివృద్ధి చెందింది. 1947లో అమర్తలూరు సమితి కింద ఉన్న ఈ గ్రామానికి గొంది రత్తయ్య అధ్యక్షునిగా పని చేశారు. నాటి నుంచి 2006 వరకు సర్పంచ్‌లుగా పురుషులే ఎన్నికయ్యారు.

2006లో జరిగిన ఎన్నికలలో రిజర్వేషన్ పద్ధతి కింద వట్టిప్రోలు సునీత తొలి మహిళా సర్పంచ్‌గా ఎన్నికయ్యారు. 1948 ఫిబ్రవరి 17వ తేదీ నుంచి ఈ గ్రామం పంచాయతీగా గుర్తింపు పొందింది. 1951లో చిగురుపాటి సీతారామయ్య, 1959లో చల్లపల్లి వెంకయ్య, 1953లో దొప్పలపూడి వీరరాఘవయ్య, 1955లో కామినేని పున్నయ్యలు అధ్యక్షులుగా పని చేశారు. 1953 నుండి అధికారిని నియమించారు. 1956లో ఆర్.పేరయ్య ప్రత్యేక అధికారిగా పని చేశారు. 1956, 64లలో కామినేని పున్నయ్య అధ్యక్షునిగా వ్యవహరించారు.

1970లో గొంది వెంకట్రాది, 1981లో వెలుపుల కోటయ్య, 1986లో తాడిశెట్టి సీతారామయ్య, 1988లో షేక్ మహబూబ్ సుబానీ, 1995లో గవిని రామకృష్ణ ప్రసాద్, 2001లో చందోలు డేవిడ్ విజయకుమార్‌లు సర్పంచ్‌లుగా ఎన్నికై, గ్రామాభివృద్ధికి కృషి చేశారు. తొలిగా మహిళా సర్పంచ్ అయిన సునీత గ్రామాన్ని మోడల్‌గా తీర్చి దిద్దడానికి కృషి చేస్తున్నారు.



# తెనాలి రైల్వే చరిత్ర ఘనం అభివృద్ధి అంతంత మాత్రం




స్టేషన్‌లో ప్లాట్ ఫారాలు

(ఆన్‌లైన్ - తెనాలి)

స్వాతంత్ర్యోద్యమ కాలంలో ప్రపంచ ప్రజల దృష్టిని ఆకర్షించిన సన్నివేశాలు, సంఘటనలను నింపుకున్న తెనాలి రైల్వేస్టేషన్ గుంటూరు జిల్లాలో ప్రముఖ రైల్వే జంక్షన్‌గా పేరొందింది. ఒకనాడు కేవలం రెండు ప్లాట్ ఫారాలతో, అరకొర సౌకర్యాలతో స్టీమ్ ఇంజన్ల రొద మధ్య ప్రస్తుత చెన్నై నాటి మద్రాసు-హౌరాల మధ్య రైలు మార్గంలో ఉన్న ఈ జంక్షన్ ప్రయాణీకుల అవసరాలను తీర్చే దిశలో గణనీయమైన అభివృద్ధి సాధించింది. అభివృద్ధితో పాటు స్టేషన్ ఆదాయం కూడా పరిగణింపదగిన స్థాయికి చేరుకుంది. 1942 క్విట్ ఇండియా ఉద్యమ సమయంలో ఆందోళనకారుల ఆగ్రహానికి గురై అగ్నికీలల మధ్య దగ్ధమైన ఈ స్టేషన్ గత పదేళ్ల కాలం వరకు సామాన్యమైన రైల్వేస్టేషన్‌గా ప్రయాణీకులకు నామమాత్రపు సౌకర్యాలు అందిస్తూ వచ్చింది. తర్వాత ప్రయాణీకుల అవసరాలకు తగిన విధంగా కొన్నాళ్ల క్రితం అభివృద్ధి పనులు జరిగాయి. గతంలోని పాతబుకింగ్ ఆఫీసును పడగొట్టి అధునాతన భవన సముదాయం, విఐపిల కోసం ప్రత్యేక లాంజ్, నాలుగు, ఐదు ప్లాట్‌ఫారాల నిర్మాణం, ఫుట్ ఓవర్ బ్రిడ్జి పొడిగింపు, కంప్యూటర్ రిజర్వేషన్ సౌకర్యం స్టేషన్‌లో సౌకర్యాలను కల్పించారు. దీనితో హౌరా - చెన్నయ్ రైలు మార్గంలో విజయవాడ తర్వాత, పెద్ద స్టేషన్‌గా తెనాలి జంక్షన్ రూపుదిద్దుకుంది. దీనికి తోడు పట్టణంలో ఓవర్ బ్రిడ్జి ఆవల వైపున ఉన్న చెంచుపేట పరిసర ప్రాంతాల ప్రజల సౌకర్యాన్ని దృష్టిలో ఉంచుకుని స్టేషన్‌కు పడమర వైపున మరో బుకింగ్ కార్యాలయం ఏర్పాటైంది. ఫ్లాట్‌ఫారంల సంఖ్య ఐదుకు పెరగటం వల్ల ఈ మార్గంలో రైళ్ల రద్దీ వల్ల ఏర్పడే సమస్యలకు పరిష్కారం లభించినట్లయింది. వాస్తవానికి ఈ దశాబ్ద కాలంలో చెన్నయ్ - విజయవాడ రైలు మార్గంలో తెనాలి జంక్షన్ మీదుగా రోజూ 62 రైళ్లు ప్రయాణిస్తుంటాయి. ఇవి కాక జిల్లా కేంద్రమైన గుంటూరుకు పది, రేపల్లె వైపునకు ఏడు రైళ్లు ప్రయాణిస్తుంటాయి. ఈ స్టేషన్ నుంచి ప్రతి రోజూ మొత్తం 80కిపైగా రైళ్ల రాకపోకలు సాగుతుంటాయి. ప్రతి 15 నిమిషాలకు ఒక గూడ్స్ రైలు, వాటికి తోడు సూపర్‌ఫాస్ట్ రైళ్లు ప్రయాణిస్తుంటాయి. రవాణా సదుపాయాలతో పాటు స్టేషన్ ఆర్థికంగా కూడా దక్షిణ మధ్య రైల్వేలో గణనీయమైన స్థానంలో ఉంది.

జిటి ఎక్స్‌ప్రెస్, జన్మభూమి వంటి ఎక్స్‌ప్రెస్‌లతో తెనాలి స్టేషన్ ప్రాధాన్యం పెరిగింది. అనేక మంది ప్రయాణీకులకు ఈ రైళ్ల ద్వారా సౌకర్యం కల్పించినట్లయింది. దీనికి తోడు పద్మావతి సూపర్ ఫాస్ట్ ఎక్స్‌ప్రెస్, జన్మభూమి ఎక్స్‌ప్రెస్ తెనాలి వరకు పొడిగింపు సౌకర్యాన్ని ప్రజా ప్రతినిధుల సహకారంతో లభింపచేశారు. గతంలో మంగళ ఎక్స్‌ప్రెస్ తెనాలి మీదుగా ప్రయాణించేది. ఆ ఎక్స్‌ప్రెస్‌ను కొంకణ్ రైల్వే ద్వారా మళ్లించినందున, ప్రస్తుతం తెనాలి జంక్షన్ మీదుగా నడుపుతున్న కేరళ ఎక్స్‌ప్రెస్‌కు తెనాలి హాల్టింగ్ సౌకర్యాన్ని కల్పించాలని ప్రయాణికులు కోరుతున్నారు.

## ప్రజా ప్రతినిధుల శీతకన్ను

గత మూడేళ్లుగా తెనాలి స్టేషన్ అభివృద్ధిపై ప్రజా ప్రతినిధులు శీతకన్ను ప్రదర్శిస్తున్నారు. ఇటీవలి కాలంలో తెనాలికి ఒక్క కొత్తరైలు హాల్టు లేకపోగా, సికింద్రాబాద్ నుంచి నడిచే ఇంటర్‌సిటీ ఎక్స్‌ప్రెస్ రద్దు చేసి దానిని జన్మభూమిగా విశాఖపట్నం వరకు పొడిగించారు. ఫలితంగా తెనాలి ప్రాధాన్యాన్ని తగ్గించి వేసినట్లయింది. పల్నాడు ఎక్స్‌ప్రెస్‌ను తెనాలి వరకు పొడిగించాలన్న అభ్యర్థన కూడా నెరవేరడం లేదు. రేపల్లె నుంచి సికింద్రాబాద్‌కు డెల్టా ఫాస్ట్ ప్యాసింజర్ మినహా తెనాలి కోసం ప్రత్యేకంగా ఒనకూర్చిన రైల్వే సౌకర్యాలు ఇటీవల లేవనే చెప్పాలి.

మరో వైపు రైల్వే స్టేషన్ ఆదాయం మరింత పెరిగినా అందుకు అనుగుణంగా సౌకర్యాలు పెరగలేదు. గత దశాబ్ద కాలంతో పోల్చుకుంటే తెనాలి స్టేషన్ అభివృద్ధి ఈ మధ్య మందగించిందనే చెప్పాలి.




తెనాలి రైల్వే స్టేషన్ ప్రధాన భవనం

# నట కంఠీరవులు రామయ్య, గగ్గయ్య

(ఆన్‌లైన్ - వేమూరు)

వేమూరు అనే పేరు వినగానే ఆ ముగ్గురు గుర్తుకు వస్తారు. గుంటూరు జిల్లా లోని వేమూరు గ్రామంలో జన్మించిన కొణిజేటి రోశయ్య రాష్ట్రంలో ప్రముఖ రాజకీయ నాయకునిగా గుర్తింపు పొందారు. ఇదే గ్రామానికి చెందిన వేమూరి గగ్గయ్య, ఆయన కుమారుడు రామయ్యలు పౌరాణిక నాటక రంగంలో నట కంఠీరవులుగా, రంగ సింహులుగా పేరు పొంది వేమూరుకు దేశ విదేశాలలో కూడా గుర్తింపు తెచ్చారు. తాదాత్మ్యం చెంది నటించే నటులు వీరు. తమదైన నటనా కౌశల్యం ద్వారా ప్రేక్షక దేవుళ్ల మెచ్చుకునేలా నటించి తమ జీవితాలను పరమాత్మ సాన్నిధ్యానికి సుసాధ్యం చేసుకున్న మహా నటులు గగ్గయ్య, రామయ్యలు అనడంలో అతిశయోక్తి లేదు. గగ్గయ్య గారి కుమారుడు రామయ్య నాటక రంగ స్థలంపై



శివాజీ పాత్రలో వేమూరి రామయ్య

తండ్రికి తగ్గ తనయుడని స్తుతులందుకున్న ధన్య జీవి. వీరిద్దరిలోని నటనా కౌశలం, భావ రాగ యుక్తమైన పద్యం, కంచు కంఠంతో వినిపించిన సంభాషణలు వారి వారి పాత్రలకు అత్యంత వైవిధ్య భరితంగా ఉండేవి.

పరమ సాత్వికమైన పాత్రలతో పాటు రాజస, తామస గుణ భరితమైన భూమికలను వారు రంగస్థలంపై ప్రదర్శించారు. ప్రత్యేకమైన బాణి, శైలి ద్వారా ప్రతిభా మూర్తులుగా మూర్తీభవించిన ఈ తండ్రీ కొడుకుల నటనా ప్రస్థానం రంగస్థల చరిత్రకు వెలుగు తోరణమైంది. తెలుగుదనం ఉట్టిపడే పంచకట్టు, మీస కట్టుతో ఆరడుగుల ఆజానుబాహులుగా గంభీర రూపాలు కలిగిన వీరిద్దరూ చలన చిత్రాలలో కూడా నటించారు. కీర్తిశేషులు గగ్గయ్య గారు సతీ సావిత్రి నాటకంలో యముడు, కృష్ణ లీలల్లో కంసుడు, బొబ్బిలిలో పాపారాయుడు, ద్రౌపదీ వస్త్రాపహరణంలో శిశుపాలుడు, కురుక్షేత్రంలో భీముడిగా ఆయన పాత్రాలలో జీవించి నటించి ఉత్తమ కళాకారులుగా గుర్తింపు పొందారు. విభిన్న పాత్రలు పోషించి ఎనలేని కీర్తిని పొందిన ఆయన 'రంగసింహ' బిరుదు అందుకోవడం అభినందనీయం. కన్నాంబ, రామతిలకం, పువ్వుల అనసూయ, మాధవపెద్ది, బందా, సిఎస్ఆర్, పులిపాటి, పారుపల్లి, బెల్లంకొండ రామకృష్ణ శాస్త్రి ఇలా ఎందరో అగ్ర నటుల అందరిలో ప్రత్యేకతను చూపి ప్రఖ్యాతిని పొందిన గగ్గయ్య కళా రంగానికి ఎప్పుడూ ఆదర్శప్రాయుడే.



ఎన్టీఆర్ అవార్డు అందుకుంటున్న రామయ్య



శిశుపాలుడి పాత్రలో వేమూరి గగ్గయ్య

ఆయనతో కలిసి పలు పాత్రలు పోషించిన కుమారుడు రామయ్య, మిత్రుడు ఉప్పాల వెంకట రత్తయ్య చౌదరిలు గొప్ప నటులయ్యారు. ఇలా కొన్ని వందల మంది యువ కిషోరాలను ఆయన కళా వేదికకు అందించారు.

తండ్రిని మించిన తనయుడైన రామయ్య వారసత్వాన్ని పుణికి పుచ్చుకుని, తండ్రి వేసిన పాత్రలన్నింటిలోనూ పేరు పొందడంతో పాటు అపర కర్ణుడిగా కీర్తింపబడి నట సార్వభౌమ ఎన్టీ రామారావు అవార్డును పొంది, వేమూరు గ్రామానికి దేశ వ్యాప్తమైన కీర్తిని సంపాదించిపెట్టారు.

ఈ ఇద్దరు కళా కారుల ద్వారా వేమూరుకు అందిన కీర్తిని నిలబెట్టడానికి నేటి కళాకారులు కృషి చేయడం ఎంతో అవసరం.

"ఆంధ్రజ్యోతి"
దిన పత్రిక తన జైత్ర యాత్రలో దిగ్విజయంగా 5 వసంతాలు
పూర్తిచేసుకొని "6" వ వార్షికోత్సవం లోకి అడుగిడుతున్న సందర్భంగా
ఇవే మా శుభాకాంక్షలు తెలుపుతూ మరియు మా తెనాలి ప్రొహిబిషన్ అండ్
ఎక్సైజ్ ఇన్‌స్పెక్టర్ ఉత్తమ అవార్డు గ్రహీత శ్రీ సిహెచ్. సీతారామయ్య గార్కి
దసరా, దీపావళి, శుభాకాంక్షలు



సిహెచ్. సీతారామయ్య
తెనాలి ఎక్సైజ్, సి.ఐ.

## సబ్ ఇన్‌స్పెక్టర్స్, సిబ్బంది, ప్రొహిబిషన్ అండ్ ఎక్సైజ్ శాఖ, తెనాలి.

| | | | |
|---|---|---|---|
| శ్రీ శివరామకృష్ణ రెస్టారెంట్ - బార్ చెంచుపేట, తెనాలి. | బాలాజీ గార్డెన్ రెస్టారెంట్ - బార్ కొత్తబస్టాండ్, తెనాలి. | లక్ష్మీగణపతి రెస్టారెంట్ - బార్ గాంధీచౌక్, తెనాలి. | రామకృష్ణా రెస్టారెంట్ - బార్ రైల్వేస్టేషన్ ఎదురు తెనాలి. |
| బాలాజీ రెస్టారెంట్ - బార్ పాతబస్టాండ్ వద్ద, తెనాలి. | దుర్గావైన్స్ రత్నాటాకీస్ దగ్గర బుర్రిపాలెం, తెనాలి. | రామకృష్ణ రెస్టారెంట్ - బార్ ఎ.వి.ఆర్. మార్కెట్‌సెంటర్, తెనాలి. | సాయిబాలాజీ రెస్టారెంట్-బార్ సాలిపేట, తెనాలి. |
| విజయ వైన్స్ రైల్వేస్టేషన్ ఎదురు, తెనాలి. | శ్రీబాలాజీ రెస్టారెంట్-బార్ వహాబ్‌రోడ్, తెనాలి. | శ్రీగాయత్రి రెస్టారెంట్ - బార్ ఎన్.వి.ఆర్. క్లబ్, నాజర్‌పేట, తెనాలి | శ్రీ గణేష్ వైన్ వహాబ్‌చౌక్, తెనాలి. |
| సంజీవి రెస్టారెంట్-బార్ గంగానమ్మపేట, తెనాలి. | బ్లూఫాక్స్ రెస్టారెంట్ - బార్ ప్రకాశంరోడ్, తెనాలి. | గౌతమ్ రెస్టారెంట్ - బార్ రైల్వేస్టేషన్ రోడ్, తెనాలి | |
| విజయలక్ష్మి రెస్టారెంట్ - బార్ సుల్తానాబాద్, తెనాలి | సాయి రెస్టారెంట్ - బార్ మారీసుపేట, తెనాలి. | | |
| సాయితేజ రెస్టారెంట్ - బార్ మారీసుపేట, తెనాలి. | శ్రీదుర్గావైన్స్ పాతబస్టాండు వద్ద, తెనాలి | | |

## మమత గ్రూప్ బార్ - రెస్టారెంట్ - వైన్స్, తెనాలి.

## సబ్ ఇన్‌స్పెక్టర్, సిబ్బంది, ప్రొహిబిషన్ అండ్ ఎక్సైజ్ శాఖ, తెనాలి.

# తిరుమల పాల ఉత్పత్తులకు విశేష ఆదరణ

(ఆన్‌లైన్, నరసరావు పేట)

తిరుమల మిల్క్ ప్రొడక్ట్స్ ప్రైవేట్ లిమిటెడ్ స్థాపించిన అనతి కాలంలోనే అసాధారణ ప్రగతి సాధించింది. రాష్ట్రంలో క్షీర విప్లవానికి తిరుమల తన వంతు కృషి చేస్తున్నది. ఒక వైపు పాల ఉత్పత్తి దారులకు వెన్నుదన్నుగా నిలుస్తూ, మరో వైపు వేలాది మంది నిరుద్యోగులకు ఉపాధి కల్పిస్తున్నది.



తిరుమల ఉత్పత్తులు

రాష్ట్రంలోనే కాక ఇతర రాష్ట్రాలు తమిళనాడు, కర్నాటకలలో కూడా సంస్థ విస్తరించింది. పది వసంతాలు తిరుమల పూర్తి చేసుకున్నది. ఒక పాల శీతలీ కరణ కేంద్రంతో ప్రారంభమైన తిరుమల డెయిరీ అది 18 కేంద్రాలను విస్తరించి పాలు, పాల పదార్థాల తయారీ విక్రయాల్లో మార్కెంట్‌లో తన కంటూ ఒక స్థానాన్ని సాధించ గలిగింది. పాలు, పాల పదార్థాల తయారీలో నాణ్యత ప్రమాణాలను పాటిస్తూ, మార్కెట్‌లో మంచి గుర్తింపు పొందింది. అసలైన స్వచ్ఛతకు తిరుమల ఉత్పత్తులు పేరెన్నిక గన్నవి.

పాలుతో పాటు పాల పౌడర్, నెయ్యి, ఫ్లావర్డ్ మిల్క్, మజ్జిగ, పెరుగు తిరుమల నుంచి వెలువడుతున్న ఉత్పత్తులకు వినియోగ దారుల నుంచి మంచి ఆదరణ లభిస్తున్నది. పది వేల లీటర్ల సామర్థ్యంతో ప్రారంభమైన తిరుమల సంస్థ నేడు ఆరు లక్షల లీటర్ల పాల సేకరణ ప్రతి రోజు చేస్తూ సుమారు ఐదు లక్షల లీటర్ల పాల విక్రయాలను ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, కర్నాటక రాష్ట్రాల్లో జరుపుతున్నది.

అగ్‌మార్క్ ప్రమాణాలతో పాలు, పాల పదార్థాలను తయారు చేస్తున్నది. తిరుమల ఉత్పత్తులకు ఐఎస్‌వో 9001-2000 గుర్తింపు లభించింది. ప్రైవేటు డెయిరీ రంగంలో ద్వితీయ స్థానాన్ని ఆక్రమించింది. అత్యున్నత సాంకేతిక ప్రమాణాలతో



తిరుమల ఎండి బొల్లా బ్రహ్మనాయుడు

నెల్లూరు జిల్లా, గూడూరులో పాలు, పాల పదార్థాల తయారీ ఫ్యాక్టరీని నిర్మించారు. ఇక్కడి నుంచి నెయ్యి, పాలు, పెరుగు, ఫ్లావర్డ్ మిల్క్, పాల పొడి ఉత్పత్తి అవుతున్నాయి.

గూడూరు, పలమనేరు, వెల్లల చెరువులలో పాల ప్యాకెట్ల తయారీ ప్లాంట్లను నెలకొల్పారు. చెన్నై, బెంగుళూరు, హైదరాబాద్ పట్టణాల్లో తిరుమల ఉత్పత్తులకు విశేష ఆదరణ లభిస్తున్నది. తిరుమల తయారీ చేసే పాల పొడికి మార్కెట్‌లో మంచి డిమాండ్ లభించటంతో పాటు బంగ్లాదేశ్, శ్రీలంక దేశాల నుంచి కూడా ఆర్డర్లు లభిస్తున్నాయి. పాల ఉత్పత్తి దారులకు చేయూత నందించటంతో పాటు ఉపాధి అవకాశాలు కల్పించటంలో తిరుమల ప్రత్యేక గుర్తింపు సాధించింది. ఈ సంస్థలో సుమారు ఏడు వేల మంది వివిధ విభాగాలలో ఉపాధి పొందుతున్నారు.

పాల ఉత్పత్తి దారులకు కూడా వివిధ రకాల సహాయం చేస్తూ, వారి శ్రేయస్సు కోసం విభిన్న పథకాలు అమలు చేస్తూ వారి ఆదరణను చూరగొన్నది. సంస్థ ఎండి బ్రహ్మనాయుడు మాట్లాడుతూ, పాల ఉత్పత్తి దారులు, వినియోగ దారుల ఆదరణే మాకు స్ఫూర్తి అని పేర్కొన్నారు. నాణ్యతా ప్రమాణాలు పాటించటం వలనే తిరుమల ఉత్పత్తులకు వినియోగ దారుల నుంచి ప్రోత్సాహం లభిస్తున్నదని చెప్పారు.

## 'తుళు' వంశపు రాజుల ఊరు

# 'తుళ్లూరు'



తుళ్లూరులోని శ్రీరామలింగేశ్వరస్వామి ఆలయం

(ఆన్‌లైన్, తుళ్లూరు)

విజయనగర సామ్రాజ్య విస్తరణలో భాగంగా కొండపల్లి దుర్గాన్ని ముట్టడి చేసేందుకు శ్రీకృష్ణదేవరాయలు కృష్ణాతీరంలో మజిలీ చేసినట్లు పూర్వీకులు చెబుతున్నారు. కృష్ణానది అవతలి గట్టుకు వెళ్లేందుకు వీలులేక ఆరునెలలపాటు ఇవతలి గట్టున తన సైన్యంతో మజిలీ చేసి విడివిలో దండయాత్రకు బయలు దేరినట్లు చరిత్ర. అందుకు మండలంలోని పలు గ్రామాల పేర్లు సాక్ష్యంగా చూపుతున్నారు. శ్రీకృష్ణ దేవారాయలు 'తుళు' వంశానికి చెందిన రాజు కావడంతో ఈ ప్రాంతానికి తుళుల ఊరు అని పిలిచేవారని కాల క్రమేణా తుళ్లూరుగా మారినట్లు పెద్దలు వివరిస్తున్నారు. రాజు నివశించిన చోటు కావడంతో శ్రీకృష్ణదేవరాయల పేరిట ఆ గ్రామానికి రాయపూడి అని పేరు వచ్చింది. రాయలవారి ఆస్థానమంత్రిగా పేరు పొందిన మహామంత్రి తిమ్మరుసు పేరున ఇప్పటికీ రాయపూడి గ్రామంలో తిమ్మరుసు బావి ప్రత్యక్ష సాక్ష్యంగా నిలిచింది. ప్రాచీన శిల్ప కళా వైభవానికి ప్రత్యేకంగా నిలిచిన శ్రీ వేణుగోపాలస్వామి ఆలయాన్ని శ్రీకృష్ణదేవరాయలు నిర్మించారని ప్రతీతి. తుళ్లూరుగా పేరుపొందిన ఈ ప్రాంతాన్ని పూర్వం 'తాండపురి'గా పిలచేవారు. శివుడు తాండవం చేసిన చోటు కావడంతో ఆ పేరు వచ్చింది. తాటకి వధకై బయలుదేరిన రామ, లక్ష్మణులకు (మిగతా 98వ పేజీలో)

# క్యాంపస్ ఇంటర్వ్యూలలో ఎన్ఇసి విజయకేతనం

(ఆన్‌లైన్, నరసరావుపేట)

అత్యుత్తమ విద్యా ప్రమాణాలను అందిస్తూ మరో వైపు విద్యార్థులకు ఉపాధి అవకాశాలు కల్పించటంలో నరసరావుపేట ఇంజనీరింగ్ కళాశాల ముందంజలో వుంది. ప్రముఖ కంపెనీలు నిర్వహిస్తున్న క్యాంపస్ ఇంటర్వ్యూలలో ఎన్ఇసి విద్యార్థులు ప్రతిసారి విజయకేతనం ఎగుర వేస్తున్నారు. కళాశాలలో చదివే ప్రతి విద్యార్థికి ఉద్యోగ అవకాశం కల్పించటమే లక్ష్యంగా ఎన్ఇసి కృషి చేస్తున్నది. ఈ కళాశాలకు కోస్తా జిల్లాల్లోనే ప్రప్రథమంగా జిఆర్ఇ టోఫెల్ కేంద్రం కూడా మంజూరైంది. గేట్, జిఆర్ఇ టోఫెల్, క్యాట్ తదితర పోటీ పరీక్షల్లో కూడా ఈ కళాశాల విద్యార్థులు విశేష ప్రతిభ కనబరుస్తున్నారు. క్యాంపస్ ఇంటర్వ్యూల ద్వారా ఉద్యోగాలు సులువుగా విద్యార్థులు సాధించేందుకు ప్రత్యేక శిక్షణ ఇస్తున్నారు.

పోటీ పరీక్షలు, క్యాంపస్ ఇంటర్వ్యూలకు హాజరయ్యే విద్యార్థుల కోసం కళాశాలలో ప్రత్యేక ఏర్పాట్లు చేశారు. నరసరావుపేట పట్టణానికి నాలుగు కిలో మీటర్ల దూరంలో కోటప్పకొండ రహదారిలో ఆహ్లాదకరమైన క్యాంపస్‌లో ఎన్ఇసి నిర్వహించబడుతున్నది.

స్థాపించిన అనతి కాలంలోనే ఉత్తమ ఫలితాలు సాధించటంలో జెఎన్‌టియు పరిధిలో ప్రత్యేక స్థానాన్ని కళాశాల సాధించింది. ఎఐసిటిఇ దేశ వ్యాప్తంగా ఇచ్చిన రేటింగ్‌లో ఎన్ఇసి 32వ స్థానాన్ని సాధించింది. రాష్ట్ర ప్రభుత్వం ఆధ్వర్యంలో నిర్వహించబడుతున్న జవహర్ నాలెడ్జి సెంటర్‌ను నిర్వహిస్తున్నారు. ఎబివిపి నిర్వహించిన రాష్ట్ర వ్యాప్త సర్వేలో ఎన్ఇసికి ఎక్స్‌లెంట్ అవార్డు లభించింది. అలాగే జవహర్ నాలెడ్జి కేంద్రం నిర్వహణలో సెంటర్ ఆఫ్ ఎక్స్‌లెన్స్ గుర్తింపు పొందింది. ప్రతి ఏటా గేట్ పరీక్షల్లో కళాశాల విద్యార్థులు అత్యుత్తమ ర్యాంకులు సాధిస్తున్నారు.

1998లో గాయత్రి ఎడ్యుకేషనల్ సొసైటీ ఆధ్వర్యంలో నాలుగు బిటెక్ బ్రాంచ్‌లతో ఎన్ఇసిని ప్రారంభించారు. ప్రస్తుతం ఆరు బిటెక్ బ్రాంచ్‌లు, నాలుగు ఎంటెక్ బ్రాంచ్‌లు, ఎంసిఎ, ఎంబిఎ కోర్సులను కళాశాలలో నిర్వహిస్తున్నారు. అన్ని హంగులతో లైబ్రరీని ఏర్పాటు చేశారు. క్యాంపస్ ఇంటర్వ్యూల నిర్వహణ కోసం ప్రత్యేక విభాగాన్ని నెలకొల్పారు. ఇప్పటి వరకు క్యాంపస్ ఇంటర్వ్యూల ద్వారా గత రెండేళ్ళల్లో 265 మంది విద్యార్థులు ప్రముఖ సాఫ్ట్‌వేర్ సంస్థల్లో ఉద్యోగాలు సాధించారు. ప్రస్తుత విద్యా సంవత్సరంలో ఇప్పటికే 118 మంది విద్యార్థులు ఉద్యోగాలు పొందటం విశేషం. పల్నాడు ప్రాంతంలో ఇంజనీరింగ్ విద్యను అందుబాటులోకి తేవాలనే ఉద్దేశంతో గాయత్రి ఎడ్యుకేషనల్ డెవలప్‌మెంట్ సొసైటీ చైర్మన్, కళాశాల అభివృద్ధి రథ సారథి మిట్టపల్లి వెంకట కోటేశ్వరరావు ఎన్ఇసిని స్థాపించారు. విద్యార్థులకు అవసరమైన అన్ని సౌకర్యాలు కల్పించటంలో కృషి చేస్తున్నామన్నారు.



ఫార్మసి కళాశాలల చైర్మన్ మిట్టపల్లి వెంకట కోటేశ్వరరావు



క్యాంపస్ ఇంటర్వ్యూలలో వివిధ ప్రముఖ కంపెనీలలో ఉద్యోగాలు సాధించిన ఎన్ఇసి విద్యార్థులతో కళాశాల చైర్మన్ మిట్టపల్లి కోటేశ్వరరావు, ప్రిన్సిపాల్, అధ్యాపకులు

## మిట్టపల్లి ఇంజనీరింగ్ కళాశాల

ఎన్ఇసి చైర్మన్ మిట్టపల్లి వెంకట కోటేశ్వరరావు నేతృత్వంలో గుంటూరుకు సమీపంలో జాతీయ రహదారి తుమ్మలపాలెం వద్ద శ్రీ మిట్టపల్లి ఇంజనీరింగ్ కళాశాలను నెలకొల్పారు.

చిలకలూరిపేట, గుంటూరు పట్టణాల మధ్య తుమ్మలపాలెం వద్ద జాతీయ రహదారి పక్కనే ఆధునిక వసతులతో కళాశాలను నిర్మించారు. నాలుగు బిటెక్ బ్రాంచ్‌లు, ఎంసిఎ కోర్సు నిర్వహిస్తున్నారు. క్యాంపస్ ఇంటర్వ్యూలకు హాజరయ్యే విద్యార్థులకు ప్రత్యేక శిక్షణ ఇచ్చేందుకు ప్లేస్‌మెంట్ సెల్‌ను ఏర్పాటు చేస్తున్నారు. అనుభవజ్ఞులైన అధ్యాపకుల బృందం బోధనలో మంచి ఫలితాలు సాధించేందుకు శ్రీ మిట్టపల్లి ట్రస్ట్ విశేషంగా కృషి చేస్తుంది.

ఈ కళాశాలకు మిట్టపల్లి వెంకట కోటేశ్వరరావు చైర్మన్‌గా వున్నారు. ఎన్ఇసి తరహాలో మిట్టపల్లి ఇంజనీరింగ్ కళాశాల అత్యున్నత విద్యాబోధన విద్యార్థులకు అందిస్తుందని కోటేశ్వరరావు వివరించారు.

కళాశాలలో ఏర్పాటు చేసిన వసతులను సద్వినియోగ పరుచుకొని విద్యార్థులు మంచి ఫలితాలు సాధించాలని ఆయన పేర్కొన్నారు.

## నరసరావుపేట ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫార్మాస్యూటికల్ సైన్సెస్

ఎన్ఇసి క్యాంపస్‌లోనే ఈ విద్యా సంవత్సరం నరసరావుపేట ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫార్మాస్యూటికల్ సైన్స్‌సెన్ కళాశాలను ఏర్పాటు చేశారు. ఈ కళాశాలలో బి ఫార్మసీ కోర్సులు ప్రవేశ పెట్టారు.

# ప్రగతి పథంలో జిల్లా యువజన సంక్షేమ శాఖ


డా॥ వై.యస్. రాజశేఖర రెడ్డి, ముఖ్యమంత్రి


శ్రీ కన్నా లక్ష్మీ నారాయణ, రవాణాశాఖ మాత్యులు


శ్రీ మురుగుడు హనుమంతరావు, పర్యాటక ఆయాక్ శాఖామాత్యులు


శ్రీ కాసు వెంకట కృష్ణారెడ్డి, ఆహార, పౌర సరఫరాలు & తూనికలు, కొలతల శాఖామాత్యులు


శ్రీ మోపిదేవి వెంకటరమణారావు, చేనేత సహకారం, ఓడరేవులు, విమానాశ్రయ, సహజ వనరుల శాఖామాత్యులు


శ్రీమతి నేదురుమల్లి రాజ్యలక్ష్మి, జిల్లా ఇన్‌చార్జ్ శాఖామాత్యులు


శ్రీ మహమ్మద్ ఆలీ రఫత్, జిల్లా కలెక్టర్


శ్రీమతి కూచిపూడి విజయ, జిల్లా పరిషత్ ఛైర్ పర్సన్


శ్రీ ఆర్. దామోదర్ రెడ్డి, యువజన సంక్షేమ శాఖామంత్రి


శ్రీ వి. మార్కు, యువజన సంక్షేమ శాఖాధికారి

## స్టెప్ - స్వశక్తి - గుంటూరు

ప్రభుత్వము వారు నిరుద్యోగ సమస్య నిర్మూలనకు గాను 2004-05 ఆర్థిక సంవత్సరము నుండి "రాజీవ్ యువశక్తి పథకము" ను ప్రారంభించినారు. రాజీవ్ యువశక్తి (గ్రూపు పథకములో 5 గురు సభ్యులు వుండి, వారు 18 నుండి 35 సంవత్సరముల లోపు వారై వుండవలెను. వారి కుటుంబ సంవత్సరాదాయము రూ. 50,000/-లకు మించియుండరాదు. గ్రూపు సభ్యులలో ఒకరు తప్పని సరిగా 10వ తరగతి పాసై వుండవలెను. మిగిలిన సభ్యులు 7వ తరగతి ఉత్తీర్ణులై వుండవలెను.

### రాజీవ్ యువశక్తి 2004 - 05

2004-05 ఆర్థిక సంవత్సరమునకు, యువజన సర్వీసుల శాఖ కమీషనర్ వారు 1984 యూనిట్లకుగాను రూ. 19.25 కోట్లు లక్ష్యము నిర్ణయించగా 1322 మందికి రూ. 10.67 కోట్లు మంజూరు చేసి స్వయం ఉపాధి కల్పించడము జరిగినది.

### రాజీవ్ యువశక్తి 2005-06

2005-06 ఆర్థిక సంవత్సరమునకు, యువజన సర్వీసుల శాఖ కమీషనర్ వారు 3844 యూనిట్లకు గాను రూ. 38.42 కోట్లు లక్ష్యము నిర్ణయించగా 2392 మందికి రూ. 17.89 కోట్లు మంజూరు చేసి స్వయం ఉపాధి కల్పించడము జరిగినది.

### రాజీవ్ యువశక్తి 2006-07

2005-06 ఆర్థిక సంవత్సరమునకు, యువజన సర్వీసుల శాఖ కమీషనర్ వారు 4032 యూనిట్లకు గాను రూ. 34.42 కోట్లు లక్ష్యము నిర్ణయించగా ఇప్పటివరకు 3563 మందికి రూ. 26.54 కోట్లు మంజూరు చేసి స్వయం ఉపాధి కల్పించడము జరిగినది.

### రాజీవ్ యువశక్తి 2007-08

2006-07 ఆర్థిక సంవత్సరములో రాజీవ్ యువశక్తి పథకము ద్వారా 1984 మందికి రూ. 15.236 కోట్లతో స్వయం ఉపాధి పథకములు స్థాపించుటకు లక్ష్యముగా నిర్ణయించినారు. ఈ ఆర్థిక సంవత్సరములో ఇప్పటి వరకు 1485 మందిని ఎంపిక చేసి మండలముల నుండి ప్రతిపాదనలు వచ్చినవి. వీరందరికి ఋణములు మంజూరు చేయడమైనది. యిందులకు గాను, రూ. 9.725 కోట్లతో స్వయం ఉపాధి పథకములు స్థాపించుటకు ఋణములు విడుదల చేయడమైనది.

### శిక్షణా కార్యక్రమములు 2006-07

2006-07వ ఆర్థిక సంవత్సరములో 2000 మందికి శిక్షణ ఇచ్చుటకు లక్ష్యముగా నిర్ణయించగా ఇప్పటి వరకు 2000 మందికి శిక్షణ ఇప్పించుట జరిగినది అందులో 1604 మందికి వివిధ ప్రైవేటు సంస్థలలో ఉపాధి కల్పించడమైనది. ఇందులకు గాను ప్రభుత్వము వారు రూ. 50.00 లక్షలు ఖర్చు చేయడమైనది.

ఈ ఆర్థిక సంవత్సరములో గుంటూరు జిల్లాలోని స్పినింగ్ మిల్లులలో గల టెక్నికల్, నాన్ టెక్నికల్ ఉద్యోగములు భర్తీ చేయుట అవసరమైన శిక్షణ 5000 మందికి ఇప్పించుటకు ప్రతిపాదనలు ప్రభుత్వమునకు పంపడమైనది. ప్రభుత్వము నుండి ఆమోదము రాగానే శిక్షణా కార్యక్రమము ప్రారంభింపబడును. ఈ స్పినింగ్ మిల్లులలో నైపుణ్యము కలిగిన టెక్నికల్ సిబ్బందికి 350 మందికి ఉద్యోగములు ఇప్పించుట జరిగినది.

అంతేకాక యువజన సర్వీసుల శాఖ ప్రతి సంవత్సరము వివిధ కళల యందు పోటీలు నిర్వహించి జిల్లా స్థాయిలో ప్రథమముగా వచ్చిన వారిని రాష్ట్ర స్థాయి పోటీలకు పంపుచున్నాము. ప్రతి సంవత్సరము డా. అంబేద్కర్ జయంతి, బాబు జగజ్జీవన్‌రాం జయంతి, సుభాష్‌చంద్రబోస్ జయంతి మొదలగునవి జరిపి నేటి యువతలో ఆదర్శమూర్తుల స్మృతులను జ్ఞప్తికి తీసుకు వస్తూ ఈ సందర్భముగా మెడికల్ క్యాంపులు, రక్తదాన శిబిరములు, ఎయిడ్స్‌పై అవగాహన సదస్సులు నిర్వహించుచున్నాము. ఈ విధముగా యువజనుల అభివృద్ధికి ఆర్థిక, సామాజిక కార్యక్రమములలో పాల్గొనులకు యువజన సర్వీసులశాఖ కృషి చేయుచున్నది.


ది. 15-08-2007న యువజన సర్వీసుల శాఖ ఆధ్వర్యములో నిర్వహించిన రక్తదాన శిబిరమును తనిఖీ చేస్తున్న జిల్లా కలెక్టర్, శ్రీ మహమ్మద్ ఆలీ రఫత్, ఐ.ఎ.ఎస్.,


ది. 15-08-2007న యువజన సర్వీసుల శాఖ ఆధ్వర్యములో నిర్వహించిన రక్తదాన శిబిరమును తనిఖీ చేస్తున్న జిల్లా సూపరింటెంటెంట్ ఆఫ్ పోలీస్ శ్రీ మహేష్ చంద్ర లడ్డా


ది. 15-08-2007న యువజన సర్వీసుల శాఖ ఆధ్వర్యములో నిర్వహించిన సాంస్కృతిక కార్యక్రమములు


రాజీవ్ యువశక్తి లబ్దిదారులకు చెక్కులు పంపిణీ చేయుచున్న జిల్లా యువజన సంక్షేమశాఖాధికారి, శ్రీ వి.మార్కు


61 వ స్వాతంత్ర్య దినోత్సవ వేడుకల్లో రాజీవ్ యువశక్తి స్టాల్‌లో లబ్దిదారులతో ముచ్చటిస్తున్న రాష్ట్ర రవాణా శాఖామాత్యులు శ్రీ కన్నా లక్ష్మీనారాయణ


61వ స్వాతంత్ర్య దినోత్సవ వేడుకల్లో రాజీవ్ యువశక్తి పథకము ద్వారా లబ్దిపొందిన గ్రూపులకు ట్రాక్టర్ పంపిణీ చేస్తున్న గౌరవ మంత్రివర్యులు, శ్రీ కన్నా లక్ష్మీనారాయణ


61వ స్వాతంత్ర్య దినోత్సవ వేడుకల్లో రాజీవ్ యువశక్తి లబ్దిదారులకు ట్రాక్టర్ పంపిణీ చేస్తున్న జిల్లా సూపరింటెండ్ ఆఫ్ పోలీస్ శ్రీ మహేష్ చంద్ర లడ్డా, ఐ.పి.ఎస్.


రాజీవ్ యువశక్తి లబ్దిదారులకు చెక్కులు పంపిణీ చేయుచున్న జిల్లా యువజన సంక్షేమశాఖాధికారి, శ్రీ వి. మార్కు


61వ స్వాతంత్ర్య దినోత్సవ వేడుకల్లో రాజీవ్ యువశక్తి లబ్దిదారులకు ఆటో పంపిణీ చేస్తున్న జిల్లా కలెక్టర్, శ్రీ మహమ్మద్ ఆలీ రఫత్, ఐ.ఎ.ఎస్.


రాజీవ్ యువశక్తి పథకము ద్వారా ఉపకరణములు పంపిణీ చేయుటకు వచ్చిన గౌరవ మంత్రివర్యులు శ్రీ కన్నా లక్ష్మీ నారాయణ, జిల్లా పరిషత్ ఛైర్ పర్సన్ శ్రీమతి కూచిపూడి విజయ, జిల్లా కలెక్టర్ శ్రీ మహమ్మద్ ఆలీ రఫత్, ఐ.ఎ.ఎస్., మరియు జిల్లా సూపరింటెండ్ ఆఫ్ పోలీస్, శ్రీ మహేష్ చంద్ర లడ్డా, ఐ.పి.ఎస్.

# ఎఎన్‌సి కెఆర్ కళాశాలలో అత్యున్నత విద్యాబోధన



ఎఎన్‌సి కెఆర్ కళాశాలల భవన సముదాయం

(ఆన్‌లైన్, నరసరావుపేట)

అత్యున్నత విద్యా బోదన అందిస్తున్న విద్యా సంస్థలుగా నరసరావుపేటలోని పిఎన్‌సి కెఆర్ కళాశాలలు ప్రత్యేక గుర్తింపు సాధించాయి. హైటెక్ కోర్సులు నిర్వహిస్తూ పల్నాడు ప్రాంత విద్యాభివృద్ధికి ఈ కళాశాలలు కృషి చేస్తున్నాయి. డిగ్రీ కళాశాలలకు జాతీయ అంచనాలు, గుర్తింపు మండలి (నాక్) నుంచి బి++ గ్రేడ్ లభించింది. రాష్ట్రంలో మొత్తం కొన్ని కళాశాలలు మాత్రమే నాక్ గుర్తింపు లభించగా, వీటిలో పిఎన్‌సి కెఆర్ కళాశాల వుండటం విశేషం. కొత్త కోర్సులు నిర్వహించటంలో డిగ్రీ, పిజి కళాశాలలు ఆచార్య నాగార్జున యూనివర్శిటీ పరిధిలో ప్రముఖ స్థానంలో నిలిచాయి. శ్రీ వెంకటేశ్వర పాలడుగు నాగయ్య చౌదరి, కొత్త రఘు రామయ్య ఎడ్యుకేషన్ సొసైటీ ఆధ్వర్యంలో ఒకే క్యాంపస్‌లో ఎల్‌కెజి నుంచి పిజి వరకు విద్యా సంస్థలను నిర్వహిస్తున్నారు. అలాగే నర్సింగ్ స్కూల్, కాలేజి కూడా ఇదే క్యాంపస్‌లో నిర్వహించ బడుతున్నాయి. అనతి కాలంలోనే డిగ్రీ, పిజి విద్యా సంస్థలు అసాధారణ ప్రగతిని సాధించాయి. అన్ని హంగులతో భవనాలను, లైబ్రరీ, ల్యాబొరేటరీ, ఆడిటోరియంలను ఏర్పాటు చేశారు. ఎడ్యుకేషన్ సొసైటీ పాలకవర్గ కార్యదర్శి, కరస్పాండెంట్ డాక్టర్ ఎం.శివలింగ ప్రసాదరావు దీక్ష, దక్షలతో ఈ విద్యా సంస్థలు విశేష అభివృద్ధిని సాధిస్తున్నాయి. సొసైటీ ఆధ్వర్యంలో కొత్త రఘు రామయ్య జూనియర్ కళాశాల, పాలడుగు నాగయ్య చౌదరి, కొత్త రఘు రామయ్య డిగ్రీ, పిజి కళాశాలలు, పిఎన్‌సి అండ్ కెఆర్ నర్సింగ్ స్కూల్, నర్సింగ్ కాలేజ్, పాలడుగు నాగయ్య చౌదరి పబ్లిక్ స్కూల్‌లను నిర్వహిస్తున్నారు. జిల్లాలో ప్రప్రథమంగా బయోటెక్నాలజీ కోర్సును ఈ కళాశాలలో ప్రారంభించటం విశేషం. ఎంఎస్‌సి మైక్రో బయాలజీ, ఎంఎస్‌సి బయోకెమిస్ట్రీ, ఎంఎస్‌సి కంప్యూటర్స్, ఎంఎస్‌సి బోటనీ, ఎంఎస్‌సి బయోటెక్నాలజీ, ఎంసిఎ, పిజి కోర్సులను కళాశాలలో నిర్వహిస్తున్నారు. బికామ్, బిఎలతో పాటు, బిఎస్‌సి కంప్యూటర్ సైన్స్, ఎలక్ట్రానిక్స్, బయోకెమిస్ట్రీ, బయోటెక్నాలజీ తదితర కోర్సులను నిర్వహిస్తున్నారు. కళాశాలలో ఎన్‌సిసి, ఎన్ఎస్ఎస్ విభాగాల ద్వారా సేవా కార్యక్రమాలను అందిస్తున్నారు. ప్రతి ఏటా ప్రపంచ రక్తదాన దినోత్సవం సందర్భంగా విద్యార్థులు స్వచ్ఛంద రక్తదానం చేస్తున్నారు. విద్యార్థుల వ్యాయామం కోసం ప్రత్యేక జిమ్ ఏర్పాటు చేశారు. క్రీడల అభివృద్ధికి వివిధ కోర్టులను నిర్మించారు. తమ విద్యా సంస్థలను జిల్లాలోనే నెంబర్ వన్‌గా తీర్చిదిద్దాలనే లక్ష్యంతో పని చేస్తున్నట్లు కళాశాల కరస్పాండెంట్ డాక్టర్ మేదరమెట్ల శివలింగ ప్రసాదరావు తెలిపారు. అత్యుత్తమ మార్కులు సాధించిన విద్యార్థులను ప్రోత్సహించేందుకు ప్రతిభా పురస్కారాలు అందిస్తున్నామన్నారు.



కరస్పాండెంట్
డాక్టర్ మేదరమెట్ల
శివలింగ ప్రసాదరావు

# కుడికాలువ నీటి ద్వారా 150 మెగావాట్ల విద్యుత్ ఉత్పాదన



కుడి కాలువ పై డ్యాం వద్ద వున్న పవర్ ప్లాంట్

(ఆన్‌లైన్, నరసరావుపేట)

వ్యవసాయ ఉత్పత్తిలో అగ్రగామిగా నిలచిన సాగర్ కుడి కాలువ ప్రాంతం విద్యుత్ ఉత్పత్తి ఖిల్లాగా నిలిచింది. ప్రతిరోజు 150 మెగావాట్ల విద్యుత్ ఉత్పాదన కుడి కాలువల పై నిర్మించిన పవర్ ప్లాంట్ల ద్వారా జరుగుతుంది. డ్యాం వద్ద కుడి కాలువ పై వున్న పవర్ ప్లాంట్ ద్వారా 90 మెగావాట్ల విద్యుత్ ఉత్పత్తి జరుగుతున్నది. అలాగే కుడి కాలువ పై వివిధ ప్రాంతాలలో నిర్మించిన మినీ హైడల్ ప్లాంట్ల ద్వారా 40 మెగావాట్ల విద్యుత్ ఉత్పత్తి అవుతున్నది. రాష్ట్రంలో విద్యుత్ కొరతతో అనునిత్యం ఇబ్బందులు ఎదుర్కొంటున్న నేపథ్యంలో నాగార్జున సాగర్ కుడి కాలువల పై మినీ హైడల్ విద్యుత్ ప్రాజెక్టులను ప్రైవేటు సంస్థలు నిర్మించాయి. పంటలకు వినియోగించే నాగార్జున సాగర్ కాలువ నీటితో విద్యుత్ ఉత్పత్తి జరుగుతుంది. మొత్తం 24 మినీ హైడల్ విద్యుత్ ప్రాజెక్టులకు కుడి కాలువల పై నిర్మించబడి ప్రతిరోజూ విద్యుత్ ఉత్పత్తి చేస్తున్నాయి. గుంటూరు, ప్రకాశం జిల్లాల గుండా నాగార్జున సాగర్ కుడి కాలువ 216 కిలో మీటర్లు విస్తరించి ఉంది. కుడి కాలువ నుంచి చీలే గుంటూరు, అద్దంకి, బెల్లంకొండ, జూలకల్లు బ్రాంచ్ కెనాల్స్‌తో పాటు చిలకలూరిపేట మేజర్, పెదనందిపాడు బ్రాంచ్ కెనాల్ పై విద్యుత్ ప్రాజెక్టుల నిర్మాణం జరిగింది. ఈ బ్రాంచ్ కెనాల్స్ పై మూడు నుంచి పది అడుగుల ఎత్తులో వున్న డ్రాప్స్ నుంచి జలపాతం వలె కిందకు వేగంగా నీరు పడే ప్రదేశాల్లో మినీ హైడల్ ప్రాజెక్టుల నిర్మాణం జరిగింది.

నిర్మాణం పూర్తయి విద్యుత్ ఉత్పత్తి జరుగుతున్న ప్రాజెక్టుల వివరాలు ఇలా ఉన్నాయి. గుంటూరు బ్రాంచ్ కెనాల్ పై దక్కన్ సిమెంట్ లిమిటెడ్, సాగర్ పవర్, కెసిపి లిమిటెడ్ (ఐదు ప్లాంట్లు), రాయలసీమ పవర్ ప్రాజెక్టు, తిరుమల హైడల్ పవర్ ప్రాజెక్టు (మూడు ప్లాంట్లు), చిలకలూరిపేట మేజర్ పై అక్షయ్ ప్రొఫైల్స్ ప్రైవేట్ లిమిటెడ్ (రెండు), పెదనందిపాడు బ్రాంచ్ కెనాల్ పై పిఎంసి పవర్ ప్రాజెక్టు లిమిటెడ్, బెల్లంకొండ బ్రాంచ్ కెనాల్ పై యస్పార్ లిమిటెడ్ (రెండు), జూలకల్లు బ్రాంచ్ కెనాల్ పై శివాని పవర్ స్పిన్నర్, అద్దంకి బ్రాంచ్ కెనాల్ పై శ్రీ ధనలక్ష్మి కాటన్ (మూడు), ట్రైడెంట్ పవర్ సిస్టమ్ లిమిటెడ్(రెండు), శ్రీ జయలక్ష్మి పవర్ కార్పొరేషన్ లిమిటెడ్(రెండు) సంస్థల ఆధ్వర్యంలో మినీ హైడల్ పవర్ ప్లాంట్లు నిర్వహించబడుతున్నాయి.

సాగర్ కాలువలకు నీరు సరఫరా అయ్యే రోజుల్లో మాత్రమే ఈ విద్యుత్ ప్రాజెక్టుల ద్వారా విద్యుత్ సరఫరా అవుతుంది. అతి తక్కువ వ్యయంతో విద్యుత్ ఉత్పాదన జరుగుతుంది. ఉత్పత్తి అయిన విద్యుత్‌ను రాష్ట్ర పవర్ గ్రిడ్‌కు సరఫరా చేస్తారు. జిల్లా చరిత్రలోనే మినీ హైడల్ విద్యుత్ ప్రాజెక్టులను ఒక మైలురాయిగా పేర్కొనవచ్చును.



తాడికొండలోని ఎస్‌వివి హైస్కూల్

# విద్యా సంస్థల సమాహారం తాడికొండ

(ఆన్‌లైన్ – తాడికొండ)

స్వాతంత్ర్యానికి పూర్వం రవాణా సౌకర్యాలు లేని రోజుల్లోనే విద్యాసంస్థ ఆవిర్భావంతో తాడికొండ ఎనలేని గుర్తింపు పొందింది. దాతల దాతృత్వంలో విద్యాసంస్థలు దిన దినాభివృద్ధి చెంది విద్యాసంస్థల సమాహారంగా ఖ్యాతి లభించింది. ప్రాథమిక పాఠశాల నుండి డిగ్రీ కళాశాల, తెలుగు పండిత శిక్షణ కళాశాల వరకు ఆవిర్భవించాయి. ఎన్నో విద్యా సంస్థలకు తాడికొండ నిలయంగా మారింది. వాటి వెనుక విద్వాన్ గోగినేని కనకయ్య కృషి ఎంతో ఉంది. ఎలాంటి ప్రభుత్వ, ప్రైవేట్ విద్యాసంస్థలు లేని 1944–45లో వెల్లంకి వెంకటప్పయ్య పేరుతో ఉన్నత పాఠశాలను ప్రారంభించారు. వెంకటప్పయ్య కుమార్తె మల్లెల రత్నమ్మ తదితరులు విరాళాలతో ఈ పాఠశాల స్థాపితమైంది. ఈ పాఠశాల వజ్రోత్సవాలను గత ఏడాది జరుపుకున్నది. ఆరవతరగతి నుండి పదవ తరగతి వరకు ఇక్కడ చదివిన ఎందరో విద్యార్థులు ప్రస్తుత దేశవిదేశాల్లో విద్య, ఆర్థిక రాజకీయ, సామాజిక రంగాల్లో స్థిరపడి పేరు పొందారు. ఆణిముత్యాల్లాంటి సంఘం ఏర్పడి పాఠశాలకు రజతోత్సవ,

(మిగతా 80వ పేజీలో)

# దక్షిణ కాశీ కపోతేశ్వరస్వామి ఆలయం



కపోతేశ్వర స్వామి మూల విరాట్

(ఆన్‌లైన్, నరసరావుపేట)

చేజర్లలోని శ్రీ కపోతేశ్వర స్వామి ఆలయం దక్షిణ కాశీగా భాసిల్లుతున్నది. నరసరావుపేట పట్టణానికి 30 కిలోమీటర్ల దూరంలో నకరికల్లు మండలం, చేజర్లలో శతాబ్దాల క్రితం కపోతేశ్వర స్వామి ఆలయం నిర్మితమైనది. భారతదేశంలోని అత్యంత ప్రఖ్యాతి పొందిన కాశీ, ద్రాక్షారామం, కాళహస్తి లాంటి పుణ్యక్షేత్రాల్లో ఒకటిగా గుర్తింపు పొంది దేశ, విదేశీ భక్త జనులను, చరిత్ర కారులను కపోతేశ్వర స్వామి ఆలయం విశేషంగా ఆకర్షిస్తుంది. చారిత్రక ప్రాధాన్యత మాత్రమే కాక, పౌరాణిక ప్రాశస్త్యం పొందిన ఈ శివ క్షేత్రంలో శివరాత్రి, సంక్రాంతి, దసరా లాంటి పండుగలను వైభవంగా జరుపుతారు. ప్రతి ఏడాది మహాశివరాత్రి మూడవ రోజున స్వామి కళ్యాణోత్సవం జరుగుతుంది.

కపోతేశ్వర స్వామి చరిత్ర

కాశ్మీర్‌ను పాలించే శిబి చక్రవర్తి సోదరులు మేఘాడంబితుడు, జీమూత వాహనుడు తీర్థ యాత్రలు చేస్తూ 'చేరుంజర్ల' పర్వత ప్రాంతాల్లో తపస్సు చేసుకొని లింగాకృతి పొంది దేహ త్యాగం చేశారు. శిబి చక్రవర్తి తల్లి అనుమతితో ఈ ప్రాంతం వచ్చి 'శత యజ్ఞ దీక్ష' ప్రారంభించారు. ఈ యజ్ఞ ఫలానికి శిబి ఎంత వరకు అర్హుడో పరీక్షించటానికి త్రిమూర్తులు నిర్ణయించు కొన్నారు. స్వర్గలోకం నుంచి దిగి వచ్చిన త్రిమూర్తులు 'రూపెనగుంట్ల' గ్రామం వద్ద రూపు మార్చుకొన్నారు. శివుడు కిరాతకునిగా, విష్ణువు కపోతంగా, బ్రహ్మ బాణంగాను రూపుమార్చుకొన్నారు. శివుడు వదిలిన శరం కపోతాన్ని తాకగా, అది కుంటుతూ కుంకలగుంట ప్రాంతంలో పడింది. అలా కపోతం శిబి యజ్ఞం చేస్తున్న ప్రాంతానికి చేరింది. ఆ కపోతం శిబి చక్రవర్తిని శరణు వేడింది. కిరాతకుడు రూపంలో శివుడు వచ్చి కపోతాన్ని ఇవ్వమని అడుగగా, అందుకు శిబి అంగీకరించక పోవటంతో నీవు కోరిదవేని దాని ఎత్తు మాంసం నా దేహం నుంచి తీసి ఇస్తాను కాని, పక్షినీయనని అన్నాడు.

అందుకు ఆ కిరాతకుడు సమ్మతించాడు. అంతట శిబి త్రాసు నందు తన దేహం నందలి మాంసం తీసి తూచటం ప్రారంభించగా, ఎంత వేసినను సరి పోలేదు. శిబి చింతించి ప్రాణములు పోవటానికైనా తెగించి తలలో మెదడు తీసి త్రాసులో పెట్టినా చాలక పోవటం చే రెండో వైపు కూడా తీయబోవుచుండగా, త్రిమూర్తులు మెచ్చి కరుణించి ప్రత్యక్షమై వరము కోరుకోమనగా, ఆ శిబి చక్రవర్తి తనకు శివైఖ్య సంధానాన్ని తన పరివారానికి లింగాకృతులను దయచేయమని కోరాడు. అంత అతడు శివైఖ్యమై పాతాళం వరకు నాటుకొని వెలిశాడు. అతని కోటి పరివారాలు కోటి లింగాలై వెలిశాయి. ఈ విధంగా కపోతాన్ని రక్షించిన శిబి లింగాకృతి దాల్చి ధన్యుడగుటచే ఆ లింగమునకు 'కపోతేశ్వర లింగమని' పేరు వచ్చింది. ఈ స్వామి మహత్యం వలన ఆ స్థలం కపోతేశ్వర క్షేత్రంగా ప్రసిద్ధి చెందింది.



కపోతేశ్వర స్వామి ఆలయ ముఖ ద్వారం

## ఆలయ చరిత్ర

క్రీస్తు పూర్వ 3, 4 శతాబ్దాల కిందట కపోటేశ్వర స్వామి ఆలయం నిర్మాణం జరిగినట్లుగా దాఖలాలు వున్నాయి. సంస్కృత, పాళి బాషలో ఆలయంలో శాసనాలు వున్నాయి. ఆలయం గుడిసె ఆకృతి కలిగి ఇటుక, సున్నంతో నిర్మితమైంది. గర్భాలయం ఆకృతి విశిష్టమైనదిగా చెపుతుంటారు. దేశంలో హస్తిపృష్ఠ విమానం శాస్త్ర ప్రకారం నిర్మితమైన ఆలయం ఇదొక్కటే. ఈ ఆలయం తొలుత బౌద్ధ చైతన్య గృహమని అనేక సాక్ష్యాధారాలు కన్పిస్తాయి. ఆచార్య నాగార్జునుడు కాలంలో ఈ ఆలయం రూపుదిద్దుకుందని, ఇది ఒక విజ్ఞాన కేంద్రంగా భాసిల్లిందని చరిత్ర చెపుతుంది. ఆలయం ఆకృతి విశేషంగా వుండటం, వాటి మీద పలు బౌద్ధ క్షేత్రాల్లా కన్పించే చిత్రాలు, శిల్పాలు కూడా వుండటం బౌద్ధ చైతన్య గృహం అనటానికి సాక్ష్యాధారాలుగా నిలిచాయి.

ఆలయ ఆవరణలో పురాస్తు శాఖ ఆధ్వర్యంలో జరిపిన తవ్వకాల్లో బయలు పడిన అవశేషాలు బౌద్ధారామ జాడలు తెలియజేస్తున్నాయి. దీంతో ఈ ఆలయాన్ని సందర్శించటానికి బౌద్ధ బిక్షువులు కూడా వస్తుంటారు. దేవాదాయ శాఖ ఆధ్వర్యంలో ఆలయాన్ని నిర్వహిస్తున్నారు. ఆలయంలోని పురాతన కట్టడాలను కాపాడేందుకు కేంద్ర పురావస్తు శాఖ దేవస్థానాన్ని తన పరిధిలోకి తీసుకుంది. ఎంతో ప్రాముఖ్యత సంతరించుకొని ప్రాచీన కళా సంపత్తికి అద్దం పట్టే కపోతేశ్వర ఆలయాన్ని అభివృద్ధి చేయాలని భక్తులు కోరుకుంటున్నారు.

## విద్యా సంస్థల సమాహారం తాడికొండ

(79వ పేజీ తరువాయి)

వజ్రోత్సవ వేడుకలు జరిపి ఘనతను చాటుకున్నారు.

తాడికొండ విద్యాసంస్థల్లో మరో ప్రధానమైనది ఆంధ్రప్రదేశ్ గురుకుల బాలుర పాఠశాల. 1954లో రాష్ట్ర ప్రభుత్వం బేసిక్ ట్రైనింగ్ స్కూల్‌ను ఏర్పాటు చేసింది. 1968 వరకు కొనసాగిన ఈ స్కూలును విద్వాన్ గోగినేని కనకయ్య కృషివల్ల గురుకుల పాఠశాలగా రూపాంతరం చెందింది. ఈ గురుకులంలో పదవ తరగతి విద్యార్థులు రాష్ట్ర స్థాయిలో మొదటి పది ర్యాంకులు సాధించిన ఘనత గతంలో ఉండేది. తాడికొండ పేరు వినగానే గురుకుల పాఠశాల గుర్తుకు వచ్చేది. అంతటి ఖ్యాతి నార్జించిన ఈ పాఠశాలలో చదివిన ఎందో ఐఎఎస్, ఐపిఎస్ వంటి ఉన్నత స్థానాలతోపాటు జాతీయ స్థాయిలో అగ్రగణ్యులుగా ఉన్నారు. విద్యతోపాటు విద్యార్థుల్ని క్రమశిక్షణగా నడిపే భారత సౌట్స్ అండ్ గైడ్స్ రీజినల్ క్యాంపింగ్ సెంటర్ కూడా 1972లో తాడికొండలో స్థాపించారు. ఇప్పటికే ఇక్కడ స్కౌట్స్ అండ్ గైడ్స్ రీజినల్ క్యాంపింగ్ సెంటర్ కూడా 1972లో తాడికొండలో స్థాపించారు. ఇప్పటికీ ఇక్కడ స్కౌట్స్ అండ్ గైడ్స్ విద్యార్థులకు, ఉపాధ్యాయులకు శిక్షణలు ఇస్తుంటారు. 1967లో మల్లెల వెంకట సుబ్బయ్య ప్రాథమికోత్నత పాఠశాల, 1968లో గోగినేని కనకయ్య సంస్కృతాంధ్ర డిగ్రీ కళాశాల ఏర్పాటైనాయి. కేవలం ఇద్దరు అధ్యాపకులతో ప్రారంభించిన ఈ సంస్కృతాంధ్ర కళాశాల ఎందో పేద విద్యార్థులకు అయిదేళ్ల డిగ్రీ పట్టాలందించింది. కోస్తా ఆంధ్ర నుండి ఎందరో విద్యార్థులు సంస్కృతాంధ్ర డిగ్రీ కళాశాలలో చేరి డిగ్రీ పట్టాలందుకుని భాషా ప్రవీణులుగా తయారవుతున్నారు. 1977లో విద్వాన్ కనకయ్య తన సతీమణి వెంకాయమ్మ పేరుతో ఏర్పాటు చేసిన ప్రాథమికోన్నత పాఠశాల 1979లో ఉన్నత పాఠశాలగా రూపుదాల్చింది. ఈ పాఠశాల కేవలం బాలికలకు మాత్రమే. జిల్లాలో బాలికల ఉన్నత పాఠశాలగా ప్రత్యేకత పొందింది. 1974లో భగవాన్ సత్యసాయిబాబా పేరిట బిఎస్ఎస్‌బి జూనియర్ కళాశాల ఏర్పాటు చేశారు. అనతి కాలంలో 1976లో దానికి అనుబంధంగా డిగ్రీ కళాశాలను కూడా అదే ప్రాంగణంలో స్థాపించారు. ఈ రెండు కళాశాలలో గ్రామీణ విద్యార్థులకు ఎంతో బాసటగా నిలిచాయి. ఉన్నత విద్య అందించడంలో ఈ జంట కళాశాలలో దోహదం చేశాయి. బిఎ, బికాం, బిఎస్‌సి కోర్సులతో ఉన్న కళాశాల తాజాగా ఎంఎస్‌సి కెమిస్ట్రీ వంటి పిజి కోర్సులను ప్రారంభించింది.

1981లో విద్వాన్ కనకయ్య స్థాపించిన సత్యసాయి ఇంగ్లీషు మీడియం ప్రాథమిక పాఠశాల ఉన్నత పాఠశాలగా రూపుదిద్దుకుంది.

# ప్రగతి పథంలో గుంటూరు జిల్లా సహకార కేంద్రబ్యాంకు



డా॥ వై.యస్.రాజశేఖరరెడ్డి
ముఖ్యమంత్రివర్యులు



శ్రీ కన్నా లక్ష్మీనారాయణ
రాష్ట్ర సహకార, రవాణా శాఖామాత్యులు



శ్రీ మురుగుడు హనుమంతరావు
రాష్ట్ర సర్వశిక్షా అభియాన్ శాఖామాత్యులు



శ్రీ మోపిదేవి వెంకటరమణ
రాష్ట్ర ఓడలు, విమానయాన,చౌమురు పెట్టుబడుల శాఖామాత్యులు



శ్రీ కాసు వెంకట కృష్ణారెడ్డి
రాష్ట్ర పౌర సరఫరాలు, మరియు తూనికల శాఖామాత్యులు



శ్రీమతి నేదురుమల్లి రాజ్యలక్ష్మి
జిల్లా ఇన్‌చార్జ్ శాఖామాత్యులు



శ్రీ మహమ్మద్ అలీ రఫత్
జిల్లా కలెక్టర్, గుంటూరుజిల్లా



శ్రీమతి కూచిపూడి విజయలక్ష్మి
జిల్లాపరిషత్ ఛైర్‌పర్సన్



శ్రీ వసంత నాగేశ్వరరావు
ఆప్కాబ్ ఛైర్మన్



శ్రీ మహ్మద్ ఫరీదుద్దీన్
సహకార శాఖామాత్యులు

INDIRAMMA

## 167 సహకార సంఘముల ద్వారా రైతన్నకు సహాయ సహకారాలు

### బ్యాంకు ప్రగతి వివరములు

| వివరములు | 2005-06 సం॥ (రూ లక్షలు) | 2006-07సం॥ (రూ లక్షలు) |
|---|---|---|
| 1. షేరు ధనము | 3889.49 | 3995.29 |
| 2. రిజర్వు ఫండ్ | 294.58 | 352.57 |
| 3. డిపాజిట్లు | 15065.54 | 15181.35 |
| 4. చెల్లించవలసిన ఋణములు | 31664.53 | 32612.29 |
| 5. అప్పులు నిల్వలు | 49321.68 | 52228.50 |
| 6. నికర లాభము | 231.94 | 128.00 |

### రైతున్నకు ఋణ సహాయం

| | 2005-06 (రూ. లక్షలలో) | | 2006-07 (రూ.లక్షలలో) | |
|---|---|---|---|---|
| | లక్ష్యము | లక్షలలో సాధించినది | లక్ష్యము | లక్షణలలో సాధించినది |
| 1. స్వల్పకాలిక (వ్యవసాయ అప్పులు) | 13200.00 | 8813.60 | 15000.00 | 10291-63 |
| 2. దీర్ఘకాలిక అప్పులు | 3150.00 | 2371.41 | 400.00 | 682.44 |
| ట్రాక్టర్లు | 400.00 | 246.57 | 50.00 | 117.14 |
| 3. స్వయం సహాయక సంఘాలు | 600.00 | 145.42 | 200.00 | 32.08 |
| 4. రైతుమిత్ర గ్రూపులు | 600.00 | 95.42 | 100.00 | 45.10 |

### వడ్డీమాఫి పధకము (విదర్భ ప్యాకేజి)

2005-06

| ఎ) వివరములు | నెం. | బ్యాంకు నుండి క్లెయిము చేసిన మొత్తము | ప్రభుత్వ నుండి విడుదల చేసినమొత్తము |
|---|---|---|---|
| స్వల్పకాలిక | 126345 | 4645.32 | |
| దీర్ఘకాలిక | 13559 | 883.86 | |
| మొత్తము | 139994 | 5626.18 | 2785.91 |

### వైద్యనాధన్ కమిటి ద్వారా సంఘముల ఆర్థిక సహాయ ప్యాకేజ్

| | | |
|---|---|---|
| మెత్తము సంఘములు | 167 | |
| మొదటి దఫా | ఆర్థిక సహాయము పొందిన సంఘములు | |
| | 95 | 22.75 (కోట్లు) |
| రెండవ ధఫా | పొందవలసిన సంఘములు | |
| | 58 | 89.00 (కోట్లు) |
| మూడవ దఫా | 14 | 53.00(కోట్లు) |
| | 167 | 164.75 (కోట్లు) |

### రైతన్నకు ప్రభుత్వ వడ్డీ రాయితి

| | లబ్ధిదారులు | వివరములు మెత్తము (రు. లక్షలలో) |
|---|---|---|
| 2005-06 | 107536 | 615.50 |
| 2006-07 | 132236 | 645.65 |

### రైతన్నలకు ఎరువుల విక్రయం

| | సంఘములు | టన్నులు | మెత్తము (లక్షలలో) |
|---|---|---|---|
| 2005-06 | 55 | 3110 | 351.44 |
| 2006-07 | 74 | 7238 | 1037.93 |
| 2007-08 (ఆన్ గోయింగ్) | | 3210 | 378.54 |

### జిల్లా కేంద్ర సహకార బ్యాంకులో పొదుపు - బంగారు భవితకు మదుపు

ఆకర్షణీయమైన వడ్డీ, ఇన్సూరెన్స్ రూ 100000 వరకు

| | | |
|---|---|---|
| 15 రోజుల నుండి | 45 రోజుల వరకు | 5.00% |
| 46 రోజుల నుండి | 90 రోజుల వరకు | 5.50% |
| 91 రోజుల నుండి | 179 రోజుల వరకు | 6.25% |
| 180 రోజుల నుండి | 1 సం॥లోపు | 7.50% |
| 1 సం॥నుండి ఆపై | 2 సం॥ల లోపు | 9.00% |
| 2 సం॥ | 3 సం॥ల లోపు | 9.50% |

3 సం॥ మరియు పైబడిన కాలమునకు 9.00%

### రూ. 15 లక్షల ఏకమొత్తము డిపాజిటునకు

| | |
|---|---|
| 1 సం॥ ఆపైబడిన కాలమునకు | 0.50% |
| 2 సం॥ ఆపైబడిన కాలమును | 0.75% |

### 2004-05 సంవత్సరములో చేనేత కార్మికులకు స్వరాజ్ గార్ క్రెడిట్ కార్డుల పధకము అమలుపరచినది.

| | నెంబరు | మెత్తము | 2006-07 | మొత్తము |
|---|---|---|---|---|
| అంచనా | 500 | ---- | 766 | 48.20 |
| సాధించినది | 457 | రూ. 12.10 లక్షలు | | |



శ్రీ విశ్వనాథం
జనరల్ మేనేజర్

శ్రీ కుర్రి పున్నారెడ్డి, అధ్యక్షులు, శ్రీ నల్లపాటి శివరామచంద్రశేఖరరావు, డైరెక్టరు, శ్రీ అల్లు నరసింహారెడ్డి, డైరెక్టరు, శ్రీ కొసరాజు రవీంద్రనాథ్, డైరెక్టరు, శ్రీ కోటా కృష్ణ, డైరెక్టరు, శ్రీ ఘంటా కామేశ్వరరావు, డైరెక్టరు, శ్రీ చింతగుంట్ల రామిరెడ్డి, డైరెక్టరు, శ్రీ నల్లపాటి రామయ్య, డైరెక్టరు, శ్రీ పూషడపు తాతయ్య, డైరెక్టరు, శ్రీ వెలువోలు వెంకట లక్ష్మీనారాయణ, డైరెక్టరు, శ్రీమతి కర్రి కమలమ్మ, డైరెక్టరు, శ్రీ చింతమళ్ళ చినరామారావు, డైరెక్టరు, శ్రీ తాడిశెట్టి వీరయ్య డైరెక్టరు శ్రీ ఎనికపల్లి సత్యనారాయణ, డైరెక్టరు, శ్రీ కె.కె.డి.వి. ప్రసాదరావు, డైరెక్టరు, శ్రీ జంజనం కృష్ణమూర్తి, డైరెక్టరు, శ్రీ పట్టెం జగన్మోహనరావు, డైరెక్టరు శ్రీ రేపూడి వెంకటేశ్వర్లు, డైరెక్టరు, శ్రీ వెనిగళ్ళ జవహర్, డైరెక్టరు శ్రీ రవి వడ్లమాని, డైరెక్టరు



శ్రీ కుర్రి పున్నారెడ్డి
ఛైర్మన్, గుంటూరు జిల్లా కేంద్ర సహకార బ్యాంకు

# పలనాటి ప్రజల కొంగు బంగారం

# మాచర్ల చెన్నకేశవుడు

(ఆన్‌లైన్, మాచర్ల)

పౌరుషం ఎగసిపడే పల్నాటి ప్రాంతంలో ప్రజలకు ఆధ్యాత్మిక చింతనను కలిగిస్తూ ప్రజల మనోభీష్టాన్ని నెరవేరుస్తూ పల్నాటి ప్రజల పాలిట మణిహారంగా వెలసిన శ్రీ లక్ష్మి చెన్నకేశవస్వామి ఆలయం చారిత్రకంగా ఎంతో ప్రసిద్ధికెక్కింది. త్రేతాయుగంలో ఈ ప్రాంతమంతా దండకారణ్యం. పూర్వకాలంలో కార్తవీర్యార్జుని వంశీకులు నిర్మించిన చెన్నకేశవ ఆలయాన్ని పల్నాటి బ్రహ్మనాయుడు 13వ శతాబ్దంలో పునర్నిర్మించినట్లు చారిత్రక గ్రంథాలు చెబుతున్నాయి. క్రీస్తుశకం 1397 వరకు మాచర్లను మహాదేవిచర్లగా పిలిచేవారని, నాటి ఆ పేరే మాచర్లగా మారిందని, రెండవ ప్రతాపరుద్ర మహాదేవ రాజు సామాంతరాజైన మాచాయనాయుడు పేరు మాచాయ శబ్దం కాలక్రమేణా మాచర్లగా మారి వుండవచ్చునని శాస్త్రాలు చెబుతున్నాయి. ఈ శాసనం తరువాత లభించిన అనేక ఆధారాల్లో మాచర్ల అని రాయబడి వుంది. అంతేకాక బ్రహ్మనాయుడు మజిలీ చేసిన తావు మాచర్ల అయిందని, తన స్వస్థలమైన మాచపురానికి బదులుగా బ్రహ్మనాయుడు మాచర్లను నిర్మించాడని పద్మనాభ చరిత్ర చెబుతోంది. మాచర్లకు విష్ణుపురి అనే మరొక పేరు వుంది.

చంద్రవంక నది తీరంలో ప్రవహం తూర్పు-పశ్చిమ దిశల నుండి ఉత్తరం వైపునకు ప్రవహిస్తుంది. ఉత్తర వాహిణి స్థలం పరమ పవిత్రమైనదని భావిస్తూ వుంటారు. అలాంటి పవిత్రమైన ప్రదేశంలో శ్రీ చెన్నకేశవస్వామి వెలిశాడు. సర్వమానవ సమానత్వాన్ని సౌభ్రాతృత్వాన్ని 13వ శతాబ్దంలోనే చాటి చాపకూటి సిద్ధాంతంతో మానవులంతా ఒక్కటేనని నిరూపించిన బ్రహ్మనాయుడి పేరు వింటే ప్రతి ఒక్కరికి స్ఫూరించేది ఆయన పునర్నిర్మించిన మాచర్లలోని శ్రీ లక్ష్మి చెన్నకేశవస్వామి వారి దేవాలయమే. పౌరుషాల పురిటిగడ్డగా, పంతాలకు పోతుగడ్డగా ప్రసిద్ధికెక్కిన పల్నాడులో 13వ శతాబ్దంలో మలిదేవరాజు ఆస్థాన మంత్రి బ్రహ్మనాయునిచే పునర్నిర్మించబడిన ఈ దేవాలయం సుప్రసిద్ధమైన పలనాటి పుణ్య క్షేత్రం.









మాచర్ల శ్రీ లక్ష్మీచెన్నకేశవ ఆలయం

## ఆనాటి శిల్ప కళకు ప్రతీకగా

ఈ ఆలయంలోని శిల్ప కళా వైభవం నాటి కళాకారుల నైపుణ్యతను తెలియజేస్తాయి. అందానికి ప్రతిరూపమైన విష్ణువు చెన్నుని రూపంలో ఈ ఆలయంలో వెలిశాడని ప్రతీతి. స్వామి వారి విగ్రహం గర్భగుడిలో మూడు అడుగుల ఎత్తులో వుంది. అందులో భూదేవి, శ్రీదేవి సమేత చెన్నకేశవుడు యాగభేరాలు, తీర్థ, బకిబేరాలు, అళ్వారులు, రామానుజులు, వడయరాజులు, వెన్నముద్దల కృష్ణయ్య, ఉత్సవమూర్తులు వున్నాయి. గర్భగుడికి ముందు రంగ మండపం వుంది. దీనిని పరిశీలిస్తే నాటి శిల్పకళా చాతుర్యం ఏ విధంగా వుందో విశిధమవుతోంది. ఈ మండపంలోని నాలుగు స్థంభాల పై ఈశాన్య దిశ వైపు వున్న స్తంభం పై భారత ఘట్టాలైన కర్ణార్జునుల యుద్ధం, పాచికలాట, అశ్వమేథయాగం, గథాయుద్ధం చెక్కబడినవి. ఆగ్నేయ స్తంభం పై రామాయణంలోని మాయలేడిని వేటాడడం, వాలి సుగ్రివ యుద్ధం, కైలాస గిరిని ఎత్తడం, నైరుతి స్తంభం పై భాగవతంలోని వినాయక, గజాసురుని యుద్ధం, త్రిపుర సంహారం, సాగర మధనం, దేవతాకూటమి, ఏనుగుల అభిషేకం, అమృతం పంచటం వంటివి శిల్పాలలో మలచబడ్డాయి. ఇటువంటి ఎన్నో ఘట్టాలను మనోహరంగా శిల్పులు మలిచారు.



శ్రీ చెన్నకేశవస్వామి

## చెన్నకేశవుని సన్నిధిలో శ్రీ లక్ష్మి ఆలయం

కాలగమనంలో చెన్నకేశవాలయం ఎన్నోసార్లు పునరుద్ధరించినట్లు తెలుస్తోంది. ఈ ప్రాంతాన్ని శైవులు, కాకతీయులు ఏలినట్లు చరిత్ర చెబుతోంది. సూరపురాజువంశీయుల సంతానమైన లక్ష్మిదేవమ్మ చెన్నునిలో ఐక్యమైనందున ఇదే ఆలయంలో లక్ష్మిదేవికి మరో ఆలయాన్ని నిర్మించారు. ప్రతి సంవత్సరం చైత్రశుద్ధ పంచమి నాడు స్వామివారి కళ్యాణంతో ప్రారంభమై 16 రోజుల పాటు జరిగే ఉత్సవాలు రథోత్సవంతో ముగుస్తాయి. దుర్గి వాస్తవ్యులు కుంచనపల్లి నారాయణ పంతులు 1980, ఏప్రిల్ 29న స్వామివారి రథాన్ని తయారు చేయించారు. ఆనాడే మొదటి రథోత్సవం జరుపుకుంది. కులమతాలకు అతీతంగా భక్తులు చెన్నకేశవుని దర్శించి కటాక్షం పొందుతుంటారు. జై చెన్నకేశవా.. జైజై చెన్నకేశవా... అంటూ భక్తులు చేసే నినాదాలతో ఈ ప్రాంతం భక్తి పారవశ్యంతో మారుమోగుతోంది.



లక్ష్మీదేవి అమ్మవారు

## భక్తుల లేమిని తీర్చే చెన్నునికి ఎన్ని కష్టాలో

ఎంతో ఆదాయం కలిగిన శ్రీ లక్ష్మి చెన్నకేశవ ఆలయ ఆస్తులు అన్యాక్రాంతమై నేడు పోషణే ప్రశ్నార్థకమైంది. ఒకప్పుడు రెండు వేల ఎకరాలకు పైగా వున్న దేవుని మాన్యం హారతి కర్పూరంలా కరిగిపోయింది. ఉన్న కొద్దిపాటి భూముల నుండి కూడా నామమాత్రపు ఆదాయమే వస్తోంది. ఆలయ కమిటి ఏర్పాటుచేసిన నిత్య కళ్యాణ వేడుకల ద్వారా ఈ స్వామికి కాసింత ప్రసాదం, తీర్థం లభ్యమవుతున్నాయి. భక్తులు ఇచ్చే కానుకల పైనే ఆలయ వేడుకలు ఆధారపడడం శోచనీయం. ఎన్నో విశిష్టతలున్న చెన్నుని దర్శనార్థం వచ్చే దూర ప్రాంతీయులకు బస చేసేందుకు ఏమాత్రం సౌకర్యాలు లేవు. యగ్న యాగాదులు నిర్వహించేందుకు ఏర్పాట్లు లేవు. ఉత్సవ వేళల్లో స్వామి వారిని ఊరేగించే ప్రత్యేక వాహనాలను భద్రపరచే వాహనశాల కూలిపోయింది. గర్భగుడిలోనే ఆ వాహనాలను వుంచడం వల్ల ఆ ప్రాంగణం ఇరుకైంది. వసతులను మెరుగుపరచాలని భక్తజనం నివేదిస్తున్నా సంబంధిత అధికార యంత్రాంగం మాత్రం స్పందించడం లేదు.

# 'ఆంధ్రజ్యోతి'కి 5వ వార్షికోత్సవ శుభాకాంక్షలు

## అభివృద్ధిపథంలో ఆరుంబాక పంచాయితీ:



శ్రీమతి మిద్దె వెంకాయమ్మ
సర్పంచ్, ఆరుంబాక



పేద విద్యార్థికి మిద్దె ఫౌండేషన్ స్వచ్ఛంద వితరణ



వృద్ధులకు స్వచ్ఛంద వితరణ అందచేస్తున్న సర్పంచ్ మిద్దె వెంకాయమ్మ



శ్రీ మిద్దె సాంబశివరావుగారు

**వార్డు సభ్యులు:**

1) యేమినేని విజయలక్ష్మి, 1వార్డు
2) దాసరి శివశంకరరావు, 2వార్డు
3) తాతా వెంకట రవి, 3వార్డు
4) పొట్లూరి శ్రీనివాసరావు, 4వార్డు
5) కొమరగిరి రమణమ్మ, 5వార్డు
6) బొక్కం సత్యనారాయణ, 6వార్డు
7) వేము రమేష్, 7వార్డు
8) వేము జ్యోతి, 8వార్డు
9) కర్రా ఎలిజబెత్, 9వార్డు
10) పీటా బసవయ్య, 10వార్డు
11) అద్దంకి విమలమ్మ, 11వార్డు

**వైస్‌ప్రెసిడెంట్ : గాదె బేబి శ్రీదేవి, 12వార్డుమెంబరు**
**కార్యదర్శి : జి.నరసింహారావు మరియు సిబ్బంది**

**అభివృద్ధి చేసిన పనులు:**

1) ఎస్‌జిఆర్‌వై నిధులు లక్షా 30వేల రూపాయలతో ఆరుంబాకలో సైడ్ డ్రెయిన్లు నిర్మాణం
2) యేమినేనివారిపాలెంలో రూ లక్షా 70వేలతోరెండు మెటల్ రోడ్ల నిర్మాణం.
3) ఎస్టీకాలనీలో రూ 70వేలతో మెటల్‌రోడ్డు నిర్మాణం
4) ఎస్‌సికాలనీలో రూ 70వేలతో మెటల్‌రోడ్డు నిర్మాణం
5) కామినేనివారిపాలెంలో రూ 65వేలతో మెటల్‌రోడ్డు నిర్మాణం
7) సొంత నిధుల నుంచి వంద మందికి నెలకు ఒక్కొక్కరికి రూ.200ల చొప్పన కి వృద్ధాప్య ఫించన్లు
8) పేద విద్యార్థులకు రూ 55వేలు ఆర్థిక సహాయం
9) నిరుపేదలకు వైద్యచికిత్సల నిమిత్తం ఆర్థికసహాయం
10) పంచాయితీలో వీధి దీపాల మెరుగుపర్చటంలో భాగంగా అన్నిస్తంభాలకు ట్యూబ్‌లెట్లు ఏర్పాటు

**చేపట్టనున్న అభివృద్ధి పనులు:**

1) గ్రామ పంచాయితీ పరిధిలో తాగునీటి సౌకర్యం కల్పించటం
2) పంచాయితీ పరిధిలో సిమెంటు రోడ్ల నిర్మాణం
3) ప్రభుత్వ సంక్షేమ పథకాలపై అవగాహన కల్పించి అర్హులైనవారికి అందేలా చూడటం.
4) సంపూర్ణ అక్షరాస్యతకోసం తమవంతు కృషి చేయటం.
5) విద్య, వైద్యరంగంలో మెరుగైన సేవలందించటం
6) సాగునీటి, మురుగునీటి కాల్వల ఆధునీకరణ పనులు చేపట్టేందుకు కృషిసల్పటం

# రైతుల పాలిట వరం - రాయపూడి ఎత్తిపోతల పథకం



కృష్ణాతీరంలో నిర్మించిన రాయపూడి ఎత్తిపోతల పథకం



రాయపూడి ఎత్తిపోతల రైతుల కార్య నిర్వాహక కార్యాలయం

(ఆన్‌లైన్-తుళ్ళూరు)

పరవళ్ళు త్రొక్కుతూ ప్రవహిస్తున్న కృష్ణానది నీటిని పంటకాలువలకు మళ్ళిస్తున్న రాయపూడి ఎత్తిపోతల పథకం తుళ్ళూరు మండల రైతుల పాలిట వరంగా మారింది. వర్షాధార పంటలపై ఆధారపడిన 4700 ఎకరాలకు సాగునీరు అందడంతో సస్యశ్యామలమయింది. సుమారు 1800 మంది రైతులు రాయపూడి ఎత్తిపోతల పథకం కారణంగా ఆర్థిక పరిపుష్టిని సాధించారు. పార్టీలకు అతీతంగా ప్రజాప్రతినిధులు చేసిన కృషికి, అధికారులు చేయూతను అందించడంతో రైతుల స్వప్నం సాకారమయింది. పథకాన్ని రైతులు సమిష్టి కృషితో విజయవంతం చేయగా, రైతు కమిటీ నిర్వహణా తీరు రాయపూడి ఎత్తిపోతలను రాష్ట్రానికే ఆదర్శంగా నిలిపింది.

మండలంలోని రాయపూడి గ్రామ సమీపంలో కృష్ణానది తీరాన 862.54 లక్షల వ్యయంతో ఏర్పాటుచేసిన పథకం అమలు తీరును పరిశీలించేందుకు రాష్ట్రంలోని ఇతర జిల్లాల నుండి వచ్చిన వేలాదిమంది రైతులు స్ఫూర్తిని పొందారు. రాయపూడి ఎత్తిపోతల పథకానికి నాబార్డు 653.40 లక్షల రూపాయలను మంజూరు చేయగా, 208.65 లక్షలను రాష్ట్ర ప్రభుత్వం కేటాయించింది. దీని ద్వారా 81 క్యూసెక్కుల పరిమాణం గల నీరు 10 కిలోమీటర్ల దూరం కాలువల ద్వారా ప్రవహించి సాగునీటిని ఆయకట్టు భూములకు అందజేస్తోంది.

టిడిపికి చెందిన కోడెల శివప్రసాద్ రావు, కాంగ్రెస్‌కు చెందిన రాయపాటి సాంబశివరావు, సిపిఎంకు చెందిన నిమ్మగడ్డ రామమోహనరావుల కృషితో పథకం రూపుదిద్దుకుంది. నేషనల్ ఫ్రంట్ అధికారంలో అప్పటి ప్రధానమంత్రి దేవెగౌడ, గ్రామీణాభివృద్ధి శాఖ మంత్రి కె ఎర్రంనాయుడులను ఒప్పించడంలో గుంటూరు నాయకులు కీలకపాత్ర పోషించారు. తొలుత 7.26 కోట్ల రూపాయలు మంజూరు కాగా 1997లో పథకం శంఖుస్థాపన జరిగింది. పథకం నిర్మాణ సమయంలో రైతుల నుండి భూవివాదాలు ఎదురవడంతో కొన్ని నెలల పాటు నిర్మాణంలో జాప్యం జరిగింది. అప్పటి జిల్లా కలెక్టర్ జివిఎస్ రావు భూ వివాదాలను పరిష్కరించడంలో ప్రత్యేక శ్రద్ధ చూపారు.

చివరకు ఎపి ట్రాన్స్‌కో విద్యుత్ కనెక్షన్ ఇచ్చేందుకు నిరాకరించడంతో తాడికొండ నియోజకవర్గ ఎమ్మెల్యే అయిన జెఆర్ పుష్పరాజ్ చొరవ చూపి విద్యుత్ సరఫరా ఏర్పాటు చేయడంతో రైతుల కల నెరవేరింది.

దీంతో మండలంలోని వెలగపూడి, కొండంరాజు పాలెం (తుళ్ళూరులోని కొంతభాగం), నేలపాడు, శాఖమూరు, అయినవోలు, గ్రామాల రైతుల్లో ఆనందం వెల్లివెరిసింది.

## రాష్ట్రంలోనే తొలి అడ్మినిస్ట్రేటివ్ బిల్డింగ్

ఎత్తిపోతల పథకానికి చెందిన కార్యకలాపాలు నిర్వహించేందుకు రాష్ట్రంలోనే తొలిసారిగా భవనాన్ని ఏర్పాటు చేసిన ఘనత రాయపూడి ఎత్తిపోతల పథకం రైతు సంక్షేమ అభివృద్ధి సంఘానికే దక్కుతుంది. రాజ్యసభ సభ్యులు యడ్లపాటి వెంకట్రావు నిధులు, జన్మభూమి నిధులకు తోడు రైతుల కంట్రిబ్యూషన్ కలిపి 9 లక్షల వ్యయంతో నిర్మించిన అడ్మినిస్ట్రేటివ్ బిల్డింగ్ 2004లో ప్రారంభించారు. భవనంపై 7.50 లక్షల రూపాయలతో జిల్లా పరిషత్ (న్ఆర్ సెల్) నిధులతో అదనంగా కాన్ఫరెన్స్ హాలు నిర్మించారు.

ప్రస్తుతం రైతు కమిటీగా అధ్యక్షులుగా గద్దె వెంకటేశ్వరరావు, ఉపాధ్యక్షులుగా తరిగోపుల సాంబశివరావు, కోశాధికారిగా దామినేని శ్రీనివాసరావు, కార్యదర్శిగా పువ్వాడ శేషుబాబు, సంయుక్త కార్యదర్శిగా కర్నాటి బాపయ్య వ్యవహరిస్తున్నారు. రైతుల భాగస్వామ్యంతో విజయవంతంగా నడుపబడుతున్న రాయపూడి ఎత్తిపోతల పథకం రాష్ట్రంలోని ఇతర ఎత్తిపోతల పథకాలకు ఆదర్శంగా నిలిచింది.

ఈ పథకం ఇచ్చిన స్ఫూర్తితో రైతులు పట్టుబట్టి మండలంలో మరో రెండు ఎత్తిపోతల పథకాలను సాధించారు. ప్రస్తుతం మండల పరిధిలో తుళ్ళూరు, అనంతవరం ఎత్తిపోతల పథకాలు నిర్మాణంలో ఉన్నాయి. వీటి ద్వారా మరో 10వేల ఎకరాల భూములు సస్యశ్యామలం కానున్నాయి.



రాయపూడి స్కీంకు చెందిన డెలివరీ బావులు



రాయపూడి ఎత్తిపోతలకు చెందిన మోటార్లను పరిశీలిస్తున్న ఏపిఎస్ఐడిసి ఎండి ఎకె జైన్

## గణపా రామస్వామిరెడ్డిని నాలుగుసార్లు శాసనసభ్యునిగా

# ఆదరించిన పెదకూరపాడు



గణపా రామస్వామిరెడ్డి

(ఆన్‌లైన్ - పెదకూరపాడు)

మారుమూల గ్రామంలో రైతుకుటుంబంలో జన్మించి రాష్ట్రంలో అతిపెద్ద నియోజకవర్గంగా గుర్తింపు పొందిన పెదకూరపాడు నియోజకవర్గానికి ఒకే అభ్యర్థిని నాలుగుసార్లు శాసనసభ్యునిగా ఎన్నుకున్న చరిత్ర నియోజకవర్గ ప్రజలకు ఉంది. 1922 సంవత్సరంలో అమరావతి మండలం మునగోడు గ్రామంలో గణపా చిన రాఘవరెడ్డి, పిచ్చమ్మలకు రామస్వామిరెడ్డి జన్మించారు. ఆయన పట్టభద్రుడు. మునగోడు మాజీ మునసబు గణపా వెంకటరెడ్డి సతీమణి రామతులశమ్మ బంధువు ప్రకాశం జిల్లా వాసి మాజీ మంత్రి కందుల ఓబుల్‌రెడ్డి, బెజవాడ గోపాలరెడ్డిలు ఆచార్య ఎన్‌జి రంగాకు పరిచయం చేయటంతో గుణపా రామస్వామిరెడ్డి రాజకీయ రంగప్రవేశం చేశారు. పార్టీ సిద్ధాంతాలతో నిమిత్తం లేకుండా ఏ పార్టీ నీడన ఉన్నా తనదైన పంథాలో నాలుగుసార్లు శాసనసభకు ఎన్నికయిన గణపా రామస్వామిరెడ్డి విశిష్టస్థానం సంపాదించారు. పెదకూరపాడు నియోజకవర్గాన్ని పునర్వ్యవస్థీకరించినప్పటి నుంచి గణపా రామస్వామిరెడ్డి 1955లో ఆచార్య ఎన్‌జి రంగా స్థాపించిన కృషికార్ లోక్ పార్టీ అభ్యర్థిగా పెదకూరపాడుకు చెందిన దర్శి లక్ష్మయ్యపై 6,205 ఓట్ల మెజార్టీతో గెలుపొందారు. 1962లో సిపిఐ అభ్యర్థి ఊటుకూరుకు చెందిన పుతుంబాక వెంకటపతిపై కాంగ్రెస్ పార్టీ అభ్యర్థిగా గణపా రామస్వామిరెడ్డి పోటీ చేసి 2,261 ఓట్ల మెజార్టీతో గెలుపొందారు. 1967లో కాంగ్రెస్‌పార్టీ అభ్యర్థిగా గణపారామస్వామిరెడ్డి సిపియం అభ్యర్థిగా పోటీచేసిన పుతుంబాక వెంకటపతిపై 20,565 ఓట్ల మెజార్టీతో గెలుపొందారు. 1972లో కాంగ్రెస్ పార్టీ అభ్యర్థిగా పోటీచేసిన గుంటూరుకు చెందిన ఫాతిమున్నీషా బేగంపై ఇండిపెండెంట్ అభ్యర్థిగా పోటీచేసిన గణపారామస్వామిరెడ్డి 16,520 ఓట్లతో ఓటమిపాలయ్యారు. 1978 జనతాపార్టీ అభ్యర్థిగా పోటీ చేసిన గణపా రామస్వామిరెడ్డి కాంగ్రెస్‌పార్టీ అభ్యర్థిగా పోటీచేసిన పెదకూరపాడుకు చెందిన సయ్యద్ మహబూబ్‌పై 3,295 ఓట్ల మెజార్టీతో విజయం సాధించారు. 1983లో తెలుగుదేశం పార్టీ అభ్యర్థిగా పోటీచేసిన ఉప్పలపాడుకు చెందిన అల్లంశెట్టి విశ్వేశ్వరరావుపై కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీచేసిన గణపా రామస్వామిరెడ్డి 23,018 ఓట్ల తేడాతో ఓటమిపాలయ్యారు. కొంతకాలం జిల్లా మార్కెటింగ్ సొసైటీ అధ్యక్షునిగా కూడా రామస్వామిరెడ్డి పనిచేశారు. రామస్వామిరెడ్డి ఎమ్మెల్యేగా ఎన్నికయినా నివాసం మాత్రం గుంటూరులో ఉండేవారు. పెదకూరపాడు నియోజకవర్గం ప్రజల సమస్యల పట్ల దృష్టిసారించి నియోజకవర్గ అభివృద్ధికి రామస్వామిరెడ్డి తనవంతు కృషిచేశారు. పెదకూరపాడు నియోజకవర్గం నుంచి ఆరుసార్లు ఎమ్మెల్యే అభ్యర్థిగా పోటీచేసిన గణపా రామస్వామిరెడ్డికి నియోజకవర్గ ప్రజలు నాలుగుసార్లు పట్టం కట్టారు. కృషికార్‌లోక్‌పార్టీ, కాంగ్రెస్, జనతా పార్టీల నుంచి పోటీచేసిన గణపా రామస్వామిరెడ్డిని పార్టీలకు అతీతంగా వ్యక్తిత్వానికి విలువ ఇచ్చి ఆయనను నియోజకవర్గ ప్రజలు గెలిపించారు. రామస్వామి రెడ్డికి కుమారుడు ఇరువురు కుమార్తెలు. కాగా అనారోగ్యంతో కుమారుడు మృతిచెందాడు. రామస్వామిరెడ్డి వియ్యంకుడు తిరుపతి మున్సిపల్ మాజీ చైర్మన్ గురవారెడ్డి టిడిపి నాయకుడు స్వర్గీయ ఎన్‌టి రామారావుకు సన్నిహితుడు. దీంతో గురవారెడ్డి 1983లో టిడిపిలోకి ఆహ్వానించినప్పటికీ కాంగ్రెస్‌ను వీడి వెళ్లలేదు. ఆయన వారసులుగా తమ్ముడు గణపా కోటిరెడ్డి మునగోడు సర్పంచ్‌గా 30 సంవత్సరాలపాటు పనిచేశారు. అమరావతి మండల ఉపాధ్యక్షుడిగా కూడా పదవి బాధ్యతలు నిర్వహించారే తప్ప నియోజకవర్గ స్థాయిలో ఎదగలేకపోయారు. గణపా రామస్వామిరెడ్డిపెద్ద కుమార్తె దగ్గుల సునీత 2004లో జరిగిన అసెంబ్లీ ఎన్నికలకు ముందు టిడిపి టిక్కెట్‌ను ఆశించి నిరాశకు గురయ్యారు.

# మహాపుణ్యక్షేత్రం త్రికూటాద్రి



త్రిముఖ శివలింగం

(ఆన్‌లైన్ - నరసరావుపేట)

దక్షిణ భారతదేశంలోనే అత్యంత ప్రసిద్ధి గాంచిన శైవ క్షేత్రం కోటప్పకొండ శ్రీత్రికోటేశ్వర స్వామి దేవస్థానం. నరసరావుపేట మండలంలోని కోటప్పకొండ పుణ్యక్షేత్రం గాను, పర్యాటక కేంద్రంగా అసాధారణ రీతిలో అభివృద్ధి చెందింది. భక్తుల కొంగు బంగారమైన శ్రీత్రికోటేశ్వర సన్నిధి యాత్రికులకు అత్యంత చేరువైంది. అభివృద్ధి కార్యక్రమాలు పూర్తయి భక్తులకు,పర్యాటకులకు అన్ని సౌకర్యాలు సమకూరాయి. దీంతో



కోటప్పకొండ దేవాలయం

పుణ్యక్షేత్రానికి భక్తుల సంఖ్య రోజురోజుకు పెరుగుతున్నది. పర్యాటక కేంద్రంగానో...పుణ్యక్షేత్రం గానో ఏదో ఒక రకంగా మాత్రమే రాష్ట్రంలో వివిధ పుణ్యక్షేత్రాలు, పర్యాటక కేంద్రాలు అభివృద్ధి చేశారే తప్ప పుణ్యక్షేత్రం, పర్యాటక కేంద్రంగా రెండు విధాలుగా ఏకకాలంలో అభివృద్ధి చెందింది కోటప్పకొండ అని చెప్పవచ్చు. భక్తి,వినోదం మేళవించి కొండపై యాత్రికులకు ఆహ్లాదం కల్పిస్తున్నారు.

హరహర! చేదుకో కోటయ్య! చేదుకోవయ్య! అని భక్తి సమ్మేళత అర్తితో పిలవగానే కాలకూటం లాంటి పాపాలనెన్నింటినైనా హరించి భక్తులకు ఇహ, పర సౌఖ్యాలను ప్రసాదించే ప్రత్యక్ష దైవం శ్రీ త్రికోటేశ్వరస్వామి అని భక్తుల నమ్మకం. రాష్ట్ర నలుమూలలలా ఉన్న భక్తులకు కోటయ్య స్వామి కొంగు బంగారం. ఎందరో మహా యోగులకు, దేవతా మూర్తులకు జ్ఞానోపదేశం చేసిన మహిమాన్విత క్షేత్రమే కోటప్పకొండ. యేటా లక్షలాది భక్తుల నీరాజనాలు అందుకుంటూ శివరాత్రినాడు ఇక్కడ సాగే తిరునాళ్ళ దేశ ప్రసిద్ధి.

దక్షయజ్ఞాన్ని ధ్వంసం చేసిన తర్వాత శివుడు శాంతించి పన్నెండేళ్ళ బాలుడిగా మారి బ్రహ్మచర్య దీక్షతో కైలాసంలో సమాధి నిష్టలో దక్షిణామూర్తిగా ఉన్నాడు. అప్పుడు బ్రహ్మ తదితర దేవతలు దక్షిణామూర్తి వద్దకు వెళ్ళి మొక్కి తమకు బ్రహ్మోపదేశం చేయాలని కోరారు. అందుకు అంగీకరించి దక్షిణామూర్తి త్రికూటాద్రికి వచ్చి(కోటప్పకొండ) బ్రహ్మోపదేశం చేశాడు. కనుకనే ఇది మహా పుణ్యక్షేత్రంగా విరాజిల్లుతోంది. ఆలయంలో నిత్యం పూజలు జరుగుతున్నాయి. ప్రతి రోజు అభిషేకం, అర్చన, అష్టోత్తరం, హోమాలు కూడా జరుగుతున్నాయి.

## కార్తీకమాస విశేష పూజలు

ఈశ్వరుడు అభిషేకంతో మానవుని యొక్క సకల ఈతిబాధలు తీర్చుతాడని వేదశాస్త్రంలో పేర్కొన్నారు. అందులోనూ కార్తీకమాసంలో శివారాధన చాలా విశిష్టం. శ్రీమేధాదక్షిణామూర్తి స్వరూప శ్రీత్రికోటేశ్వర స్వామి వారికి కార్తీకమాసంలో అభిషేకాలు, అర్చలను చేయటానికి ప్రత్యేక ఏర్పాటు చేశారు. కార్తీకమాసంలో ప్రతి ఆదివారం, పౌర్ణమి, ప్రతి సోమవారం, రెండో ఏకాదశి రోజుల్లో ఉదయం 5.30 నుండి 8.30 గంటల వరకు మూల విరాట్‌కు అభిషేకాలు జరుపనున్నారు.

## పర్యాటక కేంద్రం

ఘాట్‌రోడ్డుకు ఇరు వైపులా దాదాపు 25 ఎకరాల స్థలంలో పర్యాటక కేంద్రాన్ని ఏర్పాటు చేశారు. దీనిలో వివిధ పార్కులు రూపుదిద్దుకున్నాయి. పర్యాటకులను విశేషంగా ఇది ఆకర్షిస్తుంది. పర్యాకట కేంద్రంలో జింకల పార్కును ఏర్పాటు చేశారు. అలాగే విదేశాలకు సంబంధించిన పక్షులు పర్యాటకులకు కనువిందు చేస్తున్నాయి. సహజమైన రీతిలో అందమైన గార్డెన్ నిర్మాణం జరిగింది. సరస్సులో బోట్ షికార్ కల్పించారు. చిన్న పిల్లలు ఆడుకునేందుకు చిల్డ్రన్స్ పార్కు నిర్మాణం జరిగింది. టాయ్‌ట్రైన్‌ను ఏర్పాటు చేశారు. ఘాట్‌రోడ్ మార్గంలో బ్రహ్మ, శేషశయనంపై విష్ణుమూర్తి, సరస్వతి, లక్ష్మి,పార్వతి, విఘ్నేశ్వరుడు, ధ్యాన ముద్రలో శివుడు, శివలింగం, భారీ విగ్రహాలను నిర్మించారు.



ఘాట్ రోడ్డులో చతుర్ముఖ బ్రహ్మ విగ్రహం



పర్యాటక కేంద్రంలో తాండవ కృష్ణుని విగ్రహం



శ్రీ త్రికోటేశ్వర స్వామి మూలవిరాట్

# సిరులు పండిస్తున్న ఎత్తిపోతల పథకాలు



75 తాళ్లూరు ఎత్తిపోతల పథకం



బలుసుపాడు ఎత్తిపోతల పథకం

(అమరావతి - ఆన్‌లైన్)

అమరావతి, పెదకూరపాడు మండలాల పరిధిలోని నాగార్జున సాగర్ కుడికాలువ చివరి భూములకు సాగునీరు అందించే లక్ష్యంతో ప్రభుత్వం నిర్మించిన ఎత్తిపోతల పథకాలు రైతుల ఇంట సిరులను పండిస్తూ వారి జీవన విధానాన్ని అభివృద్ధిపథం వైపు పయనింపజేస్తున్నాయి. సుమారు రూ. 35 కోట్ల వ్యయంతో ఎకరాలకు సాగునీరు అందించేందుకు నిర్మించిన ధరణికోట ఎత్తిపోతల పథకం, బలుసుపాడు ఎత్తిపోతల పథకం, 75 తాళ్లూరు ఎత్తిపోతల పథకము, జూపూడి ఎత్తిపోతల పథకాలు వారి పరిధులు నిర్దేశించిన పంట భూములకు నీరు అందిస్తూ సస్యశ్యామలం చేస్తున్నాయి. గతంలో ఎకరం 40 వేల రూపాయలు ఉన్న భూముల ధరలు ప్రస్తుతం రూ. 4 లక్షల వరకు డిమాండ్ చేస్తున్నాయి. మిరప, పత్తి, పంటలు కూడా అత్యధిక పంటల దిగుబడి సాధిస్తున్నాయి.

బలుసుపాడు ఎత్తిపోతల పథకం పరిధిలో మల్లాది గ్రామంలోని 290 ఎకరాలు, కాశిపాడు 1223 ఎకరాలు, దిడుగు 421 ఎకరాలు, బలుసుపాడు 1578 ఎకరాలకు సాగునీరు అందిస్తున్న పథకం రూ. 10 కోట్ల నిధులతో నిర్మించబడింది. ఈ స్కీమ్ ద్వారా 2,586 మంది రైతులు లబ్ధిపొందుతున్నారు. పథకానికి చైర్మన్‌గా భవిరిశెట్టి హనుమంతరావు వ్యవహరిస్తున్నారు.

ధరణికోట ఎత్తిపోతల పథకం...

ఈ పథకము పరిధిలో ధరణికోట, లింగాపురం గ్రామాలకు చెందిన 2413 ఎకరాలకు సాగునీరు అందే లక్ష్యంతో రూ. 4 కోట్ల నిధులతో నిర్మించారు. ధరణికోటకు 2200 ఎకరాలు లింగాపురంకు 200 ఎకరాలకు నీరు సరఫరా అవుతోంది. ఈ స్కీమ్ పరిధిలో కూడా భూములకు రేట్లు పెరిగి, పంటల దిగుబడి అధికంగా ఉంటుంది. దీనిని చైర్మన్‌గా వట్టికుంట దేవేంద్రయ్య ఉన్నారు.

75 త్యాళ్లూరు ఎత్తిపోతల పథకం...

17 కోట్ల రూపాయల వ్యయంతో 5 వేల ఎకరాలకు సాగునీరు అందించే లక్ష్యంతో నిర్మించిన ఎత్తిపోథల పథకం పెదకూరపాడు మండల పరిధిని త్యాళ్లూరుకు 2182 ఎకరాలు, కాశిపాడు 25 ఎకరాలు, బలుసుపాడు 154 ఎకరాలు, జలాలపురం 20 ఎకరాలు, రామాపురం 574 ఎకరాలు, పెదకూరపాడు 226 ఎకరాలు, అమరావతి మండలపరిధిలోని అత్తలూరు గ్రామంలోని 1288 ఎకరాలకు సాగునీరు అందుతుంది. ఈ పథకం ద్వారా 2586 మంది రైతులు లబ్ది పొందుతున్నారు. కమిటీ చైర్మన్‌గా గుత్తికొండ అంజిరెడ్డి ఉన్నారు.

జూపూడి ఎత్తిపోతల పథకం...

అమరావతి మండల పరిధిలోని జూపూడి, అత్తలురు, మల్లాది గ్రామాలకు చెందిన సుమారు 2 వేల ఎకరాలకు నీరు అందించేందుకు నిర్మించిన జూపూడి ఎత్తిపోతల పథకం గత మూడు సంవత్సరాల నుండి సాగునీరు అందిస్తూ ఆదర్శంగా నిలిచింది. పథకానికి చైర్మన్‌గా యామని నరసింహారావు ఉన్నారు. పథకాల పనితీరు ప్రభుత్వ లక్ష్యాలకనుగుణంగా రైతుల కలలకు సాకారంగా పనిచేస్తూ ఇతర పథకాల నిర్మాణానికి ఆదర్శంగా నిలిచాయి. ఇలాంటి పథకాలకు విద్యుత్ సరఫరా నిరాటంకంగా కొనసాగించడం ద్వారా పథకాలు పనితీరు సంతృప్తిని కల్గిస్తుంది.

# భావి ఉపాధ్యాయులకు భవిష్యత్ దర్శనం

## జాతీయ ఖ్యాతి సాధించిన నవోదయ నేతృత్వ సంస్థ



సంస్థలో శిక్షణ పొందున్న ఉపాధ్యాయులు



బ్రాడీపేటలోని నవోదయ నేతృత్వ సంస్థ



శిక్షణ పొందుతున్న ఇతర రాష్ట్రాల ఉపాధ్యాయులు



చెత్తతో తయారు చేసిన జంతువుల నమూనాలు

(ఆన్‌లైన్ – ఎడ్యుకేషన్,గుంటూరు)

ఉపాధ్యాయులు నిత్య విద్యార్థిగా ఉంటేనే విద్యార్థులకు మెరుగైన విద్యాబోధన అందుతుంది...మారుతున్న కాలానికి అనుగుణంగా విద్యాబోధనలో విప్లవాత్మక మార్పులు రావాలి...అందుకు ఉపాధ్యాయులు సన్నద్ధం కావాలి. ఈ లక్ష్యం,నేపథ్యంతో స్థాపించనదే నవోదయ నేతృత్వ సంస్థ. గ్రామీణ విద్యార్థులకు ఊతం ఇవ్వాలనే లక్ష్యంతో 1986 జాతీయ విద్యావిధానంలో భాగంగా దేశవ్యాప్తంగా జవహర్ నవోదయ విద్యాలయాలను కేంద్ర ప్రభుత్వం ఏర్పాటు చేసింది.

కేంద్ర ప్రభుత్వ మానవ వనరుల అభివృద్ధి మంత్రిత్వ శాఖలో నవోదయ విద్యాలయాలు పనిచేస్తాయి. ప్రతి జిల్లాకు ఒకటి చొప్పున నవోదయ విద్యాలయాలను ఏర్పాటు చేసింది. చిలకలూరిపేట సమీపంలో నవోదయ విద్యాలయాన్ని కేంద్రం ప్రభుత్వం ఏర్పాటు చేసింది. దేశవ్యాప్తంగా 551 నవోదయ విద్యాలయాలు పనిచేస్తున్నాయి. ఈ విద్యాలయాల్లో పనిచేసే ఉపాధ్యాయులు శిక్షణ ఇచ్చే సంస్థలు మాత్రం దేశ వ్యాప్తంగా అయిదు మాత్రమే ఉన్నాయి. ఇందులో గుంటూరు బ్రాడీపేటలోని దేశ భక్త భవన్‌లో ఉన్న నవోదయ నేతృత్వ సంస్థ ఒకటి.

### వృత్తి నైపుణ్యమే ప్రధాన ఎజెండా

నవోదయ విద్యాలయాల్లో పనిచేసే ఉపాధ్యాయులు అన్ని రంగాల్లో నిష్ణాతులై ఉండాలనే లక్ష్యంతో ప్రభుత్వ వారికి పటిష్టమైన శిక్షణ ఇస్తుంది. అధునిక సాంకేతిక పరిజ్ఞానంతో విద్యార్థులు సమర్థవంతంగా విద్యాబోధన చేసేందు అనువైన శిక్షణ ఇక్కడ ఇస్తారు. విద్యార్థులకు నాణ్యతో కూడిన విద్యాను అందించేందుకు ప్రత్యేక చర్యలు తీసుకుంటారు. బ్రాడీపేటలో ఉన్న నవోదయ సంస్థలో శిక్షణ పొందేందుకు భోపాల్ ప్రాంతీయ కార్యలయం పరిధిలోని మధ్యప్రదేశ్, ఛత్తీస్‌ఘడ్, ఒరిస్సా తదితర రాష్ట్రాల నుంచి ఉపాధ్యాయులు వస్తారు.

కొన్ని సార్లు దేశవ్యాప్తంగా ఉన్న నవోదయ విద్యాలయాల్లో పనిచేసే ఉపాధ్యాయులు కూడా ఇక్కడ శిక్షణ పొందుతారు. 1990లో స్థాపించిన ఈ సంస్థలో ఇప్పటి వరకు 1568 మంది ఉపాధ్యాయులు శిక్షణ పొందారని సంస్థ డైరెక్టర్ జంధ్యాల వెంకటరమణ వెల్లడించారు. వ్యక్తిత్వ వికాసం, పరస్పర సంబంధాలు, భాషానైపుణ్యం, ఒత్తిడి అధిగమించేందు యోగా, సమయపాలన, విషయ నైపుణ్యం, నాయకత్వ లక్షణాలు తదితర అంశాలపై శిక్షణ ఇస్తారని కార్యనిర్వాహకులు టివి రామశర్మ వెల్లడించారు. వివిధ విభాగాల్లో ఏటా 60 శిక్షణలు ఇస్తారు. దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు వంశీయులు ఇచ్చిన భవనంలోప్రస్తుతం శిక్షణా సంస్థ కొనసాగుతోంది.

# మినుము వ్యాపారంలో అగ్రగామి పొన్నూరు



గోడౌన్‌లో నిల్వచేసిన మినుముల బస్తాలు

(ఆన్‌లైన్-పొన్నూరు)

మినుముల వ్యాపారంలో పొన్నూరు పట్టణం రాష్ట్రంలోనే ప్రథమ స్థానంలో వుంది. ఒడిదుడుకుల వ్యాపారంగా వున్న మినుముల వ్యాపారం రెండేళ్ళ క్రితం సంక్షోభాన్ని ఎదుర్కొన్నప్పటికీ గత ఏడాది రైతులకు - వ్యాపారులకు లాభాలను పంచింది. పొన్నూరు కేంద్రంగా ఏడాదికి 60కోట్ల రూపాయల మేరకు మినుముల వ్యాపారం సాగుతోంది. నాలుగేళ్ళక్రితం వరకు 25మంది వ్యాపారులు మినుముల వ్యాపారంలో వుండగా ప్రస్తుతం 15మంది 60కోట్ల రూపాయల విలువైన వ్యాపారాన్ని నిర్వహిస్తూ రాష్ట్ర ప్రభుత్వానికి కోటిన్నర రూపాయల మేరకు పన్నులు చెల్లిస్తున్నారు.

## రాష్ట్రంలో మినుముల ఉత్పత్తి

కోస్తా జిల్లాల్లో రబీ సీజన్‌లో 25లక్షలు, ఖరీఫ్ సీజన్‌లో 10లక్షల క్వింటాళ్ళ మినుములు ఉత్పత్తి అవుతుండగా, తెలంగాణా జిల్లాల్లో కూడా కొద్దిమేరకు మినుముల పంట సాగవుతుంది. రాష్ట్రంలో ఉత్పత్తి అవుతున్న మినుముల కొనుగోలు, ఎగుమతుల్లో పొన్నూరు పట్టణానిది అగ్రస్థానం కాగా జిల్లాలోని తెనాలి, కృష్ణా జిల్లా గుడివాడ, పామర్రు, చల్లపల్లి, విజయవాడ పట్టణాల్లో కూడా పొన్నూరు పట్టణంతో సమానంగా 60కోట్ల మేరకు వ్యాపారం సాగుతోంది. తెలంగాణాలోని తాండూరు, వికారాబాద్, జహీరాబాద్ పట్టణాల్లో సాలీనా ఏడాదికి 15కోట్ల రూపాయల విలువైన మినుముల వ్యాపారం సాగుతోంది.

## ఇతర రాష్ట్రాల్లో మినుముల ఉత్పత్తి

మహారాష్ట్రంలో ఏడాదికి 50 లక్షల క్వింటాళ్ళ మినుముల ఉత్పత్తి జరుగుతుండగా, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, గుజరాత్ రాష్ట్రాల్లో 60 లక్షల క్వింటాళ్ళ మేరకు మినుములు ఉత్పత్తి అవుతున్నాయి. మినుముల పంట సాగులో మహారాష్ట్రది అగ్రస్థానం కాగా ఆంధ్ర ఆ తర్వాత స్థానంలో వుంది.

## బర్మా దేశం నుంచి దిగుబడులు

బర్మా దేశంలో సాగవుతున్న మినుములు దేశంలోకి విరివిగా దిగుబడులు చేయబడుతుండటంతో దేశ మార్కెట్‌ను ప్రభావితం చేస్తున్నాయి. బర్మాలో ఏడాదికి సగటున ఉత్పత్తి చేస్తున్న 50లక్షల క్వింటాళ్ళ మినుములలో ఎక్కువ భాగం మనదేశంలోకి దిగుబడి అవుతున్నుయి. బర్మాలో పండిస్తున్న ఎస్.క్యూ. రకం మినుములు ఎంతో నాణ్యమైనవి కావడంతో ఆ రకానికి మన దేశంలో

మిగతా 95వ పేజీలో



వ్యాపార లావాదేవీల్లో నిమగ్నమైన మినుము వ్యాపారులు

# సంక్షోభంలో తమలపాకు తోటల సాగు

## ప్రత్యామ్నాయ పంటలవైపు రైతుల మొగ్గు

(ఆన్‌లైన్-పొన్నూరు)

గత కాలంలో సిరులను కురిపించిన తమలపాకు తోటలు నేడు రైతులు, వ్యాపారులకు నిరాశనే మిగుల్చుతున్నాయి. పెళ్ళిళ్ళు, శుభకార్యాలు, దేవుని పూజా కార్యక్రమాల్లో తమలపాకు స్థానం ఎంతో ప్రధానమైనది. అంతటి ప్రాధాన్యత సంతరించుకొన్న తమలపాకుల ఉత్పత్తి, వ్యాపారంలో పొన్నూరు పట్టణానిది రాష్ట్రంలో అగ్రస్థానం కాగా దేశంలో పెరిగిన తోటల విస్తీర్ణం... ప్రకృతి వైపరీత్యాలు, చీడపీడలు తమలపాకుల ఉత్పత్తిని, వ్యాపారాన్ని తీవ్రంగా దెబ్బతీస్తున్నాయి. ఈ నేపథ్యంలో నోళ్ళు పండించే తమలపాకు-రైతులు, వ్యాపారులు, తోటల కూలీల నోళ్ళను మాత్రం పండించడం లేదు.

### గాలి వాటంగా మారిన సాగు

తమలపాకు తోటల సాగు జూదం, గాలివాటంగా మారిన నేపథ్యంలో లక్షల రూపాయల పెట్టుబడులతో తోటలను సాగుచేస్తున్న రైతులు, కౌలు రైతులకు నేడు మార్కెట్‌లో నెలకొన్న సంక్షోభం కన్నీటినే మిగుల్చుతోంది. తోటలోని ఆకులను కోయిస్తే కూలీల కూలీ ఖర్చు కూడా చేతికిరాని పరిస్థితి నెలకొనడంతో రైతులు తోటలను వదిలేయాల్సిన దుస్థితి నెలకొంది. దేశంలో పెరిగిన తమలపాకు తోటల విస్తీర్ణం సంక్షోభానికి ప్రధాన కారణమని తమలపాకు వ్యాపార ప్రముఖుడు మల్లంపాటి సుబ్బారావు పేర్కొన్నారు.

### తోటల పెంపకంలో పొన్నూరు ప్రాంత విశిష్టత

గుంటూరు జిల్లాలో పొన్నూరు, తెనాలి, దుగ్గిరాల, మంగళగిరి, రేపల్లె నియోజకవర్గాల్లోని గ్రామాల పరిధిలో సుమారు 2200 ఎకరాల విస్తీర్ణంలో తమలపాకు తోటల సాగవుతున్నాయి. అయిదు నియోజకవర్గాల పరిధిలో సాగవుతున్న తమలపాకులు పొన్నూరు కేంద్రంగా దేశంలోని వివిధ రాష్ట్రాలకు ఎగుమతి అవుతున్నాయి. పొన్నూరు మండలం ములుకుదురు, చింతలపూడి, పొన్నూరు, ఆలూరు, ఆరెమండ, కట్టెంపూడి, దండమూడి, కసుకర్రు గ్రామాలతో పాటు కృష్ణానది పరీవాహక లంక గ్రామాలు చిలుమూరు, దోనేపూడి, పోతార్లంక, తిప్పలకట్ట, కిష్కిందపాలెం గ్రామాలు నాణ్యమైన తమలపాకు తోటల పెంపకానికి పేరొందాయి.

### పొన్నూరు కేంద్రంగా ఎగుమతి

తమలపాకు తోటలను సాగు చేస్తున్న గ్రామాల నుంచి పొన్నూరు పట్టణంలోని తమలపాకుల ఉత్పత్తి, సరఫరా కేంద్రానికి బుట్టలను తరలించుకొని వచ్చి నాగపూర్, అకోలా, అమరావతి, మహారాష్ట్ర, యావత్‌మాల్, వార్థా, కాంగామ్, సాంగ్లీ, కొంకణ్ తదితర ప్రాంతాలకు లారీలు, లక్నో, ఝాన్సీ ప్రాంతాలకు రైళ్ళ ద్వారా వ్యాపారులు ఎగుమతి చేస్తుంటారు. సీజన్ సమయంలో వారానికి 20 లారీలు, అన్‌సీజన్‌లో నాలుగు నుంచి ఆరు లారీల సరుకు పొన్నూరు నుంచి ఎగుమతి అవుతోంది.

### ప్రశ్నార్థకంగా మారిన పెట్టుబడులు

గత కాలంలో సిరులను కురిపించిన తమలపాకు తోటల సాగు నేడు పెట్టుబడులను కూడా ఇవ్వలేనంతగా సంక్షోభంలో కూరుకు పోవడంతో తోటలపై లక్షల రూపాయలను పెట్టుబడిగా పెట్టిన రైతులు నష్టాల ఊబిలో కూరుకు పోయారు. ఎకరా ఆకుతోట సాగుకు సొంత భూమి కలిగిన రైతు 70వేల రూపాయల వరకు, కౌలు రైతు ఎకరా భూమి కౌలుతో కలుపుకుని లక్ష రూపాయల వరకు పెట్టుబడిగా పెట్టాల్సి వుంది. అయితే దేశంలో పెరిగిన తమలపాకు తోటల విస్తీర్ణం కారణంగా పొన్నూరు ప్రాంత తమలపాకులకు డిమాండు తగ్గడంతో పెట్టుబడులు కూడా రాని పరిస్థితి ఈ ఏడాది నెలకొంది. దీంతో ఆకుల కోత పనులను రైతులు వదిలివేశారు.



తమలపాకుల తోటలు

### రైతులు- కూలీల పరిస్థితి ప్రశ్నార్థకం

తమలపాకు తోటల పెంపకంలో నెలకొన్న సంక్షోభంతో తోటల పెంపకంపై ఆధారపడిన వేలాది మంది రైతులు, కూలీల పరిస్థితి ప్రశ్నార్థకంగా మారింది. గత కొన్నేళ్ళుగా అధిక వర్షాలు, సునామీ వంటి ప్రకృతి వైపరీత్యాల కారణంగా తమలపాకు తోటలు దెబ్బతిని రైతులు నష్టాలను ఎదుర్కొగా... మూడేళ్ళక్రితం తమలపాకు మార్కెట్‌లో వచ్చిన డిమాండు తోటలు వున్న రైతులకు అధిక లాభాలను ఇచ్చింది. మార్కెట్ ఎలా వున్నా పెట్టుబడులు వస్తాయన్న నమ్మకంతో తోటలను సాగుచేస్తున్న రైతులకు ఈ ఏడాది కష్టకాలంగా మిగిలింది. తమలపాకుల కోతకు అయ్యే ఖర్చుకూడా

మిగతా 97వ పేజీలో

# వివిధ రంగాల్లో విశిష్టతను సంతరించుకొన్న పొన్నూరు పట్టణం

(ఆన్‌లైన్-పొన్నూరు)

రాజుల పాలనలో స్వర్ణపురిగా ఖ్యాతి నొంది నేడు 'పొన్నూరు' పేరుతో విరాజిల్లుతున్న పొన్నూరు పట్టణం రాజకీయ చైతన్యానికి, ప్రజా ఉద్యమాలకు పుట్టినిల్లుగా.. పాడి పంటలకు నెలవుగా విరాజిల్లుతోంది. వ్యాపార, వాణిజ్య, విద్య, వైద్య, రంగాలలో జిల్లా, రాష్ట్ర స్థాయిలో పొన్నూరు పట్టణం విశిష్ట స్థానాన్ని పొందింది. ఆధ్యాత్మిక కేంద్రంగా విరాజిల్లుతున్న 'స్వర్ణపురి' దక్షిణ కాశీగా పేరు ప్రఖ్యాతులను పొందింది. పొన్నూరు-నిడుబ్రోలు గ్రామ పంచాయతీల కలయికతో 1967లో ద్వితీయ శ్రేణి పురపాలక సంఘంగా ఏర్పడిన పొన్నూరు పట్టణం 30కిలో మీటర్ల విస్తీర్ణంలో విస్తరించి వుంది. పురపాలక సంఘం ఆవిర్భావంలో పట్టణ జనాభా సంఖ్య 21వేలు కాగా, నేడు 59వేలకు చేరింది. పట్టణ ఓటర్ల సంఖ్య 40వేలుగా వుంది. పట్టణ, గ్రామీణ వాతావరణాలకు నెలవుగా వున్న పొన్నూరు పట్టణం తమలపాకుతోటల సాగు, మినుముల వ్యాపారంలో రాష్ట్రంలో పేరెన్నికగన్నది. పట్టణ పరిసరాలు వరిపంట పొలాలు, వాణిజ్య పంటల పచ్చదనంతో నిండి వుంటాయి. దేవాలయాల పట్టణంగా పేరొందిన పొన్నూరు పట్టణం ఆధ్యాత్మిక కేంద్రంగా...దక్షణ కాశీగా రాష్ట్రంలో పేరెన్నికగన్నది. పురాణ ప్రసిద్ధి గాంచిన సాక్షిశ్రీ భావన్నారాయణస్వామి, దక్షణ కాశీగా పేరొందిన సహస్రలింగేశ్వరస్వామి, వీరాంజనేయ, గరుత్మంత స్వామి వార్ల దేవాలయాలకు రాష్ట్రంలోని అన్ని ప్రాంతాల నుంచీ నిత్యం భక్తులు విచ్చేస్తుంటారు. విద్య, వైద్య రంగాల్లో కూడా పొన్నూరు ప్రత్యేకతను సంతరించుకొంది. రాజకీయ రంగంలో పొన్నూరు పట్టణానికి జాతీయస్థాయిలో గుర్తింపు వుంది. సుదీర్ఘ కాలం పార్లమెంటు సభ్యునిగా కొనసాగి గిన్నిస్‌బుక్ రికార్డుల్లో కెక్కిన ఆచార్య ఎన్.జి.రంగా, చేనేత ప్రముఖునిగా దేశంలో గుర్తింపును పొందిన ప్రగడ కోటయ్య పొన్నూరు వాసులే! పొన్నూరు నియోజక వర్గానికి ప్రాతినిధ్యం వహించిన పాములపాటి అంకినీడు ప్రసాద్, ధూళిపాళ్ళ వీరయ్యచౌదరి, గోగినేని నాగేశ్వరరావు రాష్ట్ర మంత్రులుగా తమ ప్రతిభను చాటారు. ప్రజా ఉద్యమకారునిగా, కవిగా, రచయితగా పేరు ప్రఖ్యాతుల నొందిన డాక్టర్ కత్తి పద్మారావు పొన్నూరు కేంద్రంగా నిర్వహించిన కారంచేడు, చుండూరు ఉద్యమాలు జాతీయ స్థాయిలో మార్మోగాయి. సినిరంగంలో విలక్షణ నటునిగా ప్రఖ్యాతి నొందిన సి.ఎస్.ఆర్.ఆంజనేయులు పొన్నూరు వాసే! పొన్నూరు పట్టణం రాజకీయ రంగంలో దేశ వ్యాప్త గుర్తింపును పొందినప్పటికీ పారిశ్రామికరంగంలో పూర్తిగా వెనుకబడి వుందని చెప్పవచ్చు. పట్టుమని పదిమందికి ఉపాధిని చూపించే పరిశ్రమలు, వ్యాపార సంస్థలు పట్టణంలో లేకపోవడం నాయకుల నిర్లక్ష్యానికి నిదర్శనమన్న భావన సర్వత్రా నెలకొని వుంది. ఆదాయ వనరులు అంతంత మాత్రంగా వున్న పురపాలక సంఘం ప్రధాన సమస్యల పరిష్కారంలో ఆర్థిక ఇబ్బందులతో సతమత మవుతోంది. కాగా రెండేళ్ళ క్రితం మున్సిపల్ చైర్‌పర్సన్‌గా బాధ్యతలను స్వీకరించిన డాక్టర్ ఎస్.రూత్ రాణి పట్టణాభివృద్ధికి తనదైన పంథాలో కృషి చేస్తున్నారు.



డాక్టర్ ఎస్.రూత్‌రాణి
మున్సిపల్ చైర్‌పర్సన్

### నాటినుంచి నేటి వరకూ..

### చైర్మన్లు-చైర్‌పర్సన్ల వీరే

పొన్నూరు పురపాలక సంఘ ప్రథమ చైర్మన్ కొప్పాక వెంకయ్య (09-10-67 నుండి 10-10-69) వరకు పదవిలో కొనసాగారు. నన్నపనేని శ్రీనివాసరావు (10-10-69 నుంచి 10-10-79) వరకు, పాలపర్తి నాయుడమ్మ 1981 నుంచి 84 వరకు, పోట్లూరి శ్రీహరి రావు 1984 నుంచి 86 వరకు, డాక్టర్ టి. వెంకయ్య 1987 నుంచి 1989 వరకు, గోగినేని రాధికారాణి 1989 నుంచి 92 వరకు, దాసరి అనూరాధ 1995 నుంచి 98వరకు, కొల్లా కుసుమ కుమారి 1998 నుంచి 2000 వరకు, మేనపాటి శాలిని 2000 నుంచి 2005 వరకు చైర్మన్, చైర్‌పర్సన్లుగా పదవీ బాధ్యతలను నిర్వహించారు. 2005వ సంవత్సరంలో జరిగిన మున్సిపల్ ఎన్నికల్లో కాంగ్రెస్‌పార్టీకి చెందిన శ్రీమతి డాక్టర్ నల్లమోతు రూత్‌రాణి చైర్‌పర్సన్‌గా ఎన్నికై పదవిలో కొనసాగుతున్నారు. కాగా పురపాలక సంఘ చైర్మన్లుగా వ్యవహరించిన వారిలో మేనపాటి శాలిని మాత్రమే అయిదేళ్ళ కాలం పదవిలో కొనసాగారు. మిగిలిన వారు రాజకీయ సమీకరణ, ఇతర కారణాలతో పదవీ కాలాన్ని పంచుకొన్నారు.



పొన్నూరు మున్సిపల్ కార్యాలయం



పొన్నూరు పట్టణంలోని ఐలాండ్ సెంటర్







# ప్రసిద్ధ పుణ్యస్థలం మన్నేపల్లి క్షేత్రం

**శివస్య హృదయం విష్ణుః అన్న ఆర్యోక్తి చందాన దేశవ్యాప్తంగా శివరాత్రికి శివుడిని ఆరాధిస్తుంటే గుంటూరు జిల్లా వినుకొండ నియోజక వర్గంలోని బొల్లాపల్లి మండలంలో విష్ణువుకు ఉత్సవాలు నిర్వహించడం విశేషం.**

(ఆన్‌లైన్ - బొల్లాపల్లి)

రాష్ట్రంలో ప్రసిద్ధి చెందిన శైవక్షేత్రాలలో ఒకటిగా గుంటూరు జిల్లా వినుకొండ నియోజకవర్గంలోని బొల్లాపల్లి మండలం గుర్తింపు పొందింది. దేశవ్యాప్తంగా శివరాత్రి పర్వదినాన శివారాధనలు జరుగుతుంటే ఇక్కడ మాత్రం విష్ణువుకు ఆరాధనలు జరగడం ఆనవాయితీ. శివస్య హృదయం విష్ణుః అన్న ఆర్యోక్తి చందాన దేశవ్యాప్తంగా శివరాత్రికి శివుడిని ఆరాధిస్తుంటే గుంటూరు జిల్లా వినుకొండ నియోజకవర్గంలోని బొల్లాపల్లి మండలంలో విష్ణువుకు ఉత్సవాలు నిర్వహించడం విశేషం. ఈ ప్రాంత ప్రజల ఇలవేల్పు, పిలిచిన పలికేదేవుడు లక్ష్మీనర్సింహస్వామి తిరునాళ్ళను ప్రతియేటా మహాశివరాత్రి పర్వదినం నాడు వైభవంగా నిర్వహిస్తారు. రావులాపురం గ్రామశివారు మన్నేపల్లి తండా సమీపాన కొండ అంచున మన్నేపల్లిస్వామిగా అవతరించినట్లు పూర్వీకుల ఉవాచ. విష్ణుమూర్తి అవతారమైన మన్నేపల్లి స్వామి· ఈ ప్రాంతంలో ఆనాటి ప్రజలకు తన మహిమలను చూపిన విష్ణుమూర్తి, మన్నేపల్లి కొండ అంచున శిలారూపం దాల్చినట్లు చెబుతుంటారు. కొండ అంచున మన్నేపల్లితో పాటు లక్ష్మీనర్సింహస్వామి, పద్మావతి దేవి వెలియగా కొండ మధ్య భాగంలో గృహాలలో శివుడు, సీతారామస్వామి, కొండదిగువన కుమారస్వామి వీరభద్రుడి సీతారాములు స్వయంభుఃగా వెలిశారు. ఈ స్వామిని మేకలు కాయడానికి వచ్చే కాపరులతో ఆడుకున్నట్లు పూర్వీకుల కథనం. ప్రార్థించడం వలన కలిగిన సంతానానికి మన్నేపల్లి, మన్నెయ్యగా నామకరణం చేస్తారు. గుంటూరు, ప్రకాశం జిల్లాల నుంచి భక్తులు తిరునాళ్ళలో అశేషంగా పాల్గొంటారు. రాష్ట్రంలోని వేర్వేరు ప్రాంతాలలో స్థిరపడిన ఈప్రాంతవాసులు మన్నేపల్లి తిరునాళ్ళకు తప్పనిసరిగా హాజరవుతారు. శివరాత్రి రోజున లక్ష్మీనర్సింహస్వామి కళ్యాణ మహోత్సవాన్ని ప్రతియేటా వైభవంగా నిర్వహిస్తారు. ఈ సందర్భంగా వేకువజాము నుంచే స్వామి వారి ఆలయంలో ప్రత్యేకపూజలు, అర్చనలు నిర్వహించి రావులాపురం, మన్నేపల్లి, గండిగనుముల తదితర గ్రామాలలో మన్నేపల్లి ఉత్సవ విగ్రహాలను ఊరేగిస్తారు. ప్రతియేటా జరిగే మన్నేపల్లి తిరునాళ్ళను ఘనంగా నిర్వహించేందుకు దేవాదాయశాఖ సన్నాహాలు చేస్తుంది. దేవస్థానానికి వందల ఎకరాల భూములున్నా నిత్య ధూప, దీప, నైవేద్యాలు స్వామివారికి కరువయ్యాయి. స్థానిక ప్రజాప్రతినిధులు, దేవాదాయ శాఖాధికారులు స్పందించి ఆలయాభివృద్ధికి విశేషకృషి జరపాలని గ్రామప్రజలు కోరుతున్నారు.


స్వయంభుఃగా వెలసిన మన్నేపల్లిస్వామి


లక్ష్మీనర్సింహస్వామి విగ్రహం


కొండ అంచున వున్న మన్నేపల్లి ఆలయం



నిడుబ్రోలు రామానీడు రాజకీయ విద్యాలయం

# దేశంలో తొలి రాజకీయ పాఠశాల
# నిడుబ్రోలు రామానీడు విద్యాలయం

(ఆన్‌లైన్-పొన్నూరు)

దేశ స్వాతంత్ర్యానికి పూర్వం నిడుబ్రోలులో ఆచార్య ఎన్.జి.రంగా నెలకొల్పి నిర్వహించిన 'రామానీడు' రాజకీయ పాఠశాల దేశంలోనే తొలి రాజకీయ పాఠశాలగా గుర్తింపు పొందింది. దేశ స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనడానికి సమర్థులైన నాయకులను రాజకీయాల్లోకి తేవడం లక్ష్యంగా 1930వ దశకంలో ఆచార్య ఎన్.జి.రంగా స్వగ్రామం నిడుబ్రోలులో ఏర్పాటు చేసిన రాజకీయ పాఠశాల (రామానీడు విద్యాలయం) నేటికీ ఆనాటి స్మృతులకు సజీవ సాక్ష్యంగా వుంది. రాష్ట్రం, దేశం నలు మూలల నుంచి నిడుబ్రోలు రామానీడు రాజకీయ విద్యాలయానికి విచ్చేసి రాజకీయ ఓనమాలు నేర్చుకొన్న యువ నాయకులు- దేశ స్వాతంత్ర్యానంతరం కేంద్రం, వారి రాష్ట్రాల్లో సమర్థులైన నాయకులుగా పేరు ప్రఖ్యాతులను గడించారు. రామానీడు విద్యాలయాన్ని 1933లో మహాత్మాగాంధీ ప్రారంభించారు. ఆచార్య ఎన్.జి.రంగా, భారతిదేవి దంపతుల ఆశయాన్ని ప్రశంసించడం ఈ ప్రాంత వాసులకు తియ్యటి అనుభూతిని మిగిల్చిందని చెప్పొచ్చు. దేశంలోని వివిధ రాష్ట్రాల నుంచి 'రామానీడు' రాజకీయ విద్యాలయానికి విచ్చేసే నాయకులకు ఉద్ధండులైన ప్రముఖ నాయకులతోను, స్వయంగా రంగాజీ ఉన్నత విలువలు, త్యాగాలతో కూడిన రాజకీయాలను బోధించే వారని రంగాజీ శిష్యులు పేర్కొంటున్నారు. రైతు ఉద్యమాలు, స్వాతంత్ర్య పోరాటాల్లో పాల్గొనడానికి రంగాజీ దేశంలో పర్యటించే నాడు ఆయన సతీమణి భారతీదేవి స్వయంగా తాను రాజకీయ పాఠాలను చెప్పడంతో పాటు స్వాతంత్ర్య కాంక్షను యువ నాయకుల్లో రేకెత్తించే వారని, కన్న బిడ్డలవలె ఆదరించే వారని రాజకీయ పాఠశాలలో గడిపిన స్థానిక నాయకుడొకరు పేర్కొన్నారు. రంగాజీ ఆధ్వర్యంలో నిర్వహించబడిన రామానీడు రాజకీయ విద్యాలయంలో స్వాతంత్ర్య సంగ్రామానికి సంబంధించిన వ్యూహ రచనలు జరిగేవని, ఈ నేపథ్యంలో పలువురు ప్రముఖులు, సమర యోధులు విద్యాలయాన్ని సందర్శించే వారని రంగాజీ శిష్యులు పేర్కొన్నారు. స్వగ్రామం నిడుబ్రోలులో రాజకీయ విద్యాలయాన్ని ప్రారంభించిన ఆచార్య ఎన్.జి.రంగా ఇదే స్ఫూర్తితో రాష్ట్రంలోని వివిధ జిల్లాల్లోనూ, ఇతర రాష్ట్రాల్లో రాజకీయ విద్యాలయాలను నిర్వహించారు. నిడుబ్రోలు రామానీడు విద్యాలయంలో రాజకీయ ఓనమాలు నేర్చుకున్న పలువురు నాయకులు దేశ రాజకీయాల్లో కీలక భూమికను పోషించడమే కాకుండా రాష్ట్రాల ముఖ్యమంత్రులు, గవర్నర్లు, మంత్రుల పదవులను చేపట్టారు. ఎందరో నాయకులు ఎమ్మెల్సీలు, ఎమ్మెల్యేలుగా వ్యవహరించారు.



ఆచార్య ఎన్.జి.రంగా



పట్టణంలో ప్రతిష్ఠించిన ఎన్.జి.రంగా విగ్రహం

### రామానీడు విద్యాభ్యాసంలో శిక్షణ పొందిన నాయకుల జాబితా

రాష్ట్ర మాజీ ముఖ్యమంత్రి మర్రి చెన్నారెడ్డి, భవనం వెంకట్రామ్, ప్రముఖ నాయకులు ప్రగడ కోటయ్య, గౌతు లచ్చన్న, వావిలాల గోపాలకృష్ణయ్య, ఆర్థికశాఖా మాత్యులు కె.రోశయ్య, కమ్యూనిస్ట్ యోధులు పుచ్చలపల్లి సుందరయ్య, మాకినేని బసవపున్నయ్య, కాట్రగడ్డ రాజగోపాలరావు, రావి నారాయణరెడ్డి, కందుల ఓబులరెడ్డి, దివి కొండయ్యచౌదరి, పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి, డి.రాజగోపాల నాయుడు, ధనీకుల నర్సింహం, వి.ఎల్.సుందరరావు, సుంకర సత్యనారాయణ, యడ్లపాటి వెంకట్రావు, వాసిరెడ్డి వెంకయ్య, చెల్లా కొండయ్య, చెంచు రామానాయుడు, ఎన్.వీరాచారి, దరువూరి వీరయ్య, సుంకర సత్యనారాయణ, వండలి వెంకట కృష్ణారావు, వసంత నాగేశ్వరరావు, పిన్నమనేని కోటేశ్వరరావు, వడ్డే శోభనాద్రీశ్వరరావులతో పాటు వివిధ రాష్ట్రాలకు చెందిన ప్రముఖ నాయకులు ఉన్నారు.

# పేరుకు 'నగరం'.. తీరుకు గ్రామం


నగరం మండల కేంద్రం

★ నియోజకవర్గ కేంద్రమైనా అభివృద్ధిలో వెనుకంజే

★ కాలువ చివరి భూములు... అందని సాగునీరు

★ రహదారి సౌకర్యమూ అంతంత మాత్రమే

('ఆన్‌లైన్' - నగరం)

మాండలిక వ్యవస్థ ఆవిర్భావంతో నగరం మండలం 1987లో రూపుదిద్దుకున్నది. గతంలో చిన్నచిన్న అవసరాలకు కూడా రేపల్లె వెళ్ళవలసి వచ్చేది. రెవెన్యూ, అభివృద్ధి కార్యాలయాలతోపాటు ఖజానా, రాణాలు కూడా ఏర్పడి మండల ప్రజలకు సౌకర్యం చేకూరింది. 12 రెవెన్యూ గ్రామాలు, 25 పంచాయతీ గ్రామాలతో ఏర్పడ్డ నగరం మండలంలో 108 ఆవాస ప్రాంతాలున్నాయి. కాగా 53వేల జనాభాలో 67శాతం అక్షరాస్యత సాధించారు. 'నగరం' పేరుకు, ఊరికి పోలికలేకపోయినా 1969లో స్థాపించిన డిగ్రీకళాశాల, 1971లో ఏర్పాటు చేసిన ఉన్నత పాఠశాలలు ఈప్రాంత ప్రజల విద్యాభివృద్ధికి ఎనలేని కృషి చేశాయంటే అతిశయోక్తి కాదు. 146.24 చదరపు కిలోమీటర్లలో విస్తరించివున్న మండలంలో రాకపోకల సౌకర్యం అతితక్కువ. గ్రామాలమధ్య రోడ్లులేవు. కాలువకట్టలు, చేలగట్లు మార్గాలుగా ప్రజలు రాకపోకలు జరుపుతుంటారు. కేవలం ఆరుకిలోమీటర్లలో చేరగల పెద్దవరం గ్రామానికి 18కిలోమీటర్లు చుట్టూతిరిగి వెళ్ళాల్సిన పరిస్థితి వుంది. కాగా గ్రామాల శివార్లు దూరందూరంగా వుండటమేకాక గ్రామకేంద్రానికి లింకు లేకుండా వున్నాయి. పెదపల్లి పంచాయతీలోని గట్టువారిపాలెం, దేవరకొండవారిపాలెం తదితర ఆవాసాలు ఉదాహరణలుగా చెప్పవచ్చు. 28.82 వేల ఎకరాల భూమిలో 19.01వేల ఎకరాలు వరిసాగులో ఉన్న మాగాణి భూములు, మిగిలిన 9.81 వేల ఎకరాల్లో కూరగాయలు, మామిడి, సపోటా తోటలు పెంచుతున్నారు. సపోటా ఏలేటిపాలెం, బెల్లంవారిపాలెం, చిరకాలవారిపాలెం, పవిడిమర్రు గ్రామాల నుంచి చీరాల, సత్తెనపల్లి, హైదరాబాద్ నగరాలకు విరివిగా ఎగుమతి కావడం చెప్పుకోదగ్గ విషయం. తోట యజమానులు ఉద్యానవన శాఖ సహకారం కొరవడి తరచూ నష్టాలకు గురవుతున్నారు. సపోటా సాగులో తెగుళ్ళు, పురుగులు రైతులను కుంగదీస్తున్నాయి. ప్రవాస భారతీయుల ప్రభావం మండలం మీద చెప్పుకోతగినంతగా లేకపోవడం వల్ల అభివృద్ధి అంతంత మాత్రంగా వుంది. ప్రభుత్వ పథకాలు, నిధులే మండలంలో జరుగుతున్న కొద్దిపాటి పనులకు ఆసరాగా వున్నాయి. కాగా రాష్ట్ర మంత్రి మోపిదేవి వెంకటరమణారావు చొరవవల్ల మండలంలో 19 కోట్లరూపాయల ఖర్చుతో రోడ్లు, చెరువులు, భవనాల అభివృద్ధి జరిగింది. మండల కేంద్రమేగాక నియోజక వర్గ కేంద్రమైన నగరం అభివృద్ధిలో వెనుకంజలోనే వుంది. గతంలో రాజకీయంగా తేడాలుండేవి. మండలంలో కాంగ్రెస్ అధికారంలో ఉంటే నియోజకవర్గం తెలుగుదేశం చేతుల్లో వుండేది. కాగా ప్రస్తుతం అన్ని స్థాయిలలో కాంగ్రెస్ పార్టీ అధికారం చేజిక్కించుకుంది. అభివృద్ధికి ఇది చక్కని అవకాశంగా అందరూ భావిస్తున్నారు. కాలువ చివరిభూములు కావటం కారణంగా పంటనీరు కటకట అనిపిస్తుంది. డ్రెయిన్‌ల ఆధునీకరణ పనులు పూర్తి చేస్తే ముంపుముప్పు తొలగి రైతులు స్థిమితంగా వ్యవసాయం చేసుకునే అవకాశం కలుగుతుందని పలువురు ఎదురు చూస్తున్నారు. మండలంలో పరిశ్రమలు పూజ్యం కావటంవల్ల ఉపాధికోసం దూరప్రాంతాలకు వలసవెళ్ళే పరిస్థితులు నెలకొని వున్నాయి. పారిశ్రామికవేత్తలకు రాయితీలు కల్పించి ప్రభుత్వం పరిశ్రమలు ఏర్పాటుచేసే వాతావరణం కల్పించాలని మండల వాసులు కోరుతున్నారు.

# పల్నాటి యుద్ధానికి బీజం... అరణగండ్లలోనే...

**పురావస్తు శాఖ పరిశోధనలు జరపాలి ★ పర్యాటక ప్రాంతంగా అభివృద్ధి చేయాలి**




నాగమ్మ

(ఆన్‌లైన్ - బొల్లాపల్లి)

పల్నాటి యుద్ధమనగానే ఈ తరానికి గుర్తుకు వచ్చేది బ్రహ్మనాయుడు, నాయకురాలు నాగమ్మల మధ్య జరిగిన యుద్ధ నేపథ్యమే. ఈ కథనాలపై బుర్రకథలు, సినిమాలు నేటితరానికి ఎంతోకొంత సమాచారాన్ని, అవగాహనను కల్పించేవి. కాని బ్రహ్మనాయుడికి, నాగమ్మకు మధ్య వైరానికి గల కారణం ఏ కథలలోనూ వివరించకపోవడం శోచ నీయం.

పల్నాటి యుద్ధం క్రీ.శ. 1180లో జరిగింది. దీని నేపథ్య చరిత్ర తెలుసుకోవాల్సిన అవసరం నేటితరానికి ఎంతైనావుంది. ఈ కాలంలో అనేక చారిత్రాత్మక సంఘటనలు జరిగి గుంటూరు ప్రభావం పల్నాటి యుద్ధంతో మసిబారినట్లు యింది. ఈ క్రమంలో బొల్లాపల్లి మండలం నేడు అత్యంత వెనుకబాటుతనంతో అభివృద్ధికి ఆమడ దూరంలో అనేక సమస్యలతో అల్లాడుతోంది. వీరి రువురి మధ్య వైరం బొల్లాపల్లి మండలంలోని గండిగనుమల, రావులావరం వద్ద గల అరణగండ్ల (రాచకొండ)లో జరిగిన యుద్ధంతోనే మొదలైం దన్నది చరిత్రకారులు చెబుతున్న నిజం.

గండిగనుముల, రావులాపురం వద్ద గల అరణగండ్ల వద్ద విశాలమైన మైదానంలో యుద్ధానికి సిద్ధం కావాలని ఉత్తరుడు గురజాలరా జుకు సవాల్ చేశాడు. ఈ నేపథ్యంలో ఆ యుద్ధానికి బ్రహ్మనాయుడు సేనాధిపతిగా వ్యవ హరించాడు. యుద్ధంలో బ్రహ్మనాయుడు రణ

పల్నాటి బ్రహ్మనాయుడు




తంత్ర వ్యూహరచన చేస్తూ సైన్యాన్ని ముందుకు నడిపించి తన ఆయుధమైన రాగాలతో జిట్టగామా లపాడుకు చెందిన చౌదరి రామిరెడ్డి, జగ్గారెడ్డి, సింగారెడ్డిలను హతమార్చాడు. పల్నాటి యుద్ధాన్ని పౌరుషాగ్నితో నడిపించిన పల్నాటి నాగమ్మ తండ్రి చౌదరి నాగిరెడ్డి. ఆమె మేనమామ జగ్గారెడ్డి. భర్త సింగారెడ్డి. యుద్ధంలో తండ్రి, మేనమామ, భర్తలను బ్రహ్మనాయుడు చంపినందుకే నాగమ్మ తాచుపాములా పగబట్టింది. ఆ యుద్ధానికి కొంత నేపథ్యం ఉంది కాబట్టే ఇదే తరువాత కాలంలో

మిగతా 97వ పేజీలో

# మినుము వ్యాపారంలో అగ్రగామి పొన్నూరు

(89వ పేజీ నుంచి)

మంచి డిమాండ్ లభిస్తోంది.

### బర్మా నుంచి పొన్నూరుకు దిగుబడి

బర్మా దేశంలో విస్తారంగా పండిస్తున్న మినుములను పొన్నూరు వ్యాపారులు ఆన్‌లైన్ వ్యాపారం ద్వారా దిగుబడి చేసుకొంటున్నారు. సింగపూర్ దేశ వ్యాపారుల ద్వారా బర్మా మినుములను కొనుగోలు చేస్తున్న వ్యాపారులు ఓడల ద్వారా దేశంలోని చెన్నయ్, ముంబయి ఓడరేవులకు సరుకును దిగుమతి చేసుకొని లారీల్లో పొన్నూరుకు రప్పించుకొంటున్నారు. విజయనగరం, హైదరాబాదు, తెనాలి, గుంటూరు, నరసరావుపేటలలోని పప్పు మిల్లులకు వీటిని సరఫరా చేస్తున్నారు. భారత ప్రభుత్వం కూడా బర్మా నుంచి మినుములను నాఫెడ్, ఎం.ఎం.టి.సి, పి.ఇ.సి ద్వారా కొనుగోలు చేసి 15 నుంచి 20శాతం సబ్సిడీపై ప్రజలకు మార్కెట్‌లో అందుబాటులో వుంచుతోంది.

### ఉత్పత్తి తక్కువ డిమాండ్ ఎక్కువ

మన దేశ ప్రజల అవసరాలకు సరిపడిన మినుముల ఉత్పత్తి దేశీయంగా జరగని నేపథ్యంలో ఇతర దేశాలు ముఖ్యంగా బర్మా నుంచి మన దేశ మార్కెట్‌లోకి మినుముల దిగుబడి ఎక్కువగా సాగుతోంది. బర్మా నుంచి మినుముల దిగుమతి లేకపోతే మినప్పప్పునకు మనదేశంలో వున్న డిమాండ్ దృష్ట్యా క్వింటా మినుములు 10వేల రూపాయల ధర పలుకుతాయని స్థానిక వ్యాపార ప్రముఖుడు కారుమూరి ప్రకాష్ అభిప్రాయ పడ్డారు.

### వ్యాపారులను దెబ్బతీస్తున్న ప్రభుత్వ నిబంధనలు

ఏడాదికి రూ. 10కోట్ల మేరకు పన్నులు చెల్లిస్తున్న తమను ప్రభుత్వ నిబంధనలు దెబ్బతీస్తున్నాయని మినుము వ్యాపారులు కారుమూరి ప్రకాష్, ఎస్.గుర్నాథం, పి.రవీంద్రనాథ్ పేర్కొన్నారు. ప్రభుత్వ నిబంధనల కారణంగా ఎక్కువ మొత్తంలో మినుమును స్టాక్ చేసుకొనే అవకాశం లేకుండా పోతోందన్నారు. దేశంలో ఏ రాష్ట్రంలోనూ లేని విధంగా మినుముల వ్యాపారంపై రాష్ట్ర ప్రభుత్వం నాలుగుశాతం వ్యాట్ ట్యాక్స్‌ను వసూలు చేస్తోందన్నారు. పన్నులు సక్రమంగా చెల్లించినా, రవాణాలో మార్కెటింగ్ యార్డు చెక్ పోస్టుల ఇబ్బందులు తప్పడం లేదని అసంతృప్తి వ్యక్తం చేశారు. వ్యాట్ ట్యాక్స్ వల్ల జీరో వ్యాపారం పెరిగిందని, జీరో వ్యాపారం వల్ల ప్రభుత్వానికి నష్టం వాటిల్లుతోందని అన్నారు.

### ఈ ఏడాది ఆశాజనకం

మినుముల ఉత్పత్తి దారులు- వ్యాపారులకు మినుముల మార్కెట్ ఈ ఏడాది ఆశాజనకంగా వుందని వ్యాపారులు పేర్కొన్నారు. పంట దిగుబడి చేతికి అందిన సమయంలో క్వింటాల్ ధర మూడు వేల నుంచి మూడువేల అయిదు వందల వరకు రైతులకు ధర లభించిందన్నారు. గత ఏడాదితో పోల్చుకుంటే మినుముల ధర తక్కువగా వున్నప్పటికీ మార్కెట్ ఆశాజనకంగా వుందన్నారు. నల్లబంగారం (మినుములు) వ్యాపారం గాలి వాటమైనప్పటికీ ఈ ఏడాది సంతృప్తికరంగా సాగుతోందన్నారు.




ఎమ్మెల్యే మక్కెన ద్వారా వృద్ధులకు బియ్యం పంపిణీ




బాటసారుల కోసం ఏర్పాటు చేసిన చలివేంద్రం

# అన్నార్తుల సేవలో ఆఓపా

- ★ సేవా కార్యక్రమాల కోసం ఏడాదికి రూ. 2 లక్షలు
- ★ నిరుపేదలు, వృద్ధులు, విద్యార్థులను ఆదుకోవడమే ప్రధానాశయం

(ఆన్‌లైన్ - వినుకొండ)

ఆకలిగొన్నవారికి అన్నం.. దాహార్తితో ఉన్నవారికి మంచినీరు.. వికలాంగులకు చేయూత.. వృద్ధులకు సహకారం.. బీద విద్యార్థులకు ఆపన్న హస్తం అందిస్తూ వినుకొండ ఆర్యవైశ్య అఫీషియల్స్ అండ్ ప్రొఫెషనల్స్ సేవా రంగంలో ముందుకు సాగుతోంది. రాష్ట్రంలో ఎవరూ చేపట్టని వినూత్నరీతిలో పలు పథకాలను ఏర్పాటుచేసి సహాయ సహకారాలు అందిస్తోంది. ఎటువంటి ఆదరణా లేని నిరుపేద వృద్ధులకు అన్నపూర్ణ పథకం ద్వారా నెలకు 10కేజీల బియ్యం, కందిపప్పు, నూనెలు పంపిణీ చేస్తూ వారి ఆకలిబాధను తీరుస్తోంది వేసవికాలంలో మంచినీటి చలివేంద్రాలు ఏర్పాటుచేసి బాటసారుల దాహార్తిని తీరుస్తోంది. విద్యావికాస పథకం ద్వారా పేద విద్యార్థులకు దుస్తులు, పాఠ్యపుస్తకాలు, నోట్‌బుక్‌లను అందజేస్తున్నారు. పేదరికంతో చదువుకోలేని విద్యార్థులకు ఫీజులు చెల్లించి చదువును కొనసాగిస్తున్నారు. ఆరోగ్య పథకం ద్వారా అనారోగ్యంతో మంచం పట్టిన రోగులు కోలుకునేందుకు ఆర్థికసాయంతో పాటు ఆపరేషన్లకు ఇతోథిక సాయం అందిస్తున్నారు. ఉపాధి పథకం ద్వారా కొంత మందికి కుట్టుమిషన్లు పంపిణీ చేశారు. శావల్యాపురం మండల కేంద్రంలోని అనాథ శరణాలయం విద్యార్థులకు ట్రంకుపెట్టెలు, చాపలు, దుప్పట్లు పంపిణీచేశారు. పేద విద్యార్థులకు స్కాలర్‌షిప్‌లు అందజేయడంతో పాటు వివిధ సంస్థల నుంచి ఆర్థికసాయం అందేట్లు చేయూతనిచ్చారు. ఏడాదికి రెండు లక్షల రూపాయలు సేవా కార్యక్రమాలకు వినియోగిస్తున్నట్లు ఆఓపా నాయకులు గోనుగుంట్ల సుదర్శనరావు వెల్లడించారు. నిరుపేదలను, వృద్ధులను, విద్యార్థులను ఆదుకోవాలన్నదే తమ సంస్థ ప్రధానాశయమని వివరించారు. భవిష్యత్తులో మరిన్ని ప్రజాహిత కార్యక్రమాలు చేపట్టనున్నట్లు సుదర్శనరావు తెలిపారు. వినుకొండలో ఆఓపా చేస్తున్న కార్యక్రమాలు సేవారంగంలో ప్రశంసలు పొందుతూ ఆదర్శంగా నిలిచాయి.

# సంక్షోభంలో తమలపాకు తోటల సాగు

(90వ పేజీ నుంచి)

మార్కెట్‌లో లభించే పరిస్థితి లేకపోవడంతో రైతులు తోటలను వదిలి వేయగా... తోటలపై ఆధారపడిన కూలీల జీవనం ప్రశ్నార్థకంగా మారింది.

## ప్రత్యామ్నాయ పంటలే గత్యంతరం

తమలపాకు తోటల సాగుపై దశాబ్దాల కాలంగా లాభాలను ఆర్జిస్తున్న రైతులకు గత దశాబ్ద కాలంగా తోటల పెంపకంలో ఎదురవుతున్న సంక్షోభం ఇతర వాణిజ్య పంటల వైపునకు మళ్ళిస్తోంది. ఇప్పటికే పలువురు రైతులు పసుపు, అరటి, కూరగాయల తోటలు, మొక్కజొన్న పంటల సాగును ప్రారంభించారు.

## తమలపాకు తోటల రైతులను ప్రోత్సహించాలి

తమలపాకుల తోటలు సాగుచేస్తున్న రైతులను ప్రభుత్వం ప్రోత్సహించాలని పొన్నూరు ప్రాంత తమలపాకుల ఉత్పత్తి, సరఫరా ద్వారుల సంఘ నాయకులు మల్లంపాటి సుబ్బారావు, ఎస్.ఎస్.ఆర్‌లు ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు. తమలపాకులను నిల్వ చేసేందుకు కోల్డ్ స్టోరేజిలను నిర్మించాలని, పాన్ పరాగ్, గుట్కాలను నిషేధించి తమలపాకుల వినియోగానికి ప్రభుత్వం చర్యలను గైకొనాలని కోరారు. జూదం, గాలివాటంగా మారిన తమలపాకుల తోటలను సాగుచేస్తున్న రైతులకు రాయితీలను కల్పించాలని, కార్మికులకు ఉపాధి భద్రతను కల్పించాలని ప్రభుత్వాన్ని కోరారు. ప్రభుత్వం తమలపాకుల తోటల సాగును ప్రోత్సహించకపోతే తోటల సాగు కనుమరుగయ్యే ప్రమాద ముందని వారు పేర్కొన్నారు.

# అరణగండ్లలోనే..

(95వ పేజీ నుంచి)

బ్రహ్మనాయుడికి, నాగమ్మకు మధ్య శత్రుత్వానికి, యుద్ధానికి దారి తీసిందని అది అరుణగండ్లలోనే బీజం పోసుకుందని చరిత్రకారులు వెల్లడిస్తున్నారు.

## అరుణగండ్ల ప్రాంతాన్ని పర్యాటక ప్రాంతంగా అభివృద్ధి చేయాలి

వెనుకబడ్డ గిరిజన మండలం బొల్లాపల్లిలోని గండిగనుముల, రావులాపురం వద్ద గల అరుణగండ్ల (రాచకొండ) లోనే పల్నాటి యుద్ధానికి బీజం పడింది. కాని ఈ విషయంపై ప్రజలకు అవగాహన లేదు. సమీప గ్రామాల్లో పూర్వీకులకు మాత్రమే దీని గురించి అవగాహన ఉంది. ఈ విషయంపై పురావస్తుశాఖ స్పందించి అరుణగండ్ల (రాచకొండ)లో పరిశోధనలు జరిపితే మరిన్ని విషయాలు వెలుగు చూడగలవు.

## పర్యాటక ప్రాంతంగా అభివృద్ధికి కృషిచేస్తా: జెడ్‌పిటిసి

వెనుకబడిన గిరిజన ప్రాంతంలో ఇలాంటి విశేషాలు ఉండటం గర్వించదగ్గ పరిణామమని, ఈ విషయానికి ఎక్కువ ప్రాధాన్యత నిస్తూ ఈ ప్రాంతాన్ని పర్యాటకరంగంగా అభివృద్ధి పర్చాలని కోరుతూ ప్రభుత్వానికి నివేదికను పంపనున్నట్లు జెడ్‌పిటిసి ఊరిబిండి లక్ష్మియాదవ్ తెలిపారు. దీనిపై ప్రజల్లో అవగాహన కార్యక్రమాలను ఏర్పాటుచేసే విధంగా ప్రభుత్వం చర్యలు తీసుకోవాలని ఆమె కోరారు.



ఆత్మహత్యలు చేసుకున్న రైతుల పిల్లలకు సహాయం అందిస్తున్న దృశ్యం

# ఆత్మహత్య చేసుకున్న రైతుల కుటుంబాలకు ఎఎంజి సంస్థ చేయూత



ఎఎంజి సంస్థ డైరెక్టరు అరుణ్‌కుమార్ మహంతి

(ఆన్‌లైన్, చిలకలూరిపేట) కడప, చిత్తూరు, కరీంనగర్, అదిలాబాద్, నిజామాబాద్, కర్నూలు, నల్గొండ, ఖమ్మం... ఇలా 21 జిల్లాలలో ఎంతమంది రైతులు అప్పుల పాలై ఆత్మహత్యలు చేసుకున్నారో ఆయా జిల్లాల కలెక్టర్ల వద్ద ఇందుకు సంబంధించిన అధికారిక సమాచారం ఉంది. చిలకలూరిపేట ప్రధాన కేంద్రంగా ఉన్న స్వచ్ఛంద సేవాసంస్థ ఎఎంజి ఇండియా ఇంటర్నేషనల్ వారు ఆయా జిల్లా కలెక్టర్లను సంప్రదించారు. వారి వద్ద నుంచి ఆత్మహత్యలు చేసుకున్న రైతుల వివరాలను సేకరించారు. జిల్లాల వారీగా ఆత్మహత్యలు చేసుకున్న ప్రతి రైతు ఇంటివద్దకు ఎఎంజి సంస్థ ప్రతినిధులు వెళ్లారు. ఈ రైతుల కుటుంబాలలోని పిల్లలు ఏం చదువుకుంటున్నారు అనే సమాచారాన్ని సేకరించారు. కుటుంబానికి పెద్ద దిక్కు అప్పులతో ఆత్మహత్యకు పాల్పడగా ఆర్థిక ఇబ్బందుల కారణంగా రైతుల పిల్లలు చదువులు మధ్యలో మానివేయకుండా సహాయం చేయాలని ఎఎంజి సంస్థ డైరెక్టర్ డాక్టర్ అరుణ్‌కుమార్ మహంతి నిర్ణయానికి వచ్చారు.

జర్మనీ, హాలెండ్ దేశాలలో ఉన్న సేవాసంస్థల వారిని అరుణ్‌కుమార్ మహంతి సంప్రదించి తన ఆలోచనను వెల్లడించారు. దాతలు సహాయం అందించడానికి ముందుకు వచ్చారు. దీనితో ప్రభుత్వం కూడా చేయలేని సహాయం ఎంతో చక్కగా ఎఎంజి సంస్థవారు అందించడం ప్రారంభించారు. ఇంజనీరింగ్, ఎంసిఎ, ఎంబిఎ, పిజి కోర్సులు, డిగ్రీ, ఇంటర్మీడియెట్, 1 నుంచి 10వ తరగతి చదువుకుంటున్న సుమారు వెయ్యి మంది విద్యార్థులకు ఎఎంజి సంస్థ సహాయం అందిస్తున్నది. వీరు తమ చదువులు ముగించే వరకు ఈ సహాయం కొనసాగుతుంది.

రైతుల పిల్లలకు ప్రతిఏటా దుస్తులు, పుస్తకాలు, ఫీజులు, స్కూలు బ్యాగులతోపాటు ప్రతినెలా ఖర్చుల కోసం చదువునుబట్టి ఆర్థిక సహాయాన్ని ఎఎంజి సంస్థ అందిస్తున్నది. 2004 సంవత్సరంలో రాష్ట్ర మంత్రి కె రోశయ్య ప్రారంభించిన ఈ కార్యక్రమం విజయవంతంగా కొనసాగుతున్నది. ఎఎంజి సంస్థ వారు చేస్తున్న ఈ సహాయం ఆత్మహత్యలు చేసుకున్న రైతుల కుటుంబాలకు ఎంతో ఊరటనిస్తున్నది.

## 'తుళు' వంశపు రాజుల ఊరు

*(మొదటి పేజీ తరువాయి)*

విశ్వామిత్ర మహర్షి సర్వశక్తులను ధారబోస్తాడు. బల, అతిబల అనే విద్యలను కైవశం చేసుకునేందుకై రామునిచే విశ్వామిత్ర మహర్షి శివలింగ ప్రతిష్ట చేయిస్తుండగా, కైలాసం నుండి శివుడు ఆనంద తాండవం చేస్తూ దిగివచ్చాడట. కనుకనే ఈ ప్రాంతానికి శివతాండవపురి అనే పేరు వచ్చింది. రామునిచే శివలింగ ప్రతిష్ట గావింపబడిన ఆలయాన్ని రామలింగేశ్వరస్వామి ఆలయమని స్థానికులు చెప్పుకుంటున్నారు.

అంతేకాకుండా మరో చారిత్రక ఆధారాన్ని ఈ ప్రాంత ప్రజలు ఇప్పటికీ సాక్ష్యంగా చూపుతున్నారు. లక్ష్మణుడిని బ్రతికించేందుకై సంజీవని పర్వతంతో ఆంజనేయస్వామి ఆకాశమార్గాన పయనిస్తుండగా పర్వతం నుంచి చిన్న గులకరాయి జారి నేలపై పడిందట. అలా జారి పడిన గులకరాయి తుళ్లూరులోని రామలింగేశ్వరస్వామి ఆలయం ఎదుట నున్న ఎర్రమాసు చెరువులో పడిందని చెబుతున్నారు. ప్రతి వేసవిలోనూ చెరువులో కన్పించే రాయిని దర్శించి స్థానికులు పరవశం చెందుతున్నారు. మండలంలోని అనంతవరం, హరిశ్చంద్రపురం గ్రామాలకు మరో పురాణగాథను పూర్వీకులు వివరిస్తున్నారు. కలియుగ ఆరంభానికి కొన్ని ఘడియల ముందు శ్రీమన్నారాయణుడు స్థిర నివాసం కోసం బయలుదేరాడట. అనంతవరం కొండపై కాలుమోపిన శ్రీనివాసుడు అక్కడి ప్రకృతికి పులకరించి కొంతసేపు విశ్రమించినట్లు చెబుతారు. ఇప్పటికీ అనంతవరం కొండపై శ్రీనివాసుడు పవళించిన రూపంలో భక్తులకు దర్శనమిస్తుంటారు. శ్రీనివాసుని అనుసరిస్తూ వచ్చిన అలివేలు మంగాదేవి కృష్ణానది తీరాన ఉన్న హరిశ్చంద్రపురంలో కొలువైనట్లు పురాణాలు చెబుతున్నాయి.

- 'మందడం'గా మారిన మందారం గ్రామానికి మరో చారిత్రక విశిష్టత ఉంది. ప్రతాపరుద్రుని గురువు విశ్వేశ్వరశైవుడు ఆశ్రమ పాఠశాలను ఏర్పాటు చేయదలచాడట. ఆయన కోరిక మేరకు రాణి రుద్రమదేవి మందారం, వేళంగిపూడి, ములికిపురాలను దానం చేయగా విశ్వేశ్వర శైవుడు ఆశ్ర పాఠశాలకు ఏర్పాటు చేసి నృత్యం సంగీతం, సంస్కృతం నేర్పించినట్లు శాసన ఆధారాలున్నాయి. కాలక్రమేణా ఆ గ్రామాలపేర్లు మందడం, వెలగపూడి, మల్కాపురంగా రూపాంతరం చెందాయి. అమరావతిలో కొలువైన మూలవిరాట్టు అమరలింగేశ్వరుని మల్కాపురం గ్రామం నుండి తరలించినట్లు స్థానికుల నమ్మకం.

# నాణ్యతలో 'సేఫ్'... ఉపాధిలో భేష్




గోళ్ళపాడులోని సేఫ్ ఫార్మా కంపెనీస్

(ఆన్‌లైన్, ముప్పాళ్ళ)

ఉపాధి కల్పనే ధ్యేయంగా ఏర్పర చిన కంపెనీ నేడు ఖండాంతరాలలో రాష్ట్ర, దేశ ఖ్యాతిని ఆర్జిస్తుంది. నాణ్యత, నమ్మకం ధ్యేయంగా పనిచేస్తూ దిన దిన ప్రవర్ధమానమై నేడు ఎంతోమంది నిరుద్యోగ, యువతీ, యువకులకు ఉపాధి కల్పిస్తుంది. ప్రజల అవసరాలను తీర్చవలసిన బాధ్యత ప్రభుత్వానికి ఉంది. అయితే ఇబ్బడిముబ్బడిగా పెరుగుతున్న జనాభాకు అన్ని వసతులు ప్రభుత్వమే సమకూర్చాలనుకోవటం కూడా భావ్యం కాదు. సమర్థులైన వ్యక్తులు, సంస్థలు తమవంతు సహకారాన్ని అందించవలసిన అవసరం ఎంతైనా ఉంది. ముఖ్యంగా పరిశ్రమలను గ్రామీణ ప్రాంతాలలో విస్తరింపచేసి అక్కడ ప్రజలకు ఉపాధి కల్పించాల్సిన బాధ్యత ఉంది. అదే ధ్యేయంలో డాక్టర్ కోడెల శివప్రసాదరావు 1985లో 30 మంది కార్మికులతో సేఫ్ ఫార్మా స్యూటికల్స్ కంపెనీ ప్రారంభించారు. సుమారు 120 మంది డాక్టర్ మిత్రుల సహకారంతో 1995లో సేఫ్ పేరంటరల్స్, సేఫ్ ఫార్ములేషన్స్ అనే మరో రెండు కంపెనీలను విస్తరింపజేశారు. అప్పటి రాష్ట్ర ముఖ్యమంత్రి ఎన్‌టి రామారావు ఆ కంపెనీలకు ప్రారంభోత్సవం చేశారు. నేడు ఈ పరిశ్రమలో ప్రస్తుతం 150 మంది కార్మికులు పని చేస్తున్నారు.

అన్ని వ్యాధులకు కావాల్సిన ఇంజక్షన్లు, యాంపిల్స్, వైయాల్స్, డ్రైపౌడర్లను సేఫ్ పేరంటరల్స్ తయారు చేస్తుండగా, టాబ్లెట్లు, క్యాప్యూల్స్, లిక్విడ్ ఓరల్స్‌ను సేఫ్ ఫార్ములేషన్ కంపెనీ తయారుచేస్తోంది. ఆంధ్రప్రదేశ్‌లో సొంత వ్యాపారం కొనసాగిస్తూ, లోన్ లైసెన్సుల ద్వారా ఆఫ్రికా దేశాలైన నైజీరియా, కెన్యా, ఘనా, టూగో, రిపబ్లిక్ డుమాలి, జోర్డాన్, ఐవరీకోస్ట్, ఓమెన్ తదితర ప్రాంతాలకు ఇక్కడ మందులు ఎగుమతి చేస్తున్నారు.

వీటికి తోడు మల్టీనేషన్ కంపెనీలైన నోవార్టిస్ ఇండియా లిమిటెడ్, ఇండియన్ ఇమ్యునాలాజికల్ లిమిటెడ్, భారత్ సీరమ్స్ అండ్ వ్యాక్సిన్స్ లిమిటెడ్ ముంబాయి, ఎస్‌కె ఎం ఫార్మా లిమిటెడ్ బెంగుళూరు, భారత్ బయోటెక్ హైదరాబాద్, బ్రిలియంట్ ఇండస్ట్రీస్ లిమిటెడ్, హైదరాబాద్, నియోస్పార్క్ డ్రగ్స్ అండ్ కెమికల్స్ లిమిటెడ్, హైదరాబాద్ కంపెనీలకు కావాల్సిన 85 రకాల మందులను సేఫ్ కంపెనీ తయారుచేయటం గర్వకారణంగా ఉందని కంపెనీ ఎండి కెవికె రామారావు చెప్పారు. కంపెనీ నుంచి తయారైన వాటిలో న్యూరోసేఫ్, ఫెండిక్, సెఫెటాక్సైమ్, సెఫ్ట్రయాక్సోన్, యాంపిక్లాక్సా, ఇంజక్షన్లు, సేఫ్‌మాక్స్, సిలిన్‌ప్లస్, సేఫ్‌లక్స్, న్యూరోసేఫ్ క్యాప్యూల్స్, టానిక్స్ ఖ్యాతిని ఆర్జించాయి.

(మిగతా 103వ పేజీలో)

# కునారిల్లుతోన్న పణిదెం చేనేత సహకార సంఘం

(ఆన్‌లైన్, సత్తెనపల్లి)

స్వాతంత్ర్య ఉద్యమకాలంలో చేనేత పరిశ్రమ రక్షణ కోసం జాతిపిత మహాత్మాగాంధీ రాట్నాన్ని చిహ్నంగా జెండాను రూపొందించి విదేశీ వస్త్ర బహిష్కరణ ఉద్యమాన్ని నిర్వహించారు. దరిమిలా అధికారంలోకి వచ్చిన పాలకులు అనుసరిస్తున్న విధానాల ఫలితంగా చేనేత పరిశ్రమ తీవ్ర సంక్షోభానికి గురికావటం వల్ల కార్మికులకు ఉపాధి లేక ఇబ్బంది పడుతున్నారు. గత పాలక ప్రభుత్వాలు చేనేత పరిశ్రమ రక్షణకోసం అనేక సంక్షేమ పథకాలు ప్రవేశపెడుతున్నట్టు వాగ్ధానాలు చేయటం తప్ప ఆచరణలో ఏ ఒక్కటి అమలు కాలేదు.

భారత దేశంలో ప్రధానమైన వ్యవసాయ, చేనేత రంగాలకు ప్రాధాన్యం ఇచ్చి ఆయా రంగాలలో రైతులు, చేనేత కార్మికులు ఎదుర్కొంటున్న సమస్యలను పరిష్కరించి ఆదుకుంటామని వాగ్దానం చేసిన కాంగ్రెస్ ప్రభుత్వం వాగ్ధానాల అమలులో ముందుగా వ్యవసాయ రంగానికి ప్రాధాన్యత ఇచ్చింది. దరిమిలా చేనేత రంగానికి కూడా కొంతమేరకే ప్రాధాన్యత ఇవ్వటం వల్ల చేనేతకు సరైన ప్రోత్సాహం లభించటం లేదు. సత్తెనపల్లి పట్టణంలోని రైల్వేగేటు సమీపంలో 1947లో ప్రారంభించిన పణిదెం చేనేత సహకార సంఘం నేడు అప్పులు కట్టలేక కార్మికులకు పని చూపలేకపోతున్నది. చేనేత వస్త్రాల ఉత్పత్తిలో తనదైన ప్రతిభను కనబరిచి విదేశాలలో సైతం నీరాజనాలు అందుకున్న పణిదెం చేనేత సహకారసంఘం నేడు పాలకుల విధానాల ఫలితంగా కునారిల్లుతోంది. కార్మికుల గృహాలలో నేడు ఆకలి రాజ్యమేలుతోంది. 1946లో ఈసంఘాన్ని ప్రారంభించగా 1947లో పనిమొదలైంది. సంఘ ప్రారంభంలో 1975 మంది సభ్యులు ఉండేవారు. 350దాకా ఫ్రేమ్‌మగ్గాలు, 900 మంది కార్మికులు సంఘంలో పనిచేస్తూ జీవనోపాధి పొందేవారు. సత్తెనపల్లి, ఇరుకుపాలెం, రెంటపాళ్ళ, అబ్బూరు, లగడపాడు, గారపాడు, పెదకూరపాడు, నందిగామ, గుడిపూడి, మాదల గ్రామాల నుంచి కార్మికులు సత్తెనపల్లి వచ్చి సహకార సంఘంలో పనిచేసి జీవనోపాధి పొందేవారు. ఈసహకార సంఘంలో తయారైన దుస్తులను రాష్ట్రవ్యాప్తంగా అమ్మేందుకు 14 పట్టణాలలో డిపోలను ఏర్పాటు చేశారు. రెండు దశాబ్దాల పాటు ఎంతో చక్కగా నడిచిన సహకార సంఘం పాలకుల బాధ్యతారాహిత్యం కారణంగా నేడు నష్టాల ఊబిలో కూరుకుపోయింది. పనులు లేక చేనేత కార్మికులు పలువురు ఇతర వృత్తులకు వెళుతున్నారు. కొందరు కార్మికులకు పనులులేక అర్థాకలితో అలమటిస్తున్నారు. సహకార సంఘ పరిధిలో ప్రస్తుతం 75 మగ్గాలు పనిచేస్తున్నాయి. 150 మంది కార్మికులు దీనిద్వారా ఉపాధి పొందుచున్నారు. సంఘం పూర్తిగా నడవాలంటే రూ.15లక్షల వర్కింగ్ క్యాపిటల్ అవసరమని సంఘ అధ్యక్షుడు కట్టా శివదుర్గారావు తెలిపారు. ప్రభుత్వం రూ.15లక్షల అప్పుగా ఇచ్చి, ఉన్న అప్పును రద్దు చేస్తే ఎక్కువమంది కార్మికులకు ఉపాధి కల్పించవచ్చని ఆయన తెలిపారు. ఆర్థిక వనరులు లేకపోవటం కారణంగా చేనేత కార్మికులందరికి ఉపాధి చూపలేకపోతున్నామని ఆయన తెలిపారు. చేనేత దుస్తుల ప్రాధాన్యత గురించి టివి, ఇతర ప్రసార సాధనాల ద్వారా ప్రచారం చేయాలని, చేనేత సంఘాలకు నాబార్డ్ కల్పిస్తున్న నగదు పరిమితికి వడ్డీ 9శాతం నుంచి 14.5శాతం పెంచటం వల్ల సంఘాల నడ్డి విరుగుతుందన్నారు. వెంటనే దీనిని ప్రభుత్వం ఉపసంహరించుకుంటే చేనేత సంఘాలకు మేలు జరుగుతుందన్నారు. చేనేత వస్త్రాల ఉత్పత్తిలో ప్రతిభ కనబరిచి విదేశాలలో సైతం నీరాజనాలు అందుకున్న పణిదెం చేనేత సహకార సంఘం అభివృద్ధికి ప్రభుత్వం కృషిచేయాలని పలువురు కోరుతున్నారు.



పణిదెం చేనేత సహకార సంఘం భవనం



పణిదెం చేనేత సహకార సంఘంలోని మగ్గాలు

## పూజలందుకుంటున్న ఫిరోజి రుషీంద్రులు

(ఆన్‌లైన్, సత్తెనపల్లి)

నిత్యజీవితంలో అనేక సమస్యలతో కొట్టుమిట్టాడుతున్న లక్షలాది మంది ప్రజానీకానికి ఆధ్యాత్మిక చింతనను బోధించటం ద్వారా వారి జీవితాలలో వెలుగు నింపిన మహనీయుడు సత్తెనపల్లికి చెందిన ఫిరోజి అనే తత్వవేత్త. ఇప్పటికి శతాబ్దానికి పైగా సత్తెనపల్లి పరిసర ప్రాంతాలలో ఆ మహానుభావుడు ప్రజల ఆరాధ్యదైవంగా పూజలందుకుంటున్నారు.



ఫిరోజి ఋషీంద్రులవారు

దైవశక్తి ప్రపూరితమైన అతీతమైన శక్తి ఆయనకు పుట్టుకతో సంక్రమించగా అనేక సందర్భాల్లో ప్రజాహితంకోరి ఎన్నో మహిమలను ప్రదర్శించారు. వీరు తెలుగు, సంస్కృత భాషల్లో అనేక రచనలను గావించి ప్రజలను ప్రభావితం చేయటంతోపాటు తన సంగీత గానమృతంతో పండిత పామరులను రంజింపచేసి ఆధ్యాత్మిక శిఖరంగా నిలచారు. ఫిరోజి మహారాష్ట్రకు చెందిన క్షత్రియ వంశంలో శివాజీ మహారాజ్ రాచరికపు వెలుగు క్షీణించిన తర్వాత ఫిరోజి తాత గారైన పాపాజీ నరసరావుపేట జమీందారు కొలువులో ప్రధాన సేనానిగా చేరారు. పాపాజి కుమారులైన నర్సోజి సత్తెనపల్లి జమిందారుగారైన రాజామానూరు వెంకట గోపాలరాయని కొలువులో సబేదారుగా చేరారు. ఫిరోజి చిన్న వయసులోనే జరగబోయే విషయాలను ముందుగా చెప్పగలగడం, ఆ చెప్పినవన్నీ జరుగుతూ ఉండటంతో వాక్శుద్ధి కలిగిన మహిమాన్వితునిగా ఆయనపట్ల ప్రజలకు విశ్వాసం కలిగింది. చిదానందుడు అనే యోగి ప్రభోదించిన తారక మంత్రోపాసనతో ఆధ్యాత్మిక శోధనను ప్రారంభించిన ఫిరోజి పోతులూరి వీరబ్రహ్మం, యోగివేమనలు అనుసరించిన అచల పరిపూర్ణ సిద్ధాంత మార్గంలో పయనించారు. ఫిరోజి రుషీంద్రుల సహజ పాండిత్య ప్రకర్షతో పండితలోకాన్ని ఆశ్చర్యపరచారు. సంస్కృత, ఆంధ్ర భాషల్లో ఆయన రచించిన వేణుగోపాల శతకాన్ని తనకు అంకితం ఇవ్వవలసిందిగా సత్తెనపల్లి జమీందారు కోరగా తన రచనలు భగవంతుని కోసమేనంటూ అపర పోతనామాత్యునిలా తిరస్కరించారు.

ఆ కొలువులో వున్న అనేకమంది పండితులకు ఫిరోజి ఖ్యాతి అసూయ కలిగించింది. ఫిరోజిని ఎలాగైనా అపఖ్యాతి పాలు చేయాలని వారు ఎంతగానో యత్నించి చివరకు శ్రీహరి అనే దేవదాసిని ఆయనపై ఉసిగొల్పారు. ఫిరోజిని కవ్వించబోయిన శ్రీహరిలో ఆయన మాతృతత్వాన్ని వర్తింపజేశారు. ఆయన భౌతికకాయాన్ని వీడిన తర్వాత ఆయన ఆత్మ గుత్తికొండ బిలాలలో మరికొంత కాలం తపోనిష్ఠ ఆచరించవలసి ఉందని అనేక దృష్టాంతరాలతో ఇప్పటికీ ఈ ప్రాంతీయులు చెప్పుకోవడం ఫిరోజి విశేషం. ఫిరోజికి గుంటూరు, ప్రకాశం జిల్లాల్లో అనేక చోట్ల ఆలయ నిర్మాణాలు జరిగాయి. ఆయన ప్రధాన పీఠమైన సత్తెనపల్లిలోని సమాధిపై నెలకొల్పిన లింగ రూప దర్శనానికి వేల సంఖ్యలో భక్తులు వస్తుంటారు.

# చరిత్ర ప్రసిద్ధికెక్కిన రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు



రాజావాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు హయాంలోని వారి వారసులు నిర్మించిన కోట శిథిలావస్థకు చేరిన దృశ్యం

అచ్చంపేట, (ఆన్‌లైన్): ప్రముఖ జమిందార్ రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు 18-19 శతాబ్దాలలో కృష్ణా నది తీరంలో 108 శివాలయాలు నిర్మించి 909 గ్రామాలను పరిపాలించి చరిత్ర ప్రసిద్ధిగాంచారు. ఆ కాలంలోనే యోగాలు, సానిధ్యాలు, సామీప్యం, సాలోఖ్యంల వంటి ధ్యానాలను ఆచరించి దైవభక్తిని చాటారు.

వెంకటాద్రినాయుడు తండ్రి జగ్గన్న, తల్లి అచ్చమాంబ. వెంకటాద్రి నాయుడికి నాలుగు సంవత్సరాల వయస్సులోనే తండ్రి జగ్గన్నను 1764 సంవత్సరంలో బసాలత్‌జంగ్ వద్ద నున్న ఉద్యోగి ఒకరు మెడనరికి చంపారు. బసాలత్‌జంగ్ 1770లో గుంటూరు సర్కారురంతయూ జంగ్ చేతిలో ఉంది. ఈయన నిజాం నవాబునకు సోదరుడు. కృష్ణానదికి సమీపంలో ఉన్న అచ్చంపేట మండలంలో కుగ్రామంగా ఉన్న చింతపల్లి ఒకప్పుడు లక్ష్మీపురంగా పిలవబడేది. ఈ చింతపల్లే వెంకటాద్రి నాయుడుకి రాజధాని. చింతపల్లి కోట 1778లో వెంకటాద్రి నాయునికి సంక్రమించింది.

వెంకటాద్రి నాయుని తండ్రి జగ్గయ్య మృతిచెందిన పిదప నేటి అచ్చంపేట సాత్రాసెంటర్ వద్ద అచ్చమాంబ భర్తజగ్గయ్య మృతదేహాన్ని ఒడిలో పెట్టుకొని సతీసగమనం చేసిందని చరిత్రద్వారా తెలుస్తుంది. ఆనాడు అచ్చంపేట ప్రాంతమంతా తుప్పలతోను, కాలిబాటలు గాను ఉండేది. ఇదే ప్రాంతంలో శత్రువుల చేతిలో చనిపోవుట వల్ల అదేస్థలంలో ఆమె సతీసహగమనం చేసుకుంది.

### వెంకటాద్రి నాయుడు బాల్యం...

తల్లిదండ్రుల మరణానంతరం తన పెద్దనాన్న రామన్న భూపాలుడు నాయుడుని చేరదీశారు. సంగీతం, గుర్రపు సవారీ, వైద్యంలో వెంకటాద్రి నాయుడు ప్రావీణ్యత సంపాదించారు. తల్లిదండ్రులను పోగొట్టుకోవటం వల్లే వెంకటాద్రి నాయుడులో కాటిన్యం బాల్యం నుంచే అలవడిందని చరిత్రకారులు తెలిపారు.

### కుటుంబం...

వెంకటాద్రి నాయుడుకు ఇద్దరు భార్యలు. వారిలో ఒకరు వెర్రిమాంబ, మరొక భార్య ఉన్నారు. మొదటి భార్యకు పిల్లలు లేని కారణంగా రెండవవివాహం చేసుకోగా వారికి రాజ్యలక్ష్మి అనే కుమార్తె కలిగింది. వెంకటాద్రి నాయుడు కుమార్తె కృష్ణానదికి అవతలి ఒడ్డున ఉన్న ద్వారకా గట్టును చూస్తూ కోట నుంచి

(మిగతా 102వ పేజీలో)

## నిరుపేదలకు ఉన్నత విద్యే లక్ష్యంగా

# శ్రీ యదుకృష్ణ ఎడ్యుకేషనల్ సొసైటీ

(ఆన్‌లైన్ -ప్రత్తిపాడు)

పల్లెప్రాంతాల లోని నిరుపేద, మధ్యతరగతి కుటుంబాలకు ఉన్నత విలువలతో కూడిన విద్యను అందించాలనే సంకల్పంతో శ్రీ యదుకృష్ణ ఎడ్యుకేషనల్ సొసైటీ ద్వారా 1982వ సంవత్సరంలో స్థాపించబదిన కళాశాల శ్రీ మల్లం సుబ్బయ్య అండ్ నాగలక్ష్మయ్య జూనియర్ కళాశాల జిల్లా కేంద్రమైన గుంటూరుకు కేవలం 16 కిలో మీటర్ల దూరంలో ఉన్న ప్రత్తిపాడు - పెదనందిపాడు మార్గంలో సుమారు నాలుగు ఎకరాల స్థలంలో సువిశాల వాతావరణంలో సుమారు 25 సంవత్సరాల క్రితం ఈ కళాశాల అనే విజ్ఞాన మొక్కను డాక్టర్ బొంతగర్ల ప్రసాద్ నాటారు. ఆనాడు గుంటూరుకు వెళ్ళి ఇంటర్మీడియెట్ చదవలేక పదవ తరగతిలో చదువుకు స్వస్తి చెప్పి పొలం పనులకు వెళ్తున్న యువతను చూసి మనసు చలించిన బొంతగర్ల కళాశాల స్థాపనకు నడుంబిగించారు. వెంటనే ప్రత్తిపాడుకు చెందిన మల్లం సుబ్బయ్య, నాగలక్ష్మమ్మ దంపతులు కళాశాల స్థాపనకు ఆనాడు రూ. లక్ష విరాళం అందించారు. వారిపేరుతోనే కళాశాల ప్రారంభమైంది. నాటి నుండి ఇంటర్మీడియెట్‌కు సంబంధించి అన్ని గ్రూపులలో శిక్షణా తరగతులు ప్రారంభమయ్యాయి. 1990లో ప్రభుత్వం నుండి గ్రాంట్ లభించింది. అదే సంవత్సరం కళాశాలకు పక్కా భవనాలు నిర్మించారు.

చదువుకు పేదరికం అడ్డుకారాదు అనే సంకల్పంతో నేటికీ ఈ కళాశాలలో విద్యాబోధన జరుగుతుంది. ఓ పక్క పుట్టగొడుగుల్లా కార్పోరేట్ కళాశాలలు పుట్టుకొస్తున్నా, పేద, బడుగు, మధ్యతరగతి కుటుంబాల వారికి ఈ కళాశాల వెన్నుదన్నుగా నిలుస్తోంది. ప్రభుత్వ ఫీజులు కన్నా అతి తక్కువ ఫీజులను మాత్రమే వసూలు చేస్తున్నారు. ఆ ఫీజు కూడా కట్టలేని నిరుపేద విద్యార్థులకు కేవలం పరీక్ష ఫీజు మాత్రమే వసూలు చేస్తున్నారు.



కళాశాల భవనం

### ప్రతి విద్యార్థిపై వ్యక్తిగత శ్రద్ధ

కార్పోరేట్ కళాశాలలోనే ట్యూషన్ పెట్టి విద్యార్థులను చదివిస్తుంటారు. అయితే ఈ కళాశాలలో కూడా వాటికి మేమూ తీసిపోమంటూ ప్రతిరోజు సాయంత్రం విద్యార్థుల చేత చదివిస్తూ, వారం వారం పరీక్షలు పెడుతూ ప్రోగ్రెస్ రిపోర్టును విద్యార్థుల ఇంటికి పంపుతుంటారు. ఏ విద్యార్థి అయినా సరిగా కళాశాలకు రాకపోయినా, మార్కులు సరిగా రాకపోయిన కళాశాల వైస్ ప్రిన్సిపల్ జక్కా వెంకటేశ్వరరావు, ఇతర లెక్చరర్లు ఆయా విద్యార్థుల ఇళ్లకు వెళ్లి తల్లిదండ్రులను కలిసి విద్యార్థి పరిస్థితిని విచారిస్తారు. ఈ విధంగా మంచి ఫలితాలు సాధిస్తున్నారు.

### తగ్గని ఆదరణ..

కార్పోరేట్ కళాశాలల పోటీని తట్టుకోలేక ఇప్పటికీ రాష్ట్రంలో చాలా చోట్ల ప్రభుత్వ జూనియర్ కళాశాలలు కనుమరుగవుతున్న సమయంలో కూడా ఈ కళాశాలకు ఆదరణ ఏమాత్రం తగ్గలేదు. 300 మంది విద్యార్థినీ విద్యార్థులతో విరాజిల్లుతుంది. కళాశాల ప్రిన్సిపాల్ మరియు కరస్పాండెంట్ డాక్టర్ బొంతగర్ల ప్రసాద్ కళాశాల విషయంలో ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటూ మారుతున్న కాలానికి అనుగుణంగా కళాశాల సౌకర్యాలను ఏర్పాటుచేస్తున్నారు.

### కార్పోరేట్ విద్యా సంస్థలపై ప్రభుత్వ అజమాయిషీ కొరవడింది: డాక్టర్ బొంతగర్ల ప్రసాద్

కార్పోరేట్ విద్యా సంస్థలపై ప్రభుత్వ అజమాయిషీ పూర్తిగా కొరవడిందని మల్లం సుబ్బయ్య అండ్ నాగలక్ష్మమ్మ జూనియర్ కళాశాల ప్రిన్సిపాల్ అండ్ కరస్పాండెంట్ బొంతగర్ల ప్రసాదు అభిప్రాయం వ్యక్తంచేశారు. ఫీజులపై గాని, విద్యాబోధనలోగాని, అధ్యాపకులపై, క్యాంపస్‌పై ప్రభుత్వ అజమాయిషీ లేదన్నారు. ఎంసెట్‌లో ఇంటర్ మార్కుల ఆధారంగా సీట్లు కేటాయించడం వలన గ్రామీణ ప్రాంత విద్యార్థులకు అన్యాయం జరుగుతుందన్నారు. గ్రామీణ ప్రాంతంలోని విద్యా విధానం మెరుగుపడే విధంగా ప్రభుత్వం ఎయిడెడ్ విద్య సంస్థలను ప్రోత్సహించాలన్నారు. మెరిట్ స్టూడెంట్స్‌ను మాత్రమే తమ కళాశాలల్లో జేర్చుకొని అధికమార్కులు సాధించామంటూ పబ్లిసిటీ ఇస్తున్న కార్పోరేట్ విద్యా సంస్థల గురించి తల్లిదండ్రులు తెలుసుకోవాలని సూచించారు. మా కళాశాలల్లో జేరే విద్యార్థులందరూ సామాన్య తరగతికి చెందిన వారని అలాంటి వారికి విద్యను అందించి మంచి ఫలితాలను సాధిస్తున్నామని ప్రసాద్ తెలిపారు.

# చరిత్ర ప్రసిద్ధికెక్కిన రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు



చింతపల్లిలో వెంకటాద్రి నాయుడు నిర్మించిన శివాలయం

(101వ పేజీ తరువాయి)

కాలుజారి కిందపడి చనిపోయింది.

**వెంకటాద్రినాయుడు పాలన**

వాసిరెడ్డి రామన్న నాయుడు 1778లో మృతిచెందారు. రామన్న కుమారుడు పాపయ్యకు రాజ్యాధికారం సంక్రమించాల్సి ఉండగా రామన్న తమ్ముడు జగ్గయ్యకుమారుడైన వెంకటాద్రి నాయుడుకి రాజ్యాధికారం సంక్రమించింది. ఇతడే చరిత్ర ప్రసిద్ధిగాంచిన రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు. ఈయన రాజుకాగానే కొంత రాజనీతిని వదిలిపెట్టి పాపయ్యను చింతపల్లి కోటలో బంధించారు. దీంతో తమ అద్భుతమైన పరాక్రమం బటయపడింది. అదే తరుణంలో బసాలత్‌జంగ్ మరణించాడు. అప్పటినుంచి వెంకటాద్రి నాయుని అదుపులో ఉంచేవారే లేరు.

**తల్లిదండ్రుల పేరుతో గ్రామాల నిర్మాణం:**

వెంకటాద్రి నాయుడు తండ్రి జగ్గయ్య పేరిట కృష్ణాజిల్లా జగ్గయ్యపేట, తల్లి అచ్చమాంబ పేరిట గుంటూరు జిల్లా అచ్చంపేటలకు నామకరణం గావించాడు.

**వెంకటాద్రి నాయుడు దానాలు:**

నాయుడు చేసిన దానములకు అంతే లేదు. బ్రాహ్మణులకు అనేక అగ్రహారములు దానంచేసి తాను మూడు సార్లు తులాభారం తూగారు. బంగారంతో నెమలిని చేయించి ఆ వాహనంపై ఎక్కారు. 108 శివాలయాలు కట్టించి అన్నింటిని ఒకే ముహూర్తన ప్రతిష్టంప చేశారు. చేతివృత్తుల వారైన మంగళి, కుమ్మరి, ముస్లింలకు భూములు ఇచ్చారు. ఇప్పటికి పై కులాల వారికి ఈ భూములు చింతపల్లి పరిధిలో ఉన్నాయి.

**వెంకటాద్రి నాయుడు చీకటికోణం**

వెంకటాద్రి నాయుడు కాలంలో చెంచులు ఇప్పటి చెరుకుంపాలెం సరిహద్దు అడవిలో ఒక ఇల్లు నిర్మించుకొని సంఘజీవనం చేస్తూ దారిదోపిడీలు, దౌర్జన్యాలతో బతుకుచున్నారు. ఇప్పటికి ఆ ప్రాంతాన్ని మేదరసాని దుర్గం అంటారు. పెద్దపెద్ద రాతి కట్టడాలు, గోడలు పూర్తిగా పడిపోయి శిధిలావస్థలో ఉన్నాయి. ఆ చెంచులను 150 మందికి పైగా విందుకు ఆహ్వానించి వారిని తగురీతిలో సత్కరించి వెంకటాద్రి నాయుడు తన సైనికులచే అందరిని ఏకాంతమునకు తీసుకువెళ్ళి చంపించారు. ఈ ఘటనతో తన మనస్సు కకావికలమై పశ్చాతాపము నొంది పెద్దల సలహామేరకు అనేక గోపురాలు కట్టించి దానాలు చేయటం మొదలుపెట్టారు. కాశి,రామేశ్వరాలయాల యాత్రలు చేశారు.

(మిగతా 103వ పేజీలో)



వెంకటాద్రి నాయుడు పూజామందిరం

# చరిత్ర ప్రసిద్ధికెక్కిన రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు



అచ్చంపేటలో వెంకటాద్రి నాయుడు శిలావిగ్రహం

(102వ పేజీ తరువాయి)

అయినా తన తప్పు పదేపదే గుర్తుకు రావటం వల్ల చింతపల్లి నుంచి అమరావతికి వెళ్ళిపోయారు. మరలా తన జీవితంలో చింతపల్లి కోటకు రాలేదు.

**వెంకటాద్రి నాయుడు దత్తపుత్రులు:**

వెంకటాద్రి నాయుడుకు పిల్లలు లేరు. తాను చెర పెట్టిన పాపయ్య, చంద్రమౌళిల మీద ప్రేమ చూపించి చంద్రమౌళికి పుట్టిన రెండవ కుమారునికి జగన్నాథబాబు అనే పేరుపెట్టి 1798లో దత్తతు తీసుకున్నారు. పాపయ్య రెండవ కుమారునికి రామనాథ బాబు అనే పేరుపెట్టి 1806లో రెండవ కుమారునిగా దత్తతు చేసుకున్నాడు. 314 గ్రామాలతో కూడుకున్న ఉమామహేశ్వర సంస్థానాన్ని జగన్నాథబాబుకు స్వాధీనపరిచి 237 గ్రామాలతో కూడుకున్న చేబ్రోలు సంస్థానాన్ని రామనాథబాబుకు ఇవ్వాలని తలంచగా, అంతలోనే వెంకటాద్రినాయుడు మృతిచెందగా, వారి వద్దనున్న ఆస్తులన్ని కోర్టులపాలై నాశనమయ్యాయి.

రాజా వాసిరెడ్డి జగన్నాథబాబు: వెంకటాద్రి నాయుడు చివరి వారసుడు అచ్చంపేట మండలం లోని చింతపల్లి గ్రామంలో 12-05-1905లో పుట్టి 30-08-2001లో చింతపల్లిలో మృతిచెందారు. ఈయనకు కూడా పిల్లలు లేకపోవటం చేత ఒకరిని దత్తపుత్రునిగా చేసుకున్నాడు. వారు విదేశాలలో ఉంటున్నారు. ప్రస్తుతం చింతపల్లి కోట పూర్తిగా శిధిలమై ఆస్తులు కొంత జగన్నాథబాబు ప్రజలకు దానం చేశారు. మిగిలిన ఆస్తులు ప్రస్తుతం వారి బంధువుల స్వాధీనంలో ఉన్నాయి.



వెంకటాద్రి నాయుడు చివరి వారసుడు రాజా వాసిరెడ్డి జగన్నాథబాబు (బాబు)



ఆనాటి ప్రజా వైద్యశాల

# నాణ్యతలో 'సేఫ్'... ఉపాధిలో భేష్



యాంపిల్స్ తయారీలో నిమగ్నమైన సిబ్బంది

(99వ పేజీ తరువాయి)

నాణ్యత, నమ్మకం, నిపుణులైన సిబ్బంది, నిరంతర కృషి, సేఫ్‌ను పెంచి పెద్ద చేసింది. కార్మికులకు, సిబ్బందికి జీతాలు చెల్లించటం, క్రమశిక్షణ, ప్రభుత్వానికి చెల్లించవలసిన టాక్స్‌లను చెల్లించటం లాంటి కార్యక్రమాలను తు.చ. తప్పక పాటిస్తూ 2003-04లో రాష్ట్ర చిన్న పరిశ్రమలశాఖ ద్వారా 'పెరల్స్ ఆఫ్ ఏపి' జిల్లా ఉత్తమ అవార్డును సేఫ్ గెలుచుకుంది.



ప్యాకింగ్‌లో నిమగ్నమైన కార్మికులు

# ప్రగతి పథంలో జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ



డా॥వై.ఎస్.రాజశేఖరరెడ్డి
రాష్ట్ర ముఖ్యమంత్రి



డా॥ చిన్నారెడ్డి
గ్రామీణాభివృద్ధి శాఖా మంత్రి



శ్రీ కన్నా లక్ష్మీనారాయణ
రాష్ట్ర రవాణా శాఖా మాత్యులు



శ్రీ కాసు కృష్ణారెడ్డి
రాష్ట్ర పౌరసరఫరాల శాఖా మంత్రి



శ్రీ మురుగుడు హనుమంతరావు
రాష్ట్ర సర్వ శిక్షా అభియాన్ శాఖా మంత్రి



శ్రీ మోపిదేవి వెంకట రమణ
రాష్ట్ర విమాన యాన శాఖామంత్రి



శ్రీ కూచిపూడి విజయమ్మ
జిల్లా పరిషత్ చైర్ పర్సన్, గుంటూరు



శ్రీ నేదురుమల్లి రాజ్యలక్ష్మి
శ్రీ శిశు సంక్షేమ శాఖా మంత్రి



శ్రీ మహ్మద్ అలీ రఫత్
జిల్లా కలెక్టర్

**1. పట్టణ ఇందిరా క్రాంతి పథకం :-** ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం పట్టణాలలోని పేద మహిళలను కూడా స్వయం సహాయక సంఘాలలో సభ్యులుగా చేర్పించి వారికి కూడా బ్యాంకుల ద్వారా ఆర్థిక చేయూత నందించి వారి వారి కుటుంబ అవసరాలు తీర్చుటతోపాటుగా అదనపు ఆదాయవనరులు అనగా పాడిపశువుల పెంపకం, గొర్రెల పెంపకం, చిన్న చిన్న వ్యాపారాలు నిర్వహించుకొనుచూ, అధిక వడ్డీలు వసూలు చేయుచున్న ప్రేవేటు మైక్రో ఫైనాన్స్ సంస్థల బారి నుండి పట్టణ పేద మహిళలను కూడా విముక్తులను చేయు మహదాశయముతో ప్రతిష్టాత్మకంగా ప్రారంభింప బడుచున్న నూతన పథకమే పట్టణ ఇందిరా క్రాంతి పథకం. 04-06-2006న జి.వో.నెం.414 ద్వారా ఈ పథకమునకు శ్రీకారము చుట్టి రాష్ట్ర స్థాయిలో ముఖ్యమంత్రి గారు అధ్యక్షుడిగా పాలనా పరమైన కార్యక్రమములు ప్రారంభించబడినవి. ఎ.పి.యు.యస్.పి. ప్రాజెక్టు కో-ఆర్డినేటర్ గారు మిషన్ డైరెక్టరుగా బాధ్యతలు స్వీకరించి ఇతర ఉన్నతాధికారుల పర్యవేక్షణలో కార్యకలాపములు ప్రారంభించుట జరిగినది.

జిల్లా స్థాయిలో మిషన్ ఫర్ ఎలిమినేషన్ ఆఫ్ పావర్టి ఇన్ మునిసిపల్ ఏరియాస్ (మెప్మా)గా వ్యవహరించబడు పట్టణ ఇందిరా క్రాంతి పథకమునకు ఆరు మాసముల వరకు డి.ఆర్.డి.ఎ., ప్రాజెక్టు డైరెక్టరు గారు డిస్ట్రిక్టు ప్రాజెక్ట ఆఫీసరుగా కొనసాగునట్లుగా ఆదేశములు జారీ చేయబడినవి. ఈ పథకము గురించి విస్తృత ప్రచారము కొరకు విధి విధానముల గురించి చర్చించుటకు గుంటూరు మునిసిపల్ కార్పొరేషన్ కమిషనరు గారు మరియు డి.ఆర్.డి.ఎ.ప్రాజెక్టు డైరెక్టరుగా అదనపు బాధ్యతలను నిర్వర్తించుచున్న శ్రీ సిద్దార్థ జైన్ గారి ఆధ్వర్యములో ది.12.09.2007 నుండి 22.09.2007 వరకు జిల్లాలోని గుంటూరు మునిసిపల్ కార్పొరేషన్ మరియు అన్ని మునిసిపాలిటీలలోను సమావేశములను ఏర్పాటు చేయడమైనది. ఈ అవగాహన సమావేశములకు మేయర్/చైర్‌పర్సన్‌లు, కార్పొరేటర్లు/ కౌన్సిలర్‌లు, మునిసిపల్ కమిషనర్‌లు, మునిసిపల్ అధికారులు, డి.ఆర్.డి.ఎ. అనుబంధ జిల్లా సమాఖ్య ప్రతినిధులు, 10 నుండి 15 మంది స్వయం సహాయక సంఘ సభ్యురాండ్రు, జిల్లాలో పేదరిక నిర్మూలనలో పాలు పంచుకొనుచున్న ఎన్.జి.ఓ.లు, వివిధ పథకములు అమలు చేయుచున్న కార్పొరేషన్లు/సంస్థల అధికారులు, రాష్ట్ర స్థాయి పట్టణ పేదరిక నిర్మూలన పథకము నుండి ఒక ప్రతినిధి మరియు ప్రింట్ అండ్ ఎలక్ట్రానిక్ మీడియా ప్రతినిధులను ఆహ్వానించుట జరిగినది. ఈ సమావేశము నందు ఈ పథకమునకు సంబంధించిన వివిధ అంశములపై విస్తృత స్థాయి చర్చలు, అమలు చేయుటకు అవసరమగు మౌలిక వసతుల ఏర్పాటు, సిబ్బంది నియామకములు, స్వయం సహాయక సంఘముల ఏర్పాటుపై కమ్యూనిటి రిసోర్సు పర్సన్స్ నియామకము వారికి తగు ఆదేశములు జారీ చేయుట, మున్నగు వివిధ విషయములపై కూలంకుష చర్చలు జరిపి తగు నిర్ణయములు తీసుకొనబడగలవు.

**2. పావలా వడ్డీ రాయితీ:** స్వయం సహాయక సంఘాల అభ్యున్నతికి, వారు చేపట్టిన ఆర్థిక కార్యక్రమాలు మరింతగా పెంపొందింప చేసుకొనుట కొరకై, వారు 01-07-2004 తరువాత బ్యాంకు నుండి తీసుకున్న లింకేజి ఋణముపై చెల్లించిన వడ్డీ మొత్తంలో 3% (అనగా పావలా) పోను మిగిలిన మొత్తాన్ని ప్రతి 6 నెలల కొకసారి ప్రభుత్వమే చెల్లిస్తుంది.

జిల్లాలో పావలావడ్డీ రాయితీని 2005-06 సంవత్సరములో 8,999 గ్రూపులకు రూ.126.23 లక్షలను, 2006-07 సంవత్సరములో 15,446 గ్రూపులకు రూ.283.44 లక్షలను విడుదల చేయడమైనది.

2007-08 ఆర్థిక సంవత్సరములో ది.31-03-2007 అర్థ సంవత్సర ఖాతా లెక్కలపై ఇప్పటి వరకు 16,220 గ్రూపులకు గాను రూ.178.08 లక్షలు వడ్డీ రాయితీని విడుదల చేయడమైనది.

ది.30-09-2007 అర్థ సంవత్సర ఖాతా లెక్కలను బ్యాంకుల నుండి అక్టోబరు, 2007లో సేకరించి నవంబరు నుండి వడ్డీ రాయితీ పంపిణీ చేయబడును.

**3. రివాల్వింగు ఫండు :** ఈ ఆర్థిక సంవత్సరములో రివాల్వింగు ఫండును 2000 గ్రూపులకు రూ.10,000/-ల చొప్పున రూ.200 లక్షలు కేటాయించి రూ.49.77 లక్షలను ప్రభుత్వము విడుదల చేయడమైనది. ఇప్పటివరకు 374 గ్రూపులకు రూ.10,000/- చొప్పున రూ.37.40 లక్షలు వివిధ మండలములకు విడుదల చేయడమైనది.

**4. వృద్ధాప్య పింఛనులు:** గుంటూరు జిల్లా నందలి గ్రామీణ మరియు పట్టణ ప్రాంతములలో ప్రతినెల 1వ మరియు 5వ తారీఖులలో 115020 మందికి రెగ్యులర్ పింఛన్లు పంపిణీ జరుగుచున్నవి. వాటికి అదనముగా 01-04-2006 నుండి ఇందిరమ్మ ఫేస్-I గ్రామములలో/వార్డులలో 43245 మందికి ఇందిరమ్మ పింఛన్లతో కలిపి 158265 మందికి పంపిణీ జరుగుచున్నవి.

ఇందిరమ్మ ఫేస్-II గ్రామములలో మరియు వార్డులలో ప్రభుత్వము జి.వో.నెంబరు 410 ద్వారా గుంటూరు జిల్లాకు 61211 పింఛన్లు మంజూరు చేసినది. వీరికి నెలకు రూ.200/-ల చొప్పున అక్టోబరు 1 నుండి పింఛన్లు పంపిణీ జరుగునని తెలియపరచటమైనది. ఇందిరమ్మ ఫేస్-II క్రింద గ్రామీణ మరియు పట్టణ ప్రాంతములకు పింఛను రకము వారీగా ఈ దిగువ తెలిపిన ప్రకారము మంజూరు అయినవి.



రెగ్యులర్ పింఛనులు, ఇందిరమ్మ ఫేస్-I మరియు ఫేస్-II పింఛనులు కలిపి గుంటూరు జిల్లా నందు ప్రతి నెల 219476 మందికి రూ.4,38,95,200/-లు పంపిణీ జరుగునని తెలియపరచటమైనది.

**సిద్దార్థ జైన్, ఇన్‌చార్జి PD, DRDA**

# పవిత్ర పుణ్యస్థలం శివకోటిలింగ క్షేత్రం

(ఆన్‌లైన్ - అచ్చంపేట)

గుంటూరు, కృష్ణా, నల్గొండ జిల్లాల సరిహద్దులో పవిత్ర కృష్ణానది తీరంలో కృష్ణానది ఉత్తరవాహిణిగా ప్రవహిస్తూ ఉత్తర కాశీగా పేరుపొందిన ముక్త్యాల గ్రామం త్రేతాయుగంలో భరద్వాజముని ఒక ఆశ్రమాన్ని ఏర్పాటు చేసుకుని ఇక్కడ నివసించినట్టు తెలుస్తోంది. ఇదే ప్రాంతంలో కొండపై శివాలయం ఏర్పాటు చేశారు. అలాంటి పవిత్రమైన స్థలం అచ్చంపేట మండలంలోని మాదిపాడుకు దగరలో ఉంది. ఈ ప్రాంతంలో కృష్ణానది సుమారు 2 కిలోమీటర్లు దక్షిణం నుంచి ఉత్తరంగా ప్రవహి



త్రేతాయుగంలో మాదిపాడు వద్ద కొండలలో భరద్వాజ మహాముని ప్రతిష్ఠించిన శివాలయం



ముక్త్యాల వద్ద నిర్మితమవుతున్న శివకోటిలింగ క్షేత్రంలో యజ్ఞశాల

స్తోంది. అందుకే ఉత్తరకాశిగా పేరుగాంచింది. అలాంటి ఉత్తరవాహిణి మాదిపాడు దగ్గరలో ఉన్న కొండలు వాటి నీడలు ఉదయం కృష్ణానదిలో పడి అవికాస్త జంటనందులుగా కనిపిస్తాయని, అలాంటి పవిత్రమైన చోటునే భరద్వాజ మహాముని తపస్సు చేశాడని పురాణాల ద్వారా తెలుస్తోంది. అలాంటిచోటునే నందుల రేవుగా ప్రసిద్ధిగాంచింది. ఇలాంటి స్థల పురాణాన్ని దృష్టిలో ఉంచుకొని కృష్ణానదికి ఆవలి ఒడ్డున ముక్త్యాలకు ఒక కిలోమీటర్ల దూరంలో కృష్ణాజిల్లా కంచికచర్లకు చెందిన గద్దె ప్రసాద్, పావని దంపతులు హిందూ మత వ్యాప్తిలో భాగంగా శ్రీ కోటిలింగ మహాశివక్షేత్రం కట్టుటకు సంకల్పించి కోట్లాది రూపాయలతో శరవేగంతో శైవక్షేత్రాన్ని రూపుదిద్దుతున్నారు.

54 ఎకరాల సువిశాలమైన స్థలంలో ప్రారంభమైన ఈ కోటిలింగ మహా శివక్షేత్రం 2006 అక్టోబరు 23వ తేదీన తులారాశి, వ్యయనామ సంవత్సరం, కార్తీకమాసంలో 6గృహాల కూటమితో ప్రారంభమైన మాసాంతరం లోపలే దీర్ఘకాలం చేసే శని, గురు, రాహు, కేతు అను నాలుగు గృహాల మార్పులతో కార్తీకమాసం ముగుస్తుంది. ఈ స్థితి 18 శతాబ్దాలకు ఒకసారి సంభవిస్తుందని వేద పండితులు తెలిపారు. 2006 అక్టోబరు 23 నుంచి ప్రారంభమై 2008 మార్చి 6 వరకు 501 రోజులు రూపుదిద్దుకొనుచున్న శ్రీకోటిలింగ శివక్షేత్రం

(మిగతా 105వ పేజీలో)

# పవిత్ర పుణ్య స్థలం శివకోటిలింగ క్షేత్రం

(104వ పేజీ తరువాయి)

ప్రాంగణంలో ఈ 501 రోజులు నిర్విఘ్నంగా జపాలు, యజ్ఞయాగాది, హోమ కార్యక్రమాలు నిష్ణాతులైన రుత్విక్కులతో జరుగుతుంది. ఇదే ప్రాంగణంలో 108 శివాలయాలు, 64 శక్తి ఆలయాలు, 32 గణపతుల ఆలయాలు, 16 సుబ్రమణ్యేశ్వర ఆలయాలు, 12 జ్యోతిర్లింగాలు, నవగ్రహ అష్ట దిక్పాలక, క్షేత్రపాలక ఆలయాలతో కలిపి మొత్తం 250 ఉపాలయాలతోను, కోటి శివలింగాలతోను నిర్మాణంలో ఉంది. భక్తులు 693 రూపాయల శివక్షేత్రానికి చెల్లిస్తే వారిపేరున కోటి శివలింగాలలో ఓ బాణలింగం ప్రతిష్ఠించి ప్రతిరోజు అదేపేరున అర్చన, దోషనివారణ పూజలు జరిపిస్తారు. ఇంత గృహోత్తర కార్యక్రమం నిర్వహించుటకు ప్రధానమైంది అచ్చంపేట మండలంలోని మాదిపాడు వద్దనున్న భరద్వాజ మహాముని నిర్మించిన శివాలయం దగ్గరలోని నందుల రేవు, ఉత్తరవాహిణియే కారణం. భరద్వాజుడు నివసించిన ప్రదేశం కృష్ణానదికి ఉత్తర వాహిని ప్రదేశం, నిర్మాణంలో ఉన్న శివకోటిలింగ మహా శివక్షేత్రం దర్శించిన ప్రతివారు భక్తిపారవశ్యంతో పులకించిపోవాల్సిందే. శ్రీ కోటిలింగ మహా శివక్షేత్ర నిర్మాణకర్త గద్దె ప్రసాద్ మాట్లాడుతూ భగవత్ సంకల్పం వల్ల దీనిని నిర్మిస్తున్నానని, నిరంతరాయంగా శివలింగాలు తయారుచేస్తూ పోతే, సుమారు 12 సంవత్సరాలకు పూర్తవుతాయని తెలిపారు. ఇదంతా దైవానుగ్రహమని ఆయన అన్నారు. ఈ పుణ్యతీర్థంలో ఎవరి పేరుమీదనైనా ఒక దేవాలయం నిర్మాణం కావాలంటే ఒకలక్ష 25వేల రూపాయలతో నిర్మించి వారి గోత్ర నామములతో నిత్యం సత్రయాగంలో చెప్పబడుతుంది. ఒకరి పేరుతో శివలింగం ప్రతిష్టకు 693 రూపాయలు చెల్లించాల్సి ఉంది. ఎవరి పేరుతో నైనా, వారి పెద్దల పేరుతో ఒక కాటేజి నిర్మాణానికి 75 రూపాయలు చెల్లిస్తే వారికి సంవత్సరానికి 30రోజులు ఉచిత వసతి కల్పిస్తారు. ఇలాంటి పుణ్యక్షేత్రాన్ని భక్తులు దర్శించి తీరాలని వేదపండితులు తెలుపుతున్నారు.



గద్దె ప్రసాద్ దంపతులు





# జాతీయ రాజకీయాలను ప్రభావితం చేసిన జిల్లా నేతలు

(ఆన్‌లైన్ - గుంటూరు)

జాతీయ సంగ్రామంలో పోరాడిన కొండా వెంకటప్పయ్య, పర్వతనేని వీరయ్యా చౌదరి వంటి త్యాగధనులు, స్వాతంత్ర్యానంతరం దేశ రాజకీయాలలో కీలక పాత్ర వహించిన ఆచార్య ఎన్‌జి రంగా, కాసు బ్రహ్మానందరెడ్డి, ఉమ్మడి మద్రాసు రాష్ట్రానికి స్పీకర్‌గా పనిచేసిన నల్లపాటి వెంకట్రామయ్య చౌదరి వంటి హేమాహేమీలను అందించిన గుంటూరు జిల్లాకు రాష్ట్ర రాజకీయ పటంలో ప్రత్యేక స్థానం ఉంది. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత కాసు బ్రహ్మానందరెడ్డి, భవనం వెంకట్రామిరెడ్డి, నాదెండ్ల భాస్కరరావులు ముఖ్యమంత్రులుగా పనిచేశారు. నల్లపాటి వెంకట్రామయ్య, నిశ్శంకరరావు వెంకటరత్నం, ఆలపాటి ధర్మారావులు గతంలో స్పీకర్లుగా పనిచేయగా ప్రస్తుతం తెనాలి ఎమ్మెల్యే నాదెండ్ల మనోహర్ పానల్ స్పీకర్‌గా, ప్రస్తుతం శాసనమండలి డిప్యూటీ స్పీకర్‌గా జిల్లాకు చెందిన మహమ్మద్ జానీ కొనసాగుతున్నారు.

గతంలో కేంద్రంలో కాసు బ్రహ్మానందరెడ్డి, కొత్త రఘురామయ్య, పాములపాటి అంకినీడు ప్రసాదు, వెనిగళ్ళ సత్యనారాయణ సుదీర్ఘ కాలం కేంద్ర క్యాబినేట్‌లో కీలక మంత్రులుగా కొనసాగారు. తెలుగుదేశం హాయాంలో డాక్టర్ ఉమ్మారెడ్డి వెంకటేశ్వర్లు కేంద్ర మంత్రిగా పనిచేయగా, యుపిఏ హాయాంలో ఎన్‌టిఆర్ కుమార్తె దగ్గుబాటి పురంధరేశ్వరి ప్రస్తుతం కేంద్ర మంత్రిగా కొనసాగుతున్నారు.

**జాతీయ స్థాయిలో ఎదిగిన వామపక్షనేతలు...**



నాదెండ్ల భాస్కరరావు



కాసు బ్రహ్మానందరెడ్డి

దేశ రాజకీయాలను ప్రభావితం చేస్తున్న వామపక్ష నాయకులు ఎంతోమంది ఈ జిల్లాకు చెందినవారే. సిపిఎంలో పోలిట్ బ్యూరో సభ్యుడు మాకినేని బసవపున్నయ్య జిల్లాలోని రేపల్లె ప్రాంతానికి చెందిన వారు. శాసనమండలి నాయకునిగా, రాజ్యసభ సభ్యుడిగా పనిచేసిన మోటూరు హనుమంతరావు ఆ పార్టీ రాష్ట్ర కార్యదర్శిగా పనిచేశారు. సిపిఎం రాష్ట్ర కార్యదర్శులుగా పనిచేసిన కొరటాల సత్యనారాయణ, లావు బాలగంగాధరరావులు రేపల్లె ప్రాంతానికి చెందినవారే. సిపిఐలో కీలకపాత్ర వహించిన వేములపల్లి శ్రీకృష్ణ, కార్మికనాయకులు మల్లయ్య లింగం, కనపర్తి నాగయ్యలు గుంటూరు కేంద్రంగా అనేక ఉద్యమాలు నిర్వహించారు. పద్మభూషణ్ అవార్డు గ్రహీత వావిలాల గోపాలకృష్ణయ్య సత్తెనపల్లి కేంద్రంగా అనేక వామపక్ష ఉద్యమాలను నిర్వహించారు.

రాష్ట్ర స్థాయిలో మోటూరు ఉదయం, భవనం జయప్రద, దొడ్డపనేని ఇందిర, నన్నపనేని రాజకుమారిలు మహిళల సమస్యలపై పోరాడి గుర్తింపు పొందారు.

☆ కేంద్రమంత్రిగా పనిచేసిన కె కమలకుమారి గుంటూరు జిల్లాకు చెందినవారే.

☆ జనరల్ కేటగిరికి కేటాయించిన గుంటూరు జడ్‌పి ఛైర్‌పర్సన్ పదవిని 1987లో జరిగిన ప్రత్యక్ష ఎన్నికల్లో దొడ్డపనేని ఇందిర పోటీచేసి సునాయాసంగా గెలుపొందారు.

☆ రెండు దశాబ్దాల పాటు రాజకీయాలలో కీలకపాత్ర వహించిన కాసు బ్రహ్మానందరెడ్డి, వెంగళరెడ్డి సోదరులు నర్సరావుపేట కేంద్రంగా పనిచేయగా ప్రస్తుతం వారి వారసుడు కృష్ణారెడ్డి మంత్రిగా కొనసాగుతున్నారు.

☆ రెండు దశాబ్దాల తర్వాత పునరుద్ధరించిన శాసనమండలికి డిప్యూటీ ఛైర్మన్‌గా గుంటూరు జిల్లాకు చెందిన మహమ్మద్ జానీ ఎన్నికయ్యారు.

☆ పిసిసి అధ్యక్షులుగా కోనా ప్రభాకరరావు, కొణిజేటి రోశయ్యలు వ్యవహరించారు.

☆ జిల్లాకు చెందిన కొణిజేటి రోశయ్య వైఎస్ క్యాబినేట్‌లో నెంబర్ 2 స్థానంలో ఆర్థికమంత్రిగా కొనసాగుతున్నారు.

☆ గుంటూరు జిల్లాకు చెందిన సినీ నటులు కొంగర జగ్గయ్య, శారద, కృష్ణలు, దర్శకుడు డాక్టర్ దగ్గుపాటి రామానాయుడులు లోక్‌సభ సభ్యులుగా పనిచేశారు.

ఎంతోమంది రాజకీయ ఉద్దండులను అందించిన గుంటూరు జిల్లాలో ఎన్నికల ఫలితాలు రాష్ట్ర రాజకీయాలకు దిక్సూచిగా ఉంటాయని పలువురు సీనియర్ నేతలు చెపుతూ ఉంటారు. చేనేత నేత ప్రగడ కోటయ్య కూడా గుంటూరు జిల్లా పొన్నూరుకు చెందినవారే. తెలుగుదేశం ఆవిర్భావం తర్వాత ఆ పార్టీలో కీలకపాత్ర వహించిన నాదెండ్ల భాస్కరరావు, డాక్టర్ కోడెల శివప్రసాద్, దూళిపాళ్ళ వీరయ్య చౌదరి, అన్నాబత్తుని సత్యనారాయణ, డాక్టర్ ఎంఎస్ఎస్ కోటేశ్వరరావు, జెఆర్ పుష్పరాజ్, డాక్టర్ మాకినేని పెదరత్తయ్య, డాక్టర్ శనక్కాయల అరుణ, ఆలపాటి రాజేంద్రప్రసాద్, ఈపూరి సీతారావమ్మలు మంత్రులుగా కొనసాగారు.

ముఖ్యమంత్రి డాక్టర్ వైఎస్ రాజశేఖరరెడ్డి క్యాబినేట్‌లో కన్నా లక్ష్మీనారాయణ, కాసు వెంకటకృష్ణారెడ్డి, మురుగుడు హనుమంతరావు, మోపిదేవి వెంకటరమణలు మంత్రులుగా కొనసాగుతున్నారు.



## విద్యా పరిమళాలు వెదజల్లుతున్న 'అరవింద'

(ఆన్‌లైన్ - తాడేపల్లి)



**సిహెచ్ చంద్రశేఖరరెడ్డి**

గ్రామీణ విద్యార్థులకు విలువలతోకూడిన ఉత్తమ విద్యనందించాలన్న ఆశయంతో 1991వ సంవత్సరంలో 'అరవింద' స్థాపించబడినది. స్థాపించిన నాటి నుంచి ఒక్క 'మార్కుల'కే ప్రాధాన్యత ఇవ్వకుండా విద్యార్థుల సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడే 'ఒత్తిడి' లేని వాతావరణంలో అంకితభావంగల ఉపాధ్యాయులతో ప్రముఖ విద్యావేత్తల సహాయ సహకారాలతో ఈ విద్యాసంస్థ ప్రగతిపథంలో నడుస్తుంది. ఎలాంటి ఒత్తిడి లేకుండా ఆడుతూ, పాడుతూ విద్యార్థులు సాధిస్తున్న జిల్లా స్థాయి, రాష్ట్రస్థాయి ఫలితాలే దీనికి నిదర్శనం.

ప్రస్తుత విద్యావిధానంలో పరీక్షలలో ఒక్క మార్కులకే ప్రాధాన్యత ఇవ్వటం వలన, ఆ పరీక్షలు పుస్తకాలలోని విషయ సేకరణకే పరిమితమవటం వలన, విద్యార్థి బట్టీ విధానానికి అలవాటు పడిపోతున్నారు. దాని వలన సృజనాత్మకత దెబ్బ తింటుంది. పదవ తరగతిలో 98శాతం ఉత్తీర్ణత సాధిస్తున్నప్పటికీ ఆ తర్వాత పోటీ పరీక్షలలో నిలబడలేకపోతున్నాడు. దాని వలన నిరాశ నిస్పృహలకు గురవుతున్నాడు. కనుక తల్లిదండ్రుల ఆలోచన విధానంలో, పరీక్షా విధానంలోనూ మార్పు రావలసిన అవసరం ఎంతో వుంది.

ఈ అవసరాన్ని గుర్తించి ఇదే భావంతో పనిచేస్తున్న కొన్ని విద్యా సంస్థలతో కలసి డాక్టర్ చుక్కా రామయ్య అధ్యక్షతన స్పేస్ (సొసైటీ ఫర్ అకడమిక్ ఎక్స్‌లెన్స్ ఇన్ స్కూల్స్) అనే స్వచ్ఛంద సంస్థ ఏర్పాటు జరిగినది. సంస్థ ద్వారా పాఠశాలలోని ఉపాధ్యాయులకు, ప్రతినెల రెండురోజుల పాటు శిక్షణ ఇవ్వడం జరుగుతుంది. తద్వారా విద్యార్థుల బట్టీ విధానం నుంచి మళ్లించి 'కాన్‌సెప్ట్స్' బోధించడం జరుగుతుంది. ఇక్కడ పరీక్షలు కూడా విద్యార్థిలో ఆలోచన రేకెత్తించేవిగా వుంటాయి.

ప్రాథమిక స్థాయిలో స్టెప్ (స్టూడెంట్స్, టీచర్స్, ఎడ్యుకేషన్, పేరెంట్స్) ఆధ్వర్యంలో రెగ్యులర్‌గా వర్క్‌షాప్స్ నిర్వహించి టీచర్స్‌ను అప్‌డేట్ చేయడం జరుగుతుంది. 'అరవింద'లో స్పోర్ట్స్, ఆర్ట్స్, మ్యూజిక్, డ్యాన్స్ ఇవన్నీ కరిక్యులమ్ లో ఒక భాగంగా వుంటాయి. ప్లాస్టిక్ వినియోగం వలన నష్టాలు, వాతావరణ కాలుష్యం, నీటి దుర్వినియోగం వలన నష్టాలు, పర్యావరణ పరిరక్షణ మొదలగు సామాజిక అంశాల గురించి తరచుగా వారితో చర్చింటమే కాకుండా వీటిని పాటలరూపంలో, నృత్యాలరూపంలో, నాటికల రూపంలో వివిధ గ్రామాల్లో ప్రచారం చేయుట ద్వారా వీరిచే మొక్కలు నాటించటం ద్వారా ఈ అంశాలన్నీ వారిని పూర్తిగా ఇన్‌వాల్వ్ చేయటం జరుగుతుంది.

విద్యార్థిని పూర్తిగా ఇన్‌వాల్వ్ చేయగలిగే పాఠ్యాంశాలు, పరీక్షా విధానం రావలసిన అవసరం ఎంతైనా వుంది.

# రైతులకు నూతన వంగడాలను అందిస్తున్న లాం ఫారం



లాం ఫారమ్

(ఆన్‌లైన్ - గుంటూరు)

తక్కువ కాలంలో అధిక దిగుబడి వచ్చే పత్తి, మిర్చి, అపరాలలో అనేక రకాల వంగడాలను కనుగొన్న లాం ప్రాంతీయ పరిశోధన సంస్థకు దేశంలో విశిష్ట స్థానం ఉంది. తాడికొండ మండలంలో గుంటూరు - అమరావతి రోడ్డులో 103 ఎకరాల్లో విస్తరించిన ఈ లాం ఫారం వాణిజ్య పంటలపై ప్రత్యేక పరిశోధనలు జరుపుతోంది. దేశంలో తొలిసారిగా సోయాబీన్ విత్తనాలను అధిక దిగుబడి ఇచ్చే విధంగా రూపొందించి లాం శాస్త్రవేత్తలు నూతన ఒరవడిని సృష్టించారు. రైతులకు అవసరమైన మెళుకువలను సృష్టించడంలో ప్రాంతీయ పరిశోధనల్లో దేశం లోనే ముందుంది.

రెండు దశాబ్దాల క్రితం తెల్ల బంగారాన్ని గజగజలాడించిన తెల్ల దోమను తట్టుకొనే పత్తి వంగడాలను తయారు చేయడంలో లాం వ్యవసాయ పరిశోధనా సంస్థ ప్రపంచ స్థాయిలో ఖ్యాతి గడించింది. దేశ విదేశాలలో పేరెన్నికగన్న లాం ఫారం తక్కువ కాలంలో అధిక దిగుబడి ఇచ్చే పత్తి, మిర్చి, అపరాల వంటి వంగడాలను కనుగొన్న లాం ప్రాంతీయ పరిశోధనా కేంద్రం రైతులకు ఎంతో అందుబాటులో ఉంది. ప్రపంచంలో తొలిసారిగా శనగపచ్చ పురుగు, తెల్ల దోమ వంటి చీడపీడలను తట్టుకొని అధిక దిగుబడినిచ్చే పత్తి వంగడాలైన ఎల్‌కె 861, ఎల్‌పిఎస్ 141 వంటి రకాలను కనుగొని లాం పరిశోధనా స్థానం విజయకేతనం ఎగురవేసింది. ఈ విత్తనాలుకోసం పాకిస్తాన్ తదితర దేశాలు కేంద్ర ప్రభుత్వం పై వత్తిడి తెస్తున్నాయి.

తెల్లదోమను తట్టుకొనే ఇతర వంగడాలను కూడా శాస్త్రవేత్తలు రూపొందించారు. వాటన్నింటికి మించి మరో ప్రధాన పంట అయిన మిర్చిలో 25 సంవత్సరాల నుంచి వివిధ రాష్ట్రాల్లో వాడుతున్న జి-4, ఎల్‌సిఎ - 235 వంటి విత్తనాలను లాం శాస్త్రవేత్తలు కనుగొన్నారు. మిర్చిలో వాటితోపాటు అధిక దిగుబడినిచ్చే వంగడాలుగా ఇవి దేశ వ్యాప్తంగా ప్రసిద్ధికెక్కాయి. వీటిని గుంటూరు మిరప అని కూడా పిలుస్తారు. రాష్ట్రంలో అత్యంత సారవంతమైన నేలలు, అధిక దిగుబడినిచ్చే వంగడాలు ఆధునిక పద్ధతిలో పండించే రైతాంగం ఉన్న ప్రాంతానికి ఈ పరిశోధనా సంస్థ రైతాంగానికి అనేక రకాలైన సూచనలిస్తుంది.

ఇక్కడ పత్తి, మిర్చి, మినప వంటి అపరాల పంటలపై నిత్యం పరిశోధనలు జరుగుతూ ఉంటాయి. కంది పంటకు శనగపచ్చపురుగు ఆశించి దిగుబడులు తగ్గిపోయి రైతులు నష్టపోతున్న దశలో శాస్త్రవేత్తలు ఇక్కడ ప్రయోగాలు చేసి ఎల్ఆర్‌జి -30 అనే రకం శనగపచ్చపురుగును తట్టుకొని నిలబడింది. కందిపంటను ఖరీఫ్‌లో కాకుండా రబీకి వేసే విధంగా అనువైన విత్తనాలను రూపొందించారు. దేశంలో తొలిసారిగా సోయాబీన్ విత్తనాలను అధిక దిగుబడి వచ్చే విధంగా రూపొందించి లాం శాస్త్రవేత్తలు నూతన ఒరవడిని సృష్టించారు. కేవలం 65 రోజుల్లో కాపుకు వచ్చే ఎల్‌ఎస్‌వి -1 అనే నూతన వంగడాన్ని కనుగొని సోయాబీన్‌లో అద్భుత పురోగతిని సాధించారు. ఖరీఫ్, రబీ సీజన్‌లలో ఉపయోగపడటంతోపాటు పత్తిలో అంతరపంటలుగా సోయాబీన్ వేసేందుకు శాస్త్రవేత్తలు చేసిన కృషి విజయవంతమైంది.

ప్రస్తుతం రైతులు రసాయనిక ఎరువులను ఎక్కువగా ఉపయోగించడం వలన ఆహార పంటలు విషతుల్యాలవుతున్నాయి. సేంద్రీయ ఎరువుల వాడకాన్ని పెంచడం వలన పర్యావరణాన్ని మెరుగుపరచడం కోసం ఇక్కడ నిత్యం పరిశోధనలు జరుగుతున్నాయి. దశాబ్దం నుంచి రసాయన ఎరువుల వాడకాన్ని తగ్గించి, సేంద్రీయ ఎరువుల వాడకాన్ని పెంచడంపై శాస్త్రవేత్తలు దృష్టిపెట్టారు. ప్రధానంగా తక్కువ ఖర్చుతో అధిక దిగుబడి, లాభాలను ఆర్జించడం కోసం ఇక్కడ శాస్త్రవేత్తలు నిత్యం ప్రయోగాలతో తలమునకలై ఉన్నారు.

# నటనలో నవ్యత్వం గోవిందునికే సొంతం

(ఆన్‌లైన్, చిలకలూరిపేట అర్బన్)

తెలుగు నాటక మాగాణంలో సుబ్బారావు కళాజీవితం యోగ్యతా ముద్రను పొంది ఒక విశిష్ట సంప్రదాయాన్ని నిర్మించిందనే గద్యతిక్కన తుమ్మలవారి ప్రశంసలకు పాత్రుడై రంగస్థలంపై, వెండితెరపై పాత్రలకు ప్రాణప్రతిష్ట చేసి విశిష్టనటునిగా రంగస్థలపుటలలో చెరగని స్థానాన్ని పొందిన నటశేఖరుడు గోవిందరాజుల సుబ్బారావు. వృత్తిరీత్యా వైద్యులైనా ప్రవృత్తిరీత్యా నటనను తపనగా భావించి సరికొత్త నిర్వచనం చెప్పారు. విశాలమైన ఫాలభాగం.... వత్తుగా పెరిగిన గుబురు మీసాలు.... విలక్షణమైన నడకతో నటనలో తనకంటూ ఒకశైలిని రూపొందించుకొన్న డాక్టర్ సుబ్బారావు ప్రేక్షకుల గుండెగుడిలో చిరకాలం నిలిచిపోయారు. హైస్కూలు విద్యాభ్యాస సమయంలో మర్చెంట్ ఆఫ్ వెనీసు ఇంగ్లీషు నాటకంలో తొలిసారిగా నటించి ఆ పాత్రకు జీవం పోసి విద్యార్థుల, అధ్యాపకుల ప్రశంసలను పొందారు. ఈ ప్రేరణలో నాటక రంగానికి అంకితమై నటనలో తరించారు.



రంగస్థల కళాకారుడు గోవిందరాజుల సుబ్బారావు

కృష్ణాజిల్లా మేడూరు గ్రామంలో జన్మించిన గోవిందరాజుల పూర్వీకులు తెనాలిలో స్థిరనివాసం ఏర్పరుచుకున్నారు. తెనాలి తాలూకా హైస్కూలులో విద్యాభ్యాసం చేశారు. ఆ కాలంలోనే మహానటులైన మాధవపెద్ది నటించిన నాటకాన్ని చూసి నటన పట్ల ఆసక్తిని పెంచుకున్నారు. తెనాలి శ్రీరామ విలాససభలో పలు నాటకాల్లో పాత్రలను పోషించారు. గయోపాఖ్యానం, బొబ్బిలియుద్ధం, ప్రతాపరుద్రీయం, కన్యాశుల్కం నాటకాలతో పాటు మాలపల్లి, షావుకారు, కన్యాశుల్కం వంటి చిత్రాలలోను ప్రధాన భూమికలను పోషించారు. నాటకాలలో పాటలు, పద్యాలు పాడటం కోసం ఇరవై రాగాలు కఠోర పరిశ్రమతో నేర్చుకున్నారు. ఒక పాత్రను ఎన్నిసార్లు పోషించి భేష్ అనిపించుకున్నా ప్రతి ప్రదర్శననూ ఒక ప్రసవంగానే భావించి స్నేహితుల విమర్శలను స్వీకరించి నటనకు మరింత మెరుగులు పెట్టుకునేవారు.

సుప్రసిద్ధ నటులు హరిప్రసాదరావు, ఈమని లక్ష్మణస్వామి ప్రభావం గోవిందరాజుల జీవితంలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

గయోపాఖ్యానం నాటకంలో భీముని పాత్ర ధరించి నటనలో, సంగీతంలో అంతకు ముందులేని నూతన పోకడలను ప్రవేశపెట్టి ప్రేక్షకులను ఆశ్చర్యచకితులను చేశారు. 'నిజకరవాల విక్షేపణమాత్ర' అనే డైలాగ్‌ను అనితర సాధ్యంగా చెప్పి ప్రేక్షకుల నుంచి వన్స్‌మోర్ ప్రశంసలను పొందారు. వన్స్‌మోర్ గౌరవాన్ని తొలిగా పొందిన ఘనత తెలుగు నాటకరంగంలో వీరికే దక్కింది. శ్రీరామ విలాస సభవారు బొబ్బిలియుద్ధం నాటకం తయారైన సందర్భంలో గోవిందరాజుల తొలుత హైదర్‌జంగ్ పాత్రకు తయారయ్యారు. కొంతకాలం రిహార్సల్స్ జరిగిన అనంతరం ఆ పాత్రను పెద్ద భొట్ల చలపతికి ఇచ్చారు. తోటవల్లూరు నాటక ప్రదర్శనకు బుస్సీ పాత్రధారి గైరు హాజరు కావటంతో అప్పటికప్పుడు గోవిందరాజుల ఆపద్ధర్మంగా ఆ పాత్రను ధరించారు. అప్పటినుండి బుస్సీ పాత్రను, మద్రాసులో వైద్య వృత్తిని అభ్యసించే సమయంలో ప్రతాపరుద్రీయం నాటకంలో గోవిందరాజుల పిచ్చివాని పాత్రను ధరించారు. యుగంధరుని పాత్రధారి ప్రదర్శనకు నటనకు ముగ్ధుడై సన్మానించడమే కాకుండా నాటక ప్రదర్శన హక్కులను గోవిందరాజులకు ఇచ్చారు.

గూడవల్లి రామబ్రహ్మం గోవిందరాజులను మద్రాసుకు ఆహ్వానంచి 'మాలపల్లి' చిత్రంలో ముఖ్యమైన పాత్ర ఇచ్చారు. ఆ చిత్రంలో సనాతన సంప్రదాయశీలుడైన సుందరరామయ్య పాత్రకు మీసాలు అవరోధం కావటంతోమీసాలు తీసివేయడానికి అంగీకరించక సినిమాను తిరస్కరించి గోవిందరాజుల తెనాలికి తిరిగి వచ్చారు.

రామబ్రహ్మం పదే పదే అభ్యర్థించటంతో తల్లి అనుమతిని పొంది మీసాలు లేకుండానే చిత్రంలో నటించారు. తొలి చిత్రంతోనే గోవిందరాజుల పేరు ప్రతిష్ఠలు తారాపథానికి దూసుకువెళ్లాయి. బాలనాగమ్మ చిత్రంలో మాయలఫకీరు పాత్ర గోవిందరాజులకు పేరు కీర్తిప్రతిష్ఠలు తెచ్చిపెట్టింది. ఈ చిత్ర నిర్మాత జెమినీవాసన్ దాదాపు ఒక నిముషం గోవిందరాజుల నడకను ప్రత్యేకంగా చిత్రీకరించారు. ఆ రోజుల్లో పసిపిల్లలు ఏడుపుతో మారాం చేస్తుంటే గోవిందరాజుల మాయలఫకీరును ఉదహరిస్తే భయంతో బిక్కచచ్చిపోయేవారట.

# నాడు ఘనం... నేడు దయనీయం

(ఆన్‌లైన్ - యడ్లపాడు)

ఒకప్పుడు సంగీత, సాహిత్య రంగాలలోను, అద్భుత శిల్ప కళా నైపుణ్యంతో కూడిన కట్టడాలతో పేరొందిన కొండవీడు... నేడు శిథిలావస్థకు చేరుకున్న కట్టడాలు అసాంఘిక శక్తులకు నిలయంగా మారి చూపరులకు కడు భయంగా కనిపిస్తుంది. వివరాల్లోకి వెళితే యడ్లపాడు మండల పరిధిలోని కోట చిన్నగ్రామం కాని పూర్వంలో కొండవీడు సామ్రాజ్యంనకు కేంద్రంగా వెలుగొందింది.

కానీ నేటి పాలకులకు పురాతన ప్రదేశాలపై శ్రద్ధ లేకపోవటంతో అసాంఘిక శక్తులకు నిలయంగా మారింది. దక్షిణ భారతదేశంలో ఎక్కడా లేని ఏకశిలా రాతితో కూడిన నంది విగ్రహం ఇక్కడ పొలాల్లో పడి వుంది. గుప్త నిధుల వేటలో నందిని పగలగొట్టారు. గోపినాధ స్వామి దేవాలయం నేడు పూర్తిగా శిథిలమై చెట్లు పెరిగి కూలే దశకు వచ్చింది.

ఈ దేవాలయంలోనే కత్తుల బావి కూడా వుంది. కుతంత్రం పన్నారు అన్న నెపంతో 70 మంది సామంత రాజులను విందుకు పిలిచి కత్తుల బావిలో పడేటట్లు చేసి చంపినట్టు చరిత్ర ఆధారం. ఈ దేవాలయం కూడా గుప్త నిధుల వేటలో కుంటలుగా మారింది. మొత్తం కొండ వీడు రాజ్యంను 18 పేటలుగా విభజించి కొండ వీడు రెడ్డిరాజులు పరిపాలించారు.

అంతేకాక ఈ కొండవీడు రాజులు తమ సామ్రాజ్యంను శత్రు దుర్భేద్యమైన కోటగా మార్చారు. ఆరు కిలోమీటర్లపైగా నిర్మాణం చేసి అందులో మొసళ్ళు పెంచేవారు.

అంతేకాక కొండపైన ఇతరుల రాకపోకలను గమనించటానికి సైనిక బురుజులను ఏర్పాటు చేశారు. కొండపైన మంచినీటి ఎద్దడి నిర్మూలన కోసం పది మంచినీటి చెరువుల నిర్మాణం చేశారు. ఇంత అభివృద్ధికి నోచుకొని తెలుగువాడి కీర్తిని భారతదేశం అంతా చాటిన కొండవీడు సామ్రాజ్యం నేడు కడుదయనీయంగా మారింది.

గుప్త నిధుల కోసం యధేచ్ఛగా పురాతన కట్టడాలను సైతం దుండగులు కూల్చివేస్తుండటం కడు బాధాకరం. కొద్ది సంవత్సరాలు గడిస్తే కొండవీడు కొండలు కనిపించటం మినహా అక్కడేమి పురాతన కట్టడాలు ఏమి కనిపించవు.



## అభివృద్ధిపథంలో కారంపూడి గ్రామ పంచాయితి



షేక్ కమాల్ సాహెబ్
పంచాయితీ కార్యదర్శి



ఎ. వెంకటేశ్వర్లు
సర్పంచ్



ఎ. హరనాధ్
ఉపసర్పంచ్

### చేపట్టిన అభివృద్ధి పనులు

1. పైలట్ ప్రాజెక్ట్ కింద పైపులైన్ నిర్మాణానికి రూ. 4లక్షలు 2. పంచాయితీ కార్యాలయం ముందు వాణిజ్య గదుల నిర్మాణము. రూ 2.90 లక్షలు 3. కారంపూడి పంచాయితీ పరిధిలోని ఆక్రమణ స్థలములకు అద్దెలు నిర్ణయించి, పంచాయితీ ఆదాయం పెంచటమైనది, 4. గ్రామపంచాయితీ కార్యాలయం వెనుకవున్న డ్రైనేజీ మరమ్మత్తులు చేపట్టటమైనది. 5. బస్టాండు వద్ద, బోడిమేడవద్ద, చెన్నకేశవ కాలనీలో మంచినీటి బోర్లు వేయించుట. 6. గ్రామంలో కొత్త ట్యూబ్‌లైట్లు 32 వేయించాం.

### చేపట్ట బోయే పనులు

1. సుద్దగుంతలో డ్రైనేజీ నిర్మాణము. 2.వడియరాజుల కాలనీలో పైపులైను విస్తరణ.3.నాగులేటీ ఒడ్డున మహిళలకు మరుగుదొడ్ల నిర్మాణం (ఎమ్మెల్యే గ్రాంటుతో) 4. ఆర్ & బి రోడ్డు నుండి గంగాధార మడుగు వరకు సి.సి.రోడ్డు, సైడుకాల్వలు 5.ఆర్ & బి రోడ్డు నుండి అంకాళమ్మ గుడికి వరకు సైడు కాల్వల నిర్మాణం 6. కారంపూడి తండాలో 2 గ్రావెల్ రోడ్లు నిర్మాణం.

### పంచాయితీ సభ్యులు

1వ వార్డు-తండా ఆలేసైదా, 2వ వార్డు-తాడా సుభాని, 3వ వార్డు-కొంగల పీరయ్య, 4వ వార్డు-కాల్వ ఎస్తేరు రాణి, 5వ వార్డు-ఈదర చిన మంగయ్య 6వ వార్డు - బొజ్జా శ్యామలాంబ, 7వ వార్డు-కోనేటి రామయ్య, 8వ వార్డు- షేక్ నూలింబీ, 9వ వార్డు-ఒత్తిని వెంకయ్య, 10వ వార్డు-కలవల శ్రీనివాసరావు, 11వ వార్డు-షేక్ హస్నేలు, 12వ వార్డు-ఆకుకూరి హరనాథ్, 13వ వార్డు - బొంకూరి శివరంజని, 14వ వార్డు-గాలం కోటయ్య, 15వ వార్డు - బాణావత్ వస్రాం నాయక్, 16వ వార్డు-శిఖినం అచ్చమ్మ మరియు సిబ్బంది.

**కార్యాలయ సిబ్బంది :** స్వర్ణా ఏడుకొండలు, పి. సురేష్, షేక్ వాజర్‌వలి, వల్లూట్ల సైదులు, షేక్‌జాని, పి. బ్రహ్మం, స్వీపర్లు : యన్. కోటేశ్వరరావు, జి. నాగయ్య, పి. ఏసోబు, ఎ. వెంకయ్య, కె. మంగయ్య, ఎ. ఏసుపాదం, అంతరగడ్డ రామయ్య,, సిబ్బంది : షేక్ నాగులుమీరా, షేక్ అసన్ అహ్మద్, అంతరగడ్డ దాసు, పాల్వాయి వెంకాయమ్మ, టి కోటేశ్వరరావు, కాల్వ సంతోషం, కాల్వ మాణిక్యం, వి. అన్నారావు, పి. ఆనందబాబు

# కనుమరుగవుతున్న చరిత్రకు సజీవ సాక్ష్యం 'చేబ్రోలు'

(ఆన్‌లైన్, చేబ్రోలు)

ప్రభుత్వం విస్మరించిన చారిత్రక ప్రదేశాలలో జిల్లాలోని చేబ్రోలు ఒకటి. ఇక్కడ ఉన్న ఆలయాలు, శాసనాలు, లభ్యమైన పురాతన వస్తుసామాగ్రి, రాజ శాసనాలను పరిశీలిస్తే చేబ్రోలుకు కొన్ని వేల సంవత్సరాల చరిత్ర ఉన్నట్టు తెలుస్తోంది. పురాతన సంప్రదాయాలకు, ప్రాచీన కళలకు పుట్టినిల్లు భారతదేశం. అనేక మంది రాజులు, చక్రవర్తులు శతాబ్దాలుగా దేశంలోని వివిధ ప్రాంతాలను రాజధానులుగా చేసుకుని రాజ్యాలు ఏలారు. రాజులు, రాజ్యాలు కాలగర్భంలో కలిసిపోయినా అప్పటి కట్టడాలు గత వైభవానికి చిహ్నాలుగా ఇప్పటికీ మనల్ని ఆకట్టుకుంటున్నాయి. దేశంలోని పలు ప్రాంతాలలో ఉన్న పురాతన కట్టడాలను, చారిత్రాత్మక ప్రదేశాలను పర్యాటక కేంద్రాలుగా ప్రభుత్వం గుర్తించింది. ఇటువంటి ప్రదేశాలలో ఉన్న ఏ కట్టడాలను పరిశీలించినా అవి మనకు అనేక కథలు చెబుతాయి. ప్రభుత్వం, పురాతన వస్తు పరిశోధనా శాఖ చేపట్టిన పరిశోధనల్లో అనేక నిజాలు వెలుగులోకి రావడంతో వివిధ ప్రాంతాలు ప్రముఖ పర్యాటక కేంద్రాలుగా భాసిల్లుతున్నాయి.

చేబ్రోలులో ఉన్న ఆలయాలు, శాసనాలు, లభ్యమైన పురాతన వస్తుసామాగ్రి, రాజశాసనాలను పరిశీలిస్తే కొన్ని వేల సంవత్సరాల చరిత్ర ఉన్నట్టు తెలుస్తోంది. చేబ్రోలు పల్లవుల కాలంలో తొంబ్రవ, తొంబ్రపురి అని, ఆ తర్వాత చాళుక్యుల కాలంలో జయవోలు, జయబాలుగా పిలువబడేదని, కాలక్రమేణా చేబ్రోలుగా మారిందని చరిత్ర చెబుతున్నది. ఇక్కడ గతంలో శాతవాహన, రోమన్ చక్రవర్తి కాన్‌స్టైన్, ఇక్ష్వాక నాణాలు లభ్యమయ్యాయి. క్రీస్తుపూర్వం రెండు వందల సంవత్సరాల క్రితమే ఆంధ్రులు సముద్రయానంలో ఆరితేరారని నిరూపించగల నాణాలు ఇక్కడ లభ్యమయ్యాయి. చేబ్రోలు ప్రాంతం మొదట ప్రముఖ బౌద్ధ క్షేత్రంగా అలరారింది.



ప్రసిద్ధిచెందిన చతుర్ముఖ బ్రహ్మదేవాలయం

## ఒకనాటి శైవక్షేత్రం...

ఇక్కడ లభించిన నాణాలను బట్టి చూస్తే ఈ ప్రాంతం కొంత కాలం శాతవాహనుల పాలనలో ఉన్నట్టు తెలుస్తోంది. ఆ తరువాత జైనులు కొన్నాళ్ళు చేబ్రోలును పాలించారు. విష్ణుకుండినుల కాలంలో బౌద్ధ, జైన ధర్మాలపై దాడి జరిగింది. ఒకటవ మాధవవర్మ అమరావతి స్థూపాన్ని ధ్వంసం చేసి శైవమత వ్యాప్తికి కృషి చేశాడు. ఇదే కాలంలో చేబ్రోలులో శైవమతం వ్యాప్తిచెందింది. తూర్పు చాళుక్య రాజైన యుద్ధమల్లుడు చేబ్రోలును రాజధానిగా చేసుకుని కొన్నేళ్ళు ఏలారని తెలుస్తోంది. ఈ కాలంలో చేబ్రోలును శ్రీశైవ క్షేత్రంగా తీర్చిదిద్దాడు. అనేక దేవాలయాలు నిర్మించి, పలు జాతరులు చేశారు. మహాసేనుని జాతరలో చేబ్రోలు నుంచి బెజవాడ వరకు ఊరేగింపు జరిగినట్టు యుద్ధమల్లుని బెజవాడ శాసనాన్ని బట్టి తెలుస్తోంది. కొంతకాలం పశ్చిమ చాళుక్య నరేంద్రుడైన ప్రత్యాశ్రయుని విడిది నగరంగా చేబ్రోలు వర్ధిల్లింది. కాకతీయ గణపతి సైన్యాధ్యక్షుడైన జాయపసేనాని చేబ్రోలును ప్రధాన కేంద్రంగా చేసుకున్నారు. ఆయన తోబుట్టువులైన నారాంబ, పేరాంబలను గణపతిదేవుడు వివాహమాడాడు. వెలమనాటి చోళులకు సైనిక కేంద్రంగా కూడా భాసిల్లింది. క్రీ.శ. 1570లో గోల్కొండ ఇబ్రహీం కులీకుతుబ్‌షా కొండవీటిని జయించిన పిదప చేబ్రోలు కూడా అందులో కలిసింది. చివరిగా తూర్పు ఇండియా వర్తక సంఘం వారు ఆంగ్లేయులు చేబ్రోలుపై ఆధిపత్యం చెలాయించారు.

## కాశీలో తప్ప మరెక్కడా లేనన్ని ఆలయాలు

చేబ్రోలు గుంటూరుకు 14 కిలో మీటర్ల దూరంలో గుంటూరు - పొన్నూరు రహదారిపై ఉంది. చేబ్రోలు గ్రామంలో నూటొక్క దేవాలయాలు, నూటొక్క బావులు ఉండేవని ప్రతీతి. కాలగర్భంలో కొన్ని శిథిలం కాగా, మరి కొన్ని దేవాదాయ శాఖ ఆధీనంలో ఉన్నాయి. ఇక్కడున్నన్ని ఆలయాలు భారతదేశంలో కాశీలో తప్ప మరెక్కడా లేవు. ప్రపంచంలో ఎక్కడా లేని విధంగా బ్రహ్మదేవాలయం చేబ్రోలులో మాత్రమే ఉంది.

## ముచ్చటైన విమాన గోపురం, ఆదికేశవాలయం

చేబ్రోలులోని ఆలయాలలో అతి పురాతనమైనది ఆదికేశవ ఆలయం. ఒకే ప్రాంగణంలో ఆదికేశవ, రాజ్యలక్ష్మి, ప్రసన్నాంజనేయ స్వామి ఆలయాల నిర్మాణం జరిగింది. వీటిని పల్లవ రాజులు నిర్మించారు. తొమ్మిదో శతాబ్ధంలో ఈ ఆలయాలను నిర్మించినట్లు తెలుస్తోంది. ఈ ఆలయానికి మిగతా ఆలయాల నిర్మాణానికి వ్యత్యాసం ఉంది. ఆదికేశవ ఆలయం పైన నిర్మించిన విమాన గోపురం ఎంతో చూడముచ్చటగా ఉంటుంది. ఈ ఆలయాల ప్రధాన దారిలో పెద్ద గాలిగోపురం నిర్మాణానికి శ్రీకారం చుట్టి పల్లవులు మధ్యలోనే నిలిపినట్లు తెలుస్తోంది. పెద్ద బండరాళ్ళతో అసంపూర్తిగా ఉన్న గోపురం ద్వారం ఇప్పటికీ ఉంది. ముక్కోటి ఏకాదశినాడు ఈ ద్వారాన్ని తెరుస్తారు.

## అరుదైన ఆలయం బ్రహ్మదేవాలయం

బ్రహ్మదేవునికి శాపం కారణంగా భూలోకంలో పూజలు జరుగవు. ప్రపంచంలో ఎక్కడా కూడా బ్రహ్మదేవాలయం లేదు. అయితే చేబ్రోలులో బ్రహ్మదేవుడిని లింగాకారంలో మలిచి ప్రతిష్టించారు. దీనిని 18వ శతాబ్దంలో రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు నిర్మించాడు. నాలుగు వైపులా నాలుగు ముఖాలతో లింగాకారంలో బ్రహ్మదేవుడున్నాడు. కనుక 'చతుర్ముఖ బ్రహ్మలింగేశ్వరుడు' అని అంటారు. బ్రహ్మదేవుడిని ఇక్కడ అష్ట (ఎనిమిది) దిక్కుల దిగ్బంధన చేశారు. బ్రహ్మ ఆలయానికి ముందు, వెనుక శైవ, ఇరు ప్రక్కలా వైష్ణవ ఆలయాలు నిర్మించారు. అదే విధంగా నాలుగు మూలలా నాలుగు దేవతామూర్తుల ఆలయాలను నిర్మించారు. ఈ ఆలయం పర్యాటకులను విశేషంగా ఆకట్టుకుంటుంది.

## ఎత్తయిన గాలిగోపురం, నాగేశ్వరాలయం

క్రీస్తు శకం 14వ శతాబ్దంలో చేబ్రోలుకు గ్రామాధికారులుగా ఉన్న కంతెన్న, మూర్తన్న అనే ఇరువురు సోదరులు నాగేశ్వరాలయాన్ని నిర్మించారు. ఆలయానికి ముందున్న అతి పెద్ద గాలిగోపురం కన్నుల విందుగావిస్తోంది. ఈ ప్రాంతంలో గల అతి ఎత్తయిన కట్టడంగా చట్టు ప్రక్కల గ్రామాలకు సైతం కనిపిస్తుంది. ఆలయంలో దసరా, శివరాత్రి మహోత్సవాలు ఘనంగా నిర్వహిస్తారు.

మహాశివరాత్రికి స్వామివారి కళ్యాణం అనంతరం రథోత్సవం జరుగుతుంది. చేబ్రోలులో గల రథం జిల్లాలో కెల్లా అతిపెద్దది. నాగేశ్వరాలయం ముందు నవగ్రహాలను ప్రతిష్టించారు. ప్రక్కనే ఉన్న ఏకశిలానంది విశేషంగా ఆకట్టుకుంటుంది. ఈ పరిసర ప్రాంతాలలో లేనంత సైజులో ఒకే ఎర్ర రాతితో నందిని మలచి ప్రతిష్టించారు. చేబ్రోలులో గల ఆలయాలలో భీమేశ్వరాలయానికి ఓ విశిష్టత ఉంది.

# జన్మభూమి రుణం తీర్చుకుంటున్న డా॥ రామినేని ఫౌండేషన్



రామినేని అయ్యన్న చౌదరి
ఫౌండర్, రామినేని ఫౌండేషన్

భారతీయ సంస్కృతి మరియు హిందూయిజం ఆదర్శాలకు సంబంధించి కట్టడాల వారసత్వాన్ని పరిరక్షించి, అభివృద్ధి పరిచే లక్ష్యంతో USA లోని ఓహియో రాష్ట్రంలో సిన్ సిన్నాటిలో స్వర్గీయ డా॥ రామినేని అయ్యన్న చౌదరి పిల్లలచే 1995లో డా॥ రామినేని ఫౌండేషన్ స్థాపించబడింది. అంతేగాక కళలు, శాస్త్రం మరియు మానవ విజ్ఞాన శాస్త్రాల మిశ్రమ రంగాల నుండి తీసుకోబడిన ఉన్నత పండితులను సాహసవంతులుగా, ధృఢ నిర్భలయులుగా, పరోపకారులుగా వారి ప్రయత్నాలకు వీలు కల్పించడమే ఈ సంస్థ యొక్క ప్రాథమిక లక్ష్యం.

## డా॥ రామినేని అయ్యన్న చౌదరి (డా॥ RAC)

డా॥ RAC 1929 అక్టోబరు 12న ఆంధ్రప్రదేశ్‌లోని గుంటూరు జిల్లా, బ్రాహ్మణ కోడూరు గ్రామంలో రైతు కుటుంబంలో స్వర్గీయ శ్రీ వీరయ్య చౌదరి మరియు స్వర్గీయ శ్రీమతి కన్యాకుమారికి జన్మించారు. ఆయన తండ్రి సలహా మేరకు వ్యవసాయంతోపాటు లలిత కళలలో చొరవచూపారు. డా॥ RAC గుంటూరు జిల్లాలో పాఠశాల విద్య పూర్తి చేసి బనారస్ హిందూ విశ్వవిద్యాలయం నుండి గణితంలో పోస్ట్ గ్రాడ్యుయేషన్ డిగ్రీ పొందారు. 1955 వరకు ఆయన గుంటూరు జిల్లాలోని పాలపర్రు, కృష్ణాజిల్లాలోని మొవ్వలో ఉపాధ్యాయుడిగా పనిచేశారు. ఉన్నత విద్యాభ్యాసంకై డా॥ RAC 1955లో అమెరికా వెళ్ళారు. అక్కడ ఆయన మిన్నీపాలిస్‌లోని మిన్నెసోట విశ్వవిద్యాలయం నుండి మాస్టర్ ఆఫ్ సైన్స్ ఇన్ ఎకనామిక్స్ అండ్ ఫైనాన్స్‌తోపాటు డాక్టరేట్ కూడా పూర్తి చేశారు. విద్యాభ్యాస కాలంలో ఆయన తల్లిదండ్రులపై ఆధారపడక పార్ట్‌టైం ప్రాతిపదికన పనిచేస్తూ స్వయంగా ఆర్థిక వనరులను సమకూర్చుకునేవారు. తర్వాత 1963-1973 వరకు నార్త్ ల్యాండ్ కాలేజిలో ప్రొఫెసర్‌గా ఆశ్లాండ్ అండ్ జేవియర్ యూనివర్శిటీ, సిన్‌సెన్నాటిలో పనిచేశారు. 1973లో ఆయన తన సేవలను సామాజిక, సాంస్కృతిక రంగాలకు అంకితం చేసేందుకై చాలా ముందుగానే పదవీ విరమణ పొందినారు. డా॥ RAC పదవీ విరమణ తర్వాత రియల్ ఎస్టేట్ వ్యాపారంలోప్రవేశించి ఓహియో రాష్ట్రంలోని సిన్ సిన్నాటిలో డౌన్‌టౌన్ ప్రాపర్టీ మేనేజ్‌మెంట్ Inc., ని స్థాపించారు. నాయకుని లక్షణాలతో ముందుకు సాగారు. నేడు ఈ సంస్థ ఉన్నత స్థానంలో ఉన్నది. డా॥ RAC కి 1967లో సుగుణతో వివాహమైంది. ఆయనకు 6గురు పిల్లలు. మన సంస్కృతి నాగరికతలో అపార నమ్మకమున్నందున వారికి ధర్మప్రచారక్, శారదాదేవి, సత్యవాది, బ్రహ్మానంద, వేదాచార్య మరియు హరిచంద్ర అని సంప్రదాయక వేద పేర్లు పెట్టుకొన్నారు. ఆయన తన పిల్లలను పాశ్చాత్య సంస్కృతి నుండి తప్పించేందుకు ఇంట్లోనే విద్యాబుద్ధులు నేర్పారు. ఆయనచే ప్రారంభించిన వ్యాపారంలో శిక్షణలో పొందిన వారు జాగ్రత్తగా చూసుకుంటున్నారు. డా॥ RAC 1958లో USA లో విద్యాభాస కాలంలో హిందూ సంస్కృతి మరియు నాగరికతను వికసింపజేసేందుకు హిందూ అసోసియేషన్ ఆఫ్ మిన్నెసోటాను స్థాపించి క్రమంగా భారతీయ ఉత్సవాలు మరియు సామాజిక కార్యకలాపాలను నిర్వహించారు. ఆయన తన జన్మస్థలంలో సంగీత, సాహిత్య, సంస్కృతి, హిందూధర్మ నిలయంను స్థాపించి భారతీయ లలిత కళలకు అంకితం చేశారు. డా॥ RAC వెంపటి చినసత్యం మార్గదర్శకాల మేరకు కూచిపూడి నాట్య పాఠశాల మరియు వేద పాఠశాలను కూడా స్థాపించాలని ప్రణాళిక రూపొందించారు.



వేదాచార్య
కన్వీనర్, రామినేని ఫౌండేషన్



గుంటూరులో మెరిట్ విద్యార్థులకు స్కాలర్ షిప్‌లు పంపిణీ చేస్తున్న రామినేని అయ్యన్న చౌదరి సతీమణి సుగుణ



ప్రముఖ గాయని శ్రీమతి జానకిని సన్మానిస్తున్న గవర్నర్ తివారి

## డా॥ రామినేని ఫౌండేషన్ USA

ఈ సంస్థ యొక్క లక్ష్యాలు మరియు సంక్షిప్త వివరాలు ఇప్పటికే మీ వద్ద ఉన్నాయి. దీనికి తోడు సంస్థ యొక్క గత కార్యకలాపాలు దిగువ తెలియజేస్తున్నాము.

హైదరాబాద్‌లో 12 అక్టోబరు 1999న హోటల్ గ్రాండ్ కాకతీయలో డా॥ ఆర్‌ఎఫ్ ప్రారంభించబడి క్రింద పేర్కొన్న వాటిని నిర్వహించింది. ఈ వేడుకలో ముఖ్య అతిథిగా డా॥ సి. నారాయణరెడ్డిగారు మరియు విశిష్ట అతిథులుగా డా॥ వెంపటి చిన్నసత్యం, ప్రొఫెసర్ ఎన్. గోపి, ప్రొఫెసర్ పి. శివారెడ్డి మరియు డా॥ గుమ్మడి వెంకటేశ్వరరావు పాల్గొన్నారు.

**సాంస్కృతిక కార్యక్రమం :** డా॥ వెంపటి చిన సత్యం బృందంచే కూచిపూడి నృత్య ప్రదర్శన.

**సన్మానం : విశిష్ట పురస్కారం :** డా॥ జీఎన్. రావు, వ్యవస్థాపకులు & డైరెక్టర్, ఎల్.వి. ప్రసాద్ ఐ ఇనిస్టిట్యూట్.

**విశేష పురస్కారం :** బాపు-రమణ , ఆదర్శ స్నేహితులు మరియు రూపకర్తలు : డా॥ నండూరి రామమోహనరావు, విశేషానుభవంగల జర్నలిస్టు & రచయిత : శ్రీ కాళీపట్నం రామారావు, తెలుగు కధాపోషకులు

భారతదేశంలో 12 అక్టోబరు, 2000 నాడు హోటల్ గ్రీన్‌పార్క్‌లో డా॥ మొది వార్షికోత్సవమును జరుపుకొని దిగువ తెలిపిన వాటిని నిర్వహించింది. ఈ ఉత్సవానికి డా॥ అక్కినేని నాగేశ్వరరావుగారు ముఖ్య అతిథిగా మరియు డా॥ ఎన్. శివప్రసాద్, ప్రొఫెసర్ కాకర్ల సుబ్బారావు, శ్రీ ఎం. మురళీమోహన్ విశిష్ట అతిథులుగా పాల్గొన్నారు.

సాంస్కృతిక కార్యక్రమం : "అన్నమయ్య పద కోకిల" శ్రీమతి శోభరాజు మరియు బృందంచే భక్తి సంగీత కార్యక్రమం.

డా॥ RAC జన్మస్థలాన్ని మరియు తన కుటుంబ వృత్తిని మరచిపోకుండా తన 4వ కుమారుడు వేదాచార్య సహాయంతో బ్రాహ్మణకోడూరులో వ్యవసాయ కార్యరంగాన్ని అభివృద్ధి చేశారు. భారతదేశాన్ని తరచుగా సందర్శించినప్పుడు విలువైన మార్గదర్శకాలను పశుసంరక్షణకై అందించారు. హిందుస్థాన్ థెరప్యూటిక్స్ ప్రై. లిమిటెడ్, హైదారాబాద్ పేరుతో ఫార్ములేషన్స్ తయారీ యూనిట్‌ను నెలకొల్పి, వ్యవసాయదారులకు అధిక నాణ్యత మరియు తక్కువ ఖర్చుతో కూడిన పశు సంరక్షణ మందులను అందిస్తున్నారు. డా॥ RAC గారి 70వ జన్మదినోత్సవం సందర్భంగా వారి పిల్లలు డా॥ రామినేని ఫౌండేషన్‌ను భారతదేశంలో 12-10-1999న ప్రారంభించి దాని సామాజిక మరియు సాంస్కృతిక కార్యకలాపాలను విస్తృతంచేసి ప్రాథమిక లక్ష్యాన్ని నెరవేర్చేందుకు కృషి చేస్తున్నారు.

ఆంధ్రప్రదేశ్ ఉన్నత విద్యా మండలిచే నిర్వహించబడిన 10వ తరగతి పబ్లిక్ పరీక్షలలో అత్యున్నత మార్కులు సాధించిన బాలబాలికలను మెరిట్ అవార్డులను ఇవ్వాలని 2001 పురస్కారముల సమయంలో నిర్ణయించడమైనది. ఎంపిక చేయబడిన పాఠశాలలన్నీ గ్రామీణ ప్రాంతాల (గుంటూరు జిల్లాలోని బ్రాహ్మణకోడూరు, పాలపర్రు మరియు తెనాలి మరియు కృష్ణా జిల్లాలోని మొవ్వలోని జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలకు చెందినవే. ఈ ఎంపిక వెనుక దాగివున్న ఉద్దేశ్యమేమనగా గ్రామీణ ప్రాంతాల విద్యార్థులను ప్రోత్సహించి జీవితంలో ఉన్నత లక్ష్యాలను సాధింపచేయడం. ఈ ప్రదేశాలు కూడా డా॥ RAC గారి స్వస్థలమేకాక ఆయన విద్యాభ్యాసం చేసి, అక్కడే ఉపాధ్యాయుడిగా పనిచేసియున్న స్థలం.



బెనారస్ యూనివర్సిటీ రిటైర్డ్ వైస్ చాన్సలర్ ప్రొఫెసర్ రామచంద్రరావును సన్మానిస్తున్న గవర్నర్ ఎన్‌డి తివారి



రచయిత రెడ్డి రాఘవయ్యను సత్కరిస్తున్న గవర్నర్ తివారి తదితరులు




హైదరాబాద్‌లో సత్యసాయి నిగమంలో జరిగిన విశిష్ట పురస్కారాల పంపిణీ సభలో ప్రసంగిస్తున్న గవర్నర్ ఎన్‌డి తివారి, వేదికపైన రాష్ట్ర మంత్రులు మోపిదేవి వెంకటరమణ, గల్లా అరుణ, నేదురుమల్లి రాజ్యలక్ష్మి తదితరులు



జాతీయ సబ్ జూనియర్ అథ్లెటిక్స్ పోటీల నిర్వహణకు రూ.50,000 విరాళంగా జిల్లా కలెక్టర్ మహమ్మద్ ఆలీ రఫత్‌కు అందజేస్తున్న రామినేని ధర్మ



మిమిక్రి కళాకారుడు నేరెళ్ళ వేణుమాదవ్‌ను సన్మానిస్తున్న గవర్నర్ తివారి



స్కాలర్‌షిప్‌లు పంపిణీ చేస్తున్న జిల్లా కలెక్టర్ మహమ్మద్ ఆలీ రఫత్, జడ్‌పి చైర్‌పర్సన్ విజయమ్మ, మంత్రి మోపిదేవి వెంకటరమణ

8322, Arborcrest Drive, Cincinnati, Ohio - 45236-140, USA.
C-12, Madhuranagar, Hyderabad - 500 038. India

# ఆధునిక హంగులతో సిడి లైబ్రరీ

( ఆన్‌లైన్, గుంటూరు)

అక్షరాలను పదాల పల్లకిగా మార్చి విజ్ఞానాన్ని విశ్వ వ్యాప్తం చేయడంలోనూ తద్వారా చరిత్రగతిని మార్చడం లోనూ పుస్తకం ప్రముఖ పాత్ర వహిస్తుందనడంలో సందేహం లేదు. ప్రపంచ ప్రఖ్యాత గాంచిన ఎందరో మహానుభావులు పుస్తకాలతో స్నేహం చేసి తద్వారా పొందిన జ్ఞానాన్ని చరిత్రగతిని మార్చడంలో ఉపయుక్తంగావించారు. ఇంతటి అద్భుత శక్తి కలిగిన మంచి పుస్తకాలను ఏరికూర్చి ఏర్పరిచినదే గ్రంథాలయం. నేటి విద్య విధానంలోవిద్యార్థులకు చేదోడు వాదోడుగా ఉంటూ వారి పాఠ్యాంశాల్లో ఎదురయ్యే సమస్యలను నివృత్తి చేయడం. వాటిలో నిపుణత సాధించడానికి వారికి గ్రంథాలయం ఎంతో ఉపయోగపడుతుంది. నేటి పోటీ పరీక్షల యుగంలో విద్యార్థులకు సరైన దిశా నిర్దేశం గ్రంథాలయం చేస్తుంది.

ఇంతటి విస్తృత విజ్ఞానాన్ని పరిశోధకులు, విద్యార్థులు, అధ్యాపకులకు అందిస్తూ కృష్ణా, గుంటూరు, ప్రకాశం జిల్లాలకే తలమానికంగా నిచేదే ఆచార్య నాగార్జున యూనివర్సిటీ ఆగష్టు 19, 1976లో ప్రారంభించబడి ఆంధ్ర యూనివర్సిటీచే గ్రంథాలయం నేడు ఒక లక్షా 12వేల పుస్తకాలకు పైగా తనలో ఇముడ్చుకుంది. పరిశోధన విద్యా విషయక విషయాలను అనుబంధ కళాశాలలకు అవసరమయిన సమాచారాన్ని అందజేయడంలో సంధానకర్తగా వ్యవహరిస్తుంది.

3 ఫ్లోరెలలో 2,130 చదరపు మీటర్లలో ఏర్పాటైన లైబ్రరీ బేస్‌మెంట్ హాల్ నందు వివిధ విభాగాలకు చెందిన పుస్తకాలను క్రమ పద్ధతిలో అమర్చారు. గ్రౌండ్ ఫ్లోర్‌లో టెక్స్‌ట్ పుస్తకాలు, రిఫరెన్స్ పుస్తకాలు, పుస్తక జారీ, సంగ్రహం సెంటర్‌లు, ఆఫీసు, ఇంటర్‌నెట్ గ్రంథాలయం ఉన్నాయి. మొదటి అంతస్థులో (మిగతా 119వ పేజీలో)



# పవిత్ర దేవాలయాల పురి 'స్వర్ణపురి'

(ఆన్‌లైన్-పొన్నూరు)

భక్తుని వివాహ సాక్షార్థమై కాశీ నుండి తరలి వచ్చిన భావన్నారాయణ స్వామి, ఏకశిలారూపులైన ఆంజనేయస్వామి, గరుత్మంతుల విగ్రహాలతో పొన్నూరులోని దేవాలయాలు భక్తులు పాలిటి కొంగు బంగారంగా విరాజిల్లుతున్నాయి. రాజకీయ,సాహిత్య, సాంస్కృతిక విద్యా రంగాల్లో విశిష్టతను పొందిన పొన్నూరు పట్టణంలోని దేవాలయాలు శిల్పకళా శోభితమై అత్యంత ప్రాముఖ్యతను సంతరించుకొన్నాయి.



సాక్షి శ్రీ భావనారాయణస్వామి దేవాలయం

## సాక్షిశ్రీ భావనారాయణస్వామి దేవాలయం

భగవంతుడు సత్యనిరూపణకు సాక్షీ భూతుడు కాగలడన్న సత్యానికి కనిపించే ఆధారమే పొన్నూరు భావన్నారాయణ స్వామి క్షేత్రం,హరిహరుల విభేదాలకు ముందే వెలసిన ప్రాచీన క్షేత్రాలల్లో ఇది ఒకటి ఈ క్షేత్రం స్వయం వ్యక్తం. శ్రీ మన్నారాయణడు తన నిజ భక్తుడైన గూని గోవిందుని వివాహ సాక్ష్యార్థమై కాశీ నుండి తరలి వచ్చినట్లు క్షేత్ర పురాణం ద్వారా స్పష్టమవుతోంది. భక్తులు తమ మనోభావాలతో భావన చేస్తున్న కారణంగా సర్వులకూ సాక్షీ భూతుడైన కారణంగాను ఇక్కడి దేవుడు సాక్షి భావనారాయణుడన్న పేరుతో విరాజిల్లు తున్నాడు. అవుకు మండలాధిపతి అయిన అందెల నారపరాజు శ్రీ భావన్నారాయణ స్వామి ఆలయాన్ని నిర్మించినట్లుగా చారిత్రక ఆధారాలున్నాయి. క్రీ.శ.1119లో కుళుత్తుంగ చోళుడు స్వామి వారి కళ్యాణోత్సవాలు, అర్చకుల పోషణ నిమిత్తం అయిదు గ్రామాలను సమర్పించినట్లు ఆలయ ప్రాంగణంలోని శిలాఫలకం తెలుపుతోంది. అనంతరం రాచూరి జమిందారులైన మాణిక్యారావు,జగ్గన్నారావులు 1712లో దేవాలయానికి ప్రాకారాదులను నిర్మించారు. అనంతరం 1804లో రాజా భావయ్య మాణిక్యారాములు నుంచి రాజావాసి రెడ్డి వెంకట్రాది నాయుడు బహుద్దూన్ మన్నెసుల్తాన్ దొరవారు ఆలయాన్ని సర్వహక్కులతో పొందారు. ఆలయ ప్రాంగణంలో భావన్నారాయణ స్వామితో పాటు కాశీ నుండి తరలివచ్చినట్లుగా చెప్పబడుతున్న కాశీ విశ్వేరుడు, రాజ్యలక్ష్మి, చెన్నకేశవ, లక్ష్మీనరసింహస్వామి, రామానుజ సహిత సన్నిద్ధ రాళ్వారులు, ఆంజనేయస్వామి, విశాలాక్షి ఆలయాలు వున్నాయి. ప్రతి ఏడాది వైశాఖ సప్తమి నుంచి పౌర్ణమి వరకు స్వామి వారి బ్రహ్మోత్సవాలు కన్నుల పండువగా జరుగుతాయి. ఆలయానికి అనుబంధంగా సంస్కృతోన్నత పాఠశాల, కళాశాల, గ్రంథాలయం, ఉచిత నాదస్వర డోలు విద్యాలయాలు నిర్వహించ బడుతున్నాయి.



సహస్రలింగేశ్వరస్వామి దేవాలయం

## సహస్ర లింగేశ్వరాలయం

1008 విగ్రహాల శివాలయం, పాలరాతి శంకరుని ప్రతిమ, దశావతారాలతో కనువిందు చేసే ఆలయం, దేశంలో మరెక్కడా కనిపించని రీతిలో 24 అడుగుల ఎత్తయిన పెద్ద ఆంజనేయస్వామి, 27 అడుగుల ఎతైన భారీ గరుత్మంత స్వామి విగ్రహాలు, నిత్య కాంతులతో శోభించే అఖండ జ్యోతులు సహస్రలింగేశ్వరస్వామి దేవాలయ ప్రత్యేకతలు. నాలుగు దశాబ్ధాల క్రితం ప్రతిష్టతమైన 24 అడుగుల ఎత్తు, 12 అడుగుల వెడల్పు, మూడు అడుగుల మందంతో ఏకశిలా నిర్మితమైన వీరాంజనేయస్వామి విగ్రహాన్ని వీక్షించేందుకు రాష్ట్రం నలు మూలల నుండే కాక దేశం నలు చెరుగుల నుంచి భక్తులు, సందర్శకులు నిత్యం విచ్చేస్తుంటారు. పొన్నూరుకు సమీపం ( మిగతా 117వ పేజీలో)

## పెదకూరపాడు నియోజకవర్గ అభివృద్ధికి
# నిరంతరం శ్రమిస్తున్న మంత్రి కన్నా

(ఆన్‌లైన్ పెదకూరపాడు)

పెదకూరపాడు నియోజకవర్గ శాసనసభ్యునిగా వరుసగా నాలుగు పర్యాయాలు గెలుపొంది కాంగ్రెస్ ప్రభుత్వం అధికారంలో ఉన్న రెండు సార్లు జిల్లా నుంచి మంత్రిగా ప్రాతినిధ్యం వహిస్తున్న రాష్ట్ర రవాణాశాఖా మంత్రి కన్నా లక్ష్మినారాయణ నియోజకవర్గ అభివృద్ధికి విశేషంగా కృషి చేస్తున్నారు. రాజకీయంగా నియోజకవర్గంపై నేటికీ మంత్రి కన్నా గట్టి పట్టుతో ఉన్నారు. నాల్గవసారి శాసన సభ్యునిగా ఎన్నికై ముఖ్యమంత్రి వైఎస్ రాజశేఖర రెడ్డి నేతృత్వంలో రవాణాశాఖా మంత్రి కన్నా లక్ష్మినారాయణ కోట్లాది రూపాయలు వెచ్చించి పెదకూరపాడు నియోజకవర్గ అభివృద్ధికి విశేషంగా కృషి చేశారు. నియోజకవర్గంలోని చివరి భూములకు సాగునీరు అందించేందుకు కోట్లాది రూపాయలతో ఎత్తిపోతల పథకాలను చేపడుతున్నారు. నాబార్డు సహకారంతో రాష్ట్ర నీటిపారుదల సంస్థ ఆధ్వర్యంలో మల్లాదిలో, 75 తాళ్ళూరు ఎత్తిపోతల పథకం కింద రూ.15,15,09,000లతో 4,990 ఎకరాలకు సాగునీరు, బలుసుపాడు ఎత్తిపోతల పథకం కింద రూ.9,13,83,000లతో 3,562 ఎకరాలకు సాగునీరందించారు. ఎద్దువాగు సమీపంలో ఊటుకూరు వద్ద 890 ఎకరాలకు సాగునీరు అందించేందుకు రూ.7,48,000లు, కృష్ణానదిపై అచ్చంపేట వద్ద అంబడిపూడి మైనర్ పరిధిలోని చింతపల్లి మేజర్‌లో ఉన్న 1,324 ఎకరాలకు సాగునీరందించేందుకు రూ.11,56,000లతో, కృష్ణానదిపై పుట్లగూడెం వద్ద 2,492 ఎకరాలకు సాగునీరందించేందుకు రూ.20 కోట్లుతో, పెదకూరపాడు *(మిగతా 115వ పేజీలో)*



రూ. 12 కోట్లతో సత్తెనపల్లి నుంచి అమరావతికి ఆర్ అండ్ బి రోడ్డు నిర్మాణం

# పల్నాట విద్యారంగంలో విరాజిల్లుతున్న రెంటచింతల

(ఆన్‌లైన్, రెంటచింతల)

గుంటూరు జిల్లాలోని 57 మండలాల్లో మండల కేంద్రమైన రెంటచింతల ఓ విశిష్టతను సంతరించుకుంది. రాష్ట్రంలోనే అత్యధిక ఉష్ణోగ్రత నమోదయ్యే ప్రాంతాలలో రెంటచింతలది రెండవస్థానం. అంతేగాకుండ గత 50 ఏళ్ళ కాలం నుండి వ్యవసాయ, విద్యారంగానికి పెట్టింది పేరు. ఇక్కడ పండించే మిర్చి, పత్తి పంటలకు ఎంతో నాణ్యత వుంటుంది. అదే విధంగా మండలంలోని గోలి, జెట్టిపాలెం, పశర్లపాడు, తుమృకోట గ్రామాలలో వేలాది ఎకరాలలో నాపరాయి గనులు విస్తరించి వున్నాయి. ఇక్కడి నుండి తీసే నాపరాయికి ఎక్కడా లేని గిరాకి వుంటుంది. రెంటచింతల నుండి దేశంలోని పలుప్రాంతాలకు నాపరాయిని ఎగుమతి చేస్తుంటారు. ఈ గనులలో సుమారు 250 కుటుంబాలు పనిచేసుకుంటూ జీవిస్తున్నాయి. జిల్లాలో ఏ మండల కేంద్రంలోను లేనన్ని పాఠశాలలు ఇక్కడ వెలిశాయి. రెంటచింతల లూథరన్ బాలికల పాఠశాల, సెయింట్ జోసఫ్ హైస్కూలు, వైఆర్ఎస్ హైస్కూలు వంటి మూడు ఎయిడెడ్ స్కూల్సు వుండగా, ఏడు ప్రైవేటు హైస్కూల్సు వుండడం విశేషం. వేలాది మంది విద్యార్థుల రాకపోకలతో నిత్యం రెంటచింతల రద్దీగా కనిపిస్తుంటుంది. ఇంగ్లీషు, తెలుగు మీడియం పాఠశాలలు ఏర్పాటు కావడంతో జిల్లా నలుమూలల నుండి పెద్ద సంఖ్యలో విద్యార్థులు ఇక్కడ విద్యనభ్యసించేందుకు తరలి వస్తుంటారు. విద్యారంగంలో విపరీతమైన పోటీ వాతావరణం ఏర్పడడంతో రెంటచింతల గతంలో ఎన్నడు లేని విధంగా విద్యా ప్రమాణాలు గణనీయంగా పెరిగాయి. గత సంవత్సరం (2006-07) విద్యాసంవత్సరంలో రెంటచింతలకు చెందిన 'వివేక పబ్లిక్ స్కూలు' విద్యార్థి పదవ తరగతిలో 570 మార్కులు సాధించి పల్నాడులోనే అత్యధిక మార్కులు సాధించిన విద్యార్థిగా నిలిచాడు. వివేక పబ్లిక్ స్కూలు నుండి సుమారు 13 మందికి పైగా 500లకు పైగా మార్కులు సాధించారు. మిగిలిన పాఠశాలల విద్యార్థులు కూడా పెద్ద సంఖ్యలో 500లకు పైగా మార్కులు సాధించడం మరో సంచలనం. దీంతో రెంటచింతల పాఠశాలలకు విద్యార్థుల తాకిడి ఈ సంవత్సరం అధికమైంది. స్థానిక సెయింట్ జోసఫ్, వైఆర్ఎస్ హైస్కూళ్ళు గత 35 ఏళ్ళుగా అత్యుత్తమ ఫలితాలను సాధిస్తున్నాయి. ఈ రెండు పాఠశాలలోచదివేందుకు గతంలో రాష్ట్రంలోని విశాఖ, వరంగల్, నెల్లూరు వంటి ప్రాంతాల నుండి రెంటచింతలకు వచ్చి విద్యనభ్యసించేవారు. ఇక్కడ చదివిన ఎందరో విద్యార్థులు విదేశాలలో డాక్టర్లు, ఇంజనీర్లుగా స్థిరపడగా, మరెందరో లాయర్లుగా, ఐఎస్, ఐపిఎస్, ఇతర రంగాలలోను నిష్ణాతులుగా తీర్చిదిద్దబడ్డారు. ప్రభుత్వ పాఠశాలల్లో విద్యా ప్రమాణాలు నానాటికి దిగజారిపోతుండడంతో తల్లిదండ్రులు తమ పిల్లలను ప్రైవేటు చదువులు చెప్పించేందుకు ఆసక్తి చూపుతున్నారు. ఫలితంగా రెంటచింతల మండలంలోని సుమారు 32 ప్రభుత్వ పాఠశాలల్లో రాను రాను విద్యార్థుల సంఖ్య తగ్గిపోతున్నది. అయితే కొన్ని ప్రభుత్వ పాఠశాలల్లో అంకితభావంతో పనిచేస్తున్న ఉపాధ్యాయుల కృషి కారణంగా తుమృకోట, పశర్లపాడు, పాలువాయి, రెంటాల, రెంటచింతలలోని ప్రభుత్వ పాఠశాలల ఉత్తీర్ణత శాతం కూడా బాగా పెరిగింది.

## జూనియర్ కాలేజి ఆవశ్యకత

విద్యాకేంద్రంగా విరాజిల్లుతున్న రెంటచింతలలో ప్రభుత్వ జూనియర్ కాలేజిని స్థాపించాల్సిన అవసరం ఎంతైనా వుంది. మండల కేంద్రమైన రెంటచింతలలో జూనియర్ కాలేజి లేకపోవడంతో విద్యార్థిని, విద్యార్థులు ప్రైవేటు కళాశాలలను ఆశ్రయించి ఫీజులు కట్టి చదువుకోవాల్సిన పరిస్థితి ఏర్పడుతున్నది. ఆర్థిక స్థోమత లేని ఎన్నో కుటుంబాలు తమ పిల్లలను పదవ తరగతి వరకే చదివించి ఆ పై చదువులకు స్వస్తి చెబుతున్నారు. దీంతో పేద కుటుంబాల్లో వున్న మెరిట్ విద్యార్థులు ఉన్నత చదువులకు నోచుకోలేకపోతున్నారు. ప్రతి సంవత్సరం రెంటచింతల మండలం నుండి సుమారు 1000 మంది విద్యార్థుల వరకు పదవ తరగతి పరీక్షలు రాస్తున్నారు. వీరంత కాలేజ చదువులకు స్థానిక, ఇతర ప్రాంతాలకు వెళ్ళవలసి వస్తున్నది. ప్రజా ప్రతినిధులు, ఉన్నతాధికారులు రెంటచింతలలో ఓ ప్రభుత్వ జూనియర్ కాలేజిని ఏర్పాటుచేయాలన్న ఆవశ్యకతను గుర్తించాల్సి వుంది.



రెంటచింతలలోని సెయింట్ జోసెఫ్ ఉన్నత పాఠశాల

# పెదకూరపాడు నియోజకవర్గం అభివృద్ధికి మంత్రి కన్నా కృషి

(113వ పేజీ తరువాయి)

మండలంలోని లింగంగుంట్ల జగడాల వాగుపై లింగంగుంట్ల వద్ద ఎత్తిపోతల పథకం ఏర్పాటుకు 754 ఎకరాలకు సాగునీరు అందించేందుకు రూ.31 లక్షలతో, కృష్ణానదిపై పొందుగల వద్ద చివరి భూములైన 872 ఎకరాలకు సాగునీరందించేందుకు రూ.78 లక్షలతో నిర్మిస్తున్నారు. పెదకూరపాడు నుంచి సిరిపురం వెళ్ళేందుకు రూ.కోటి 45 లక్షల ఆర్ అండ్ బి నిధులతో తారు రోడ్డు, పెదకూరపాడు నుంచి అత్తలూరు వెళ్ళేందుకు నాబార్డు సాయంతో రూ.కోటి 20 లక్షలతో తారురోడ్డు ఏర్పాటు చేశారు. అమరావతి నుంచి సత్తెనపల్లి ఆర్ అండ్ బి రోడ్డు నిర్మాణానికి రూ.12 కోట్ల వ్యయంతో తారు రోడ్డు ఏర్పాటు, కోట్లాది రూపాయల వ్యయంతో పులిచింతల ప్రాజెక్ట్ నిర్మాణం పనులు జరుగుతున్నాయి. ఊటుకూరు నుంచి కస్తల వెళ్ళే రోడ్డు నిర్మాణానికి రూ.కోటి 54 లక్షలతో తారురోడ్డు ఏర్పాటు, మన్నెసుల్తాన్ పాలెం నుంచి వెంకటాయపాలెం వరకు నాబార్డు సాయంతో రూ.95 లక్షలతో తారురోడ్డు ఏర్పాటు, ప్రధానమంత్రి గ్రామీణ సడక్ యోజన పథకం కింద 75 తాళ్ళూరు నుంచి తమ్మవరం వరకు, పరస నుంచి జలాలపురం వరకు తారురోడ్డు వేశారు. సత్తెనపల్లి మాదిపాడు రోడ్డులో రూ.కోటి 80 లక్షలతో, రూ.కోటి 29 లక్షలతో వంతెనల నిర్మాణం, ఇదే రోడ్డులో రూ.కోటి 48 లక్షలతో హై లెవల్ బ్రిడ్జి నిర్మిస్తున్నారు. పెదకూరపాడు నుంచి పాడపాడు వెళ్ళే రోడ్డు మార్గంలో రూ.కోటి 9 లక్షలు, రూ.కోటి 40 లక్షలతో మరో వంతెన నిర్మాణాలకు నిధులు కోటాయించారు. రెడ్డిగూడెం ఉప్పలపాడు రోడ్డును రూ.2 కోట్లతో నిర్మిస్తున్నారు. సత్తెనపల్లి నుంచి వెళ్ళే బయ్యావరం రోడ్డును రూ.2 కోట్ల 60 లక్షలతో తారురోడ్డుగా మార్చేందుకు మంత్రి కన్నా కృషి చేశారు. ఆరు ఎత్తిపోతల పథకాలకు విద్యుత్ సరఫరా చేసేందుకు రూ.కోటి 11 లక్షల నిధులను కేటాయించారు. నియోజకవర్గంలోని ఇందిరమ్మ ఆదర్శ గ్రామాల్లో అర్హులైన ప్రతివారికి పక్కా గృహాలు, పెన్షన్‌ల మంజూరుకు మంత్రి కన్నా పూర్తి కృషి చేశారు. అసిస్ట్ స్వచ్ఛంద సంస్థ ద్వారా రూ.10 లక్షల విలువైన ఇనుమును నిరుపేదల గృహాల వారికి అందించారు. మహిళా సమాఖ్య ద్వారా అర్హులైన పొదుపు గ్రూపులకు కోట్లాది రూపాయల రుణాలను పావలా వడ్డీకే పంపిణీ చేశారు.



కోట్లాది రూపాయలతో అమరావతి మండలం మల్లాదిలో నిర్మించిన ఎత్తిపోతల పథకం

# దిగంతాలకు వ్యాపించిన పెదనందిపాడు పన్నుల నిరాకరణ ఉద్యమం



దివంగత పర్వతనేని వీరయ్యచౌదరి

(ఆన్‌లైన్-పెదనందిపాడు)

భారతదేశ స్వాతంత్ర్య పోరాటంలో బ్రిటీష్ పాలకులను గడగడలాడించిన ఉద్యమాల్లో ప్రధానమైనది పెదనందిపాడు పన్నుల నిరాకరణోద్యమం. భారతదేశ చరిత్ర పుటల్లోనే కాక లండన్‌లో సైతం సువర్ణాక్షరాలతో లిఖితమైన ఈ ఉద్యమ రథసారధి స్వర్గీయ పర్వతనేని వీరయ్యచౌదరి.అప్పట్లో జాతిపిత మహాత్మాగాంధీ పర్యవేక్షణలో వల్లభాయిపటేల్ నాయకత్వాన గుజరాత్‌లోని బార్డోలిలో, రాజేంద్రప్రసాద్ నాయకత్వంలో, బీహార్‌లోని చంపారణ్‌లో జరిగిన పన్నుల నిరాకరణ ఉద్యమాల కన్నా మిన్నగా ఒక మధ్యతరగతి రైతు కుటుంబీకుడు సామాన్య విద్యాభ్యాసంతో నడపడం భారతప్రజలు గర్వించ దగిన విష యం. మన్యం ప్రాంతంలో అల్లూరి సీతారామరాజు సాగించిన పోరాటం క్షాత్రా పూరితం కాగా పెదనందిపాడు ఫిర్కాలో పర్వతనేని వీరయ్యచౌదరి కొ నసాగించిన ఉద్యమం శాంతియుతం. శ్రీ వీరయ్యచౌదరి నాయకత్వంలో పెదనందిపాడు ప్రాంతంలోని వంద గ్రామాల్లోని ప్రజల నుంచి ధీరులైన కార్యదీక్ష తత్పరులైన యువకులను ఎంపిక చేసి వీరయ్యచౌదరి 1921లో ఆరు వేల మంది శాంతిసైనికులను సమీకరించారు. వీరితో ఆయన బ్రిటిష్ సైన్యాన్ని, పాలనా వ్యవస్థను స్తభింపజేశారు. అప్పట్లో ఆయన్ని 'ఆంధ్ర శివాజీ' అని పిలిచేవారని ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధుడు శ్రీ బెజవాడ గోపాలరెడ్డి చెప్పారు. శ్రీ వీరయ్య చౌదరి జిల్లా కేంద్రమైన గుంటూరుకు 18 మైళ్ళ దూరాన గల అప్పటి ఫిర్కా కేంద్రం ప్రస్తుత మండల కేంద్రమైన పెదనందిపాడులో స్వర్గీయ పర్వతనేని అంకమ్మ, లక్ష్మమ్మ దంపతులకు 1886 అక్టోబరు 4న జన్మించారు. చదువుతోనే చిన్నతనం నుంచి సంగీతం అభ్యసించి గానవిద్యలో సుప్రసిద్ధులయ్యారు. ఆ ప్రావీణ్యంతో హరికథలు చెబుతూ నాటకాలు వేస్తుండేవాడు. చిన్నతనం నుండి ప్రజాసేవ యెడల ఎక్కువ మక్కువ కలిగి సంఘసేవ,సాంఘిక కార్యక్రమాలలో ఎక్కువ పాల్గొంటూ తన మిత్ర బృందంతో కలసి పోస్టాఫీస్,గ్రామ పాఠశాల స్థాపనకు కృషి చేశారు. మహాత్మాగాంధీ సహాయ నిరాకరణోద్యమాన్ని పూరించి శాసనసభల ఎన్నికలు బహిష్కరించాలని ఆదేశించడంతో తన గాన విద్యా, నాటక సంఘాల ద్వారా ఎన్నికలను బహిష్కరించే విధంగా ప్రజలను ఆయన ప్రభావితం చేశారు.

1921 జనవరిలో జిల్లా కాంగ్రెస్ సంఘం శ్రీ వీరయ్యచౌదరిని పెదనందిపాడు ఫిర్కా ప్రచారకునిగా నియమించింది. 1936లో జాతిపిత మహాత్మాగాంధీ ప్రకాశం జిల్లా పర్చూరు వచ్చిన సందర్భంగా పర్వతనేని వీరయ్యచౌదరి సతీమణి బొల్లమ్మ తన బంగారు ఆభరణాలను అక్కడికక్కడే ఉద్యమం కోసం త్యాగం చేసి తమతోటి వారికి మార్గదర్శకురాలైనట్లు అప్పటి వారు చెప్పారు. 1921లో గాంధీ మహాత్ముడు శాసనోల్లంఘనాన్ని ప్రారంభించడానికి సంకల్పించారు. ఆ సమయంలో ప్రజా హృదయంలో రగులుతున్న స్వాతంత్ర్య సముపార్జన తృష్ట పన్నుల నిరాకరణోద్యమానికి పురి కొల్పాయి. గ్రామోద్యోగుల సహకారం లేనిదే పన్నులు వసూలు చేయడం ప్రభుత్వానికి సాధ్యపడదని గ్రహించిన వీరయ్యచౌదరి ఉద్యమం ఆశించిన విధంగా సఫలీకృతం కావడానికి గ్రా మోద్యోగుల సహాయ సహకారాలను కోరారు. ముమ్మరంగా కొనసాగుతున్న ఉద్యమాన్ని నీరుగార్చడానికి స్థానిక పరిస్థితులు తెలిసిన సహకార శాఖ సూపర్‌వైజర్ జంపాల వెంకటేశంను డిప్యూటీ కలెక్టర్‌గా ప్రమోషన్ ఇచ్చి పెదనందిపాడు పంపారు. ఆయ న పర్వతనేనికి మిత్రుడు. మిత్రుని ఉద్యమాన్ని అణచవలసిన బాధ్యత మరొక మిత్రుని భుజస్కందాల పై పెట్టి బ్రిటిష్ ప్రభుత్వం ఆనాడే తమ రాజనీతిని చాటుకున్నది. అయినప్పటికీ గ్రామాల ఉద్యమంలో మార్పు రాలేదు. మాజీ గ్రామోద్యోగుల వద్ద నుండి బ్రిటిష్ ప్రభుత్వం పుస్తకాలు స్వాధీనం చేసుకొని పన్నుల వసూలుకు కొత్తవారిని నియమించారు. ఈ విషయం తెలిసిన వెంటనే గ్రాముస్థులు తమ తమ ఇంటి నెంబర్లు,గుర్తులు చెరిపి వేయవలసిందిగా వీరయ్యచౌదరి ఆదేశించారు. దీంతో ఎవరి ఆస్తి ఏదో ఏ ఆస్తిని జప్తు చేయాలో అర్థం కాక బ్రిటిష్ ప్రభుత్వానికి అయోమయ పరిస్థితి ఏర్పడింది. శిస్తు దమ్మిడి కూడా వసూ లు కాలేదు.సైన్యం, ఉద్యమం పరిస్థితిని పరిశీలించేందుకు రూథర్‌పర్డ్ అను జిల్లా కలెక్టర్ పెదనందిపాడు వచ్చారు. అయితే ఎలాంటి గుర్తులు కానరానందున ఇది పెదనందిపాడు గ్రామమేనా అని కనిపించిన వారినల్లా అడిగి ఎలాంటి సమాచారం రాక విసిగి వేసారి పోయాడు. దీనితో భగ్గుమన్న రూథర్‌పర్డ్ పెదనందిపాడు ఉద్యమాన్ని అణచడానికి జప్తు ప్రారంభించాలని మద్రాసు ప్రభుత్వ చట్టసభలలో పట్టుపట్టి 'రికవీ' చట్టాన్ని అమలు పెట్టారు. 1934 జనవరి 24న డిప్యూటీ కలెక్టర్ వెంకటేశం ఉద్యమ సారధి మిత్రుడు అయిన వీరయ్యచౌదరితో సమావేశ మయ్యారు. మిత్రులు వారి వారి విధి నిర్వహణలో చెరొక పక్క వున్నా పట్టు విడవకుండా వ్యవహరించారు.

## ఉద్యమం ఆగిన తీరు

ఇంత ఉధృతంగా నిరాటంకంగా సాగిపోయిన ఉద్యమం కొందరు పెద్దల స్వార్థపరులతో ఆగిపోయింది. అప్పటి కాంగ్రెస్ పార్టీ పెద్దలు పూర్తిగా సహకరించనందున ఉద్యమానికి ఎదురు దెబ్బ తగిలిందని ఈ ప్రాంత ప్రజలు చెబుతారు. ఉద్యమ రోజుల్లో నడింపల్లి నరసింహారావు, గొల్లపూడి సీతారామశాస్త్రి వంటి పెద్దలు తప్ప కాంగ్రెస్ పార్టీకి చెందిన పెద్దలు సహకరించలేదని నేటికి ఈ ప్రాంతంలో విమర్శ వుంది. ఈ పరిస్థితులలో 1922 జనవరి 26న గుంటూరులోని కొండా వెంకటప్పయ్య ఇంట్లో ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సమావేశం జరిగింది.1922 ఫిబ్రవరి 11న ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ గుంటూరులో సమావేశమై కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ ఆదేశం దృష్ట్యా పెదనందిపాడు పన్నుల నిరాకరణ ఉద్యమాన్ని విరమించాలని తీర్మానించారు. దీనితో ఈ ప్రాంత ప్రజలు హతాశులయ్యారు. గ్రామోద్యుగులు తమ విధులకు హాజరయ్యారు. ప్రజలు పన్నులు యధావిధిగా చెల్లించారు. ఆంధ్రా శివాజీని బ్రిటిష్ పాలకులు అరెస్ట్ చేసి గుంటూరు తరలించారు. అనంతరం వీరయ్యచౌదరి ఉద్యమాల జోలికి పోకుండా గాన సభలతో, సంగీత కచేరిలతో ప్రజలను ఉత్తేజ పరుస్తూ కాలం గడుపుతూ 1970 ఫిబ్రవరి 6న పరమ పదించారు.

# పవిత్ర దేవాలయాల పురి 'సింహపురి'

(112వ పేజీ తరువాయి)

లోని రెడ్డిపాలెంకు చెందిన కోట జగన్నాధమనే సామాన్య భక్తుడు ప్రజలు, దాతల నుండి విరాళాలను సేకరించి జమిందారులు, మహారాజులకు దీటుగా సహస్రలింగేశ్వరస్వామి దేవాలయ సముదాయాన్ని నిర్మింపజేయడం విశేషం. దేవాలయ ప్రాంగణంలో ప్రతిష్ఠించబడిన భారీ ఆంజనేయస్వామి, గరుత్మంత స్వామి వార్ల విగ్రహాలను చెక్కిన శిల్పి 15 సంవత్సరాల నూనూగు మీసాల బాలుడంటే ఆశ్చర్యం కలగక పోదు. ఆలయ ప్రాంగణంలోని 1008 శివలింగాలను 1961లో 1008 దంపతులతో ప్రతిష్ఠింపజేశారు. ఇక్కడి ఆలయంలో శివలింగాకృతులతో పాటు పాలరాతి బాల శంకరుని విగ్రహం ప్రత్యేకతను సంతరించుకొంది. సాధారణంగా శివాలయాల్లో శివలింగాకృతులు మాత్రమే వుండటం సహజం కాగా ఇక్కడ సుమనోహరమైన రూపంలో పాలరాతి బాల శంకరుని మూలవిరాట్ భక్తుల పూజలను అందుకొంటుంది. మూలవిరాట్ ముందున్న శివలింగానికి మహా శివరాత్రి పర్వదినం నుంచి మొదలుకొని మరుసటి సంవత్సరం శివరాత్రి వరకు అర్చక స్వాములు నిత్యం గంధాభిషేకం చేస్తారు. ఆ గంధపు పూతను మహాశివరాత్రి పర్వదినాన వలిచి భక్తులకు ప్రసాదంగా పంపిణీ చేస్తారు. ఆలయ ప్రాంగణంలోనే కాలభైరవ స్వామి ఆలయం వుండటం చేత పొన్నూరుకు దక్షిణ కాశీ అన్న పేరుకూడా వచ్చింది. ఈ కారణంగా పొన్నూరు శ్మశాన వాటికలో మృతులకు దహన క్రియలు నిర్వహించే సమయాల్లో కపాలం పగలకుండా కరిగిపోవడం ద్వారా మోక్షం ప్రాప్తిస్తుందని పెద్దలు చెబుతారు. నిత్యం వెలుగుతుండే అఖండ జ్యోతులు ఈ ఆలయానికి మరో విశిష్టత.



భారీ ఆంజనేయస్వామి విగ్రహం

# అభివృద్ధి పథంలో రెంటచింతల

## ★ గ్రామాభివృద్ధి లక్ష్యంగా చేస్తున్న సర్పంచి శౌరెడ్డి

(ఆన్‌లైన్, రెంటచింతల)

ఎప్పటికైనా రెంటచింతల మేజరు పంచాయతీ సర్పంచ్‌గా ఎన్నికై గ్రామాన్ని అభివృద్ధి చేసి గ్రామస్తుల ఆదరాభిమానాన్ని పొందాలన్నదే ఆయన చిరకాల వాంఛ. అందుకనుగుణంగా 2006 జూన్‌లో జరిగిన పంచాయతీ ఎన్నికలలో భారీ మెజార్టీతో గెలుపొంది సర్పంచిగా ఎన్నికై తన కోరికను నెరవేర్చుకున్నారు. ఆయనే కాంగ్రెస్ నేత సర్పంచి కటకం మరియశౌరెడ్డి. పదవీ బాధ్యతలు చేపట్టిన నాటి నుంచి గ్రామాభివృద్ధికి అహర్నిశలు శ్రమిస్తున్నారు. వివిధ రంగాలలో విశిష్టత సంతరించుకున్న రెంటచింతల రాష్ట్ర వ్యాప్తంగా గుర్తింపు పొందిన గ్రామం. ముఖ్యంగా అత్యధిక ఉష్ణోగ్రత నమోదయ్యే ప్రాంతాలలో రాష్ట్రంలో రెంటచింతలది రెండవ స్థానం. అంతేగాకుండా వ్యవసాయ, విద్యారంగాలలో ప్రసిద్ధి చెందడమేగాకుండా నాపరాయి గనులకు అత్యంత ప్రసిద్ధి చెందింది. 16 వేల జనాభా కలిగి వున్న రెంటచింతల సుమారు 4 కిలోమీటర్ల విస్తీర్ణంలో విస్తరించి 18 వార్డులలో 10,381 మంది ఓటర్లు వున్నారు. పూర్తిగా గ్రామీణ వాతావరణంలో వుండి గ్రామం చుట్టూ వాణిజ్య పంటలైన పత్తి, మిర్చి, వరి పంటల పచ్చదనంతో ఆహ్లాదకరంగా వుంటుంది. ఆధ్యాత్మికంగా ప్రసిద్ధి చెందిన రెంటచింతలలో వందేళ్ళకు పైగా చరిత్ర వున్న ఏసుక్రీస్తు దేవాలయాలు వున్నాయి.



రెంటచింతల పంచాయతీ కార్యాలయం



కటకం మరియ శౌరెడ్డి, రెంటచింతల సర్పంచ్

### గ్రామాభివృద్దే లక్ష్యంగా పనిచేస్తున్న సర్పంచ్

సర్పంచిగా ఎన్నికైన తాను గ్రామాభివృద్ధే లక్ష్యంగా పనిచేస్తున్నానని సర్పంచి కటకం శౌరెడ్డి అన్నారు. 2006 గ్రామంలో తాగునీటి సమస్య ప్రధానంగా వుండి గ్రామంలోని పలు వార్డులకు తాగునీరు అందక పోవడంతో గ్రామస్తులు తీవ్ర ఇబ్బందులు పడుతుండే వారని తెలిపారు. తాగునీటి సమస్యను పరిష్కరించి గ్రామంలోని అన్ని ప్రాంతాలకు తాగునీటిని అందిస్తానని ప్రధాన వాగ్దానంగా ఎన్నికలలో సర్పంచిగా పోటీ చేశానని తెలిపారు. తనపై గ్రామస్తులు ఎంతో నమ్మకంతో భారీ మెజార్టీతో గెలిపించారని, చేసిన వాగ్దానం మేరకు సర్పంచ్ శౌరెడ్డి తాగునీటి సమస్య పై ప్రధానంగా దృష్టిసారించి ఆ సమస్యను పరిష్కరించగలిగారు. ఆ మేరకు సుమారు రూ.8 లక్షలతో ఆరోగ్యపురం, రైలుపేట, సుబ్బన్నతోట ప్రాంతాలల తాగునీటి పైపులైన్లు 8 మోటార్లతో వేయించారు. స్థానిక బ్రహ్మయ్య బావి సెంటరులో రూ.3 లక్షలతో సిసి రోడ్లు నిర్మాణం చేపట్టారు.

గ్రామంలో 126 వీధి లైట్లను కొత్తగా వేయించారు. అంతేగాకుండ గురజాల ఎమ్మెల్యే జంగా కృష్ణమూర్తి సహకారంతో గ్రామానికి అవసరమైన రెండవ రక్షిత మంచినీటి పథకాన్ని రూ.22 లక్షలతో 1.50 లక్షల లీటర్ల సామర్థ్యం గల ఓవర్‌హెడ్‌ను నిర్మించనున్నాయి. ఈ పథకానికి రెంటచింతలకు చెందిన విద్యావంతుడు, వ్యాపారవేత్త పల్లెర్ల రాంబాబు రూ.2 లక్షల వరకు విరాళాన్ని ఇచ్చి తన ఔదార్యాన్ని చాటుకున్నారు. ప్రస్తుతం గ్రామంలో 600 వరకు మంచినీటి కుళాయి కనెక్షన్లు వున్నాయి. అంతేగాకుండ గ్రామంలో పారిశుధ్యాన్ని ఎప్పటికప్పుడు మెరుగుపర్చేందుకు ఓ ట్రాక్టర్‌ను కొనుగోలు చేశారు. పారిశుధ్యం పని వాళ్ళకు నెల నెలా సక్రమంగా జీతాలు ఇవ్వడం మరో విశేషం. ఆంజనేయస్వామి మాన్యంలో స్కూలుకు నూతన గదుల నిర్మాణం చేపట్టడం జరిగింది.

అంతేగాకుండా గ్రామంలో ఎమ్మెల్యే ద్వారా 110 మంది రైతులకు పవర్ స్ప్రేయర్లు పంపిణీ చేశారు. రానున్న నాలుగు ఏళ్ళలో గ్రామంలో మరికొన్ని సిసి రోడ్లు నిర్మాణం చేపట్టి గ్రామాభివృద్ధికి కృషి చేస్తానని సర్పంచి కటకం శౌరెడ్డి 'ఆన్‌లైన్' ఇంటర్వ్యూలో తెలిపారు.

# ఆధునిక హంగులతో సిడి లైబ్రరీ

(112వ పేజీ తరువాయి)

పిరియాడికల్స్ క్రమబద్ధీకరించిన పాత ప్రతులు, ప్రభుత్వ నివేదికలను అమర్చారు. వర్సిటీ విసి చైర్మన్‌గా, లైబ్రరీ కన్వీనర్‌గా ఏర్పాటైన సలహా సంఘం వివిధ విభాగాలకు చెందిన పుస్తకాల కేటాయింపులను, పుస్తకాల సేకరణ, విద్యార్థుల అవసరాలను తీర్చడానికి ఆధునిక పద్ధతులను అవలంభించడానికి చర్యలను తీసుకుంటుంది.

యుజిసి 10వ ప్రణాళికలో గ్రంధాలయానికి రూ. 29,50,000లను కేటాయించారు. అత్యాధునిక హంగులతో సిడి గ్రంధాలయాన్ని ఏర్పాటు చేయడానికి 4,58,000 రూపాయలు కేటాయించి ప్రారంభించారు. దీనిలో భాగంగా ఒక క్రమ పద్దతిలో పుస్తకాల అన్నింటిని డిజిటలైజేషన్ చేయనున్నారు. దీనితో విద్యార్థులు వందలు ఖర్చుచేసి జిరాక్స్‌లు తీసుకోవలసిన అవసరం లేకుండా సిడిల రూపలో తమకు అవసరమైన పుస్తకాన్ని కాపీ చేసుకునే అవకాశం కల్పిస్తుంది.

గ్రంధాలయంలో ఐదు రూపాయలకే ఇంటర్నెట్ సౌకర్యం అందజేస్తున్నారు. న్యూ జెన్‌లిప్ వంటి అత్యాధునిక సౌకర్యాలతో కూడిన సాఫ్ట్‌వేర్‌ను రూ. 4,25,000లతో కొనుగోలు చేయడం ద్వారా గ్రంధాలయాన్ని విద్యార్థులకు మరింత చేరువ చేశారు. ఇంటర్నెట్ ద్వారా 4,500 దేశీయ, విదేశీయ జర్నల్స్‌ను విద్యార్థులకు అందజేస్తున్నారు.

ప్రైవేటురంగంలో పలు డెయిరీలు

# పల్నాట పాల వెల్లువ

(ఆన్‌లైన్, రెంటచింతల)

'పాడి' తరువాతనే పంటలు. నేడు పాడి పంటలతో పల్నాడు ప్రాంతం అలరారుతుందనే చెప్పవచ్చు. గత మూడేళ్ళుగా అనుకూలిస్తున్న వాతావరణ పరిస్థితులు ఆశా జనకంగా సకాలంలో కురుస్తున్న వర్షాలతో రైతుల పరిస్థితి గణనీయంగానే మెరుగుపడింది. పాడి పరిశ్రమలో విప్లవాత్మకమైన మార్పులు చోటు చేసుకుంటున్నాయి. దశాబ్ధ కాలం క్రితం వరకు గుంటూరు జిల్లాలో సంగం డెయిరీ లక్షలాది లీటర్లు పాలు సేకరిస్తూ దక్షిణ భారత దేశంలోనే అగ్ర గామి సంస్థగా వుంది. రాను రాను క్షీర విప్లవంలో భాగంగా ప్రైవేటు సెక్టారులో ప లు డెయిరీలు ఆవిర్భవించాయి. ప్రైవేటు డెయిరీలు రాకతో సంగం డెయిరికి పాల సేకరణ తగ్గిపోయిందనే చెప్పుకోవాలి.

పల్నాటి ప్రాంతంలో హెరిటేజ్ ఇం డియా లిమిటెడ్, పల్నాడు, మస్కటో, పన్నీరు, మా డెయిరీ తదితర డెయిరీలు వెలిశాయి. ప్రైవేటు డెయిరీల ఆవిర్భావంతో పల్నాట ప్రాంతంలో పాల ఉత్పత్తి అధికమయింది. ప్రైవేటు డెయిరీలు తమ పాల సేకరణను పెంచుకునేందుకుగాను సంగం డెయిరీ రైతులకు చెల్లిస్తున్న ధరల కన్నా లీటరుకు రెండు రూపాయలు అధికంగా చెల్లిస్తూ పాల ఉత్పత్తిదారులను ఆకర్షించే ప్రయత్నాలు ముమ్మరంగా చేపట్టాయి. గతంలో ఎన్నడు లేని విధంగా సంగం డెయిరీ జిల్లాలోని తమ పాల ఉత్పత్తిదారులకు 2007, జూలై నెల నుండి అధిక ధరలను చెల్లించడం విశేషం. పది శాతం వెన్న గల పాలకు ఒక లీటరుకు రూ. 23.50లు, 12 శాతం వెన్న గల పాలకు అత్యధికంగా రూ.28.43లు చెల్లిస్తున్నది. అయితే కొన్ని ప్రైవేటు డెయిరీలు సంగం డెయిరీ కన్నా ధీటుగా రెండు రూపాయలను అదనంగా చెల్లిస్తున్నట్లు తెలుస్తున్నది. దీంతో ప్రైవేటు డెయిరీలు పాల ఉత్పత్తి సీజనులో పది వేల లీటర్లు సేకరించగలుగుతున్నాయి. సేకరణ సా మర్థ్యాన్ని పెంచుకొనేందుకుగాను తమ పరిధిలోని పాల కేంద్రాలకు లక్షలాది రూపాయలు పెట్టుబడులను పెడుతూ ప్రోత్సహిస్తున్నారు. ఇందుకుగాను పాల ఉత్పత్తిదారులకు ముందుగానే పాడిగేదెలు కొనుగోలుకు వేలాది రూపాయలు అడ్వాన్సు రూపంలో ఇస్తూ రైతులను తమ వైపు తిప్పుకుంటూ సేకరణ సామర్థ్యాన్ని గణనీయంగా పెంచుకుంటున్నాయి. ప్రైవేటు డెయిరీలు అనుసరిస్తున్న ఈ విధానం కారణంగా కొన్ని గ్రామాలలో సంగం డెయిరి అనుబంధ సంఘాల ఉనికి ప్రమాదకరంగా పరిణమిస్తున్నది.



గురజాలలోని సంగం డెయిరీ పాల శీతలీకరణ కేంద్రం

### రుణాలు ఇచ్చి ఆదుకోవాలి

ప్రైవేటు డెయిరీల కారణంగా తగ్గిపోతున్న పాల సేకరణను గణనీయంగా పెంచుకునేందుకు సంగం డెయిరీ అందుకు ఓ కార్యాచరణ ప్రణాళికను రూపొందించాల్సిన అవసరం ఎంతైనా వుంది. ఇందుకు సంగం డెయిరి తమ అనుబంధ పాల సొసైటీలకు బ్యాంకుల ద్వారా ఉత్పత్తిదారులకు రుణాలు ఇప్పించే విధంగా కృషి చేయాలి. ఇప్పటికే సంగం డెయిరి గురజాల పాల శీతలీకరణ కేంద్రం పరిధిలోని కొన్ని పాలకేంద్రాలకు పాడి గేదెలకు రుణాలు ఇప్పించడం జరిగింది. అయితే కొన్ని కేంద్రాలకే పరిమితం కాకుండ అన్ని సొసైటీలకు రుణ సౌకర్యాలను విస్తరింపజేసినట్లయితే రైతులకు జీవనోపాధి కల్పించడమే గాకుండా పాల సేకరణను గణనీయంగా పెంచుకునే అవకాశం వుంది.

### 'పశుక్రాంతి'తో
### పెరగనున్న పాల ఉత్పత్తి

పాడి పరిశ్రమ ద్వారా పేదలకు జీవనోపాధిని కల్పించి తద్వారా పాల ఉత్పత్తిని పెంచాలన్న ఉద్దేశంతో రాష్ట్ర ప్రభుత్వం ఇటీవల 'పశుక్రాంతి' అనే పథకాన్ని ప్రవేశపెట్టింది. ఈ పథకం ద్వారా బడుగు, బలహీన వర్గాల ప్రజలకు సబ్సిడీతో పాడి గేదెలను కొనుగోలు చేసి అందజేస్తారు. పేదరిక నిర్మూలన ఉద్దేశంతో ప్రభుత్వం ఈ బృహత్తర పథకాన్ని చేపట్టింది. ఇందుకోసం మండల పరిధిలోని గ్రామాల్లో ఇప్పటికే లబ్ధిదారుల ఎంపిక కార్యక్రమాన్ని పూర్తి చేసింది. పథకం పూర్తిస్థాయిలో విజయవంతం అయితే డెయిరీలకు పాల సేకరణ పెరుగుతుందనడంలో సందేహం లేదు.

# ఆటు పోటులతో ఆక్వా రైతుల ఇక్కట్లు



విస్తారంగా రొయ్యలు

(ఆన్‌లైన్-కర్లపాలెం)

లక్షలాది రూపాయల విదేశీ మారక ద్రవ్యాన్నినా ర్జించి పెట్టే ఆక్వా పరిశ్రమ ప్రస్తుతం ఆటుపోటుల నడుమ అల్లాడుతున్నది. నాడు సిరులు కురిపించిన రొయ్యలసాగు నేడు గిట్టుబాటు ధరలేక రైతాంగం నానా ఇక్కట్లు నెదు ర్కొంటున్నారు. వాతావరణంలో వచ్చిన మార్పులు ఒక కారణమైతే, దళారుల చేతివాటం మరో కారణంగా చెప్పొ చ్చు. బాపట్ల నియోజకవర్గంలోని కర్లపాలెం, పిట్టలవాని పాలెం, బాపట్ల మండలాల్లోని సముద్ర తీర ప్రాంతగ్రామా లైన గాడిదిబ్బ, పేరలి, తుమ్మలపల్లి, గణపవరం, పెదపులు గువారిపాలెం, నర్రావారిపాలెం, బుద్దాం, కర్లపాలెం, సూర్య లంక, కప్పలవారిపాలెం, ముత్తాయపాలెం, పిన్నిబోయిన వారిపాలెం తదితర గ్రామాల్లో వేలాది ఎకరాల్లో రొయ్యల సాగు చేస్తున్నారు. అందులో కౌలురైతులే అధికంగా వున్నారు. 1990వ సంవత్సరంలో ఇక్కడ తీర ప్రాంత గ్రామాల్లో నీలి విప్లవం ఊపందుకొంది. అప్పట్లో ప్రతి ఎకరం చెరువు నుండి లక్షల రూపాయల లాభాలు వచ్చేవి. దీంతో సుదూర ప్రాంతాల నుంచి (ఇతర రాష్ట్రాల నుండి) అనేక మంది ఇక్కడకు వచ్చి పెట్టుబడి పెట్టి రొయ్యల వ్యాపారం చేశారు. ఈ వ్యాపారంలో లక్షాధికారులైన వారు ఉన్నారు. ఆస్తులు పోగొట్టుకొని రోడ్డున పడ్డవారు ఉన్నారు. మొదట్లో రొయ్యల సైజును బట్టి మంచి రేటు ఉండేది. కిలో 30 రొయ్యల కౌంటు ధర 360 రూపాయలుండేది. ప్రస్తుతం అది 200రూపాయలకు పడిపోయింది. ఈ విధంగా ధరల్లో వచ్చిన మార్పుల కారణంగా రైతులు నష్టాలు చవిచూస్తున్నారు. రొయ్యల ఎగుమతిదారులు సృష్టిస్తున్న ధరల మాయజాలంతో ఆక్వా రైతులు అల్లాడు తున్నారు. పంట మొదలు పెట్టే సమయంలో ధరలు ఆశాజ నకంగా చూపించి పంట చేతికందే తరుణంలో గణనీ యంగా తగ్గిస్తున్నారు. ఇక కౌలు రైతుల పరిస్థితి అయితే కడు దయనీయం. ముందుగా కౌలు చెల్లించి లక్షలాది రూపాయలు పెట్టుబడి పెట్టి పంట పండించి వ్యాపారుల వద్దకు వెళితే ధరలు లేవని వైరస్ సోకిదంటూ దోచుకుంటు న్నారు. దీంతో కొంతమంది రైతులు చెరువులను పూడ్చి వరి పొలాలుగా తయారు చేసుకొంటున్నారు.గిట్టుబాటు ధర లేక పోవడం,పెట్టుబడి గణనీయంగా పెరగడం, ప్రతికూల వాతావరణ పరిస్థితులు తదితర కారణాల వల్లనే ఆక్వా రంగం దెబ్బతిందని అనుభవజ్ఞులైన రైతులు తెలియజేస్తు న్నారు. ఈ విధంగా బాపట్ల నియోజకవర్గంలోని ఆక్వా రైతులు ఆటు పోటులతో అల్లాడుతున్నారు. కావున ప్రభు త్వం తమను ఆదరించి ఇన్సూరెన్స్ కల్పించాలని,అలాగే గిట్టుబాటు ధరలు కల్పించడంతో పాటు బ్యాంకు రుణాలు అందించి ఆదుకోవాలని ఆక్వా రైతులు కోరుతున్నారు.



రొయ్యలను గ్రేడింగ్ చేస్తున్న మహిళలు

# బుడగ జంగాల పాలిట వరం జెసిఎస్ సంస్థ

(ఆన్‌లైన్ పెదకూరపాడు)

కష్టాలలో ఉన్న వారిని ఆదుకున్నప్పుడే సేవకు అర్థం, పరమార్థం కలుగుతుంది. ఈ కోవకు చెందినదే పెదకూరపాడుకు చెందిన జనచైతన్య సమితి (జెసిఎస్). 1992లో స్థాపించిన ఈ సంస్థ మండలంలోని పలు గ్రామాల్లో ప్రజలను చైతన్యవంతులను చేసింది. మండలంలోని 75 తాళ్ళూరులో సుమారు వంద కుటుంబాలకు చెందిన బుడిగి జంగాల (సోది చెప్పుకునేవారు) వారు 50 సంవత్సరాల క్రితం వరంగల్ జిల్లా నుంచి వలస వచ్చి గ్రామంలోని చింతలతోపులో డేరాలు వేసుకొని జీవించేవారు. వీరి తాత ముత్తాతల కాలం నుంచి కుల వృత్తి అయిన సోది చెప్పుకోవడం, చిలకజోస్యం, భిక్షాటన వీరికి జీవనాధారం. వీరు నివశించే ప్రాంతాల్లో కనీస సౌకర్యాలు లేకపోవడంతో పాటు నిరక్షరాస్యత, కుటుబ నియంత్రణపై అవగాహన లోపం కారణంగా అధిక సంతానంతో వీరు బాధలు అనుభవిస్తున్నారు. కనీసం కడుపు నిండా తిండి, ఒంటి నిండా బట్టలు కట్టుకోలేని స్థితిలో అవస్థలు పడేవారు. స్థిరత్వం లేకుండా సంచార జీవనాన్ని సాగించేవారి మధ్య జనచైతన్య సమితి అధ్యయనం చేసి గుంటూరు కార్మిక విద్యాపీఠ్ సహకారంతో దశాబ్దకాలం క్రితం పాఠశాలను స్థాపించి ఉచితంగా విద్యనందించి వారి అభ్యున్నతికి తోడ్పాటందించింది. సేవా సంస్థల సహకారంతో నాలుగు ఎకరాల భూమిని కొనుగోలు చేసి ఎమ్మార్వో ద్వారా 83 కుటుంబాల వారికి నివేశన స్థల పట్టాలు ఇప్పించి బుడిగి జంగాల నివాసానికి ఉపయోగించే డేరాలకు బదులు తొలుత పూరిల్లు ఏర్పాటు చేశారు. బుడిగి జంగాల కాలనీకి శాంతికాలనీగా నామకరణం చేశారు. వీరి జీవనశైలిలో పొడవాటి జుట్టును ముడివేసుకొని నిలువెత్తు బొట్టుపెట్టుకొని గంభీరంగా సోది చెప్పుకుని జీవించడంతో పాటు మహిళలు సోదితో పాటు ఈతాకు చాపలు అల్లి వాటిని అమ్మటం ద్వారా కుటుంబ పోషణలో భాగస్వామ్యులయ్యేవారు. వచ్చే కొద్దిపాటి సంపాదనలో పురుషులు ఎక్కువ శాతం దుర్వ్యసనాలకు బానిసలయ్యారు. వీరి బతుకులు దుర్భరంగా మారిపోవటాన్ని గుర్తించిన జెసిఎస్ సంస్థ నిర్వాహకులు బుడిగి జంగాల అభివృద్ధే ధ్యేయంగా వారిని చైతన్యవంతులను చేశారు. 83 గృహాలు ప్రభుత్వపరంగా మంజూరుకు కృషిచేసి కార్మిక విద్యాపీఠ్ సహకారంతో పక్కా గృహాలను నిర్మించారు. కాలనీలోనే పాఠశాలను నిర్మించి ముగ్గురు ఉపాధ్యాయులను ఏర్పాటు చేసి అవసరమైన పుస్తకాలను, దుస్తులను, బ్యాగులను అందించి వారి అభివృద్ధికి తోడ్పాటునందించారు. ఇక్కడి మహిళలను ఏకతాటిపై నడిపించేందుకు ఆరు పొదుపు గ్రూపులను ఏర్పాటు చేసి పొదుపు చేసుకొనేలా ప్రోత్సహించారు. ప్రభుత్వ, ప్రజాప్రతినిధుల సహకారంతో బ్యాంక్ లింకేజి రుణాలను కూడా వీరు పొందారు. బుడిగి జంగాల కాలనీ నుండి 80 మంది విద్యార్థులు విద్యనభ్యసిస్తున్నారు. విద్యే తెలియని ఈ కాలనీలో కాలేజి స్థాయిలో కూడా విద్యనభ్యసిస్తూ బుడిగి జంగాలకే ఆ కాలనీ విద్యార్థి గంధం సైదులు ఆదర్శప్రాయుడయ్యాడు. కులవృత్తి అయిన సోది, చిలకజోస్యంను వదులుకొని అధికశాతం కుటుంబాలు వ్యవసాయ కూలీలుగా కూడా జీవిస్తున్నారు. మరి కొంతమంది చిన్న చిన్న వ్యాపారాలు (బూరలు, కళ్లజోళ్లు, హెల్మెట్‌ల అమ్మకం) చేస్తూ పలువురికి ఆదర్శంగా నిలిచారు. సమాజంలో చీత్కారాలకు గురైన మమ్మల్ని మా జీవనశైలిలో మార్పు రావడం వలన మనుష్యులుగా గౌరవిస్తున్నారని బుడిగి జంగాల కుల పెద్ద కిన్నెర అచ్చయ్య సంతోషం వ్యక్తం చేశారు. చింతలతోపులో జీవనం గడుపుతున్న మాకు అన్నివిధాల సహాయ సహకారాలందించిన సేవా సంస్థల నిర్వాహకులకు, ప్రజాప్రతినిధులకు, ప్రభుత్వాధికారులకు ఆయన కృతజ్ఞతలు తెలిపారు. మా కులాన్ని గుర్తించి మాకు కూడా పంచాయితీ మెంబర్ పదవిని ఏకగ్రీవంగా గ్రామ నాయకులు ఇచ్చారని వార్డు మెంబర్ గంధం భిక్షాలు తెలిపారు. డేరాలలో ఎండకు ఎండుతూ, వానకు తడుస్తూ ప్రాణాలు కోల్పోయిన సందర్భాలు కూడా ఉన్నాయని, ప్రస్తుతం మాలో చాలా మార్పు వచ్చిందని ఆనందం వ్యక్తం చేశారు. ఆడవారిలో మార్పు తీసుకొచ్చి మాచే పొదుపులు కట్టించి అభివృద్ధి దిశగా ముందుకు తీసుకెళ్తున్న సంస్థల నిర్వాహకులు అభినందనీయులని పొదుపు గ్రూప్ లీడర్ ఊర ఏసమ్మ ఆనందం వ్యక్తం చేశారు. సమాజానికి దూరంగా దుర్భర జీవితాన్ని గడుపుతున్న బుడిగి జంగాల పాలిట వరం జనచైతన్య సమితి వారి సేవలు ప్రశంసనీయం.


జెసిఎస్ ఆద్వర్యంలో బుడగ జంగాలకు నిర్మించిన శాంతి కాలనీ


బుడగ జంగాల కుల పెద్ద కిన్నెర అచ్చయ్య

## ప్రభుత్వ నిర్లక్ష్యానికి నిలువుటద్దం

# వీరపుత్రుల పురిటిగడ్డ బావోజీపాలెం

('ఆన్‌లైన్' - నిజాంపట్నం)

బ్రిటీష్‌పాలకుల హయాంలో ఏర్పడిన బావోజిపాలెంలో అత్యధిక శాతం వున్న మిలటరీ కుటుంబాలకు, ప్రజలకు కనీస సౌకర్యాల కల్పనలో ప్రభుత్వ నిర్లక్ష్యానికి నిలువుటద్దం పడుతుంది. నూనూగు మీసాల ప్రాయంలోనే సైన్యంలో ఎలా చేరాలని యువకులు తాపత్రయ పడుతుంటారు. సైన్యంలో ఒక వ్యక్తి చనిపోతే దుఃఖానికి బదులు వీర గర్వంతో గ్రామం ఒకటై సాగనంపుతారు. అన్నివర్ణాలు ఆ గ్రామంలో వున్నప్పటికీ ముస్లిం సోదరులే ఎక్కువగా సైన్యంలో చేరతారు. దేశరక్షణే మాలక్ష్యం, దేశ శ్రేయస్సే మా ధ్యేయమని గ్రామంలోని వ్యక్తులు ముక్తకంఠంతో పలుకుతారు.

నేటికీ గ్రామంలో స్వాతంత్ర్యంనాటి జ్ఞాపకాలను నెమరువేసుకుంటూ రెండవ ప్రపంచయుద్ధ ఘట్టాలను చర్చించుకోవడం మాజీ సైనికుల దినచర్య. 2055మంది జనాభా వున్న గుంటూరు జిల్లా నిజాంపట్నం మండలంలోని బావోజిపాలెంలో నేటికీ తాగునీటి సమస్యతో రోజూ ఇబ్బందులు తప్పడంలేదు. 1982వ సంవత్సరం 15 వేల లీటర్ల సామర్థ్యం కలిగిన వాటర్‌ట్యాంక్ నిర్మాణం కేంద్ర ప్రభుత్వం నిధులతో ఆర్మీ బృందం నిర్మించారు. అదే ట్యాంక్ నుంచి పంచాయతీలోని ఇతర గ్రామాలకు నీరు ఇవ్వడంవల్ల గ్రామంలో తాగునీటి సమస్య అధికంగా వుంది.

* గ్రామంలోని 300 కుటుంబాలలోనివారు దేశరక్షణలో వున్నారు.
* సైనికులులేని ఇల్లు గ్రామంలో లేదు. ఒకే ఇంట్లో ఇద్దరు ముగ్గురు సైనికులు.
* రెండవ ప్రపంచయుద్ధంలో పాల్గొన్న వారు 50పైచిలుకు.
* దేశరక్షణలో 60మంది వీరజవాన్లు అశువులు బాసారు.
* 1981లో ఆ గ్రామాన్ని రక్షణ శాఖ దత్తత తీసుకుంది.

### అంతర్గత రోడ్లు నిర్మించాలి

**అబ్దుల్ హమీద్**



అంతర్గత రోడ్లు లేక ప్రధాన రహదారి నుంచి వీధులలోకి వెళ్ళేందుకు వర్షాకాలంలో ఇబ్బందులు ఎదుర్కొంటున్నామని మాజీ సైనికుడు అబ్దుల్ హమీద్ అన్నారు. పేరుకుమాత్రం దత్తత గ్రామం, వసతుల కల్పనలో మాత్రం అన్ని గ్రామాలలో వెనుకబడి వున్నామన్నారు. 23 ఏళ్ళ పాటు సైన్యంలో వున్న కుటుంబాలకు ప్రభుత్వ సాయం అంతతమాత్రంగానే వుందనన్నారు.

### నేటికీ అందని ప్రభుత్వ భూములు

**అహ్మద్ ఇస్మాయిల్**



మాజీ సైనికులకు ప్రభుత్వం ప్రకటించిన అయిదు ఎకరాల భూమి ఇంతవరకు అందలేదని మాజీ సైనికుడు అహ్మద్ ఇస్మాయిల్ అన్నారు. మండలంలో వేలకు వేల ఎకరాల అసైన్డ్ భూమి వున్నప్పటికీ ప్రభుత్వం సైనికులకు ఇచ్చేందుకు శ్రద్ధచూపడంలేదన్నారు. విధి నిర్వహణలో ప్రాణాలు కోల్పోయినవారి కుటుంబసభ్యులకు ప్రభుత్వం అయిదు ఎకరాల భూమిని ఇవ్వాలని తద్వారా కుటుంబపోషణ జరుగుతుందన్నారు.

### ఆర్మీలో యువకులకు ప్రత్యేక అవకాశాలు కల్పించాలి

**అబ్దుల్ సుభాని**



బావోజిపాలెంలో సైనిక కుటుంబాలవారిని ప్రత్యేక కేటగిరిగా భావించి, సైన్యంలోకి చేర్చుకోవాలని మాజీ సైనికుడు అబ్దుల్ సుభాని అన్నారు. రెండవ ప్రపంచ యుద్ధంలో పాల్గొన్న సుభాని జపాన్ యుద్ధంలో ప్రత్యేకంగా ప్రభుత్వం సత్కరించినట్లు తెలిపాడు. గ్రామంలోని యువకులకు ఆర్మీలో ప్రత్యేక అవకాశం కల్పించాలని కోరుతున్నాడు.

### అన్న చనిపోయినా అవకాశాలు లేవు

**షేక్ మహ్మద్ ఖమరుల్లా**



అన్న మహ్మద్ రఫిక్ జమ్మూకాశ్మీర్‌లోని సరిహద్దులో పహారా కాస్తుండగా మృతిచెందాడు. ప్రభుత్వం ఉద్యోగం ఇస్తానని హామీ ఇచ్చినా ఇంతవరకు ప్రభుత్వం నుంచి ఎలాంటి ఏర్పాటు చేయలేదన్నారు. పెళ్ళైయిన ఆరు నెలలకే చనిపోవడంతో కుటుంబానికి అన్నివిధాల ఇబ్బందులు ఎదురయ్యాయని తెలిపాడు. చెట్టంత కొడుకు మృతిచెందడంతో తల్లి అనారోగ్యానికి గురైందని తమ్ముడు షేక్ మహ్మద్ ఖమరుల్లా తెలిపాడు.



యుద్ధంలో చనిపోయిన మహ్మద్ రఫిక్ తల్లిదండ్రులు

## భవిష్యత్తుని గురించి ఆలోచించేవారు

# 'భాష్యం'ను ఎలా కాదనగలరు ?




చిన్నారులకు మోడ్రన్ డ్యాన్స్‌లో శిక్షణ



గోరంట్లలో న్యూ క్యాంపస్‌ను ప్రారంభిస్తున్న అప్పటి జిల్లా కలెక్టర్ జయలక్ష్మి



భాష్యం బియిడి కళాశాలకు శంకుస్థాపన



ఇంటిలెక్ట్ మ్యాగ్జైన్ విడుదల చేస్తున్న ఎమ్మెల్సీ లక్ష్మణరావు, భాష్యం రామకృష్ణ

ఆంధ్రప్రదేశ్ స్కూల్ విద్యలో అనన్యసామాన్యమైన విజయాలకు అసలుసిసలు చిరునామాగా 'భాష్యం' ఘనకీర్తి చెక్కుచెదరనిది. అత్యుత్తమ ప్రతిభకు సాటిలేని సక్సెస్‌ను సిద్ధింపజేయడమే కాదు, ఆ విజయపరంపర భవిష్యత్‌లోనూ కొనసాగేలా దార్శనికతతో 6 నుండి 10వ తరగతి విద్యార్థులను తీర్చిదిద్దడమే 'భాష్యం' ప్రత్యేకత. అందుకు నిదర్శనమే IITలు, BITS, NIT, VITలు, AFMC, JIPMER, CMCలతోపాటు రాష్ట్రంలోని ప్రతిష్టాత్మక ఇంజనీరింగ్ మరియు మెడికల్ కళాశాలల్లో ప్రొఫెషనల్ విద్యను అభ్యసిస్తోన్న వేలాదిమంది 'భాష్యం' పూర్వ విద్యార్థులు. అంతేకాదు, SSC ఫలితాలలో గత ఆరు సంవత్సరాలుగా 'భాష్యం' అసాధారణ రీతిలో తన ఆధిక్యతను కనబరుస్తూ వస్తోంది. ప్రతి సంవత్సరం 550 మార్కులకుపైగా సాధిస్తోన్న విద్యార్థుల సంఖ్యలో 'భాష్యం'దే పైచేయి. మ్యాథ్స్, సైన్స్ సబ్జెక్టుల్లో 100 మార్కులకు 100 నుండి 90 మార్కుల వరకు సాధించినవారి సంఖ్యలోనూ 'భాష్యం' ఆధిక్యత కనబరుస్తోంది. ఇలా విద్యార్థుల ప్రతిభను అద్వితీయరీతిలో ఆవిష్కరించడంలో మరొక విద్యాసంస్థ ఏదీ 'భాష్యం' దరిదాపుల్లో లేకపోవడం నూటికి నూరుపాళ్ళు నిజం. ఇందుకు కారణం IIT(JEE) మొదలైన భవిష్యత్ పోటీ పరీక్షలను దృష్టిలో ఉంచుకొని 'BIIT అకాడెమీ' పేరిట 'భాష్యం' అందిస్తూ వచ్చిన వ్యూహాత్మక శిక్షణే.

'భాష్యం' విజయపరంపరను జాగ్రత్తగా పరిశీలిస్తున్న వారికి 'భాష్యం' IIT ఓరియెంటేషన్ గురించి ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరం లేదు. గత కొన్నేళ్ళుగా 'భాష్యం' అమలు చేస్తోన్న IIT ఓరియెంటేషన్‌ను నేడు అత్యధిక విద్యాసంస్థలు అనుసరించడం ఒక విశేషంగా చెప్పుకోవచ్చు. అత్యద్భుత ఫలితాలనిచ్చిన 'BIIT అకాడెమీ' ని IIT(JEE) మొదలైన పోటీపరీక్షల ప్యాటర్న్‌లలో వచ్చిన మార్పులకు అనుగుణంగా సమూలంగా మార్చివేసి కొత్తకోర్స్ మాడ్యూల్‌ని రూపొందించింది 'భాష్యం'. విద్యార్థి ఇంటర్‌లో ఆప్షనల్స్‌పై కమాండ్ సాధించడంలోనూ. IIT మొదలైన పోటీ పరీక్షల్లో రాణించడంలోనూ మ్యాథ్స్, సైన్స్ సబ్జెక్టులపైన ఉండే ప్రాథమికమైన గ్రిప్ కీలకపాత్ర పోషిస్తుందని అందరకూ తెలిసిందే. ఆ సబ్జెక్టులలోని ఫండమెంటల్స్‌పై పట్టువచ్చేలా అదనపు క్లాసులతో ప్రత్యేక శిక్షణ అందిస్తుంది 'BIIT అకాడెమీ'. 'మ్యాథ్స్'లో శిక్షణ సునిశిత మేధాశక్తిని పెంపొందించేందుకు, 'సైన్స్'లో శిక్షణ సైంటిఫిక్ ఎప్రోచ్‌ను పెంపొందించేందుకు ఉపకరిస్తాయి. అందువల్లే 'భాష్యం' విద్యార్థులు స్కూల్‌విద్య అనంతరం ఇంటర్‌లోనూ. IIT(JEE) మొదలైన పోటీపరీక్షలలోనూ అత్యున్నతస్థాయి విజయాలను అలవోకగా సాధిస్తున్నారు.

ప్రతి జూనియర్ కాలేజ్‌లోనూ 'భాష్యం' ప్రతిభ కాంతులు విరజిమ్ముతోంది. ప్రతి ప్రతిష్మాత్మక ఇంజనీరింగ్ లేదా మెడికల్ కళాశాలలోనూ 'భాష్యం' ప్రజెన్స్ అనివార్యంగా ఉంటోంది. ఈ పర్సంటేజ్ పదింతలుగా చేసే 'BIIT అకాడెమీ' విద్యార్థుల లక్ష్యసాధనకు ఉపకరించే అత్యంత శక్తివంతమైన ప్రోగ్రాం అనడంలో సందేహం లేదు. ఈ ప్రోగ్రాం ప్రకారం క్లాస్ VI నుండి విద్యార్థులకు IIT మొదలైన అన్ని పోటీపరీక్షలకు ఉపయోగపడే ఫండమెంట్స్‌పై ప్రాథమిక అవగాహన కల్పించి, క్లాస్ VIII నుండి మాత్రం పూర్తిస్థాయి IIT ఫౌండేషన్ శిక్షణ అందించబడుతుంది. ఈ శిక్షణకై అటు కాలేజ్ విద్యలోనూ, ఇటు స్కూల్ విద్యలోనూ దశాబ్దాల అనుభవం గడించిన విద్యావేత్తల సలహాలు, సూచనలు అనుసరించి కోర్స్ మాడ్యూల్ రూపొందించబడింది. ఈ ఫౌండేషన్ కోర్స్... విద్యార్థులు భవిష్యత్‌లో పోటీపడే IIT(JEE), AIEEE, BITSAT మొదలైన ఇంజనీరింగ్ ఎంట్రన్స్‌లతో పాటు జాతీయ, రాష్ట్రస్థాయి మెడికల్ ఎంట్రన్స్‌లలోనూ సక్సెస్ సాధనకు ఉపకరిస్తుంది. కారణం మెడికల్ పోటీ పరీక్షలలోనూ ఫిజిక్స్ కెమిస్ట్రీలలోని గ్రిప్ విద్యార్థుల ర్యాంక్ సాధనలో కీలకం కావడమే.

ఘన విజయాలు 'భాష్యం'లో సంప్రదాయం అయ్యాయంటే అతిశయోక్తి కాదు. విజయంతో 'భాష్యం' పూర్వ విద్యార్థుల అనుబంధం SSC ఫలితాల అనంతరమూ కొనసాగింది. ప్రతిష్మాత్మక IIT లలో వారి ప్రవేశం ప్రమాణాత్మక విద్యకు దక్కిన సత్కారం... విద్యలో విలువలకు అధిక ప్రాధాన్యాన్నిచ్చే 'భాష్యం'కు గర్వకారణం!

'BIIT అకాడెమీ'... విద్యార్థి సముజ్జ్వల భవిష్యత్‌కు సంబంధించిన స్వప్నాలను నిజం చేసే అత్యద్భుతమైన IIT ఫౌండేషన్ కోర్స్... విద్యార్థి రేపటి సవాళ్ళన్నింటినీ సమర్థంగా ఎదుర్కొనేలా తీర్చిదిద్దే తిరుగులేని IIT ఫౌండేషన్ కోర్స్. 'భాష్యం'చే విరచితమైన ఈ విశిష్ట కోర్స్ మాడ్యూల్‌తో ముమ్ముందూ విజయాలు వెల్లువెత్తడం ఖాయం... అంతటా తామై ఆంధ్రప్రదేశ్ విద్యార్థులే ప్రతిష్మాత్మక జాతీయస్థాయి ఇంజనీరింగ్ మరియు మెడికల్ కళాశాలలన్నింటా తారసపడ్డం నిస్సందేహం !

- CBSE, ICSE, SSC సిలబస్‌లను పరిగణనలోకి తీసుకుని రూపొందించిన విద్యాప్రణాళిక
- ఫ్యాకల్టీగా పోటీపరీక్షల శిక్షణలో అపార అనుభవం గడించిన లెక్చరర్స్
- సరళంగా ఉంటూనే, విషయగాఢతతో రూపొందించిన స్టడీమెటీరియల్స్
- ప్రతి టాపిక్‌పై విద్యార్థి అవగాహనను తెల్సుకునేలా పరీక్షల నిర్వహణ
- టెస్ట్ ఫలితాల శాస్త్రీయ విశ్లేషణ, రెమెడియల్ క్లాసులు
- విద్యార్థుల స్ట్రెస్‌ఫ్రీ ఎడ్యుకేషన్‌కు అధిక ప్రాధాన్యత
- మానసిక ఒత్తిడిని నివారించేలా కౌన్సెలింగ్ సదుపాయం
- స్పోకెన్ ఇంగ్లీష్, పర్సనాల్టీ డెవలప్‌మెంట్, కమ్యూనికేషన్ స్కిల్స్‌పై ప్రత్యేక శ్రద్ధ



హైటెక్ విద్యాబోధన



తల్లిదండ్రులకూ ఆటపాటలు



గోరంట్లలోని భాష్యం న్యూ క్యాంపస్



ఎస్ఎస్‌సి విద్యార్థులకు శుభాకాంక్షలు

## కోటి కోర్కెలు తీర్చే అమ్మ

# కొండపాటూరు పోలేరమ్మ

(ఆన్‌లైన్-కాకుమాను)

గుంటూరు జిల్లాలో చరిత్ర ప్రసిద్ధిచెందిన దేవాలయాల్లో కాకుమాను మండలంలోని కొండపాటూరు పోలేరమ్మ ఆలయం ఒకటి. భక్తజన సంరక్షణార్థమై కొండపాటూరులో పోలేరమ్మ దేవత స్వయంగా వెలసిందని నాలుగు దశాబ్దాల చరిత్ర చెబుతోంది. 1825 చాణక్య వంశీయుడైన విష్ణువర్ధన మహారాజు రాజమహేంద్రవరాన్ని రాజధానిగా చేసుకుని పాలిస్తూ దిగ్విజయ యాత్రకు బయలుదేరి సమస్త దేశాలను జయించి, ఇక్షుపురి అనే పేరుగల ప్రకాశం జిల్లా పర్చూరు మండలం చెరుకూరులో శ్రీ త్రివిక్రమస్వామిని దర్శించారు. కొండపాటూరు, కసుకుర్తి, ఇనగర్తి గ్రామాలను త్రివిక్రమ పురత్రయమనే అగ్రహారాలుగా స్వామికి సమర్పించినట్లు చరిత్రలో స్పష్టంగా ఉన్నది.

### పోలేరమ్మ దేవత ఆవిర్భావ చరిత్ర

పూర్వకాలంలో గిరిపురం అని పిలువబడే నేటి కొండపాటూరు గ్రామం సర్వ సౌభాగ్యాలతో విలసిల్లుతూ వుండేది. కొంతకాలం తరువాత అనావృష్టి కారణంగా పంటలు పండక విపరీతమై కరువు ఏర్పడింది. ఈ నేపథ్యంలో రైతులు భూమిశిస్తు చెల్లించలేక బకాయిలు పడ్డారు. గ్రామ కరణం బాపిరాజు నివేదిక మేరకు శిస్తులు చెల్లించని రైతులకు అప్పటి బ్రిటిష్ ప్రభుత్వం కారాగార వాసం విధించి, అద్దంకి జైలుకు తరలించారు. ఆ సమయంలో అద్దంకి గ్రామంలో పోలేరమ్మ అమ్మవారు కొలుపులు జరుగుతుండగా రైతులు చెరసాల నుంచి త్వరగా విముక్తి కలిగితే తమ గ్రామంలో కూడా కొలుపులు చేయగలమని మొక్కుకొన్నారు. అంతట వారికి దేవిప్రసన్నమై అర్ధరాత్రి కారాగార ద్వారా బంధాలు మహోత్తరమైన శబ్దంతో తెరుచుకొని ఖైదీలకు వున్న సంకెళ్ళు విడిపోయాయి. 'మిమ్ములను చెరసాల నుంచి విడుదల గావించుచున్నాను'. అని ఆజ్ఞా పూర్వకమైన వాణి వినిపించింది. దేవి స్వయంగా రైతులను రాత్రివేళ ఊరుబయట దాకా తీసుకుని పోయి 'మీరు నిశ్చింతగా ఇంటికి వెళ్ళిరండి' అనే ధైర్యం చెప్పి అంతర్ధానమైనట్లు నాటి నుంచి నేటి కాలం వరకు చెప్పుకుంటున్నారు. అయితే జైలు నుంచి విముక్తి అయిన రైతులు చేసిన వాగ్దానాన్ని మరచి తమ పనుల్లో నిమగ్నమయ్యారు.

తొలకరి వానలు పడటంతో రైతులు తమ వ్యవసాయ పనులు ప్రారంభించి, కరణం బాపిరాజు తన పొలం దున్నుతుండగా భూమిలో పోలేరమ్మ అమ్మవారు వెలసిన విగ్రహానికి నాగటి కర్రు గుచ్చుకొని రక్తం ప్రవాహంలా సాగింది. ఆ దృశ్యం చూసిన రైతులు మూర్ఛపోయారు. ఈ వార్త తెలుసుకొన్న గ్రామస్తులు ఆ ప్రాంతానికి చేరి తిలకించుచుండగా ఒకరికి పోలేరమ్మ అవహించి 'నేను పోలేరమ్మను అద్దంకి జైలు నుంచి రైతులను విడిపించిన శక్తి స్వరూపిణిని' మీరు మొక్కులను మరచి పొలం దున్నుకుంటున్నారు. అందువలన బాపిరాజు పొలంలో వెలసితిని. మీరు మాట చెల్లించుతారా! లేని ఎడల వినాశ కాలం ఆసన్నమగును' అని పలికింది. ఈ వాక్కుకు భయకంపితులైన రైతులు విగ్రహం తీసుకెళ్ళి గ్రామంలో ప్రతిష్ఠించబోయారు. కాగా విగ్రహం ఎంత తవ్వినా భూమిలోకి పోతున్నదిగాని తీసేందుకు వీలుకాక గ్రామస్థులు నిరాశ చెందుతున్న సమయంలో దేవత మరల అవహించి 'నేను ఈ పొలం నందే ఉండదలచితిని' నాకు ఇక్కడే నాగటి కర్రులతో గుడి కట్టించాలని, అద్దంకిలో జరిగే విధంగా ఉపచారములు చేయవలె'అని ఆదేశించెను. దేవి ఆజ్ఞానుసారం గుడి కట్టించి ప్రతి సంవత్సరం పంటలన్నీ పండి ఇంటికి చేరిన అనంతరం జ్యేష్ఠ శుద్ధమందు గ్రామస్తులు జాతర చేయడం పరిపాటి అయింది.

ప్రతి ఏటా ఉగాది తరువాత శుక్రవారం నాడు అమ్మవారి కొలుపుల గురించి గ్రామంలో చాటింపు వేస్తారు. దీన్ని 'సాటు'అని అంటారు. ఆ రోజు నుంచి19రోజుల తరువాత వచ్చే మంగళవారం తిరునాళ్ళ నిర్వహిస్తారు. దేవాలయానికి గ్రామంలో యాదవ కులస్తులు పూజారులుగా వ్యవహరిస్తారు. సాటు అనంతరం 'ఘటం' అనే కార్యక్రమంలో పూజారి 15 రోజుల పాటు కుండ నెత్తిన పెట్టుకొని మేళ తాళాలతో గ్రామంలో సంచరిస్తారు. మొక్కులు తీర్చుకోదలచిన వారు వైభవంగా కొలుపులు నిర్వహిస్తారు. 15రోజుల పాటు ఈ కార్యక్రమంలో గ్రామంలోని అష్టాదివర్ణాలు పాలుపంచుకొంటారు. సాటు అనంతరం పెదనందిపాడు, కాకుమాను, పర్చూరు, ప్రత్తిపాడు, పొన్నూరు, బాపట్ల, చెరుకూరు తదితర మండల గ్రామాలకు చెందిన రైతాంగం తమ పశుసంపదను, వ్యవసాయ పరికరాలను మోటారు వాహనాలపై గుడి చుట్టూ ప్రదర్శనగా తిప్పుకొని తమ మొక్కుబడులు తీర్చుకొనుట నాటి నుంచి నేటి వరకు జరుగుతున్నది. ఘటం కార్యక్రమం అనంతరం అమ్మవారిని మంగళవారం ఆలయ ప్రవేశం చేయిస్తారు. తిరునాళ్ళకు ముందు అయిదురోజులు కోలాహాలంగా నిర్వహించే కొలుపుల్లో భాగంగా గ్రామంలో గల గంగానమ్మ, అద్దంకమ్మ, పోతురాజు తదితర సహచర గణాలను ఈ సందర్భంగా కొలుస్తారు.

సిడిమాను జాతరగా పేరుపొందిన ఈ ఉత్సవంలో దేవత వెలసిన పొలంకు చెందిన బాపిరాజు బ్రాహ్మణ వంశస్థులు కుంకుమ బండ్లతో గ్రామంలో ఊరేగింపు నిర్వహిస్తారు. అనంతరం దళితులకు చెందిన సిడి పెళ్ళికొడుకును ఊరేగింపుగా గుడికి తీసుకొస్తారు. సిడి పెళ్ళికొడుకు అమ్మవారు అవహించిన మేకపోతును ఊచల పెట్టెలో పెట్టి సిడి కర్రకు వేలాడదీస్తారు. రైతులు తమ పొలాల్లో పండిన వరి, మిరప, పత్తి, మొక్కజొన్న తదితర పంటల గుత్తులను సిడిమాను కర్రకు వేలాడదీసి తమ మొక్కుబడులు చెల్లించుకుంటారు. 'నాపసాని' అనే నర్తకి నృత్యంతో యాదవ, మంగలి, బ్రాహ్మణ, కమ్మ తదితర వర్ణాలు సిడి మేకపోతును సమష్టిగా గ్రామ పురవీధుల్లో ఊరేగిస్తారు.



పోలేరమ్మ అమ్మవారు; దేవస్థాన ప్రాంగణం



# అక్కరకు రాని పోతార్లంక సాగునీటి పథకం


లిఫ్ట్ ఇరిగేషన్ తూటికాడతో పూడుకుపోయిన దృశ్యం

('ఆన్‌లైన్' - భట్టిప్రోలు)

కృష్ణానది తీరలంక గ్రామాల్లోని అయిదు వేల ఎకరాలకు సాగునీరును అందించే పోతార్లంక సాగునీటి పథకం నిరుపయోగంగా మారింది. దశాబ్దకాలంగా ఈ పథకం అమలుకు నోచుకోకపోవడంతో రైతాంగం సాగునీటి సమస్యను ఎదుర్కొనక తప్పడం లేదు. లంక గ్రామాల్లో వాణిజ్య పంటలైన అరటి, పసుపు, కంద, బొప్పాయి, తమలపాకు, మొక్కజొన్న వంటి పంటలను రైతులు పండిస్తుంటారు. ఇక్కడ పండిన ఉత్పత్తులను రాష్ట్రంలోని ప్రధాన నగరాలతోపాటు ఇతర రాష్ట్రాలకు ఎగుమతులు జరుగుతాయి. లంకగ్రామాల్లోని భూగర్భజలాల్లో ఉప్పుశాతం పెరగడంతో పంటల ఉత్పత్తికి ఆటంకంగా మారింది. ఈ నేపథ్యంలో 1985 సంవత్సరంలో అప్పటి ముఖ్యమంత్రి స్వర్గీయ ఎన్టీ రామారావు పోతార్లంక సాగునీటి పథకానికి శ్రీకారం చుట్టారు. అయితే పథకంలో కొన్ని సమస్యలు ఎదురుకావడంతో 1997 వరకు నిర్మాణ పనులు ముందుకు సాగలేదు. 1997 లో రైతులు తమ వాటా ధనాన్ని అందించేందుకు ముందుకు రావడంతో కొల్లూరు లాకులవద్దబ్యాంకు కెనాల్ నుంచి లిఫ్ట్‌ను ఏర్పాటుచేసి, కాల్వల తవ్వకాలు జరిపారు. ఈ కాల్వల తవ్వకాల్లో ఇంజనీర్ల నిర్లక్ష్యం కారణంగా నేటివరకు చుక్కనీరు పారిన దాఖలాలు కనిపించలేదు. రైతాంగానికి నిరాశే ఎదురైంది. అప్పట్లో కాల్వల తవ్వకం డిజైన్లలో జరిగిన పొరపాట్లవలన నీరు పారడం లేదని గుర్తించిన ప్రభుత్వం తిరిగి పథకాన్ని అమలులోకి తీసుకు వచ్చేందుకు అయిదు కోట్ల రూపాయల వ్యయంతో టెండర్లు పిలిచింది. పెరిగిన సిమెంటు, ఇటుకల ధరలు కారణంగా టెండరుదారులు వాటి నిర్మాణానికి ముందుకు రావడం లేదు. ఈ పథకం అమలుకు నోచుకోకపోతే భవిష్యత్తులో లంకభూములు బీడులుగా మారే ప్రమాదం వుందని రైతులు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. ఇప్పటికైనా ప్రభుత్వం ఈ పథకం అమలు విషయంలో ఒక అడుగు ముందుకేసి అవాంతరాలను తొలగించాలని రైతాంగం కోరుతోంది.


పోతార్లంక పథకం ప్రారంభ శిలాఫలకం


పోతార్లంక సాగునీటికాలువ

# దేశభక్తుల నగరి... భావపురి



మున్సిపల్ కార్యాలయం

(ఆన్‌లైన్-బాపట్ల)

బాపట్ల పంచాయతీగా జిల్లాలో ప్రముఖ పాత్ర వహించిన బాపట్ల 1951లో ద్వితీయ శ్రేణి పురపాలక సంఘంగా గుర్తింపు పొందింది. 1952 నుంచి ఇప్పటి వరకు ఎనిమిది మంది మున్సిపల్ చైర్మన్లు పదవులు నిర్వహించారు. 1955 నుంచి 1957 వరకు వెలగపూడి సుబ్బారావు ప్రప్రథమంగా చైర్మన్ పదవిని నిర్వహించారు. ఈయన హయాంలో పట్టణంలోని ఇసుకరోడ్లు కంకర రోడ్లుగా రూపాంతరం చెందాయి. కిరోసిన్ దీపాలకు బదులు పెట్రోమాక్స్ లైట్లు వీధి దీపాలుగా మార్చారు. పంచాయతీ కార్యాలయంగా వున్న భవనాన్ని ట్రావెలర్స్ బంగళాగా అభివృద్ధి చేశారు. కమ్యూనిస్టుల సహకారంతో ఇండిపెండెంట్ అభ్యర్థిగా గెలుపొందిన శీరం రాధాకృష్ణమూర్తి 1956వరకు చైర్మన్ పదవిని అలంకరించారు. శీరం హయాంలో మున్సిపల్ మార్కెట్ కాంప్లెక్స్ ఏర్పడింది.

1960 నుంచి 1961వరకు, 1969 నుంచి 1970 వరకు కాంగ్రెస్‌పార్టీకి చెందిన కాకుమాను భావన్నారాయణ చైర్మన్‌గా పనిచేశారు. ఈయన హయాంలో మున్సిపల్ పార్కులు, పలు పాఠశాలలకు పక్కా భవనాలు, షాపింగ్ కాంప్లెక్స్‌లు, రహదారుల నిర్మాణం జరిగింది.

1970 నుంచి 1971వరకు యడవల్లి సూర్యనారాయణ చైర్మన్ పదవినలంకరించారు. ఆయన కాలంలో పార్కుల అభివృద్ధికి రక్షిత మంచినీటి పథకానికి శ్రీకారం చుట్టారు.

1982 నుంచి 1987వరకు చైర్మన్‌గా పదవి నిర్వహించిన తాడి నరసింహారావు పట్టణాన్ని ఎంతో అభివృద్ధి చేశారు. మున్సిపల్ ఆదాయాన్ని పెంచారు. రక్షిత మంచినీటి పథకం రుణం 26 లక్షల రూపాయలను ప్రత్యేక గ్రాంటుగా మార్పించారు. సూర్యలంకకు రక్షిత మంచినీటి సరఫరాను చేసి, పురపాలక సంఘానికి ఏటా 12లక్షల రూపాయల ఆదాయం పెరిగేలా ఏర్పాటు చేశారు. షాపింగ్ కాంప్లెక్స్‌లను నిర్మించారు.

1988 నుంచి 1994 వరకు కాంగ్రెస్‌పార్టీకి చెందిన నీలం సత్యనారాయణ చైర్మన్ పదవిని నిర్వహించారు. ఈయన హయాంలో మురికివాడల లో అభివృద్ధికి విశేష కృషి సల్పారు. 1995 నుంచి 2000 వరకు పదవి నిర్వహించిన తెలుగుదేశంపార్టీకి చెందిన కొటికలపూడి వెంకట రాఘవరావు హయాంలో పురపాలక సంఘంలో ఎనిమిది కోట్ల రూపాయలతో వివిధ అభివృద్ధి పనులు చేపట్టారు.

2001లో మొట్టమొదటి మహిళా చైర్మన్‌గా జిట్టా ప్రమీలారాణి ఎన్నికయ్యారు. ఈమె హయాంలో 50 సంవత్సరాలలో సాధించలేని అభివృద్ధిని సాధించారు. మున్సిపల్ హైస్కూల్ ఆవరణలో 42 లక్షల వ్యయంతో కళాక్షేత్రం, కోటి రూపాయల రామానాయుడు నిధులతో వార్డులలో పలు అభివృద్ధి కార్యక్రమాలు, ఐడిఎస్ఎంటి పథకం కింద కోటి రూపాయలతో రోడ్లు, షాపింగ్ కాంప్లెక్స్‌ల నిర్మాణం, తొమ్మిది కోట్ల రూపాయలతో ఫ్లైఓవర్ బ్రిడ్జి, 2.25 కోట్ల రూపాయలతో ప్రభుత్వ ఆస్పత్రి భవనం, కోటీ 80లక్షల రూపాయలతో కోర్టు భవనాలు,రక్షిత మంచినీటి పథకానికి చెందిన రెండవ సమ్మర్ స్టోరేజి ట్యాంకు నిర్మాణం,మున్సిపల్ కౌన్సిల్ హాలు ఏర్పాటు కార్యక్రమాలను చేపట్టారు.

2005వ సంవత్సరంలో మొదటి సారిగా దళిత వ్యక్తి కూరపాటి మరియదాసు చైర్మన్‌గా ఎన్నికయ్యారు. వీరి హయాంలో సుమారు 100 కోట్ల రూపాయల అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టారు. అనంతరం అంబేద్కర్ సేవాసమాజం హైకోర్టులో వేసిన పిటిషన్‌ను విచారించిన కోర్టు కూరపాటి మరియదాసు ఎన్నిక చెల్లదంటూ తీర్పు చెప్పారు.

ఈ నేపథ్యంలో వైస్ చైర్మన్‌గా వున్న నరాలశెట్టి ప్రకాష్‌ను ఇన్‌చార్జి మున్సిపల్ చైర్మన్‌గా ప్రకటించారు. 1951లో బాపట్ల పట్టణం జనాభా 14వేలు, 11మంది కౌన్సిలర్లతో తొలి కౌన్సిల్ సమావేశాలు జరిగాయి. 1956లో 46 వేల జనాభా కలిపి 28 వార్డులుగా అభివృద్ధి జరిగింది. 1991లో పట్టణ జనాభా సుమారు లక్షకు చేరుకోవడంతో 17.92 చదరపు మీటర్ల విస్తీర్ణం గల బాపట్ల పట్టణాన్ని 34 వార్డులుగా విభజించారు. ప్రస్తుతం పురపాలక సంఘ పరిధిలో 2001 జనాభా లెక్కల ప్రకారం 68వేల 126మంది ఓటర్లు ఉన్నారు.

**సాహితీ, సాంస్కృతిక, విద్య, రాజకీయ రంగాల్లో అగ్రగామిగా నిలిచింది బాపట్ల. 1936లో తొలి జాతీయ కాంగ్రెస్ సమావేశం ఇక్కడ జరిగింది. పలువురు దేశభక్తులకు నిలయంగా స్వాతంత్రోద్యమంలో బాపట్ల ప్రముఖ పాత్ర వహించింది. ప్రథమ ఆంధ్రమహాసభను శ్రీకారం చుట్టింది బాపట్ల. స్వాతంత్రోద్యమంలో స్త్రీ హితేషిణి మండలి ద్వారా మహిళలను చైతన్యవంతం చేసింది బాపట్ల. 'చేయెత్తి జై కొట్టు తెలుగోడా' అన్న వేములపల్లి శ్రీకృష్ణకు స్థానమిచ్చింది బాపట్ల. 'ఏ దేశమేగినా ఎందుకాలిడినా పొగడరా నీ తల్లి భూమి భారతిని' అన్న గేయ రచన ద్వారా జాతిని జాగృతం చేసిన రాయప్రోలు గడ్డ ఇది. మురళీలేని గాన రవళి ఈల పాట రఘురామయ్యకు స్థానమిచ్చింది బాపట్ల. 1927లోనే జిల్లాలో ప్రథమంగా ఇక్కడ హైస్కూల్ భవనం ఏర్పాటు జరిగింది. 1945లో దక్షిణ భారతదేశంలోనే ప్రథమంగా ఇక్కడ వ్యవసాయ కళాశాలను ఏర్పాటు చేశారు. 1917లో దిగ్గజులైన పండితులతో శంకర విద్యాలయం, వేదపాఠశాల ఏర్పడి నేటికీ కొనసాగుతోంది. చోళ రాజుల కాలంలో 1400ల సంవత్సరాల క్రితం భావన్నారాయణస్వామి పేరుతో దేవస్థాన నిర్మాణం జరిగిన సమయంలో 'భావపురి'గా బాపట్ల ఏర్పడింది.**

## భక్తుల కొంగుబంగారం

# చందోలు శ్రీ లింగోద్భవస్వామి


పాండవులు ప్రతిష్ఠించిన శివలింగాలు

(ఆన్‌లైన్-పిట్టలవానిపాలెం)

పిట్టలవానిపాలెం మండలం చందోలు గ్రామంలో వున్న లింగోద్భవస్వామి క్షేత్రం అయిదు యుగాలుగా వెలుగొందుచూ ప్రఖ్యాతి చెందినది. కలియుగంలో సైతం పరిసర గ్రామాల భక్తులకు కొంగు బంగారమై వెలుగొందుతున్నది. భట్టిప్రోలు గ్రామానికి నైరుతి దిశన 15 మైళ్ళ దూరంలో వున్న చందోలు గ్రామంలో ఇప్పటికీ విగ్రహాలు తవ్వకాలలో లభిస్తున్నాయి. ప్రసిద్ధి చెందిన బౌద్ధ గ్రామాలలో లభించే ఆనవాళ్ళు అప్పుడప్పుడు చందోలు గ్రామంలో తవ్వకాలలో కనిపిస్తుండడం జరుగుతున్నది. అయిదు యుగాలలో కొన్నిమార్లు శిథిలావస్థకు చేరి, దాడులలో పడగొట్టబడినప్పటికీ ప్రస్తుతం పునర్నిర్మితమై భక్తులకు వరాల జల్లు కురిపిస్తున్నది. ఆలయంలోని ధ్వజస్తంభం పక్కనగల శిలపై చెక్కిన లిపిలో యుగాలకు సంబంధించి చరిత్ర కలదు.

### స్థల పురాణం

కృతయుగమున సంవ్వాదపురమని, త్రేతా యుగమున సనక సనందన సనత్కుమార పురమని, ద్వాపర యుగమున ధనదప్రోలు అని, కలియుగమున చందవోలు (చందోలు) అని పిలువబడుచున్నది.

### కృతయుగం కథ

బ్రహ్మ విష్ణువు మధ్య అన్యోన్యత, ఆధిక్యతను నివారించుటకై ఈశ్వరుడు లింగ రూప ధారియై తన ఆద్యంతాలను తెలుసుకుని రమ్మని వీరిద్దరిని ప్రేరేపింపగా, ఎవరికివారే ప్రథమ స్థానం పొందాలని వరాహ రూపంలో విష్ణువు, హంస రూపంలో బ్రహ్మ బయలుదేరి ఆద్యంతములను తెలుసుకోలేక కేతకి పుష్పము కామధేనువును తనకు సాక్ష్యంగా ఉండమని బ్రహ్మ కోరగా, అంగీకారమై బ్రహ్మవెంట సాక్ష్యం చెప్పేందుకు వచ్చాయి. విష్ణువు తనకు సమాధానం దొరకక ఊరకుండెను. ఆద్యంత విషయములో బ్రహ్మకు సాక్ష్యంగా వచ్చిన కేతకి పుష్పమునకు పూజార్హత లేదని, బ్రహ్మకు కలియుగంలో ఆలయం ఉండదని, కామధేనువు ముఖం చూచినవారికి ధోషమని, పృష్ణ భాగం చూచిన యెడల శుభం కలుగునని శివుడు తెలిపెను. ఈ సంవాదం ఇచ్చట జరిగినందున ఈ గ్రామానికి సంవ్వాద పురమని పేరు వచ్చెను. ఇందుకు నిదర్శనంగా ధ్వజస్తంభానికి దక్షణ భాగమున గల అపురూప చింతామణి సాలగ్రామ శిలా లింగం ఉండుటయే తార్కాణం.


ఆలయ వివరాలు తెలిపే ఆనాటి శిలాఫలకం

### త్రేతాయుగం...

ఈ యుగమున బ్రహ్మమానస పుత్రుడైన సనకనందాదులు ఈ క్షేత్రాన లింగోద్భవ రూపుడైన చంద్రశేఖర మహాలింగాన్ని గురించి తపస్సు చేసినందున సనక పురమని పేరు. దీనికి తార్కాణముగా దేవాలయ ముఖ ద్వారమునకు దక్షిణ భాగమున చంద్రశేఖర మహాలింగము ఉండుటయే తార్కాణం.


లింగోద్భవ స్వామి దేవస్థానం

### ద్వాపర యుగం...

ద్వాపర యుగమున దుష్యంత, శంతన మహారాజులు, పాండవులు ఇచ్చటకు వచ్చి ఈ మహాదేవుని గురించి తపస్సు చేసి, తమ కోరికలను పొంది, లింగోద్భవస్వామికి కుడి భాగాన ధర్మారాజుచే పాండేశ్వర లింగాన్ని, ఎడమ భాగాన అర్జునునిచే విజయేశ్వర లింగాన్ని ప్రతిష్ఠగావించి ఈ గ్రామాన్ని పట్టణంగా ఏర్పరచిరి. అప్పుడు ఈ పట్టణమంతా ధనకనకవస్తువాహన సమృద్ధిగా కలిగి ధనదవోలుగా పిలువ బడినది. ఇందుకు తార్కాణమే ధ్వజస్తంభమునకు ఇరువైపుల నున్న పాండేశ్వర, విజయేశ్వర లింగములు.

### కలియుగంలో ...

కలియుగంలో కుళోత్తుంగ చోళ మహారాజు పరిపాలనలో ఒక యతీశ్వరుడు కాశీలో మణికర్ణిక ఘట్టములోగల శాసనాలను చదివి, అందు వేమూరుకు నైరుతి మూలగల గ్రామ దేవాలయంలో ధనం దాచినట్లుగా తెలుసుకుని, ఆ మహారాజుని కలుసుకుని క్షేత్ర పాలకుడైన భైరవుడు లేని సమయంలో నిక్షిప్తమైయున్న ధనమును అపహరింప ప్రయత్నమును భైరవుడు తెలుసుకుని యతీశ్వరుని బలిగొనడం జరిగింది. యతీశ్వరుడు బ్రాహ్మణుడు కావడం వలన బ్రహ్మ హత్యాపాతకం పొగొట్టుకొనుటకు చోళ మహారాజు చందవోలు గ్రామంలోని శ్రీ లింగోద్భవ స్వామిని పునఃప్రతిష్ఠ చేసిరి. 12వ శతాబ్దంలో ఆలయ గోపుర ప్రాకారాది నిర్మాణములు గావించిరి. క్రీ.శ.1752లో ఫ్రెంచి వారి పాలనలో దేవాలయములు ధ్వంసం చేయడం జరిగినది. పిమ్మట 18వ శతాబ్దంలో దేశిముఖియగు పూగడ్డ వీరమ్మ ఈ గుడిని తిరిగి నిర్మించుటకు ప్రారంభించి, సగం పూర్తిచేసిన పిమ్మట కొమరవోలు నాశన్న గారు ఈ దేవాలయ విమాన గోపురాది ప్రాకారాలు కట్టించి ధ్వజ ప్రతిష్ఠ కావించి, ధర్మకర్తగా కొనసాగారు. స్వామివారు, పార్వతి అమ్మవారు కొంగు బంగారమై ఇచట విలసిల్లారు.

# ప్రజాసేవలో వినుతికెక్కిన వినయాశ్రమం



వినయాశ్రమం ముఖద్వారం

త్యాగ నిరతితో స్వాతంత్ర్య సముపార్జనే లక్ష్యంగా, ప్రాణాన్ని తృణప్రాయంగా ఎంచి ఎందరో మహనీయులు స్వాతంత్ర్య సమరరంగంలో పోరు జరుపుతున్న రోజులవి. సత్యము, అహింసయే నా దేవుళ్ళు అన్న నినాదమే ఆశయంగా, 'సాధించు లేదా గతించు' అన్న ఆశయమే ప్రాణంగా భావించిన పూజ్య బాపూజీ నాయకత్వంలో భారతీయులందరూ ఒకే మాటపై నిలబడి, ఒకే బాటలో పయనిస్తూ మాతృదాస్య విముకి కోసం అహింసాయుతమైన ఉద్యమం దేశమంతటా వెల్లివిరిసిన సమయమది. ఆ సమయంలోనే దేశభక్తి ప్రపూరితమైన స్వచ్ఛంద సేవకులను, స్వాతంత్ర్య సమరయోధులను తయారుచేసే కార్ఖానాలే మహాత్మునిచే స్థాపించబడిన వినయాశ్రమాలు. గుజరాత్‌లోని సబర్మతి, వార్థాసేవాగ్రామ్, తమిళనాడులోని గాంధీగ్రామ్, మన ఆంధ్రప్రదేశ్‌లోని వినయాశ్రమం ఈ కోవకు చెందినవే. దేశంలోని ఏ ప్రాంతానికి తీసిపోనిరీతిలో ఆంధ్రజాతి తల్లి రుణం తీర్చుకునేందుకు చిత్తశుద్ధితో కార్యక్షేత్రాన నిలిచి, మహాత్ముని అహింసా సూత్రాలకు ముగ్ధులై దేశ స్వాతంత్ర్య సిద్ధి కోసం కృషి చేయాలని, మనస్సులో కలిగిన కావూరువాసుల ఆలోచనలకు ప్రతిరూపమే మన వినయాశ్రమం.



గాంధీనాటిన అశ్వర్థ వృక్షం

('ఆన్‌లైన్' - చెరుకుపల్లి)

స్వాతంత్ర్య పోరాటంలో పలు వ్యూహాలకు పురిటిగడ్డ వినయాశ్రమం. మహాత్మాగాంధీ, బాబూరాజేంద్రప్రసాద్, వినోబాబావే, టంగుటూరి ప్రకాశం, లోక్‌నాయక్ జయప్రకాష్ నారాయణ్ వంటి మహామహుల పాదస్పర్శతో పునీతమైన కావూరు వినయాశ్రమం. పూజ్య బాపూజీ ఆశ్రమంలో ఆనాడు నాటిన అశ్వర్థ మొక్క నేడు మహావృక్షంగా ఆశ్రమంలో ఆయన సేదతీరిన కుటీరం. గత చరిత్రను సాక్షీభూతాలుగా దర్శనమిస్తున్నాయి. అణువణువునా ఎంతో ఘనకీర్తిని నింపుకుని ఆనాటి ఆశయాలకు భంగం కలగకుండా నిరంతరం సేవా ధృక్పథంలో విశేష సేవలందింస్తున్న నాటి వినయాశ్రమమే నేటి కృషి విజ్ఞాన కేంద్రం.

కావూరు గ్రామానికి చెందిన తుమ్మల బసవయ్య దుర్గాంబ దంపతులు శ్రీ స్వామి సీతారాం ఆదేశంమేరకు గాంధీ పిలుపునందుకుని తమకున్న ఆస్తులన్నింటిని ధారదత్తం చేసి తమ జీవితాన్ని మొత్తం ప్రజోపయోగ కార్యములు చేయదలచి, కావూరు గ్రామాన్ని విడిచిపెట్టి 'బాపూజీ బాగ్' అనే పేరుతో హరిజన సోదరులు నాటిన ఒక తోటను ఏర్పాటు చేయగా, వీరికృషికి మెచ్చిన మహాత్ముడు 23-12-1933న వినయాశ్రమం అనే పేరుతో అశ్వర్థ వృక్షాన్ని నాటి తుమ్మల దుర్గాంబ కాలిమెట్లతో చేసిన వెండి టాపీతో శంకుస్థాపన చేయటం జరిగింది. మహాత్ముడు నాటిన మహావృక్షం లాగానే వినయాశ్రమం కూడా దినదినాభివృద్ధి చెందుతూ 2.10.1992న 40 ఎకరాల విస్తీర్ణంలో ప్రొఫెసర్ ఎన్‌జి రంగా కృషి విజ్ఞానకేంద్రంగా రూపుదాల్చింది.

ఈ కృషి విజ్ఞానకేంద్రం అన్నం పెట్టే రైతన్నలకు అండదండగా మారి వ్యవసాయం, దానికి అనుబంధమైన పశుశాస్త్రం, చేపలు, గొర్రెలు, పట్టుపురుగుల పెంపకం, గృహపరిశ్రమలు నిర్వహణ బోధిస్తుంది. ఆంధ్రబాలికల గురుకుల పాఠశాల కూడా వుంది. ముఖ్యంగా ఎప్పటికప్పుడు పరిశోధనశాలలో

(తరువాయి 131వ పేజీలో)

# ప్రజాసేవలో ...



గాంధీకుటీరం

(130వ పేజీ తరువాయి)

నుంచి వచ్చే శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం వ్యవసాయ దారులకు ప్రదర్శనా పూర్వకంగా బోధనచేయటయే లక్ష్యంగా చేసుకుని వ్యవసాయదారులకు, వ్యవసాయ మహిళలకు, నిరుద్యోగ యువకులకు, ఉద్యోగులకు శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం అందించుట ఈకేంద్రం విధి. ఈసంస్థ పర్యవేక్షణ కేంద్ర సంస్థ అయిన 'ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ అగ్రి కల్చరల్ రీసెర్చి ఢిల్లీ' వారిది. ఈ సంస్థ జిల్లా మొత్తం కింద శిక్షణా కార్యక్రమాలను ఏర్పాటు చేస్తుంది. పట్టుపురుగుల పెంపకం, వానపాముల ద్వారా సేంద్రియ ఎరువు తయారీ, తేనేటీగల పెంపకం, పశువుల పెంపకం, కోళ్ళపెంపకం, విత్తనశుద్ధి కర్మాగారం, కొబ్బరిపీచు పరిశ్రమ, ఉధ్యానవన నర్సరీ, ఆగ్రోప్రాసెసింగ్ సెంటర్, విత్తన గిడ్డంగులు, రైతు విశ్రాంతిశాలలు మొదలగు ఎన్నో కార్యక్రమాలకు నెలవై రైతన్నలకు బాసటగా నిలిచి ప్రజలందరికీ అండదండగామారి, అనేక రకాల అవార్డులతో నిత్యకళ్యాణం, పచ్చతోరణంలా అందమైన వాతావరణంలో పచ్చనిచెట్లతో ఇప్పటికీ నిక్షేపంగా వున్న వినోభాబావేచే స్థాపించబడిన అఖండదీపంతో, గాంధీకుటీరం, గాంధీనాటిన అశ్వద్ధ వృక్షం, దానిముందు ఇప్పటికీ దర్శనమిస్తున్న మహోదయ స్థూపంతో సస్యశ్యామల భారతావనికి శ్రీకారం చుడుతుంది. మన వినయాశ్రమంలోని ప్రొఫెసర్ ఎన్‌జి రంగా కృషి విజ్ఞానకేంద్రం(కెవికె).

ఎవరి జీవితంలోనైనా విజయం సాధించడం, వినయం కలిగి వుండటమనేని ఒకదానితో ఒకటి కలిసే వుంటాయి. కనుక వినయాశ్రమం వినయం కలిగిన వ్యక్తులను తయారుచేయడమేగాక విజయాలకు సింహస్వప్నంగా మారాలని మనందరికీ చేదోడువాదోడుగా నిలవాలని, ఇది దేశంలోనే ప్రముఖ స్థానాన్ని ఆక్రమించాలని ఆశిద్దాం...

## పులిగడ్డ వారధి నిర్మాణంతో

# దశ తిరిగిన రేపల్లె

('ఆన్‌లైన్' - రేపల్లె)

పెనుమూడి-పులిగడ్డ వారధి నిర్మాణం తర్వాత రేపల్లె పట్టణం దశమారింది. రేపల్లె పట్టణానికి 50 వేలకుపైబడగా, 25 వేల మంది ఓటర్లు వున్నారు. 2006 మే 27వ తేదీన రాష్ట్ర ముఖ్యమంత్రి డాక్టర్ వైఎస్ రాజశేఖరరెడ్డి పెనుమూడి-పులిగడ్డ వారిధిని ప్రారంభించి, శ్రీమండలి వెంకట కృష్ణారావు వారధిగా నామకరణం చేశారు.

పులిగడ్డలో నవయుగ ఇంజనీరింగ్ కంపెనీ నిర్వాహకులు 2007 ఫిబ్రవరి 16న టోల్‌గేట్ కలెక్షన్‌ను మొదలుపెట్టారు. పెనుమూడి-పులిగడ్డ వారధి నిర్మాణం పూర్తికాకముందు ఈ పరిసర ప్రాంతంలో ఎకరం నాలుగు లక్షలు ధర పలికింది. ఈ నాలుగేళ్ళ తర్వాత ఎకరం భూమి 15 లక్షల నుంచి 20 లక్షల రూపాయలకు గణనీయంగా రియల్ ఎస్టేట్ వ్యాపారులు ధరలు పెంచారు. అయితే భూమి ధరలు పెరిగాయేగాని, దీనికి సమానంగా ఆపార్టుమెంటులు నిర్మాణం, భవన కట్టడాలు జరగలేదు. ప్లాట్‌ల వ్యాపారం పెరిగిందికాని, అనుకున్న విధంగా గృహనిర్మాణాలు జరగలేదు.



పులిగడ్డ వద్ద ఏర్పాటుచేసిన టోల్‌గేట్

గత ఏడాది నుంచి కృష్ణా, గుంటూరు జిల్లాలకు రవాణా సౌకర్యం బాగా మెరుగుపడింది. కృష్ణా జిల్లా అవనిగడ్డ నియోజకవర్గ ప్రజానీకానికి అతిచేరువలో వున్న రేపల్లె పట్టణానికి నిత్యం అనేక పనులపై అవనిగడ్డ, నిడుమోలు నియోజకవర్గాల పరిధిలోని, కోడూరు, నాగాయలంక, దివిసీమ పరిసరప్రాంతాల్లోని 50 గ్రామాల ప్రజలు రాకపోకలు సాగించటం వల్ల రేపల్లె పట్టణం వ్యాపారపరంగా క్రమేపి అభివృద్ధి జరుగుతుంది. విద్యాపరంగా కూడా మరింత అభివృద్ధి దిశగా రేపల్లె పట్టణం అడుగులువేస్తున్నది. దీనివల్ల నివాస, నివాసేతర గృహాలకు అద్దెలు బాగా పెరిగాయి. రేపల్లె పట్టణంలోని వివిధ వ్యాపారాలకు గిరాకీ పెరిగింది. రేపల్లె, కృష్ణాజిల్లాల్లోని పరిసర ప్రాంతాల్లో రొయ్య, చేపల చెరువులు సాగుకూడా గణనీయంగా పెరిగింది. గతంలో నీటి రవాణా ద్వారా కృష్ణా, గుంటూరు జిల్లాలకు తీరప్రాంతంలో రాకపోకలు జరిగినప్పటికీ, ప్రస్తుతం మాత్రం వారధి నిర్మాణం జరగటం వల్ల రాకపోకలు ముమ్మరంగా సాగుతున్నాయి. దీంతో గత సంవత్సరం నుంచి వివాహసంబంధాలు కూడా అధికంగా పెరిగాయి.

రేపల్లె పట్టణంలో విద్యాపరంగా ఫార్మసీ, ఇంజనీరింగ్, పాలిటెక్నిక్, ఎంబిఏ, పిజికోర్సులు మరిన్ని నెలకొల్పాల్సిన అవసరం వుంది. రానున్న రెండేళ్ళల్లో రేపల్లె పట్టణంలో జనాభా పెరిగే అవకాశాలు కనిపిస్తున్నాయి. రేపల్లె రైల్వేస్టేషన్‌లో ప్రయాణీకులకు మరిన్ని సౌకర్యాలు కల్పించటానికి ఆదిశగా కృషి జరుగుతోంది. అయితే రేపల్లె ఆర్టీసి బస్సు డిపోలో ప్రయాణికులకు సరిపడా సౌకర్యాలు, బస్సు సర్వీస్‌లు కల్పించలేకపోతున్నారు. దూరప్రాంతాలకు రవాణా సౌకర్యాన్ని మెరుగుపర్చటానికి కొత్త ఆర్టీసి సర్వీస్‌లు నడపాల్సిన అవసరం వుంది.

ప్రస్తుతం పెనుమూడి-పులిగడ్డ వారధిపై నుంచి గుడివాడ, భీమవరం, నెల్లూరు, మద్రాసు వైపునుంచి నిత్యం వివిధరకాల 750వాహనాలు రాకపోకలు సాగిస్తున్నాయి. దీనివల్ల సుమారు టోల్‌గేట్ ఫీజుకింద 15వేల నుంచి 20వేల రూపాయలకు మాత్రమే వసూలు అవుతోంది. యుద్ధప్రాతిపదికపై కృష్ణాజిల్లా బంటుమిల్లి, పల్లెపాలెం అప్రోచ్‌రోడ్డు నిర్మాణం చేపట్టాల్సిన అవసరం వుంది. అదేవిధంగా విశాఖపట్టణం నుంచి మద్రాసువరకు రోడ్ల విస్తరణ, అభివృద్ధి ఇంకా జరగాల్సివుంది.

రోడ్ల అభివృద్ధి, విస్తరణలోభాగంగా చెరుకుపల్లినుంచి పెనుమూడికి రూ. 15 కోట్లు, వెల్లటూరునుంచి పెనుమూడికి రూ 12.50 కోట్లతో రోడ్లు నిర్మించేందుకు నిధులు మంజూరుకాగా, పెనుమూడి నుంచి నిజాంపట్నం వయా పిట్టలవానిపాలెం మీదుగా చందోలువరకు నిజాంపట్నం రోడ్ల అభివృద్ధికి 15 కోట్లరూపాయలతో ప్రభుత్వానికి ప్రతిపాదనలు పంపినట్లు తెలిసింది. అయితే రానున్న వేసవిలో పై రోడ్ల నిర్మాణం పనులు పూర్తయితే రేపల్లె పట్టణానికి మహార్దశ పట్టనున్నది.

# ఓడరేవుల పటిష్టతతో తీరప్రాంతాల అభివృద్ధి



పెనుమూడి-పులిగడ్డ వారధి

('ఆన్‌లైన్' - రేపల్లె)

తీరప్రాంతాలలోని ఓడరేవులు పటిష్టం చేయడంద్వారా తీరప్రాంతాలలోని పట్టణాల అభివృద్ధి అతివేగంగా జరుగుతుందని ప్రముఖ పారిశ్రామికవేత్తలు, తీరప్రాంత ప్రజానీకం తమ అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తున్నది. సముద్ర తీర ప్రాంతంలోని కాకినాడ నుంచి నెల్లూరు జిల్లా కృష్ణపట్నం వరకు గల ఓడరేవుల అభివృద్ధి చేసి మౌలిక సదుపాయాలు కల్పించాల్సిన అవసరం వుంది. రోడ్లవిస్తరణ, అభివృద్ధికి ప్రతిపాదనలు రూపొందించి, రవాణాసౌకర్యాలను మరింతగా మెరుగుపరచాల్సి వుంది. శ్రీకాకుళం నుంచి తడ వరకు తీర ప్రాంతంలో రోడ్డు, రైలు మార్గాలను ఏర్పాటు చేయాల్సివుంది. తీర ప్రాంతంలో అసంఖ్యాకంగా వున్న నిరుపేద ప్రజలు, గంగపుత్రుల ఆర్థిక స్థితిగతులను మెరుగుపర్చి మరింత ప్రోత్సహించటానికి ప్రభుత్వం కనీస సౌకర్యాల కల్పనలో భాగంగా నివేశన స్థలాలు, రేషన్‌కార్డుల పంపిణీ, పక్కా గృహాల నిర్మాణం చేపట్టాల్సిన అవసరం వుంది. దీంతోపాటు పారిశ్రామికంగా అభివృద్ధి జరగాల్సి వుంది. తీర ప్రాంతాలలోని మచిలీపట్నం, నిజాంపట్నం, కృష్ణపట్నం ఓడరేవుల అభివృద్ధి జరగాల్సి వుంది. వీటితోపాటు సింగిల్ రోడ్లను డబుల్ రోడ్లు, నాలుగు రోడ్ల లైన్ల విస్తరణ చేయాల్సివుంది.

వీటిని చేపట్టిన రోజు తీరప్రాంతంలోని తూర్పు గోదావరి, విజయనగరం, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు జిల్లాల పరిధిలోని పట్టణాలు, కుగ్రామాలు సైతం మరింతగా అభివృద్ధి చెందుతాయి. నిజాంపట్నం, కృష్ణపట్నం ఓడరేవుల అభివృద్ధికి టెండర్లు ఖరారు కావాల్సివుంది. రైలు, రోడ్డురవాణామార్గాలు, మౌలిక సదుపాయాలు తీరప్రాంతాలలో రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు కల్పిస్తే నగర ప్రాంతాల నుంచి పట్టణ ప్రాంతాలకు పరిశ్రమలు స్థాపించటానికి ఉత్సాహంతో ముందుకు వచ్చే అవకాశాలున్నాయి.

అదేవిధంగా తీరప్రాంతంలో వున్న పురాతన దేవాలయాలను అభివృద్ధి చేయడం, పర్యాటక కేంద్రంగా చేయటానికి రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు ఆ దిశగా ప్రణాళికలు రూపొందిచాల్సిన ఆవశ్యకత వుంది. మత్స్య సంపద, వాణిజ్యపంటలు, పువ్వులు, పండ్లు, కూరగాయలు నిల్వచేసుకోవటానికి కోల్డ్‌స్టోరేజ్ ప్లాంట్‌లు ఏర్పాటు చేయాలి. వీటి ఏర్పాటుకు ఔత్సాహిక పారిశ్రామిక వేత్తలకు సబ్సిడీ, రుణసౌకర్యాలు కల్పించాల్సిన అవసరం ఎంతైనా వుంది. నిరుద్యోగులకు స్వయం ఉపాధి అవకాశాలను కల్పించాల్సిన అవసరం ఎంతైనా వుంది.

తీరప్రాంతాలలోని పట్టణాల అభివృద్ధికి పారిశ్రామిక వాడలు( ఇండస్ట్రీయల్ ఏరియా) ఏర్పాటుతోపాటు, పట్టణాలుగా ఏర్పడి, మున్సిపాలిటీల అభివృద్ధికి తగిన నిధులు సమకూర్చుకోలేని రేపల్లె వంటి పట్టణాలకు సమీపంలో వున్న పలు గ్రామాలను కలిపి ఆర్థిక పరిపుష్టి పెంచుకోవటానికి, భవిష్యత్తులో ప్రభుత్వం వెసులుబాటు కల్పించాల్సిన ఆవశ్యకత ఎంతైనా వుంది. భారీ పరిశ్రమలు, చిన్నతరహా పరిశ్రమలు స్థాపనకు రాష్ట్ర, కేంద్రప్రభుత్వాలు ఎఫ్‌సిఐ, నాబార్డు, జాతీయ బ్యాంకుల ద్వారా ఆర్థిక రుణసదుపాయాలు కల్పించి ప్రోత్సహించాల్సిన అవసరం ఎంతైనా వుంది. విద్యా, వైద్య, వైజ్ఞానిక, సాంస్కృతిక, సాంకేతిక రంగాలలో కూడా తీరప్రాంతాన్ని అభివృద్ధి చేయటానికి ప్రణాళికలు రూపొందించాల్సిన అవసరం వుంది.

### వారధి నిర్మాణం సరిపోదు.. మౌలిక సదుపాయాలు కల్పించాలి

కోస్తాతీరంలో కృష్ణానదిపై 71కోట్ల రూపాయల వ్యయంతో పెనుమూడి-పులిగడ్డ వారధి నిర్మించారు. కాని కృష్ణా, గుంటూరు జిల్లాలను కలుపుతూ రోడ్ల విస్తరణ పనులతోపాటు, మౌళిక సదుపాయాలు కల్పించలేదు. దీనివల్ల మద్రాసు నుంచి కాకినాడ, విశాఖపట్నం ఓడరేవులకు భారీ వాహనాలు రాకపోకలకు తీవ్ర అంతరాయం ఏర్పడుతోంది.

పెనుమూడి-పులిగడ్డ వారధి 214-ఎ రహదారివైపునుంచి ట్రాఫిక్ అనుకున్నంతగా రావటంలేదు. స్థానికంగా కూడా ఆర్టీసి, రైల్వేస్టేషన్‌లలో ప్రయాణికులకు మరిన్ని సౌకర్యాలు కల్పించటంతోపాటు, నూతనంగా దూరప్రాంతాలకు ఆర్టీసి బస్సు సర్వీస్‌లు ఏర్పాటుతోపాటు, వేమూరు రైల్వేస్టేషన్ వద్ద క్రాసింగ్ సౌకర్యం కల్పించి, రేపల్లెకు మరిన్ని రైళ్ళను నడపాలని ఈ ప్రాంత ప్రజానీకం కోరుతున్నది.

కోస్తా జిల్లాలైన తూర్పు, పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు, ప్రకాశం జిల్లాలను కలుపుతూ జాతీయ రహదారి నిర్మాణం పనులు ఇప్పటివరకు ప్రారంభంకాలేదు. పెనుమూడి-పులిగడ్డ రహదారివల్ల తూర్పుగోదావరి జిల్లాలోని కత్తిపూడి నుంచి కాకినాడ, యానాం, అమలాపురం, నరసాపురం, మొగల్తూరు, పల్లెపాలెం, బంటుమిల్లి, పెడన, మచిలీపట్నం, చల్లపల్లి, పులిగడ్డ, రేపల్లె, భట్టిప్రోలు, చెరుకుపల్లి, చందోలు, బాపట్ల, చీరాల, ఒంగోలు వరకు ప్రస్తుతం వున్న జాతీయ రహదారి నెంబరు అయిదుకు ప్రత్యామ్నాయ రహదారి నిర్మాణంగా అభివృద్ధి పనులు చేపట్టాల్సి వుంది.



కృష్ణానది

పెనుమూడి-పులిగడ్డ వారధిమీద ప్రయాణించటం ద్వారా అయిదు జిల్లాల పట్టణాలు, గ్రామాల మధ్య దూరం గణనీయంగా తగ్గుతుంది. అవనిగడ్డ నుంచి రేపల్లె మధ్య ప్రయాణ దూరం 156 కిలోమీటర్లు, అవనిగడ్డ నుంచి తెనాలి 114 కిలోమీటర్లు, నరసాపురం నుంచి రేపల్లెకు 112 కిలోమీటర్లు, మచిలీపట్నం నుంచి రేపల్లెకు 101 కిలోమీటర్లు దూరాభారం తగ్గుతుంది. 214-ఎ జాతీయ రహదారి అభివృద్ధి, విస్తరణ పనులు రానున్న వేసవిలోనైనా ప్రారంభించటానికి స్థానిక ప్రజాప్రతినిధులు, మంత్రివర్యులు చర్యలు తీసుకోవాలని ఈ ప్రాంత ప్రజానీకం కోరుతుంది.

## వాణిజ్య పంటల ఖిల్లా..

# గుంటూరు జిల్లా



(ఆన్‌లైన్-గుంటూరు)

దేశంలోని వాణిజ్య పంటలకు గుంటూరు జిల్లా కేంద్రంగా ఉంది. వర్జీనియా పొగాకు ఉత్పత్తిలో ప్రపంచంలోనే గుంటూరు ప్రధమ స్థానం ఉంది. ఆసియా ఖండంలోనే గుంటూరు మార్కెట్ యార్డు మిర్చి వ్యాపారానికి కేంద్ర బిందువైంది. సంవత్సరానికి రూ. 1500 కోట్ల వ్యాపార లావాదేవీలు జరుగుతుంటాయి. పత్తి ఉత్పత్తిలో మొదటిస్థానంలో ఉన్నాం. ఐదు దశాబ్దాల నుంచి వాణిజ్య పంటలైన పత్తి, మిర్చి, పసుపు, పొగాకు పంటలకు కేంద్రంగా ఉంది. పసుపు వ్యాపారానికి కేంద్ర బిందువుగా ఉన్న దుగ్గిరాల నుంచి అన్ని దేశాలకు ఎగుమతులు జరుగుతున్నాయి. పొగాకు పంటకు సంబంధించి దేశం మొత్తానికి ప్రాతినిధ్యం వహిస్తున్న పొగాకు బోర్డు గుంటూరు కేంద్రంగా ఉంది. పత్తి, మిర్చి పంటల ఆధారంగా ఏర్పాటు చేసిన స్పిన్నింగ్, జిన్నింగ్, కోల్డ్ స్టోరేజ్‌ల వంటి పరిశ్రమలు ఇక్కడ ఎక్కువగా ఉన్నాయి.

పత్తి, మిర్చి, పసుపు, పొగాకు పంటల ఆధారంగా ఏర్పాటు చేసిన పరిశ్రమల ద్వారా సుమారు లక్ష కుటుంబాలు ఉపాధి పొందుతున్నాయి. 50వేల మందికి ఉద్యోగాలు లభించాయి.

### స్పైసెస్ లాబ్, పార్కులు మంజూరు

సుగంధ ద్రవ్యాల పంటల్లో నాణ్యతా ప్రమాణాలను నిర్ధారించడానికి గుంటూరు కేంద్రంగా స్పైసెస్ లేబరేటరీని ఏర్పాటు చేయబోతున్నారు. ఇప్పటి వరకు పసుపు, మిర్చి, ఇతర సుగంధ ద్రవ్యాల పంటల నాణ్యతా ప్రమాణాలను తెలుసుకోవడం కోసం రైతులు కేరళలోని కొచ్చిన్ వెళ్ళేవారు. జిల్లాకు చెందిన మంత్రులు, ఎంపిలు, ఇతర ప్రజాప్రతినిధుల సూచనల మేరకు కేంద్ర వాణిజ్య మంత్రి జయరాం రమేష్ ల్యాబ్‌ను మంజూరు చేశారు. ఇటీవల దీనికి శంఖుస్థాపన కూడా చేశారు. చుట్టుగుంట సమీపంలోని పాత మార్కెట్ యార్డులో దీనిని ఏర్పాటు చేశారు. స్థల వివాదానికి సంబంధించిన సమస్యను మార్కెట్ యార్డు చైర్మన్ లేళ్ళ అప్పిరెడ్డి ఇటీవల పరిష్కరించారు. జిల్లాలో సుగంధ ద్రవ్యాల పంటల ఉత్పత్తులను, ఉత్పాదకతను మెరుగుపరచడం కోసం జిల్లాలో 120 ఎకరాలలో స్పైసెస్ పార్కును ఏర్పాటు చేస్తున్నారు. చిలకలూరిపేట సమీపంలో ప్రభుత్వం స్థలాన్ని కేటాయించింది. త్వరలో దీనిని ఇక్కడ ఏర్పాటు చేస్తున్నారు.

### పరిశోధనా కేంద్రాలు..

వ్యవసాయ

(తరువాయి 139లో)

జిల్లాలో మొత్తం విస్తీర్ణం...
... 8 లక్షల హెక్టార్లు
పత్తి విస్తీర్ణం... సుమారు 1.5 లక్షల హెక్టార్లు
మిర్చి విస్తీర్ణం..
... సుమారు 50 నుంచి 70వేల హెక్టార్లు
పసుపు విస్తీర్ణం... సుమారు 20 లక్షల హెక్టార్లు
వరి విస్తీర్ణం... సుమారు 2.75 లక్షల హెక్టార్లు
పండ్ల తోటల విస్తీర్ణం... లక్ష హెక్టార్లు

## ఆధ్యాత్మిక చింతన, భక్తి, సేవా తత్పరతలో

# తరిస్తున్న ఆర్‌సిఎం

### 150 ఏళ్ల క్రితమే రెంటచింతలలో రోమన్ క్రైస్తవ మతం ఆవిర్భావం

(ఆన్‌లైన్, రెంటచింతల)

పలు రంగాలలో విశిష్టత సంతరించుకున్న రెంటచింతలలో సుమారు 155 ఏళ్ళ క్రితం నాడే ఆర్‌సిఎం క్రైస్తవ మతం ఆవిర్భవించింది. తెలంగాణ, రాయలసీమ ప్రాంతాలైన వరంగల్, మహబూబ్‌నగర్, నల్గొండ, అనంతపురం, కడప తదితర జిల్లాల నుండి వలస వచ్చిన రోమన్ కాథలిక్ మతస్థులైన రెడ్డి కులస్థులు గుంటూరు జిల్లా పల్నాడు ప్రాంతమైన రెంటచింతల, ఫిరంగిపురం గ్రామాలలో స్థిర నివాసాలు ఏర్పరచుకున్నారు. మేరీమాత, ఏసుక్రీస్తును అత్యంత భక్తి శ్రద్ధలతో పూజించే వీరికి ఆధ్యాత్మిక చింతన అమితంగా వుండేది. దేవుడి పట్ల భక్తి భావం పెంచుకున్న వీరికి ప్రార్థనలంటే మహా మక్కువ. 1853 నాటి కాలంలో రాయలసీమ, తెలంగాణ ప్రాంతాలలో కరువు కాటకాలు తాండవించడంతో పల్నాడు ప్రాంతానికి వలస వచ్చినట్లుగా చెప్పుకుంటారు. నాడు తరలివచ్చిన కొద్దిపాటి కుటుంబాలు వ్యవసాయమే జీవనోపాధిగా ఎంచుకొని ఇక్కడి సారవంతమైన భూములను కొనుక్కొని మిర్చిపంటను అధికంగా పండించేవారు. అలా కాలక్రమంలో ఆర్‌సిఎం మతస్థులు వారు నమ్ముకున్న మేరిమాత, ఏసుక్రీస్తు దేవుని కృపవలన శ్రీమంతులుగా ఎదిగి నేడు



ఫాదర్ మోపూరి రాయపురెడ్డి, విచారణ గురువులు

రెంటచింతలలో వందలాది కుటుంబాలు జీవిస్తున్నాయి. పల్నాడులోనే గాక జిల్లా వ్యాప్తంగా ఆర్‌సిఎం క్రైస్తవ మతం విస్తృతంగా విస్తరించింది. ఫలితంగా గుంటూరు జిల్లాలోని పలు పట్టణాలు, గ్రామాలలో ఆర్‌సిఎం దేవాలయాలు నిర్మించబడ్డాయి.

#### ప్రార్థనల కోసం తపించేవాళ్ళు

రెంటచింతలకు వలస వచ్చిన ఆర్‌సిఎం మతస్థులైన ఈ క్రైస్తవుల ప్రార్థనలంటే పరితపించేవాళ్ళు. నిత్యం ఉదయం, సాయంత్రం క్రమం తప్పకుండా దేవున్ని ఆరాధిస్తూ ప్రార్థనలు జరిపేవారు. అయితే 1853లో రెంటచింతలకు వచ్చిన ఈ క్రైస్తవులకు ప్రార్థనలు చేసుకునేందుకు దేవాలయాలు లేవు. దాంతో ఓ చిన్న మందిరం ఆవరణలోనే ప్రార్థనలు నిర్వహించుకొనే వాళ్ళు.



150 ఏళ్ళ నాటి పురాతన కానుకమాత దేవాలయం

#### 1856లో దేవాలయ నిర్మాణం

భక్తిభావాలు మెండుగా వున్న రోమన్ కాథలిక్ మతస్థులైన వీరికి ప్రార్థనలు నిర్వహించేందుకు జిల్లాలోని ఫిరంగిపురం నుండి ఫాదర్లు వచ్చి ప్రార్థనలు నిర్వహిస్తుండేవాళ్ళు. అనంతరం సుమారు 1856 సంవత్సరంలో రెంటచింతలలో సుమారు పది ఎకరాల విస్తీర్ణంలో కానుకమాత దేవాలయాన్ని అహర్నిశలు శ్రమించి నిర్మించుకున్నారు. ఈ దేవాలయాన్ని నిర్మించేందుకు దాదాపు మూడేళ్ళు పట్టినట్లుగా తెలుస్తున్నది. దేవాలయ నిర్మాణం పూర్తికావడంతో ప్రాతః కాల సమయంలోను, సాయంత్రం వేళల్లోను పూజలు నిర్వహిస్తుంటారు. ప్రతి ఏడాది ఫిబ్రవరి 2న కనివిని ఎరుగని రీతిలో కానుకమాత తిరుణాళ్ళ మహోత్సవాన్ని క్రైస్తవులు అత్యంత భక్తిశ్రద్ధలతో ఘనంగా నిర్వహించడం వీరి ఆనవాయితి.

#### 1978లో మరో నూతన దేవాలయం

1856లో నిర్మించిన కానుకమాత దేవాలయం 128 ఏళ్ళకు పురాతనమైంది. పైగా పెరుగుతున్న భక్తులకనుగుణంగా ప్రార్థనలు జరిపేందుకు దేవాలయం ఇరుకుగా వుండేది. దీనిస్థానంలో మరో నూతన దేవాలయ ఆవశ్యకత ఏర్పడింది. దాంతో 1977లో నూతన దేవాలయ నిర్మాణ కార్యక్రమానికి అంకురార్పణ జరిగి 1978లో దేవాలయం పూర్తయింది. సుమారు రూ.30 లక్షలతో ఆధునికంగా దేవాలయాన్ని నిర్మించారు. దేవాలయంలో ఏసుక్రీస్తు, మేరిమాతల విగ్రహాలను ప్రత్యేకంగా తయారు చేయించారు. ఏసుక్రీస్తును సిలువ వేసే సమయంలో 14 స్థలాలు సూచించే క్రీస్తు ప్రతిమలు భక్తులను విశేషంగా ఆకట్టుకొనే విధంగా తీర్చిదిద్దడం ఈ దేవాలయ ప్రత్యేకతలో ఒకటిగా చెప్పుకోవచ్చు. సువిశాలంగా నిర్మించిన ఈ దేవాలయంలో నిత్యం క్రమం తప్పకుండా ప్రార్థనలు జరుపుతుంటారు. ఇక్కడ ప్రస్తుతం విచారణ గురువులుగా ఫాదర్ మోపూరి రాయపురెడ్డి తన దైవ సేవలు అందిస్తున్నారు. కులమతాలకతీతంగా ఎందరో అన్య మతస్థులు సైతం ఈ దేవాలయాన్ని సందర్శించి మేరిమాత, ఏసుక్రీస్తు దివ్య దీవెనలు పొందుతుంటారు. నాటి నుండి నేటి వరకు ఆర్‌సిఎం మతస్థుల కారణంగా రెంటచింతలలో క్రైస్తవ మతం బాగా ప్రాచుర్యంలోకి వచ్చిందంటే అతిశయోక్తి కాదు.



1978లో నిర్మించిన నూతన దేవాలయం

#### 100 మందికి పైగా గురువులు

రెంటచింతల ఆర్‌సిఎం క్రిస్టియన్ కుటుంబాల నుండి పలువురు యువకులు, యువతులు దేవునిపట్ల భక్తి, ఆధ్యాత్మిక చింతన, దైవ సన్నిధిలో సేవ చేయాలన్న తపన కారణంగా రెంటచింతల నుండి ఎందరో ఫాదర్లుగాను, సిస్టర్లుగాను స్థిరపడ్డారు. వీరంత దేశంలోని పలుచోట్ల వున్న ఆర్‌సిఎం చర్చి ఫాదర్లుగా దైవ సేవకులుగా సేవలు అందిస్తున్నారు. దేశ, విదేశాల్లోవీరందరు ఎక్కడ వున్నప్పటికీ ప్రతి ఏడాది



దేవాలయంలో పూజలు నిర్వహిస్తున్న ఫాదర్

రెంటచింతలలో ఫిబ్రవరి 2న జరిగే 'కానుకమాత' తిరుణాళ్ళ మహోత్సవానికి తప్పనిసరిగా రావడం ఆనవాయితి.

#### విద్యాసంస్థలు ఏర్పాటు

రెంటచింతల ఆర్‌సిఎం మత క్రైస్తవులు పరుల సేవలో సైతం పరితపిస్తుంటారు. 1957లోనే విద్యారంగంలోకి అడుగుపెట్టారు. పల్నాడులోని కులమతాలకతీతంగా పేద విద్యార్థులకు విద్యనందించాలన్న ఉన్నతాశయం కలిగింది. దాంతో 1957లో గ్రామంలో పునీత సెయింట్ జోసఫ్ ఉన్నత పాఠశాలను నిర్మించి వేలాది మంది విద్యార్థులకు ఉచితంగా విద్యనందిస్తున్నారు. హాస్టల్ సౌకర్యం కూడా కల్పించారు. ఇరవై సంవత్సరాల క్రితం సాగరుమాత పేరుతో ఓ జూనియర్ కాలేజిని స్థాపించి విద్యను విస్తరింపజేసి తమ సేవాతత్పరత చాటుకున్నారు.

# నిజాంపట్నంలో పోర్టుసిటీ



నిజాంపట్నం హార్బర్ లైట్‌హౌస్



పోర్టుసిటీ నిర్మాణానికి ప్రభుత్వం సేకరించిన భూములు

('ఆన్‌లైన్' - నిజాంపట్నం)

నిజాంపట్నంలో పదివేల కోట్ల రూపాయలతో నిర్మించతలపెట్టిన పోర్టుసిటీ నిర్మాణం నేడు తీరప్రాంత ప్రజలతీరని కోరికగా వుంది. కేంద్రప్రభుత్వం, చెక్ రిపబ్లిక్ స్కోడాన్ కంపెనీ గత సంవత్సరం పోర్టుసిటీ నిర్మాణానికి అంగీకార పత్రాలపై సంతకాలు చేశారు. 60శాతం స్కోడాన్ కంపెని 40శాతం భారతదేశం ఖర్చును భరించాల్సి వుంటుంది. రెవిన్యూ అధికారులు పోర్టుసిటీ నిర్మాణానికి మూడువేల ఎకరాల భూమిని ప్రభుత్వానికి గత సంవత్సరం అందించారు. తీరంవెంబడి అటవీశాఖ భూమి వుండటంతో అటవీశాఖ అనుమతి కోసం ప్రయత్నించినట్లు అధికారులు తెలిపారు. అటవీ శాఖ భూమి స్వాధీనానికై ఎకరాభూమికి రెండు ఎకరాల భూమిని అటవీశాఖకు ఇతర ప్రాంతంలో ఇచ్చేందుకు అధికారులు అంగీకరించారు. పోర్టుసిటీలో భాగంగా నిజాంపట్నం తీరంవెంబడి కొత్తపాలెం ప్రాంతంలో విద్యుత్ ఉత్పత్తి కేంద్రం నిర్మించాల్సి వుంది. 2012 సంవత్సరం నాటికి నిజాంపట్నం పోర్టు సిటీ 12 వేల మెట్రిక్‌టన్నుల రవాణా సామర్థ్యంతో ఏర్పాటుకు అధికారులు అంచనాలు తయారుచేశారు. పోర్టు సిటీ నిజాంపట్నంలో ఏర్పాటు జరిగితే గుంటూరుజిల్లాలోనే నిజాంపట్నం ప్రధాన వ్యాపారకేంద్రంగా మారనుంది. నిజాంపట్నం నుంచి 5వనెంబర్ జాతీయరహదారికి అనుసంధాన రోడ్లు నిర్మించాల్సిన ప్రతిపాదన చేయాల్సివుంది.

## భౌగోళిక పరిస్థితులు

* నిజాంపట్నం ప్రాంతంలో పోర్టుసిటీ నిర్మాణానికి ప్రధానకారణం భౌగోళిక పరిస్థితులు. ప్రకృతిసిద్ధంగా తూర్పుతీరంవెంబడి 17మీటర్ల ఎక్కువ లోతు వున్న ప్రాంతంగా నిజాంపట్నంను గుర్తించారు. పోర్టుసిటీ నిర్మించేందుకు ఓడలరాక పోకలకు 25మీటర్ల పైబడిన సముద్రపు లోతు అవసరమైవుంది.
* తీరప్రాంతం వెంబడి ఒక వంపువున్న కారణంగా తక్కువఖర్చుతో నిర్మాణం పూర్తికావచ్చని అధికారుల అంచనా.
* నిజాంపట్నం నుంచి కొత్తపాలెం వరకు సముద్రపు మట్టానికి 5నుంచి 10 మీటర్ల ఎత్తు వరకు మెరక ప్రాంతం వుండటం వల్ల ప్రకృతి వైపరీత్యాలను తట్టుకునే సామర్థ్యం వుంటుంది. గతంలో ఎన్నడూ నిజాంపట్నంను ఉప్పెన్నలు ముంచెత్తలేదని గ్రామస్తులు తెలిపారు.



హార్బర్ వ్యూ

## ఎగసిపడిన భూముల ధరలు

పోర్టుసిటీ నిర్మాణం జరుగుతుందన్న సమాచారం వెలువడటంతో తీరం వెంబడి భూములరేట్లు ఒక్కసారిగా ఆకాశాన్ని అంటాయి. 50వేలకు కూడా అమ్ముడుకాని భూములు ఒక్కసారిగా 20లక్షలు పలికింది. ప్రముఖ వ్యాపార సంస్థల ప్రతినిధులు ప్రధాన రోడ్లవెంబడి భూములను కొనుగోలు చేశారు. ప్రభుత్వం నుంచి ఎలాంటి ఉత్తర్వులు జారీకాక పోవటంతో భూములరేట్లు మొదటికొచ్చాయి.

## మంత్రి మోపిదేవి కాలంలోనే శంకుస్థాపన

తీరప్రాంతానికే ప్రతిష్టాత్మకమైన పోర్టుసిటీ నిర్మాణం రాష్ట్ర మౌళిక సదుపాయాలు, ఓడరేవులు, విమానయాన, సహజవాయువు, పెట్టుబడుల శాఖమంత్రి మోపిదేవి వెంకటరమణరావు కాలంలోనే జరుగుతుందని తీర ప్రాంత ప్రజలు ఆశిస్తున్నారు.

# విద్యా సరస్వతి మెడలో మణిహారం గుంటూరు జిల్లా

★ విరాజిల్లుతున్న విద్యాసౌరభాలు ★ సత్తా చాటుతున్న ప్రభుత్వ విద్యాసంస్థలు ★ సాంకేతిక కళాశాలల్లో నూతన సంస్కరణలు

(ఆన్‌లైన్ - ఎడ్యుకేషన్,గుంటూరు)

**విద్యా, విజ్ఞాన సంపదకు జిల్లా పుట్టినిల్లు....కేజి నుంచి పిజీ వరకు...ఎందరో ఇంజనీర్లను..డాక్టర్లను...యాక్టర్లను తయారు చేసే సత్తా జిల్లా విద్యారంగానికి ఉంది. సరస్వతి మెడలో జిల్లా విద్యారంగం మణిహారంగా నిలవడానికి కారణాలు ఇవే. కార్పొరేట్ సంస్కృతికి...హైటెక్ విద్యావిధానానికి నాంది జిల్లా కావడం, వేగంగా విస్తరిస్తున్న సాంకేతిక విద్యకు శ్రీకారం చుట్టింది గుంటూరు జిల్లాలోనే.**

**రాష్ట్రస్థాయిలో విద్యారంగానికి ప్రత్యేక గుర్తింపు తీసుకువచ్చిన ఘనత జిల్లాకే దక్కుతుంది.**

## సత్తాచాటుతున్న ప్రభుత్వ విద్యా సంస్థలు

గుంటూరు జిల్లాలో కార్పొరేట్ విద్యావిధానం వేగంగా విస్తరిస్తున్నా వాటికి ధీటుగా ప్రభుత్వ విద్యా సంస్థలు సత్తా చాటుకుంటున్నాయి. విద్యార్థికి సంపూర్ణ విద్య అందించేందుకు ప్రభుత్వ విద్యా సంస్థలు అలుపెరగని కృషి చేస్తున్నాయి. ఏడవ తరగతి పరీక్షల్లో మంచి ఫలితాలు సాధించిన ప్రభుత్వ సంస్థలు ఆదే ఉత్సాహంతో పదవ తరగతిలో సత్తాచాటుకున్నాయి. 2006-07లో పదవ తరగతిలో 37వేల మంది విద్యార్థులు పరీక్షకు హాజరు కాగా వారిలో27వేల మంది (71.03శాతం) ఉత్తీర్ణత సాధించారు. ఇందులో అత్యధికంగా జిల్లా పరిషత్ పాఠశాలల విద్యార్థులు ఉండటం గమనార్హం. జిల్లాలో అత్యధిక మార్కులు సాధించిన ఘతన కూడా జిల్లా పరిషత్ పాఠశాలలో చదివిన విద్యార్థులదే. పటిష్టమైన విద్యాప్రణాళిక తయారు చేయడంలో జిల్లా విద్యాశాఖాధికారి మువ్వా రామలింగం ప్రత్యేక చర్యలు తీసుకుంటున్నారు. జిల్లా పరిషత్ పాఠశాలల్లో పదవ తరగతి చదివే విద్యార్థులకు పరీక్షల సమయంలో పౌష్టికాహారం అందించేందుకు జిల్లా పరిషత్ ఛైర్ పర్సన్ కూచిపూడి విజయ ప్రత్యేకంగా నిధులు కేటాయిస్తున్నారు. పదవ తరగతి ఫలితాల విషయంలో రాష్ట్రస్థాయిలో మొదటి పది స్థానాల్లో జిల్లా ఒకటిగా నివడం విద్యారంగ ప్రగతిని పతాకస్థాయికి చేరుస్తోంది.

## ఇంటర్ విద్యకు జవసత్వాలు

కార్పొరేట్ కళాశాలల దెబ్బకు బెంబేలెత్తిపోతున్న ఇంటర్ విద్య ఇప్పుడు డిప్పుడే జవసత్వాలు నింపుకొంటుంది. కొత్తగా వచ్చిన ఆర్ఐఒ డాక్టర్ మారం శతృఘ్నరెడ్డి ఫలితాలు మెరుగు కోసం కృషి చేసే పనిలో నిమగ్నమయ్యారు. జిల్లాలో ఉన్న 18 జూనియర్ కళాశాలల్లో అధ్యాపకుల భర్తీ, మౌలిక వసతులు కల్పించేందుకు నాబార్డు నుంచి 3కోట్లు నిధులు సమకూరడంతో ప్రభుత్వ కళాశాలలు పూర్వ వైభవం సంతరించుకుంటున్నాయి. ఈ ఏడాది 38వేల మంది విద్యార్థులు పరీక్షకు హాజరుకాగా వారిలో 20,599 మంది ఉత్తీర్ణత(53.14శాతం) సాధించారు. ఇందులో ప్రభుత్వ కళాశాలల నుంచి పరీక్షకు హాజరైన విద్యార్థులు అత్యధిక మార్కులు సాధించారు. ప్రత్యేకించి ప్రభుత్వ మహిళా జూనియర్ కళాశాల విద్యార్థునులు రాష్ట్రంలోని పది టాప్ ర్యాంకుల్లో ఒకరుగానిలిచారు. ప్రభుత్వ కళాశాలల్లో ఎంసెట్‌కు శిక్షణ ఇవ్వడం ఈ ఏడాది నుంచే ప్రారంభించారు. ఫలితంగా కళాశాలల్లో హాజరుశాతం, అడ్మిషన్లు పెరిగాయి. ప్రభుత్వ కళాశాలల్లో అకడమిక్ మానిటరింగ్ సెల్, విద్యలో వెనుకబడి ఉన్న విద్యార్థులకు ప్రత్యేక శిక్షణ ఇవ్వడం చేస్తున్నారు. ఇలా ప్రభుత్వ కళాశాలల్లో ఇంటర్ విద్య మరింత బలపడేందుకు దోహద పడుతోంది. శత వసంతాల చరిత్ర ఉన్న ఏసి కళాశాల, స్వాతంత్ర్యానికి పూర్వం స్థాపించిన హిందూ కళాశాల, ప్రభుత్వ మహిళా డిగ్రీ కళాశాలలు జిల్లాలో ఉన్నాయి. ఎంతోమంది మేధావులను, రాజకీయ నాయకుల్ని తయారు చేసిన ఘనత వాటికే సొంతం.



ప్రభుత్వ మహిళా డిగ్రీ కళాశాల

## కొత్తపుంతలు తొక్కుతున్న సాంకేతిక విద్య

రెండు దశాబ్దాల క్రితం ఐటిఐ విద్య అంటే విద్యార్థుల్లో మంచి క్రేజ్ ఉండేది. సాఫ్ట్‌వేర్ బూమ్‌తో ఒక్కసారి ఇంజనీరింగ్ విద్య ప్రస్థానం తారస్థాయికి చేరింది. అయిదంకెల జీతం వచ్చే సాఫ్ట్‌వేర్ ఉద్యోగాలకు డిమాండ్ పెరుగుతోంది. దీంతో నిన్నమొన్నటి దాక పదికి మించని ఇంజనీరింగ్ కళాశాలల సంఖ్య ప్రస్తుతం 22కు చేరింది. ఇంజనీరింగ్ విద్యలో మేటిగా ఉన్న బాపట్ల

(తరువాయి 137వ పేజీలో)

# విద్యా సరస్వతి మెడలో...



ఏసి కళాశాల

(136వ పేజీ తరువాయి)

ఇంజనీరింగ్ కళాశాల, ఆర్‌విఆర్‌అండ్ జెసి, విజ్ఞాన్, వడ్డేశ్వరంలోని కెయల్‌సి, చిలకలూరిపేట చుండిరంగనాయకులు, మాచర్ల ఎంపిఎల్‌జి, న్యూటన్, నరసరావుపేట ఇంజనీరింగ్ కళాశాల, లయోలా, నలందా, తదితర ఇంజనీరింగ్ కళాశాలలు ఇంజనీరింగ్ విద్యలో విప్లవాత్మక మార్పులు తీసుకువచ్చాయి. విద్యతో పాటు ఉపాధి కల్పించడమే లక్ష్యంగా ఆయా కళాశాల విద్యను అందిస్తున్నాయి. ఈ ఏడాది మరో 11 ఇంజనీరింగ్ కళాశాలలు వచ్చాయి. వాటిలో కూడా ఒక్కసీటు కూడా మిగలేదంటే ఇంజనీరింగ్ విద్యకు ఉన్న క్రేజ్ ఏపాటిదో అవగతం చేసుకోవచ్చు.

ఇక ఫార్మశీ విద్యలో కూడా మంచి అవకాశాలు రావడంతో ఈ కళాశాలలు కూడా పెరుగుతున్నాయి. జిల్లాలో దాదాపు పదికిపైగా ఫార్మశీ కళాశాలు ఏర్పాటు అయ్యాయి.

## విస్తరిస్తున్న బిఇడి కళాలలు

ఒకప్పుడు జిల్లాలో ఎఎల్ బిఇడి కళాశాలలో మాత్రమే బిఇడి విద్య అందించేవారు. అయితే ప్రస్తుతం జిల్లాలో దాదాపు పది బిఇడి కళాశాలు వచ్చాయి. ఒక్కో కళాశాల నుంచి వందమంది విద్యార్థులు బిఇడి పూర్తి చేస్తున్నారు. ప్రభుత్వం కూడా డిఎస్సీ ద్వారా ఉపాధ్యాయ పోస్టులు భర్తీ చేయడంతో బిఇడి విద్యకు భారీ డిమాండ్ ఏర్పడుతోంది. బిఇడి పూర్తి చేసిన వారికి ప్రైవేటు పాఠశాలల్లో కూడా మంచి అవకాశాలు ఉండటంతో డిగ్రీ పూర్తి చేసిన వారు పీజి కోర్సుల కంటే బిఇడి విద్యపై ఆసక్తి

(తరువాయి 138వ పేజీలో)













# విద్యా సరస్వతి మెడలో మణిహారం గుంటూరు జిల్లా

(137వ పేజీ తరువాయి)

చూపుతున్నారు.

### మేనేజ్‌మెంట్ విద్యకు తరగని ఆదరణ

ఇంజనీరింగ్ విద్యతో సమానంగా మేనేజ్‌మెంట్ విద్య కూడా జిల్లాలో విస్తరిస్తోంది. ఇంజనీరింగ్ విద్యర్థులతో సమానంగా ఎంసిఎ, ఎంబిఎ విద్య పూర్తి చేసిన వారికి మంచి ఉపాధి అవకాశాలున్నాయి. అనేక కార్పొరేట్ సంస్థలు మేనేజ్‌మెంట్ విద్యార్థులకు మెరుగైన అవకాశాలు కల్పిస్తున్నాయి. ప్రైవేటు విద్యా సంస్థలు మంచి మౌలిక వసతులతో మేనేజ్‌మెంట్ విద్యను సమర్థవంతంగా అందిస్తున్నాయి.

### చైనా వైద్య విద్యపై జిల్లా విద్యార్థుల చూపు

తక్కువ ఖర్చుతో చైనాలో వైద్య విద్య అందించేందుకు చైనాలోని అనేక యూనివర్సిటీలు ముందుకు వస్తున్నాయి. దీంతో ఏటా జిల్లా నుంచి వందల సంఖ్యలో విద్యార్థులు చైనాలో వైద్య విద్య చదివేందుకు వెళ్తున్నారు. విద్యార్థులకు మెరుగైన సేవలు అందించేందుకు గుంటూరులో ఉన్న శ్రీవెంకట సాయి ఎడ్యుకేషనల్ కన్సల్టెన్సీ ప్రత్యేక చర్యలు తీసుకుంటున్నారు. సరస్వతి ఆన్‌లైన్ డాట్‌కామ్ ద్వారా చైనాలో వైద్య చదివేందుకు 500 మంది విద్యార్థులను పంపినట్లు నిర్వాహకులు పి సీతారామయ్య తెలిపారు. అడ్మిషన్ నుంచి నాలుగున్నర సంవత్సరాలు వైద్య విద్యపూర్తి అయ్యేవరకు విద్యార్థులకు మెరుగైన సేవలు అందిస్తున్నారు.

### ప్రగతిపథంలో సంక్షేమహాస్టళ్ళు

జిల్లాలో సాంఘిక,బిసి,గిరిజన సంక్షేమశాఖ ఆధ్వర్యంలో దాదాపు 150పైగా సంక్షేమహాస్టల్స్ ఉన్నాయి. ఆయా హాస్టల్స్‌లో ఫలితాలు సంతృప్తికరంగా ఉన్నాయి. సాంఘిక సంక్షేమశాఖ ఆధ్వర్యంలో 9,374 మంది విద్యార్థులు విద్యాభ్యాసం చేస్తున్నారు. పదవ తరగతిలో 90.7 శాతం, ఏడవ తరగతిలో 97శాతం ఫలితాలు సాధించారు. సాంఘిక సంక్షేమశాఖ ఆధ్వర్యంలో కార్పొరేట్ కళాశాలల్లో ప్రవేశం కోసం ప్రత్యేక చర్యలు తీసుకుంటున్నారు. పదవ తరగతిలో అత్యుత్తమ మార్కులు సాధించిన 23 మంది విద్యార్థులు 2007 విద్యా సంవత్సరంలో కార్పొరేట్ కళాశాలల్లో ఉచితంగా ప్రవేశం కల్పించారు. ఈ ఏడాది వినూత్న రీతీలో హాస్టల్స్‌లో విద్యావాలంటీర్లను నియమించి ఫలితాలు పెంచేందుకు కృషి చేస్తున్నామని సాంఘిక సంక్షేమశాఖ డిప్యూటీ డైరెక్టర్ కె రామకృష్ణ స్పష్టం చేస్తున్నారు. కళాశాలల్లో చదివే విద్యార్థులకు ఈ ఏడాది రూ.13.75కోట్లు ఉపకారవేతనాలు మంజూరు చేశారు. మొత్తం 15,213 మంది విద్యార్థులు ఈ స్కాలర్‌షిప్‌ల ద్వారా లబ్ది పొందుతున్నారు. అదే విధంగా కులాంతర వివాహాలు చేసుకున్న 26 జంటలకు రూ. 2.60లక్షలు పంపిణీ చేశారు.



హైటెక్ విద్యకు నాంది

### కార్పొరేట్ విద్యలో వినూత్న మార్పులు

జిల్లాలో కార్పొరేట్ విద్యా సంస్థల్లో సమూల మార్పులు వస్తున్నాయి. మంచి మౌలిక వసతులతో మెరుగైన విద్యను అందించేందుకు వారు సన్నద్ధమౌతున్నారు. శివారు ప్రాంతాల్లో విశాలమైన విద్యాసముదాయాల్లో విద్యాబోధనకు శ్రీకారం చుట్టారు. నిన్నమొన్నటి వరకు ఐఐటి కోచింగ్‌కు హైదరాబాదు వెళ్లాల్సిన పరిస్థితి ఉండేది. ప్రస్తుతం కాన్సెప్ట్ స్కూల్స్‌లో పేరుతో కార్పొరేట్ విద్యా సంస్థలు ఐఐటి కోచింగ్‌కు ప్రత్యేక విభాగాలు ఏర్పాటు చేశారు. భాష్యం, విజ్ఞాన్, వికాస్, గౌతమ్, శ్రీ పూజిత, కన్నా తదితర విద్యా సంస్థల్లో ఈ విధానాన్ని అమలు చేయస్తున్నారు. ఇలా కెజి నుంచి పీజి వరకు విద్యారంగంలో అగ్ర భాగాన ఉన్న జిల్లా, 'విద్యారంగానికి ఖిల్లా'గా ఉన్న తన పేరును రాష్ట్ర స్థాయిలో సుస్థిరం చేసుకునే ప్రయత్నంలో ఉంది.



## ఇంటింటికీ దూరవిద్య

(ఆన్‌లైన్ – ఆచార్య నాగార్జున యూనివర్సిటీ)

ఆచార్య నాగార్జున యూనివర్సిటీ విద్యా వ్యాప్తిలో భాగంగా అందరికీ విద్య అందుబాటులోకి తేవడానికి దూర విద్యా కేంద్రాన్ని ఏర్పాటుచేస్తున్నది. ఏర్పాటైన కొద్దికాలంలోనే అనేక వినూత్నమైన కోర్సులను ప్రవేశపెట్టడం ద్వారా విద్యార్థులకు మరింత చేరువయింది. ఎన్ఆర్ఐ మెడికల్ కళాశాలవారి సహకారంలో దేశంలో ఎక్కడా లేని విధంగా హెచ్ఐవి – ఎయిడ్స్ కౌన్సిలింగ్ సర్టిఫికెట్ కోర్సులను ప్రవేశపెట్టింది. వీటితోపాటు ఎక్కువ డిమాండ్ ఉన్న ఎంఎస్‌సి, డిప్లొమోలలో అనేక కోర్సులను అందజేస్తున్నది.

ఉద్యోగం చేసుకుంటూ చదువుపై ఆసక్తికలిగి పరిస్థితులు అనుకూలించక చదువుకోలేకపోయినా అనేక మందిలో వర్సిటీ దూరవిద్య కేంద్రం ఆశాజ్యోతిని వెలిగించింది. గృహిణులు సైతం దూర విద్యా కేంద్రంలో విద్యను అభ్యసించడానికి చాలా ఎక్కువగా ముందుకు వస్తున్నారు. ఇప్పటి వరకు దూర విద్యా కేంద్రంలో ఉన్న అన్ని కోర్సులకు డిస్టెన్స్ ఎడ్యుకేషన్ కౌన్సిల్ (డిఇసి), న్యూఢిల్లీ వారి అనుమతి లభించడంతో ఈ సంవత్సరం నుంచి దూర విద్యలో చదువుకునే విద్యార్థుల సంఖ్య మరింత పెరిగిందని దూర విద్య కేంద్రం డైరెక్టర్ ఆచార్య వి చంద్రశేఖర్ తెలియజేశారు.

# వాణిజ్య పంటల ఖిల్లా... గుంటూరు జిల్లా

(133 తరువాయి) పరిశోధనలను, ఉత్పత్తి, ఉత్పాదకత, నాణ్యతా ప్రమాణాలను మెరుగుపరచడం కోసం ప్రభుత్వం అనేక పరిశోధనా కేంద్రాలను ఏర్పాటు చేసింది. బాపట్లలోని ఆచార్య ఎన్‌జి రంగా వ్యవసాయ కళాశాల, చెఱుకుపల్లి మండలం కావూరులోని ఆచార్య రంగా కృషి విజ్ఞాన కేంద్రం, గుంటూరు సమీపంలో ఉన్న తాడికొండ మండలం లాం పరిశోధనా కేంద్రం, అమరావతిలోని వ్యవసాయ పరిశోధనా సంస్థ, గుంటూరులో ఉన్న భూ సేకరణ నాణ్యతను పరిశీలించే సంస్థలు, గుంటూరు మార్కెట్ యార్డులోని ఏరువాక కేంద్రం, చిలకలూరిపేట రోడ్డులో ఉన్న పొగాకు పరిశోధనా కేంద్రం తదితర సంస్థలు రైతులకు అవసరమైన సలహా సూచనలు ఇస్తున్నాయి. దేశంలోనే రైతు నాయకుడుగా గుర్తింపు పొందిన ఎన్‌జి రంగా, కేంద్రంలో సుదీర్ఘకాలం మంత్రిగా పనిచేసిన కొత్తా రఘురామయ్య, డాక్టర్ యలమంచిలి శివాజి, రాష్ట్ర వ్యవసాయ మంత్రిగా పనిచేసిన యడ్లపాటి వెంకటరావు, కేంద్ర వ్యవసాయ మంత్రిగా పనిచేసిన డాక్టర్ ఉమ్మారెడ్డి వెంకటేశ్వర్లు ఈ జిల్లాకు చెందిన వారే.



### ఎగుమతులకు కేంద్ర బిందువు

గుంటూరు కేంద్రంగా పత్తి, పొగాకు, మిర్చి, పసుపు తదితర వ్యవసాయ ఉత్పత్తులు ప్రపంచంలోని అన్ని దేశాలకు ఎగుమతి అవుతున్నాయి. ప్రపంచంలోనే పొగాకు ఎగుమతులకు పేరెన్నికగన్న సంస్థలు గుంటూరులోనే ఉన్నాయి. గుంటూరు కేంద్రంగా ఏపి కాటన్ అసోసియేషన్, మిర్చి కమీషన్ వ్యాపారుల సంఘాలు పనిచేస్తున్నాయి.

### పెరిగిన మిర్చి, పత్తి విస్తీర్ణం

జిల్లాలో లక్ష ఎకరాలలో పత్తి, మిర్చి పంటల విస్తీర్ణం పెరిగింది. బీటి పత్తి విత్తనాల ధరలు తగ్గడం, మిర్చి ధర ఎక్కువగా ఉండటం వలన అనేక మంది రైతులు ఈ పంటల వైపు ఆకర్షితులయ్యారు. రెండు సంవత్సరాల నుంచి సకాలంలో వర్షాలు పడటం వలన సాగు విస్తీర్ణం పెరిగింది. వాణిజ్య పంటల్లో ఎక్కువగా లాభాలు ఆర్జించే అవకాశం ఉండటంతో ఎక్కువ మంది ఈ పంటల వైపు మొగ్గుచూపుతున్నారు.

## వాణిజ్య పంటలకు నిలయంగా

# లంక గ్రామాలు

(ఆన్‌లైన్ - భట్టిప్రోలు)

వాణిజ్యపంటలకు నిలయమైన లంకగ్రామాల్లో రైతాంగం ఆయా పంటలసాగులో పలు సమస్యలను ఎదుర్కొంటున్నారు. మండలంలోని వెల్లటూరు, చింతమోటు, పెదలంక, పెసర్లంక, గొరిగపూడి, ఓలేరు, పెదపులివర్రు తదితర లంకగ్రామాల్లోని మెట్టభూముల్లో అరటి, పసుపు, కంద, బొప్పాయి, తమలపాకు, ఇతర కూరగాయల పంటలను పండిస్తున్నారు. ఈ పంటలు పండిస్తున్న రైతాంగాన్ని ప్రతి ఏడాది ప్రకృతి వైపరీత్యాలు ఏదోరూపంలో కన్నెర్ర చేస్తూనేవున్నాయి. గత సంవత్సరం కృష్ణానదికి వచ్చిన వరదలు కారణంగా వెల్లటూరులోని చిన్నరేవు పొంగి పొర్లుతూ అరటి, బొప్పాయి, మొక్కజొన్న, పసుపు, కంద వంటి పంటలను కృష్ణమ్మ వరదనీటి రూపంలో తుడిచిపెట్టుకుపోయింది.



కోతకుసిద్ధంగా వున్న తమలపాకు

దీంతో రైతాంగం లక్షలాది రూపాయల పంటలను నష్టపోతే ప్రభుత్వం కంటి తుడుపుచర్యగా కొద్ది మొత్తంలో సహాయం అందించి చేతులు దులుపుకుంది. నేలతల్లినే నమ్ముకుని జీవిస్తున్న రైతాంగం ఆత్మస్థైర్యంతో తిరిగి ఎకరాకు 20వేల నుంచి 30వేల రూపాయల వరకు వెచ్చించి పంటలను సాగుచేసిన రైతాంగాన్ని ఓగ్ని కోలుకోలేని స్థితికి నెట్టివేసింది.

ప్రకృతి వైపరీత్యాలు ఈవిధంగా పగసాగిస్తుంటే మరోవైపు ఉప్పిరిసిన భూగర్భజలాలు లంకగ్రామాల రైతులకు శాపంగా మారాయి. పంటలకు అందవలసిన మంచినీరు స్థానంలో ఉప్పునీరు అందుతుండటంతో పంటల దిగుబడులు గణనీయంగా తగ్గటమే కాక వ్యవసాయంలో ఖర్చుల



లంకగ్రామాల్లో బొప్పాయిపంట



కాయ దశలో కందపంట

భారం తారాస్థాయికి చేరుతుంది. దీంతో లంకరైతులకు వ్యవసాయం ఒక సాహసంగా మారింది. ఇదిలావుంటే ఉద్యానపంటల్లో రైతులకు తగిన సూచనలను అందించాల్సిన అధికారులు లంకగ్రామాలవైపు కన్నెత్తైనా చూడటంలేదన్న విమర్శలు రైతుల నుంచి వినిపిస్తున్నాయి. వీటికితోడు విద్యుత్ అధికారులు కూడా లంకరైతులతో చెలగాటం ఆడుతున్నారనటంలో ఎలాంటి సందేహం లేదు.

వ్యవసాయానికి తొమ్మిదిగంటలపాటు విద్యుత్ సరఫరా చేస్తామని ముఖ్యమంత్రి సైతం ప్రకటనలు చేస్తున్నప్పటికీ ఇక్కడ 7గంటలు కూడా సక్రమంగా విద్యుత్ సరఫరా కావటంలేదు. ఈకారణంగా విద్యుత్ మోటార్లు పనిచేయటం పంటలకు నీరందక పైరు పచ్చదనం కోల్పోతుంది.

వాణిజ్యపంటలకు నిలయమైన లంకగ్రామాల్లోని రైతులు ఎదుర్కొంటున్న సమస్యలను పరిష్కరించి ఆయా పంటల ఉత్పత్తుల్లో రైతాంగాన్ని ప్రోత్సహించాల్సిన బాధ్యత ఇటు ప్రభుత్వం అటు అధికారులపై ఎంతైనా వుంది.

# ప్రగతి పథంలో మంగళగిరి పురపాలకసంఘం



శ్రీ వల్లభనేని బాలశౌరి
పార్లమెంటు సభ్యులు, తెనాలి

శ్రీ కోనేరు రంగారావు
పురపాలక శాఖామాత్యులు

డా॥ వై.ఎస్.రాజశేఖరరెడ్డి
ముఖ్యమంత్రివర్యులు

శ్రీ మురుగుడు హనుమంతరావు
సర్వశిక్ష అభియాన్ మంత్రివర్యులు

శ్రీ మునగాల మల్లేశ్వరరావు
మునిసిపల్ వైస్‌ఛైర్మన్

## 'ఆంధ్రజ్యోతి'కి పంచమ వార్షికోత్సవ శుభాకాంక్షలు



### రెండేళ్ల కాలంలో రూ.8 కోట్ల విలువైన అభివృద్ధి పనులు

● ప్రభుత్వ గ్రాంట్లు రూ.6.798 కోట్లు కాగా మునిసిపల్ సాధారణ నిధులు రూ.1కోటి 20 లక్షలు ● ఇందిరమ్మ పథకం కింద కొత్తగా 240మంది వృద్ధులకు, 240మంది వితంతువులకు, 42మంది వికలాంగులకు ఫించన్లు మంజూరు. ● 1328 మంది చేనేత కార్మికులకు చేనేత ఫించన్లు మంజూరు. ● ప్రతి ఇంటి నుంచి రిక్షా మరియు డబుల్ బిన్ పద్ధతిన చెత్తాచెదారము తీసుకొనిపోవు పథకం అమలు. ● దారిద్ర్య రేఖకు దిగువన ఉన్న 1450మంది లబ్ధిదారులకు 1200 రూపాయల విరాళానికి నెలకు రూ.100 వంతున 12 సులభ వాయిదాల పద్ధతిలో మంచినీటి కుళాయిలు మంజూరు చేయడమైనది. ● ఇ.ఐ.యు.ఎస్ పథకం కింద రూ.6.00 లక్షలతో నీరుకొండ దళిత శిబిరంలో పైపులైన్లు మరియు భద్రావతి నగర్‌లో కాలువలను నిర్మించడమైనది. ● రాజీవ్ నగరబాట నిధులు రూ.131.87లక్షలతో శ్రీ లక్ష్మీనృసింహస్వామి కాలనీలో కాలువలు, రోడ్లు, నీటి సరఫరా లైన్లు వేయడమైనది. ● 300మంది పేద మహిళలకు వివిధ వృత్తులలో శిక్షణ మరియు ఉపాధి కల్పన. ● రూ.90 లక్షల వ్యయంతో నూతన మునిసిపల్ కార్యాలయ భవన నిర్మాణం పూర్తి. ● తెనాలి పార్లమెంటు సభ్యులు శ్రీ వి. బాలశౌరి గారి యం.పి. గ్రాంటు నిధులు రూ.23.00 లక్షల వ్యయంతో రోడ్లు, కాలువలు, వీధి దీపాల ఏర్పాట్లు. ● రూ.130 లక్షల వ్యయంతో కుప్పురావుకాలనీలో రిజర్వాయర్ నిర్మాణం మరియు పైపులైన్ల ఏర్పాటుకు రాష్ట్రప్రభుత్వ అనుమతి మంజూరు. ● రూ.45.00 లక్షల వ్యయంతో 12వ ప్రణాళిక ఆర్థిక సంఘం నిధులతో శానిటేషన్ అభివృద్ధి. ● రూ.91.00 లక్షల ఐ.డి.ఎస్.ఎం.టి. నిధులతో షాపింగ్ కాంప్లెక్సులు, శ్మశాన వాటికలకు ప్రహరీ గోడలు, మాంసం మార్కెట్లు, గొర్రెల వధశాల నిర్మాణము. ● ఎ.పి.యు.ఆర్.ఎం.ఎస్.పి నిధులు రూ.105.00 లక్షలతో పేదల నివాస ప్రాంతాలలో సిమెంటు రోడ్లు కాలువలను నిర్మించుట. ● స్పెషల్ గ్రాంటు నిధులు రూ.93.93 లక్షలతో సిమెంటు రోడ్లు, డ్రైను నిర్మాణము జరుగుచున్నది. ● రాజ్యసభ సభ్యులు శ్రీ పెనుమల్లి మధు గారి ఎం.పి. గ్రాంటు నిధులు రూ.6.50లక్షలతో సి.సి. రోడ్ల నిర్మాణము. ● స్థానిక శాసనసభ్యులు శ్రీ మురుగుడు హనుమంతరావు గారి ఎ.సి.డి.పి. నిధులు రూ.12.50 లక్షలతో సి.సి. రోడ్లు, పైపులైన్ల నిర్మాణానికి చర్యలు తీసుకోవడమైనది. ● మునిసిపల్ సాధారణ నిధులు రూ.1 కోటి 20 లక్షలతో పలు రోడ్లు, డ్రైన్లు, స్ట్రీట్ లైటింగ్ ఏర్పాటు.

## మునిసిపల్ పాలకవర్గ సభ్యులు



ఎ. రుక్మిణమ్మ 2వ వార్డు | పి. వెంకటేశ్వర్లు 3వ వార్డు | సి.హెచ్. పిచ్చియ్య 4వ వార్డు | జి. కృష్ణవేణి 5వ వార్డు | ఎం.విజయలక్ష్మి 6వ వార్డు | ఎ. ఉమామహేశ్వరి 7వ వార్డు | వి. పెదలక్ష్మయ్య 8వ వార్డు | యు. శ్రీను 9వ వార్డు | సి.హెచ్. భాగ్యలక్ష్మి 10వ వార్డు | డి. రాధాకృష్ణకుమారి 11వ వార్డు



ఎస్.బాలాజీగుప్తా 12వ వార్డు | షేక్ మున్ని 13వ వార్డు | కె. స్వరూపారాణి 15వ వార్డు | టి. ప్రసన్న కుమార్ 16వ వార్డు | కె. శ్రీరామచంద్రమూర్తి 17వ వార్డు | డి. శివరామరాజు 18వ వార్డు | కె. లక్ష్మణరావు 19వ వార్డు | వి. శ్రీకృష్ణ రాజేంద్రప్రసాద్ 20వ వార్డు | పి. శివశంకరరావు 21వ వార్డు | కె. అంకమ్మరావు 22వ వార్డు



డి. నాగేశ్వరరావు 23వ వార్డు | ఎన్.ఆబద్దయ్య 24వ వార్డు | ఎ. శివపార్వతి 25వ వార్డు | డి. నాగేంద్రమ్మ 26వ వార్డు | ఎం. అరుణకుమారి 27వ వార్డు | డి. సత్యానందం 28వ వార్డు | ఎస్.కె.ఎం.డి. రఫీ 29వ వార్డు | ఎస్. వెంకటకృష్ణ 30 వార్డు | ఇ. శ్రీనివాసరావు 31వ వార్డు | కె. సాంబయ్య 32వ వార్డు



ఎం.డి. ఇక్బాల్ మైనార్టీ కో-ఆప్షన్ సభ్యులు | కె. కోటయ్య కో-ఆప్షన్ సభ్యులు | ఎం. జ్యోతి మహిళా కో-ఆప్షన్ సభ్యురాలు



**కె. లక్ష్మీనారాయణ**
కమిషనర్, మంగళగిరి పురపాలకసంఘం

**కాండ్రు శ్రీనివాసరావు**
మునిసిపల్ ఛైర్మన్

**మునిసిపల్ కౌన్సిల్ & సిబ్బంది, మంగళగిరి**

## ప్రపంచ జిమ్నాస్టిక్స్‌లో

# అసాధారణ క్రీడాకారిణి అనితారెడ్డి

(ఆన్‌లైన్, రెంటచింతల)

సర్వ విన్యాసాలతో పోల్చదగిన జిమ్నాస్టిక్స్ క్రీడలో రాణించాలంటే సామాన్యమైన విషయమేమి కాదు. జిమ్నాస్టిక్స్‌లో రాటుదేలాలంటే అందుకు కఠోర శ్రమ, సాధించాలన్న పట్టుదల, కృషి ఎంతైనా అవసరం. 'కృషి వుంటే మనుషులు రుషులవుతారు.. మహా పురుషులవుతారు' అన్నాడో మహాకవి. ఆ కవి మాటలను రుజువు చేస్తూ తాననుకున్న రంగంలో రాణించి అంతర్జాతీయ స్థాయిలో కన్నవారికి, దేశానికి గర్వకారణంగా నిలచింది ఓ వనిత. ఆమె ఎవరో కాదు.. భారతదేశం గర్వించదగ్గ జిమ్నాస్టిక్స్ అంతర్జాతీయ క్రీడాకారులలో ఒకరైన లక్కు అనితారెడ్డి. గుంటూరు జిల్లా రెంటచింతల సాగరుమాత కాలేజీలో ఫిజికల్ డైరెక్టర్, ప్రముఖ వాలీబాల్ క్రీడాకారుడు లక్కు కృష్ణారెడ్డి, వెంకటరమణల ముద్దుల పట్టి ఈ అనితారెడ్డి. వీరి స్వగ్రామం నరసరావుపేట డివిజన్ రొంపిచర్ల మండలం. అనిత తండ్రి ఉద్యోగరీత్యా గత పదిహేనేళ్ళుగా రెంటచింతలలో వుంటున్నారు.



స్వర్ణ, రజత పతకాలతో అనితారెడ్డి

ప్రపంచ జిమ్నాస్టిక్ చాంపియన్ షిప్ పోటీలలో పాల్గొని చైనా, జపాన్ రష్యా, అమెరికా వంటి దేశాలకు చెందిన మెరికల్లాంటి జిమ్నాస్టిక్స్ క్రీడాకారులతో పోటీపడి పతకాలు సాధించాలంటే దాదాపు అసాధ్యమనే చెప్పాలి. అటువంటిది 2006లో చైనా, బ్యాంకాక్‌లలో జరిగిన ఏరోబిక్స్ జిమ్నాస్టిక్స్‌లో పాల్గొనేందుకు భారతదేశం తరఫున అనితారెడ్డికి సువర్ణావకాశం దక్కింది. ఆ పోటీలలో మెరుపుతీగల్లాంటి క్రీడాకారులతో పోటీ పడిన అనితారెడ్డి 7వ స్థానంలో నిలచింది. ఏషియన్ ఛాంపియన్ షిప్‌లోను, చైనాలో జరిగిన ప్రపంచ ఛాంపియన్ షిప్‌లోను పతకాలు సాధించలేకపోయినప్పటికీ ఆ పోటీలు భవిష్యత్‌లో అంతర్జాతీయ పతకాలు సాధించేందుకు మంచి అనుభవాన్ని ఇచ్చాయి. అసలు ఆ పోటీలకు క్వాలిఫై కావడమంటేనే సాధారణ విషయం కాదు. పులి కడుపున పులే పడుతుంది కాని పిల్లి పుట్టదని అనితారెడ్డి రుజువుచేసింది. ఓ గొప్ప క్రీడాకారుడైన తన తండ్రి కృష్ణారెడ్డినే స్ఫూర్తిగా తీసుకొని బాల్యం నుండే జిమ్నాస్టిక్స్ పట్ల ఆసక్తి పెంచుకున్న అనిత అనతి కాలంలోనే తండ్రి ప్రోత్సాహంతో అంతర్జాతీయ స్థాయికి ఎదిగింది.

### బాల్యం...

లక్కు కృష్ణారెడ్డి, వెంకటరమణ దంపతులకు 1987, జూలై 7న అనితారెడ్డి జన్మించింది. నాల్గవ తరగతి చదువుతున్న రోజులలోనే ఈ బాలిక క్రీడల పై ఎంతో మక్కువ పెంచుకుంది. అనితారెడ్డికి క్రీడల పై వున్న అమితమైన ఆసక్తిని గమనించిన తండ్రి కృష్ణారెడ్డి తన కూతురును ఓ గొప్ప క్రీడాకారిణిగా తీర్చిదిద్దాలని తలించి 4వ తరగతి చదువుతుండగానే సికింద్రాబాద్‌లోని ఎపి స్పోర్ట్స్ స్కూల్‌లో చేర్పించారు. 11వ ఏటలో 1998లో మెదక్ జిల్లా సంగారెడ్డిలో జరిగిన 12వ ఇంటర్ డిస్ట్రిక్ట్ సబ్ జూనియర్ పోటీలలోను అదే సంవత్సరం నవంబరులో జరిగిన పోటీలలో పాల్గొని తన ప్రతిభను చాటింది. 2000లో వరంగల్‌లో జరిగిన జిమ్నాస్టిక్స్ చాంపియన్ షిప్ మీట్‌లో పాల్గొని మొదటి స్థానంలో నిలిచి స్వర్ణ పతకాన్ని కైవసం చేసుకుంది. కేరళ రాష్ట్రం కాజికోడ్‌లో జరిగిన 14వ సబ్ జూనియర్ నేషనల్ జిమ్నాస్టిక్స్ ఛాంపియన్‌షిప్‌లో పాల్గొని రిబ్బన్, రోప్, హూప్‌ల గోల్డ్ మెడల్ సాధించటమే గాక ఆల్‌రౌండ్ ఛాంపియన్‌గా నిలచింది. దీంతో అనితారెడ్డి ఒక్కసారిగా జాతీయస్థాయి క్రీడాకారిణిగా పతాక శీర్షికలకెక్కింది. ఆర్టిస్టిక్, రిథమిక్ జిమ్నాస్టిక్స్‌లో అనితారెడ్డి హైదరాబాదులో శిక్షణ పొంది ఈ జిమ్నాస్టిక్స్‌లో ఆరితేరింది. దేశంలోని కేరళ, చండీఘర్ రాష్ట్రాలలో పాల్గొని బంగారు పతకాలు సాధించడంతో చైనా, బ్యాంకాక్‌లో జరిగిన ఏషియన్ ఏరోబిక్ ప్రపంచ ఛాంపియన్ షిప్‌కు ఎంపికయింది. ఆంధ్రరాష్ట్రం నుండి ఈ పోటీలకు ఎంపికైన ఏకైక క్రీడాకారిణి అనితారెడ్డి. ఎప్పటికైనా ప్రపంచ ఛాంపియన్ కావాలన్నది అనితారెడ్డి ఆశయం. చైనా, జపాన్, కొరియా, రష్యా దేశాల జిమ్నాస్టిక్స్ క్రీడాకారిణీలను ఎదుర్కోవాలంటే అందుకు అవసరమైన పూర్తిస్థాయి శిక్షణ ఇప్పించాల్సిన బాధ్యత మన ప్రభుత్వాల పై వుంది. రాబోయే ప్రపంచ ఛాంపియన్ షిప్ పోటీలకు అనితారెడ్డిని తగిన కోచ్‌లు తీర్చిదిద్దినట్లయితే జిమ్నాస్టిక్స్‌లో మొదటి స్థానాన్ని కైవసం చేసుకొని భారతదేశానికి గర్వకారణంగా నిలవాలన్న అనితారెడ్డి చిరకాల స్వప్నం నెరవేరుతుంది. ఆమె ఆ స్థాయికి ఎదగాలని మన మందరం ఆశిద్దాం.



అద్భుతమైన విన్యాసం ప్రదర్శిస్తున్న జిమ్నాస్టిక్ అనితారెడ్డి

## ఉపాధ్యాయ ఉద్యమ
# పితామహులు చెన్నుపాటి లక్ష్మయ్య

(ఆన్‌లైన్, చిలకలూరిపేట రూరల్)

ఆంధ్రనాట రాష్ట్రస్థాయిలో 1947లో టీచర్స్ ఫెడరేషన్‌ను గుంటూరులో పునరుద్ధరించి విద్యాభివృద్ధికి, ఉపాధ్యాయ సంక్షేమానికి ఎనలేని సేవలు అందించి ఉపాధ్యాయ ఉద్యమ పితామహులుగా ఉపాధ్యాయుల హృదయాలను చూరగొన్న చెన్నుపాటి లక్ష్మయ్య చిలకలూరిపేట మండలం వేలూరు గ్రామ వాసి. ఈయన రెండు దశాబ్దాలకు పైగా రాష్ట్ర అధ్యక్షులుగా సంస్థకు సారథ్యం వహించారు. శాసనమండలి సభ్యునిగా ఆరు సంవత్సరాలపాటుపనిచేశారు. ఉద్యోగ, ఉపాధ్యాయ సంఘాల ఐక్య వేదికలలో కార్యాచరణ కమిటీ నాయకులుగా సారధ్యం వహించి వేతన పెంపుదలకు, పింఛను, డిఏ వంటి సౌకర్యాల సాధనకు, విద్యాభివృద్ధికి, హక్కుల పరిరక్షణకు తన యావజ్జీవితం త్యాగం చేసిన మహనీయులు చెన్నుపాటి. అందుకే ఉపాధ్యాయ లోకం ఆయనను ఉపాధ్యాయ లక్ష్మయ్యగా భావించి వారి హృదయాలలో పదిలపర్చుకుంది. ఈయన వేలూరు గ్రామంలో 1909లో సామాన్య రైతు కుటుంబంలో జన్మించారు. ప్రాథమిక విద్య వేలూరులో మరియు 6 నుండి 8వ తరగతి వరకు చిలకలూరిపేటలో పూర్తి చేశారు. ఆ రోజులలో శిక్షణ పొందిన ఉపాధ్యాయుల కొరత బాగా ఉన్నందున 8వ తరగతి పూర్తి చేసిన వెంటనే అన్‌ట్రైన్డ్ టీచరుగా చిలకలూరిపేటలో ఎయిడెడ్ పాఠశాలలో పనిచేశారు.

### చెన్నుపాటి నాయకత్వాన ఫెడరేషన్ పునరుద్ధరణ

రెండవ ప్రపంచ యుద్ధం ముగిశాక దేశ

(తరువాయి 144లో)

# ఉపాధ్యాయ ఉద్యమ పితామహులు 'చెన్నుపాటి'

(143 తరువాయి)

వ్యాప్తంగా జాతీయోద్యమ పోరాటాలు వెల్లువెత్తాయి. ఆర్థిక స్థితి గతుల మెరుగుదలకోసం రైల్వే, పోస్టల్, ఉద్యోగ, ఉపాధ్యాయ వర్గాల ఉద్యమాలు ప్రారంభమయ్యాయి. వీటి స్పూర్తితో చెన్నుపాటి లక్ష్మయ్య నరసరావుపేట తాలూకా బోర్డు ఉపాధ్యాయ సంఘానికి కార్యదర్శిగా బాధ్యతలు స్వీకరించారు. బియ్యం, చక్కెర, కిరోసిన్, బట్టలు వగైరాలపై ప్రభుత్వం రేషనింగ్ ప్రవేశపెట్టింది. రెవిన్యూ ఉద్యోగులు ఉపాధ్యాయులకు రేషనింగ్ కార్డులు ఇవ్వడానికి నిరాకరించారు. ఈ పరిస్థితులలో లక్ష్మయ్య ఉపాధ్యాయులను సమీకరించి సభలు, సమావేశాలు నిర్వహించి ఇతర ఉద్యోగుల వలే రేషనింగ్ కార్డులను సాధించి పెట్టారు. విడివిడిగా ఉన్న వివిధ యాజమాన్యాల సంఘాలన్నింటిని ఒక వేదిక మీదికి తెచ్చి 1947 ఫిబ్రవరిలో ఉపాధ్యాయ సంఘాల సంయుక్త సమావేశాన్ని గుంటూరులో ఏర్పాటు చేశారు. 1947 ఏప్రిల్ 19,20 తేదీలలో ద్వితీయ మహాసభను నిర్వహించి 1944లో స్థాపించబడి బ్రిటీష్ పాలకుల అణచివేతతో నిర్వీర్యమైన సంఘాన్ని ఆంధ్ర రాష్ట్ర ఎలిమెంటరీ టీచర్స్ ఫెడరేషన్ పేరుతో పునరుద్ధరించారు. ఆ ఫెడరేషన్‌కు అధ్యక్షులుగా



చెన్నుపాటి లక్ష్మయ్య

ఏకగ్రీవంగా ఎన్నికైన చెన్నుపాటి 1968 డిసెంబరు 9న కన్నుమూసే వరకు అధ్యక్షులుగా వ్యవహరించారు. 1947 జూన్ 25 లోగా ప్రభుత్వం ఉపాధ్యాయుల కనీస వేతనాన్ని 50 రూపాయలుగా నిర్ణయించనియెడల సమ్మె చేయాలన్న మద్రాసు రాష్ట్ర ప్రాథమికోపాధ్యాయ మహాసభ నిర్ణయాన్ని ఫెడరేషన్ ఏకీభవించి ఉద్యమంలో భాగస్వాములయ్యారు. కాసు బ్రహ్మానందరెడ్డి అధ్యక్షతన 1958లో పే కమిటీ నియమింపబడింది. ఆ కమిటీ నివేదికలో నూతన వేతనాల నిర్ణయంలో ఉద్యోగులకు, ఉపాధ్యాయులకు అన్యాయం జరిగిందని, పెంపుదల స్వల్పమని ఉద్యోగ, ఉపాధ్యాయ సంఘాలు జెఎసిగా ఏర్పడి ఉద్యమానికి దిగాయి. ఈ ఉద్యమానికి ఉపాధ్యాయుల పక్షాన చెన్నుపాటి, సింగరాజులు నాయకత్వం వహించారు. ఈ ఉద్యమ ఫలితంగా 1961లో కరువు భత్యం విలీకరణ వేతనాలను సాధించడంలో, ఉపాధ్యాయులకు పింఛను, ఇన్సూరెన్స్, ప్రావిడెండ్ ఫండ్ కల్పించడంలో చెన్నుపాటి ప్రధాన పాత్ర వహించారు.

### సంఘ స్వాతంత్ర్యం

1950లో నెల్లూరు జిల్లా సింగరాయకొండ బోర్డు స్కూలులో ఉపాధ్యాయులుగా పనిచేస్తున్న జిల్లా నాయకులు సింగరాజు రామకృష్ణయ్య, మరికొంత మంది ఉపాధ్యాయులు ఫెడరేషన్ సభ్యత్వానికి రాజీనామా ఇవ్వకుంటే ఉద్యోగం నుండి డిస్మిస్ చేస్తానని జిల్లా బోర్డు అధ్యక్షులు నోటీసు జారీ చేశారు. దీన్ని హైకోర్టులో సవాలు చేసి సంఘం ఏర్పాటు, నిర్వహణ రాజ్యాంగబద్ధమని రాష్ట్ర హైకోర్టు ప్రకటించడంతో రాష్ట్రంలో పలు ఉద్యోగ సంఘాలు ప్రారంభించబడ్డాయి. చెన్నుపాటి నేతృత్వం వహించి సంఘ స్వాతంత్ర్యాన్ని కోర్టు చర్యల ద్వారా సాధించిపెట్టారు.



## పురోభివృద్ధిబాటలో

# చెరుకుపల్లి

(ఆన్‌లైన్ – చెరుకుపల్లి)



ఈవూరి సుబ్బారావు స్మారక వైద్యశాల

'పల్లెటూళ్ళే దేశానికి పట్టుకొమ్మలు' అన్న ఆర్యోక్తిని నిజంచేస్తూ 'ఇంతింతై వటుడింతై' అన్నట్లుగా అన్ని రంగాలలో అలవోకగా ముందుకు పోతూ, నలుదిశలా విస్తరిస్తూ నూతన నిర్మాణాలకు నాంది పలుకుతూ, ప్రజల సమస్యలకు దారి చూపుతూ, అనేక ప్రత్యేకతలకు నెలవై, వివిధ విశేషాలకొలువై, చేతివృత్తులకు అండె వేసినదై విద్యా, వైద్య రంగాలలో విరాజిల్లుచున్నది చెరుకుపల్లి.

చెరుకుపల్లి చరిత్ర పుటల్లోనికి తొంగిచూస్తే కనిపించేవి, వినిపించేవి, పలకరించి పులకరించే విశేషాలెన్నో. వీటిలో ముఖ్యమైన విద్యను గాని గమనించినట్లయితే విద్య విశ్వమంత విశాలమైనది..జీవితమంత లోతైనది. అందుకే దేశభవిష్యత్తును తీర్చిదిద్దే లక్ష్యంతో ఉత్తమమైన ఉపాధ్యాయులను తయారు చేసే రెండు బియిడి కళాశాలలు ఒక యంయిడి కళాశాల మరియు అందరికీ విద్య అందుబాటులో వుంచేందుకుగాను మండలంలో నెలకొల్ప బడిన రెండు డిగ్రీ కళాశాలలు, 5 ఇంటర్మీడియట్ కళాశాలలు, ఒక జిడిఆర్ ఒకేషనల్ కళాశాల, అంగన్‌వాడీ శిక్షణాకేంద్రం, చిన్నతనంలోనే టెక్నికల్ విద్యను అందించేందుకు ఒక ఐటిఐ కళాశాల ఉత్తమమైన విద్యను అందిస్తున్న జిల్లాలోనే ప్రముఖ స్థానాలను అలంకరించిన అనేక ఉన్నత పాఠశాలలు ఇవేకాక మనరాష్ట్ర వాసులనే కాక ఇతరాష్ట్రాల నుండి వచ్చే అనేక వందలమంది విద్యార్థినీ విద్యార్థులకు నర్సింగ్ విద్యను అందిస్తున్న ట్రైనింగ్ ఇనిస్టిట్యూట్ పోటీ పరీక్షలకు విద్యార్థులకు శిక్షణనిస్తూ పట్టణాలను మైమరపింప చేస్తూ ఉత్తమఫలితాలు సాధించడానికి కృషి చేస్తున్న అనేక కోచింగ్‌సెంటర్లు, అక్షరజ్ఞానం లేకున్నా కంప్యూటర్ విద్యను అందిస్తామని, అతి తక్కువ ఫీజులతో కంప్యూటర్ విద్యను అందిస్తున్న కంప్యూటర్ కోచింగ్ సెంటర్ల సముదాయం, విద్యాపరంగా చెరుకుపల్లి భావిభవిష్యత్తును సమగ్రంగా మార్చివేస్తున్నాయి.

ఇక రెండవది వైద్యం 'వైద్యోనారాయణోహరి' అన్నట్లుగా అంతుచిక్కని అనేక రకాల రోగాలను, విరివిగా వ్యాప్తి చెందుతున్న వివిధరకాలైన వింతవ్యాధులను సైతం సమగ్రంగా నయంచేస్తూ మనజిల్లా వాసులనేకాక వేర్వేరు జిల్లా వాసులను సైతం ఆకర్షిస్తూ ప్రతిరోజు రెండునుండి మూడు వేల మంది ప్రజానీకానికి పరిచర్యలు చేస్తూ పరిశుభ్రమైన, ఆహ్లాదకరమైన వాతావరణంలో నిర్మింపబడి, వైద్యం అనగానే మనందరికి వినిపించేది కనులముందు కనిపించేవిధంగా చెరుకుపల్లి లోని వైద్యశాలలు రూపుదిద్దుకున్నాయి. అంతేకాక మీవిలువైన ప్రాణాలకు మేము భద్రతన్నిస్తాం అంటూ అందరికి అందుబాటులో వైద్యసేవలు అందించడానికి 24 గంటల పాటు సిద్ధంగా వున్న సత్యం కంప్యూటర్ వారి 108 అంబులెన్స్ సౌకర్యంకూడా వైద్యపరంగా చెరుకుపల్లికి వరంగా మారింది.

దేశానికి 'వెన్నెముఖ రైతులయితే' రైతులకు వెన్నంటివుండి వారి అవసరాలు తీర్చేవి మాత్రం పశువులే. వీటిలో వ్యవసాయానికి అతిముఖ్యమైనవి ఎద్దులని చెప్పవచ్చు. ఈ ఎడ్లను ఉపయోగించే పనులలో ముఖ్యంగా నాగళ్ళతో దుక్కిదున్నడం, పండిన పంట టైరుబండ్లతో ఇంటికిచేర్చడం. ఈటైరుబండ్ల తయారీలో రాష్ట్రంలోనే పేరెన్నికగన్న ప్రాంతమే చెరుకుపల్లి. ఇచ్చట తయారయిన టైరుబండ్లు మన్నికతో, నాణ్యమైన చెక్కతో తయారుచేయబడి, దృఢత్వాన్ని కలిగి ఉండి, అందంగా ఉండడంతోపాటు, అందరికి అందుబాటు ధరలో ఉండడమే ఇక్కడి విశేషం. అందుకే అన్ని ప్రాంతాల ప్రజలు చెరుకుపల్లిలో తయారైన టైరుబండ్లంటే ఎక్కువ మక్కువ చూపిస్తారు. మానవుని నిత్యవసరాలలో కూడు గుడ్డ, గృహం చాలా ముఖ్యమైనవి. ఆగర్భ శ్రీమంతులకైననూ, కటికనిరుపేదకైననూ ఈమూడు తప్పనిసరి. సామాన్య మానవుని గృహనిర్మాణంలో వినియోగించే తాటిసామానులు, చెక్కపనిముట్లకు కొదవ లేనిప్రాంతమే చెరుకుపల్లి. అత్యంత సులువుగా అతితక్కువ ఖర్చుతో దృఢమైన గృహాలను నిర్మించడానికి అవసరమైన తాటివాసాలను అందంగా, చక్కనికొలతలతో తయారుచేయడంలో తలమానికమైనది చెరుకుపల్లి. ఈతాటివాసాలు పూరిళ్ళకేకాక పెంకుటిల్లు, రేకుల ఇళ్ళు, పశువులపాకల నిర్మాణంలో ప్రధానమైన పాత్రవహిస్తాయి. ఇక్కడ తయారైన తాటివాసాలు చుట్టుప్రక్కలజిల్లాలకు, రాష్ట్రాలు దాటి వెళుతున్నాయి. ఉద్యోగ నిమిత్తం, వ్యాపార నిమిత్తం కాని చెరుకుపల్లి ఒక్కసారివస్తేచాలు, అన్ని హంగులతో వారిని ఇట్టే ఆకట్టుకొని వారు జీవితాంతం ఇక్కడే స్థిరపడాలని కోరుకునేలాచేస్తుంది. అందుకే మున్సిపాలిటీలను, కార్పొరేషన్‌లను సైతం మైమరపింపచేస్తూ అన్నిరకాల వసతులుకలిగినదై, ఆహ్లాదకరమైన వాతావరణంతో, ఎల్లప్పుడూ సిద్ధంగావుండే రవాణాసదుపాయంతో, ఎంతవినియోగించిన తరిగిపోని మంచినీటి సౌకర్యంతో, అందుబాటు ధరలకే లభించే పండ్లు, కూరగాయలు, మాంసాహార మార్కెట్లతో, అన్నివస్తువులు లభించే షాపుల సముదాయంతో, అన్ని మతాలు సర్వసమ్మేళనతో వివిధరకాల విశిష్ట దేవాలయాలతో, ప్రజలను కన్నబిడ్డల్లా చూసుకునే పాలకులతో ఎవరినైన ఇట్టే ఆకర్షింపచేసేట్లు చేస్తుంది. అందుకే ప్రతిక్కరుకూడా చెరుకుపల్లిని కేంద్రబిందువుగా చేసుకొని ఇక్కడ స్థిరపడాలని నిశ్చయించు కోవడమే ఈప్రాంతంలోని స్థలాల ధరలు ఆకాశాన్నంటినాగాని అలవోకగా అమ్ముడు పోతున్నాయి. రియల్ ఎస్టేట్ రంగానికి పెద్దపీటలు వేసి చెరుకుపల్లి కీర్తిని మరింత ఇనుమడింపచేసింది. ఈవిధంగా 'ఇందుగలడు అందులేడని సందేహమువలదు ఎందెందు వెతికినా అందందేగలడు' అన్నట్లుగా అన్నిరంగాలలో అభివృద్ధి చెందుతున్న ప్రదేశంగా చెరుకుపల్లి అని చెప్పవచ్చును.



భవానీపురం ప్లాట్స్

## ఈరోడ్‌గా మారనున్న
# ఐదో నంబరు జాతీయ రహదారి
### చిలకలూరిపేట కేంద్రంగా నూలు మిల్లులు
### 50 వేల మందికి ఉపాధి

(ఆన్‌లైన్ - గుంటూరు)

ఐదవ నెంబరు జాతీయ రహదారిలో చిలకలూరిపేట కేంద్రంగా స్పిన్నింగ్ మిల్లుల పరిశ్రమ అభివృద్ధి చెందింది. జిల్లాలో సుమారు 85 స్పిన్నింగ్ మిల్లులను స్థాపించారు. గతంలో తమిళనాడులోని ఈరోడ్ కేంద్రంగా స్పిన్నింగ్, నూలు పరిశ్రమ అభివృద్ధి చెందింది. గుంటూరు జిల్లా నుంచి ప్రతి సంవత్సరం రూ. 500 కోట్ల విలువైన పత్తి, దూది ఈ రోడ్డుకు సరఫరా అయ్యేది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అనేక మౌలిక సదుపాయాలు కల్పించడం వలన పారిశ్రామిక వేత్తలు స్పిన్నింగ్



ఆధునిక సౌకర్యాలతో ఏర్పాటైన జిన్నింగ్ మిల్లు

మిల్లులు ఏర్పాటుచేయడానికి ముందుకు వచ్చారు. గుంటూరు - చిలకలూరిపేట, గుంటూరు- ప్రత్తిపాడు, గుంటూరు- పొన్నూరు రోడ్లలో ఈ మిల్లులను స్థాపించారు. అంతర్జాతీయ మార్కెట్‌లో యారన్‌కు మంచి రేటు ఉండటం, మన రాష్ట్రంలో స్పిన్నింగ్ మిల్లుల పరిశ్రమకు మౌలిక సదుపాయాలు ఎక్కువగా ఉండటం వలన అనేకమంది ఈ రంగం వైపు మొగ్గు చూపారు. వాణిజ్యపంటలకు గుంటూరు కేంద్రంగా ఉండటం. ప్రతి సంవత్సరం జిల్లాలో లక్షన్నర హెక్టార్లలో పత్తి పండించడం వలన ఇప్పటి వరకు జిన్నింగ్ రంగంలో ఉన్న పారిశ్రామికవేత్తలందరూ స్పిన్నింగ్ రంగంలోకి వచ్చారు.

**వేలాదిమంది నిరుద్యోగులకు ఉపాధి**

జిల్లాలో సుమారు 80 కొత్తగా స్పిన్నింగ్ మిల్లులను ఏర్పాటు చేయటం వలన వేలాది మంది నిరుద్యోగ యువతకు ఉపాధి లభిస్తోంది. జిల్లా వ్యాప్తంగా సుమారు 50 వేల మందికి జిల్లా యువజన సంక్షేమ శాఖ ద్వారా శిక్షణ ఇచ్చి ఆయా మిల్లుల్లో ఉద్యోగాలిచ్చారు. కార్మికులకు వసతి సౌకర్యం కూడా మిల్లు యజమానులే కల్పించారు.

**మెరుగుపడుతున్న ఎగుమతులు**

గతంలో గుంటూరునుంచి పత్తి, దూదిని మాత్రమే ఎగుమతి చేసేవారు. ప్రస్తుతం స్పిన్నింగ్ మిల్లులు ఎక్కువగా ఉండటం వలన పత్తికి అనుబంధంగా ఉన్న అనేక పరిశ్రమలు ఏర్పడుతున్నాయి. దీని ద్వారా వస్త్రాల తయారీకి అవసరమైన అన్ని పరికరాలను గుంటూరు నుంచే ఎగుమతి చేస్తున్నారు. డైయింగ్, గార్మెంటింగ్ యూనిట్లలో అవసరమైన అవసరమైన పదార్థాలను ఇక్కడ తయారుచేస్తున్నారు. జిల్లాలో గతంలో 525 జిన్నింగ్ మిల్లులు, 32 దూది ప్రెస్సింగ్ మిల్లులు, 4725 జిన్నులు ఉన్నాయి. స్పిన్నింగ్ మిల్లులు, జిన్నింగ్ మిల్లులు పెరగటంతో అనుబంధ పరిశ్రమలు కూడా ఎక్కువగా వస్తున్నాయి.

**రూ.10 వేల కోట్లతో అనుబంధ పరిశ్రమలు**

జిన్నింగ్ మిల్లులు పెరగటం వలన రూ. 10 వేల కోట్లతో అనుబంధ పరిశ్రమలు కూడా ఏర్పడబోతున్నాయి. నూజివీడు సీడ్స్ సంస్థ కర్లపాలెం, చందోలు తదితర ప్రాంతాల్లో ఆధునిక సౌకర్యాలతో ప్రాసెసింగ్, డైయింగ్, గార్మెంటింగ్ యూనిట్లను నెలకొల్పబోతోంది. గుంటూరు - అమరావతి వయా తాడికొండ రోడ్డులో అనేక అనుబంధ పరిశ్రమలను స్థాపించబోతున్నారు. జిల్లాలో జిన్నింగ్ మిల్లుల సంఖ్య కూడా పెరగటంతో క్రమంగా పత్తి విస్తీర్ణం కూడా పెరిగింది. గతంలో లక్ష 78 వేల హెక్టార్లలో పత్తి పండించగా ప్రస్తుతం ఇది రెండు లక్షల హెక్టార్లకు చేరే అవకాశం ఉంది. పదేళ్లలో గుంటూరు, చిలకలూరిపేట కేంద్రంగా ఆధునిక సౌకర్యాలతో వస్త్ర పరిశ్రమ ఏర్పడే అవకాశాలున్నాయని పలువురు పారిశ్రామిక వేత్తలు తెలిపారు.

# పర్యాటక కేంద్రంగా రూపొందుతున్న భట్టిప్రోలు బౌద్ధ స్తూపం

('భట్టిప్రోలు' - ఆన్‌లైన్)

ఆంధ్రప్రదేశ్‌లోని అత్యంత చారిత్రాత్మక స్థలంలో ఒకటైన భట్టిప్రోలు బౌద్ధస్తూపం నేడు పర్యాటక కేంద్రంగా మారనుంది. వందల ఏళ్ళ నుంచి నిరాదరణకు గురైన ఈ బౌద్ధస్తూపం అభివృద్ధిని సంతరించుకోవటం గ్రామ ప్రజలకేకాక రాష్ట్ర ప్రజానీకానికి గర్వ కారణంగా మారనుంది. అలనాటి శాతవాహనుల కాలంలో బౌద్ధమతానికి చిహ్నంగా నిర్మించబడిన బౌద్ధ స్తూపం నేటికి భట్టిప్రోలులో వుంది. 1892 సంవత్సరంలో జరిగిన త్రవ్వకాల్లో చక్రాకార పునాదులపై నిర్మించిన బృహత్‌స్తూపం బయల్పడింది. స్థూపం వ్యాసం 132 అడుగులు. స్థూపం మధ్య అమూల్యాగ్రంగా ఇటుకలు అమర్చబడి పద్మాకారంలో వుంది. స్థూపం చుట్టూ ప్రదక్షిణపదం, దాని అంచున పాలరాయి ప్రాకారం వుండేది. ప్రాకారం వ్యాసం 148 అడుగులు. స్తూప ఆవరణ వైశాల్యం 1700 చదరపు అడుగులు.

ఈ ప్రాచీన కట్టడానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పురావస్తు ప్రదేశం అవశేషాల చట్టం 1958 ద్వారా దేశ ప్రాముఖ్యత నెలకొన్నదిగా ప్రకటించినప్పటికీ స్తూపాన్ని అభివృద్ధి చేసే నాధుడే కరువయ్యారు. అయితే ప్రస్తుతం ఎంపిపి తూనుగుంట్ల లక్ష్మీపార్వతి చొరవతో ఎంపి వల్లభనేని బాలశౌరి, శాసనసభ్యులు దేవినేని మల్లికార్జునరావు కృషి వలన బౌద్ధస్తూపం అభివృద్ధికి 25లక్షల రూపాయలు కేంద్రప్రభుత్వం నుంచి మంజూరుకాబడ్డాయి. ఈ నిధులతో కేంద్ర పురావస్తుశాఖ అధికారులు మూడునెలలపాటు స్థూపంపైనున్న మట్టిని తవ్వి పూర్వ ఆకారాన్ని తీసుకువచ్చారు.

అయితే ఇప్పటికీ స్థూపం చాలావరకు శిథిలమైపోవటంతో పూర్వ ఆకారాన్ని తీసుకువచ్చేందుకు ప్రత్యేకంగా ఇటుకరాయిని తయారుచేయించి పూర్వ ఆకారాన్ని తీసుకువచ్చేందుకు కృషి చేస్తున్నారు. కేంద్ర పురావస్తుశాఖ డైరెక్టర్ జితేంద్ర పలుమార్లు స్తూపాన్ని సందర్శించి పలు సూచనలను అధికారులకు ఇవ్వటం జరిగింది. స్తూపం చుట్టూ ప్రదక్షిణ పదను కూడా నిర్మిస్తున్నారు. ఈ అభివృద్ధి పనుల్లో భాగంగా స్తూపంయొక్క ప్రధాన రహదారి వద్ద ఓ పురాతన కట్టడం కూడా బయటపడింది. ఈ కట్టడాన్ని ధ్యానమందిరంగా అధికారులు భావిస్తున్నారు. అలాగే స్తూప ఆవరణలో వున్న గడ్డి, పిచ్చిమొక్కలను తొలగించి ఉద్యానవనంగా తీర్చిదిద్దారు. స్థూప అభివృద్ధికి 25లక్షల రూపాయలు వెచ్చించిన అధికారులు మరో 25లక్షలుకూడా మంజూరుకు సిద్ధంగా వున్నట్లు అధికారులు తెలుపుతున్నారు.

కాగా అమరావతిని తలపించే విధంగా భట్టిప్రోలు బౌద్ధస్తూపం త్వరలో పర్యాటక కేంద్రంగా మారనుంది.



అభివృద్ధి చెందుతున్న భట్టిప్రోలు బౌద్ధస్తూపం

# నాటి నరసింహారావుపేటే నేటి నరసరావుపేట

## నరసరావుపేట కేంద్రంగా మల్రాజు పాలన



200 ఏళ్ళ క్రితం నిర్మించిన భవనం

**రాష్ట్రంలో పురాతన స్వదేశీ సంస్థానాలలో నరసరావుపేట సంస్థానం ఎంతో ప్రసిద్ధి పొందింది. మల్రాజు వంశీయులు ఈ ప్రాంతాన్ని గత 300 ఏళ్ళ క్రితం నుంచి పాలించారు. వినుకొండ కేంద్రంగా పాలన చేస్తూ 1797లో నరసరావుపేటలో మల్రాజు వేంకట గూండారావు కోట నిర్మాణం చేపట్టారు. దుర్గము రాజాసాదము, అంతఃపురము నిర్మాణాలు పూర్తయిన గూండారావు ఆయన తండ్రి పేరుతో 'నరసింహారావు'పేట అని నామకరణం చేశారు. ఈ నరసింహారావుపేటయే ప్రజానుడిలో నరసరావుపేటగా పిలువబడుతోంది.**

(ఆన్‌లైన్, నరసరావుపేట)

వినుకొండ, బెల్లంకొండ, నరసరావుపేట ప్రాంతాలను మల్రాజులు పరిపాలించారు. వినుకొండను ప్రధాన రాజధానిగాను, బెల్లంకొండను ఉప రాజధానిగాను చేసుకొని రెండు పరిగణాలను మల్రాజు వేంకట నరసింహారావు పాలించేవారు. ఆ తదుపరి వేంకట గూండారావు వినుకొండ రాజధాని నుంచి బెల్లంకొండను పరిపాలించటం కష్టతరంగా మారటంతో రెండు దుర్గాల మధ్య కొత్త కోటను నిర్మించాలని భావించారు. దీంతో 1797 సంవత్సరంలో కోటకు శంకు స్థాపన చేసి నిర్మాణాన్ని ప్రారంభించారు. అంభారితో అలంకరించిన పట్టపు టేనుగును అధిరోహించి మల్రాజు వేంకట గూండారావు సింహా ద్వారం గుండా కోటలో నుంచి రాకపోకలు జరుపుతుండేవారు. ఇటువంటి సింహా ద్వారం ఆనాటి సంస్థానాధీశ్వరుల దుర్గాలలో ఎక్కడా నిర్మింప బడలేదని ప్రసిద్ధి.

కోట నిర్మాణం పూర్తయిన వెంటనే అనేక చేతి వృత్తుల వారు కోట ప్రదేశాలలో స్థిరపడ్డారు. వీరందరికీ అప్పట్లో కావాల్సిన స్థలాలను ఉచితంగా సమకూర్చారు. దీంతో విశాలమైన వీధులతో పట్టణం రూపుదిద్దుకుంది. కోటకు మొత్తం ఐదు బురుజులు నిర్మించబడ్డాయి. వీటి పై ఫిరంగులతో సాయుధులైన భటులు నిరంతరం కావలి కాస్తుండేవారు. సంస్థానంలో ఎప్పుడూ స్థిరంగా 99 ఏనుగులు వుండేవని అప్పట్లో విశేషంగా చెప్పుకొనేవారు. ఈ ఏనుగుల కోసం ప్రస్తుతం పెద్ద చెరువుగా పిలవబడతున్న ప్రాంతంలో 105 ఎకరాల విస్తీర్ణంలో చెరువును తవ్వించారు. నరసరావుపేట నీటి ఎద్దడి ఏర్పడిన సమయంలో అప్పటి మునిసిపల్ చైర్మన్ రాజా మల్రాజు వేంకట నరసింహారావు ఈ చెరువును పురపాలక సంఘానికి దానం చేశారు. అయితే ప్రస్తుతం ఈ చెరువు స్థలాన్ని ప్రభుత్వం ఇళ్ళ స్థలాలు, ఇండస్ట్రియల్ ఎస్టేట్, కళాశాలల నిర్మాణానికి పంపిణీ చేసింది. వినుకొండ, బెల్లంకొండ, కొండవీడు దుర్గాల మధ్య వున్న 420 గ్రామాలకు నరసరావుపేట నుంచే పాలన సాగించేవారు. మల్రాజు గూండారావు అప్పటి ఆంగ్ల

(మిగతా 149లో)



నరసరావుపేట తొలి మునిసిపల్ చైర్మన్‌గా మల్రాజు వేంకట నరసింహారావు(రౌండ్ చేసిన వ్యక్తి), ఆయన కుమారులు, అప్పటి కౌన్సిలర్ల గ్రూపు ఫోటో

## HON'BLE M.Ps IN GUNTUR DISTRICT

| Sl. No. | Name of the Hon.ble M.P. | Residence | Cell No. |
|---|---|---|---|
| 1. | ***Smt DAGGUPATI PURANDHARESWARI, M.P.,*** | 040-23398204 | 9489034445 |
| | BAPATLA PARLIAMENTARY CONSTITUENCY | 08594-242434 | |
| 2. | ***SRI BALA SOWRI VALLABHANENI, M.P.,*** | 0863-2235425(GH) | 9440113456 |
| | TENALI PARLIAMENTARY CONSTITUENCY | 0863-2351472(O) | 9849013456 |
| 3. | ***SRI RAYAPATI SAMBASIVARAO, M.P.,*** | 0863-2350500 | 9849061777 |
| | GUNTUR PARLIAMENTARY CONSTITUENCY | 0863-2350400 | 9848138555 |
| | | 0863-2350555 | |
| 4. | ***SRI MEKAPATI RAJAMOHAN REDDY, M.P.,*** | 040-23543541 | |
| | NARASARAOPETA PARLIAMENTARY CONSTITUENCY | 040-23543545 | 9849199009 |
| | | 040-23541385 | |
| 5. | ***SRI LAL JAN BASHA, M.P. (RAJYASABHA)*** | 040-23319189 | |
| | | 040-23378786Z | |
| 6. | ***SRI J.D. SEELAM, M.P. (RAJYASABHA)*** | 011-23019080 | 09868181113 |
| | | 011-26175537 | |

## Hon'ble M.L.A.s IN GUNTUR DISTRICT

| Sl. No. | Name of the M.L.A. | Residence | Cell No. |
|---|---|---|---|
| 1. | ***SRI KANNA LAKSHMINARAYANA, M.L.A.*** | 0863-2202784(O) | P.S. 9848782011 |
| | PEDAKURAPADU ASSEMBLY CONSTITUENCY | 0863-2355784 (R) | 9849908506 |
| | | 0863-2323164 | (S.N. Reddy) |
| | | 040-23450813 | 9440469644 |
| | | (Venkateswara Rao) | |
| 2. | ***SRI KASU VENKATA KRISHNA REDDY, M.L.A.,*** | 08647-230014 | 9849960999 |
| | NARASARAOPET, ASSEMBLY CONSTITUENCY | 08647-230118 | 9849864225 |
| | | 040-23545778 | 9848322222-SON |
| 3. | ***SRI MOPIDEVI VENKATA RAMANA RAO, M.L.A.,*** | 08648-257722 | |
| | KUCHINAPUDI ASSEMBLY CONSTITUENCY | 040-23240842 | 9849122337 |
| 4. | ***SRI MURUGUDU HANUMANTHARAO, M.L.A.,*** | 08645-232996 | 9440261600 |
| | MANGALAGIRI ASSEMBLY CONSTITUENCY | 08645-231234(R) | 9849138010 |
| 5. | ***SRI DEVINENI MALLIKARJUNA RAO, M.L.A.,*** | 08648-227826 | 9848132566 |
| | REPALLE ASSEMBLY CONSTITUENCY | 0863-2256869 | |
| 6. | ***SRI SATISH PAUL RAJ, M.L.A.,*** | 08644-257115 | 9848539227 |
| | VEMURU ASSEMBLY CONSTITUENCY | | |
| 7. | ***SRI VENKATAREDDY GUDIBANDA, M.L.A.,*** | 08644-244242 | 9440054896 |
| | DUGIRALLA ASSEMBLY CONSTITUENCY | 08644-223857 | PA-9849179668 |
| 8. | ***SRI NADENDLA MANOHAR, M.L.A.,*** | | |
| | TENALI ASSEMBLY CONSTITUENCY | | 9849000006 |
| 9. | ***SRI DHULIPALLA NARENDRA KUMAR, M.L.A.,*** | 08643-242113 | 9440602113 |
| | PONNURU ASSEMBLY CONSTITUENCY | 08643-244495 | |
| 10. | ***SRI GADA VENKATA REDDY, M.L.A.,*** | | |
| | BAPATLA ASSEMBLY CONSTITUENCY | 040-23233913 | 9848027091 |
| 11. | ***SRI RAVI VENKATA RAMANA, M.L.A.,*** | 2227777 | |
| | PRATHIPADU ASSEMBLY CONSTITUENCY | 2235599/2210742(R) | 9848135082 |
| 12. | ***SRI SHAIK NAMBURU SUBHANI, M.L.A.,*** | 2222281/2212786 | 9848133881 |
| | GUNTUR-1 ASSEMBLY CONSTITUENCY | 2356170 | |
| 13. | ***SRI TADISETTY VENKATA RAO, M.L.A.,*** | 0863-2235520(R)&Fax | 9848136616 |
| | GUNTUR-II ASSEMBLY CONSTITUENCY | 0863-5577675 (R) | 9397602000 |
| | Muralimohan - 9848636616/2235520 | 0863-6535566/77 | 9848478039-PA |
| | | 040-23236389/23241520 | |
| 14. | ***SRI DOKKA MANIKYA VARAPRASADARAO, M.L.A.,*** | 0863-2225500 | 9849794821 |
| | TADIKONDA ASSEMBLY CONSTITUENCY | 040-27004821 | 9440818871 |
| 15. | ***SRI YERRAM VENKATESWARA REDDY, M.L.A.,*** | 08641--234666 | 9440264464 |
| | SATTENAPALLI ASSEMBLY CONSTITUENCY | 040-23810312 | |
| 16. | ***SRI JANGA KRISHNA MURTHY, M.L.A.,*** | 08649-256000 | 9247262100 |
| | GURAZALA ASSEMBLY CONSTITUENCY | 08649-244242 | 9866189500 |
| | | | 9440472765-PA |
| 17. | ***SRI PINNELLI LAKSHMA REDDY, M.L.A.,*** | 08642-222205(R) | 9440170737 |
| | MACHERLA ASSEMBLY CONSTITUENCY | 08642-222126 | |
| 18. | ***SRI MAKKENA MALLIKHARJUNA RAO, M.L.A.,*** | 08646-272364 | |
| | VINUKONDA ASSEMBLY CONSTITUENCY | 08646-274025 | 9440264025 |
| 19. | ***SRI MARRI RAJASEKHAR, M.L.A.,*** | 08647-254583 | 9440257383 |
| | CHILAKALURIPET ASSEMBLY CONSTITUENCY | | |

# నాటి నరసింహారావుపేటే...నేటి నరసరావుపేట

(147వ పేజీ తరువాయి)

ప్రభుత్వానికి సంవత్సరానికి 2,89,734 పగోడాలు శిస్తు చెల్లించారు. ఒక పగోడా నాలుగు రూపాయలు విలువ.

పలు ప్రజాహిత కార్యక్రమాల పేరిట చెరువులు, బావులను తవ్వించారు. చేతి వృత్తుల పై జీవించే ప్రజానీకానికి వందలాది ఎకరాలు భూదానం చేశారు. కుల, మతాలకు అతీతంగా మల్రాజు వంశస్థులు ఈ ప్రాంతంలో భూదానాలు పెద్ద ఎత్తున చేశారు. నరసరావుపేట ఈద్గా మసీదుకు 40 ఎకరాలు, పెద తురకపాలెంలో మసీదుకు పది ఎకరాలు, చిన తురకపాలెంలో మసీదుకు ఐదు ఎకరాలు దానం చేశారు.







ఆనాటి అద్దాల మేడ

### కోటప్పకొండకు సోపానమార్గం నిర్మాణం

మల్రాజులు పాలనలో కోటప్పకొండ శ్రీ త్రికోటేశ్వర స్వామి పుణ్యక్షేత్రాన్ని అభివృద్ధి చేశారు. ఈ ఆలయానికి ధర్మకర్తలుగా జమీందారులు వున్నారు. కోటప్పకొండకు వచ్చే యాత్రికుల కోసం కొండ దిగువున చెరువులు తవ్వించారు. దేవాలయానికి 130 ఎకరాలు, అర్చకులకు 147 ఎకరాలు, పడి తరానికి 50 ఎకరాలు భూమిని ఆలయానికి విరాళంగా ఇచ్చారు. ఈ ఆలయానికి ప్రస్తుతం శాశ్విత ధర్మకర్తగా మల్రాజు వంశస్థుడు విజయ కృష్ణ గూండారావు వున్నారు. కోటప్పకొండతో పాటు మొత్తం ఏడు ఆలయాలకు ధర్మకర్తలుగా వ్యవహరించారు. ప్రముఖ శైవ క్షేత్రం చేజర్ల, ఇనిమెళ్ళలోని భావన్నారాయణ స్వామి ఆలయం, దేరంపాడు వెంకటేశ్వర స్వామి ఆలయం, అర్వపల్లి బాల కోటేశ్వర స్వామి ఆలయం, ములుకుదురు చెన్న కేశవ స్వామి ఆలయం, భృగు బండ ఆలయం, జగన్నాథ స్వామి ఆలయాలకు ధర్మకర్తగా జమీందార్ వంశీయులు వున్నారు. చేజర్ల ఆలయానికి దాదాపు 263 ఎకరాలు దానం చేశారు. ఇతర ఆలయాల నిర్వహణకు కూడా భూములను కేటాయించారు. నరసరావుపేటలోని ఎస్ఎస్ఎన్ కళాశాలకు కూడా స్థలాన్ని విరాళంగా ఇచ్చారు.

### మునిసిపల్ చైర్మన్లుగా...

మునిసిపల్ చైర్మన్లుగా మల్రాజు వంశస్థులు సుమారు 13 ఏళ్ళపాటు పని చేశారు. నరసరావుపేట పురపాలక

(మిగతా 150వ పేజీలో)

# నాటి నరసింహారావుపేటే...నేటి నరసరావుపేట

(149వ పేజీ తరువాయి)

సంఘం ఏర్పడిన అనంతరం 1926 నుంచి 1929 వరకు, 1931 నుంచి 1934 సంవత్సరం వరకు మల్రాజు వేంకట నరసింహారావు ఎనిమిది సంవత్సరాల పాటు మునిసిపల్ చైర్మన్‌గా పని చేశారు. ఆయన పాలనా కాలంలో



మల్రాజు రామకృష్ణ కొండలరావు



మల్రాజు వేంకట నరసింహారావు



మల్రాజు విజయ కృష్ణ గూండారావు

వైద్యశాల నిర్మాణం చేపట్టారు. విద్యాభివృద్ధికి ఆయన విశేషంగా కృషి చేశారు. ఆయన పాలన సమయంలో తాగు నీటి ఎద్దడి నివారణకు బావులను అభివృద్ధి పరిచి ప్రజల మన్ననలను అందుకొన్నారు. 1934లో నరసరావుపేట మునిసిపల్ ఎన్నికలు జరిగాయి. అప్పట్లో 17 మంది కౌన్సిలర్లు మల్రాజు రామకృష్ణ కొండలరావును చైర్మన్‌గా ఏకగ్రీవంగా ఎన్నుకొన్నారు. ఆయన ఐదు సంవత్సరాలకు పైగా చైర్మన్‌గా పని చేశారు. ఈయన పదవీ కాలంలో నరసరావుపేట రెండో గ్రేడు మునిసిపాలిటీగా ఎదిగింది. తొమ్మిది ఎలిమెంటరీ పాఠశాలలను మునిసిపల్ పాలక కిందకు తీసుకొచ్చి వాటిని అభివృద్ధి పరిచారు. హైస్కూల్‌లో ఆడియో విజువల్ ఎడ్యుకేషన్‌ను ప్రవేశపెట్టారు. మునిసిపల్ గ్రంథాలయాన్ని ఏర్పాటు చేశారు. మునిసిపాలిటీలో తక్కువ వేతనం కింద పని చేసే ఉద్యోగులందరికీ గృహాలను నిర్మింపచేశారు. మునిసిపల్ హైస్కూల్‌ను హయ్యర్ సెకండరీ స్కూల్‌గా మార్పు చేయించారు. వేసవి కాలంలో నీటి ఎద్దడిని నివారించేందుకు లింగంగుంట్లలో బావి తవ్వించి ట్యాంకర్ ద్వారా ప్రజలకు సరఫరా చేశారు. ఆయన పదవీ కాలంలో అనేక సేవా కార్యక్రమాలు చేపట్టి ప్రత్యేక గుర్తింపు పొందారు. 1997 జూన్ 27, 28, 29 తేదీల్లో ఘనంగా నరసరావుపేట ద్విశాబ్ది ఉత్సవాలు జరిపారు.

## గుంటూరు నగర భౌగోళిక స్వరూపం

(ఆన్‌లైన్ - గుంటూరు సిటీ)

| | |
|---|---|
| విస్తీర్ణం | 48.50 చదరపు కిలోమీటర్లు |
| జనాభా 2001 సెన్సస్ ప్రకారం | 5,14,000 |
| పురుష, మహిళా జనాభా శాతం | 1000:990 |
| అక్షరాస్యత శాతం | 69 |
| సగటు వార్షిక జనాభా వృద్ధి రేటు | 0.41 శాతం |
| సగటు ఉష్ణోగ్రత | 35 డిగ్రీల సెల్సియస్ |
| తేమ సెప్టెంబరులో | 63 శాతం నుంచి 81 శాతం |
| సగటు వర్షపాతం | 831 మిల్లీమీటర్లు |
| డివిజన్లు | 52 |
| భాషలు | తెలుగు, ఉర్దూ, హిందీ, ఇంగ్లీషు |
| సగటు కుటుంబ వార్షికాదాయం | 42 వేల నుంచి 60 వేల మధ్య |
| వాణిజ్యం | పొగాకు, మిర్చి, శీతల గిడ్డంగులు, పత్తి జిన్నింగ్, స్పిన్నింగ్ మిల్స్ |
| ఎగుమతులు | పొగాకు, పత్తి, ఎండు మిర్చి |
| కమ్యూనికేషన్స్ | 51,483 టెలిఫోన్ లైన్స్, ఎఎం, ఎఫ్ఎం రేడియోస్టేషన్లు, ఐదు కేబుల్ స్టేషన్లు |
| బ్యాంకులు | ప్రభుత్వ బ్యాంకులు -21, సహకార బ్యాంకులు-2, వాణిజ్య-18, రూరల్ -1 |
| కార్పొరేషన్ వార్షికాదాయం | రూ.129.21 కోట్లు |
| కార్పొరేషన్ వార్షిక వ్యయం | రూ.124.11 కోట్లు |
| రవాణ | రైల్వేస్టేషన్లు-3, బస్టాండు-1 |

ఈ కాకానీశ్వరుని గూడ దర్శించుచుం డును. ఈ కారణమునే ఈ మహాక్షేత్రము నకు కాకాని క్షేత్రమని పేర్చు వచ్చింది. రాష్ట్రంలో మరే దేవాలయంలో కానరాని పొంగలి నివేదనలు ప్రత్యేకం.

**రాహు కేతువుల పూజలు**

జన్మనందు కాలసర్ప దోషములుండు వారికి రాహుకేతు గ్రహ దశలకు పూజలు చేయించటం వలన అవి

(మిగతా 152లో)

# మతసామరస్యానికి ప్రతీక 'పెదకాకాని'

గుంటూరు పట్టణానికి సమీపంలో ఉన్న పెదకాకాని మత సామరస్యానికి ప్రతీకగా నిలిచింది. నిత్యం వేలాది మంది భక్తులతో పెదకాకాని కళకళలా డుతుంది. హిందువులకు పవిత్రమైన శ్రీ మల్లేశ్వర స్వామివారి దేవస్థానం, క్రైస్తవులకు ప్రార్థన నిలయమైన కాకాని స్వస్థిశాల, ముస్లింలకు పవిత్ర హజరత్ సయ్యద్ ఆవూలియా బాజీబాబా దర్గా ఇక్కడ నెలకొన్నాయి. వారంలో ఒకటి రెండు రోజులు మినహా భక్తులు అధిక సంఖ్యలో మూడు ప్రాంతాలకు విశే షంగా తరలివస్తుంటారు. ఎంతో ప్రాచుర్యం చెందిన పెదకాకాని గుర్తింపు పొందుతోంది.

**కోరిన వరాలిచ్చే దేవుడు**

రాష్ట్రంలో సుప్రసిద్ధ శైవ గ్రామ పుణ్యక్షేత్రాల్లో ఒకటై, దక్షిణ కాశిగా పెద కాకాని శ్రీ భ్రమరాంబ మల్లేశ్వర స్వామి వారి దేవస్థానం వెలుగొందు తోంది. కోరిన భక్తులకు వరాలిచ్చే దేవు డుగా కాకాని మల్లేశ్వరుడు విరాజిల్లు తున్నాడు. నిత్యం భక్తుల సేవల మధ్య మల్లేశ్వర స్వామి కొలువై ఉన్నాడు.

**క్షేత్ర పురాణం...**

భరద్వాజ మహాముని కాకాని క్షేత్రం లోకి వచ్చి ఈశ్వరి ఆరాధించుచూ క్రతువు సంకల్పించిన దేవతలకు హవి ర్భాగముల నొసంగుచుండ అచటికొక వాయన (కాకి)మేతెంచి వాటిని తిను చుండగా భరద్వాజుడు ఆ కాకాన వారింపబగానయ్యది ' భరద్వాజా: నేను కాకుండను రాక్షసుండును, ఒక మహర్షి శాపము వలన నిట్టుంటిని. ఈ శాపము మీ అభిషేకోదక ప్రభావంబుచే తొలగిపోగలదు' అని తెలిపెను. అట్లోన ర్చిన వెంటనే ఆ కాకి నల్లని వర్ణహు వీడి తెల్లని వర్ణము సంతరించుకొనది. ప్రతి దినము ఈ పక్షిరాజము మానస సరోవరము నుండి ఆకాశ మార్గమున పక్షి తీర్థమున కేగి మరల వెళ్లనపుడు

# మతసామరస్యానికి ప్రతీక 'పెదకాకాని'

(151వ పేజీ తరువాయి)

తొలగిపోతాయని భక్తుల ప్రగాఢ విశ్వాసం. ఎంతటికీ వివాహం కాకపోవటం, పిల్లలు లేకపోవటం, ఆస్తి తగాదాలు, అన్నదమ్ముల మధ్య విబేధాలు, వ్యవసాయం, వ్యాపారం అభివృద్ధి చెందకపోవటం, అనారోగ్యంపాలగుట, తీర్చలేని రుణ బాధలు, శత్రువుల వల్ల ఇబ్బందులు, భార్యతో సమస్యలు ఉండటం తదితర ఇబ్బందులు పడుచున్నవారు సుఖ సంతోషాలు కలిగేందుకు ఆలయాన్ని దర్శించి రాహుకేతువులకు పూజలు జరిపిస్తారు. అట్లు చేసినవారికి పై వాటినుండి విముక్తి కలిగి సుఖశాంతులు కలుగుతాయని ప్రగాఢ విశ్వాసం.



పెదకాకానిలోని బాజీ బాబా దర్గా



పెదకాకానిలో బాజీబాబా దర్బార్

### రుగ్మతలను తొలగిస్తున్న 'కాకాని స్వస్థిశాల'

సమాజంలోని వివిధ రుగ్మతలతో బాధపడుతున్న వారికి స్వస్థతను చేకూర్చి, రుగ్మతలను తొలగించేందుకు కాకాని స్వస్థిశాల ఏర్పడింది. క్రైస్తవుల భక్తులు విశేషంగా తరలివచ్చి యేసు క్రీస్తు ప్రార్థనలు చేస్తుంటారు. స్వస్థిశాలను యం దేవదాసు అయ్యగారిచే స్థాపించబడింది. వీరి మరణానంతరం రెవ. జె సెల్వరాజ్ హయాంలో కాకాని స్వస్థిశాల మరింతగా అభివృద్ధి చెందింది. ప్రస్తుతం బైబిల్ మిషన్ ఉపాధ్యక్షుడు రెవరెండ్ జె శామ్యూల్ కిరణ్ ఆధ్వర్యంలో భారదేశ వ్యాప్తంగా శాఖోపశాఖలుగా అభివృద్ధి చెంది ఎందరో పేదలకు స్వస్థతను చేకూరుస్తుంది. ప్రత్యేక ప్రార్థనల ద్వారా కుటుంబంలోని కలహాలు, ఆరోగ్య సమస్యలు, ఇంటిలోని రుగ్మతలను తొలగిపోతాయని అక్కడి ప్రజల భక్తుల విశ్వాసం. ప్రతి సోమవారం సాయంత్రం వేళ భక్తులకు ఆశీర్వాదం (నూనె)ను భక్తులు ఎంతో పవిత్రంగా స్వీకరిస్తారు. ప్రార్థనకు వచ్చిన ప్రతి ఒక్కరూ ఆ ఆశార్వాదం పొందటం వల్ల మానసిక ప్రశాంతత కల్గుతుందని, ప్రభువు యొక్క దీవెనలు పొందునట్లు భావిస్తారు. ప్రతి సంవత్సం ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం ఎదుట బైబిల్ మిషన్ మహాసభలను ఎంతో వైభవంగా నిర్వహిస్తారు. దేశ వ్యాప్తంగా లక్షలాది మంది భక్తులు తరలివచ్చి ప్రత్యేక ప్రార్థనలు నిర్వహిస్తారు. ఈ మహాసభల్లో బైబిల్ మిషన్ ప్రతినిధులు అందరూ కలుసుకొని ప్రత్యేక ప్రార్థనలు నిర్వహించడం విశేషం. ప్రమీల సెల్వరాజ్ భక్తి గీతాలను ఆలపిస్తారు.

### పల్లాలమ్మ చెరువులో కొలువైన 'బాజీబాబా దర్గా'

పెదకాకానిలోని పల్లాలమ్మ చెరువులో హజరత్ సయ్యద్ ఆవులియా బాజీబాబా దర్గా కొలువుతీరి ఉంది. పెదకాకాని దర్గాకు ఎంతో ప్రాముఖ్యత సంతరించుకొంది. భూత, పిశాచులను తొలగించి కొలిచిన ప్రజల కొంగు బంగారమై బాజీ బాబా సకల సౌక్యాలు కలిగిస్తారని ప్రజల ప్రగాఢ విశ్వాసం. ప్రతి శుక్రవారం భక్తులు విశేషంగా తరలివచ్చి బాజీ బాబా దర్గాలో ప్రత్యేక నమాజ్ చేస్తారు. ప్రతి సంవత్సరం దర్గాలో ఉరుసు మహోత్సవాన్ని ఎంతో వైభవంగా నిర్వహిస్తారు. ప్రత్యేక ఏర్పాట్లను జాయింట్ ముతావలిలు పర్యవేక్షిస్తారు. ఉరుసు మహోత్సవం సందర్భంగా భక్తులకు సంధల్ (గంధం) పంచుతారు. దీనిని భక్తులు ఎంతో పవిత్రంగా స్వీకరిస్తారు.

- ఆన్‌లైన్ - పెదకాకాని

## కృష్ణాడెల్టాను సస్యశ్యామలం చేసే

# పులిచింతల




కృష్ణా డెల్టాను సస్యశ్యామలం చేయడంకోసం పులిచింతల ప్రాజెక్ట్‌ను రూపొందించారు. స్వర్గీయ కెఎల్ రావు ప్రతిపాదించిన ఈ ప్రాజెక్ట్‌కు ముఖ్యమంత్రి డాక్టర్ వైఎస్ రాజశేఖరరెడ్డి మొదటి సారిగా జలయజ్ఞంలో శంఖుస్థాపనచేశారు. ప్రకాశం బ్యారేజికి ఎగువన 85 కిలోమీటర్లు, నాగార్జున సాగర్ ప్రాజెక్టుకు దిగువ 115 కిలోమీటర్ల దూరంలో ఈ ప్రాజెక్టును రూపొందించారు. దీనివలన కృష్ణా డెల్టా సస్యశ్యామల మవుతుంది. కృష్ణానది పైన మహారాష్ట్ర, కర్ణాటక రాష్ట్రాల్లో అనేక రిజర్వాయర్లను నిర్మించారు. దీనివలన కృష్ణా డెల్టా పరిధిలో క్రమంగా సాగునీటిని నిల్వ చేసుకునే అవకాశం క్రమంగా తగ్గిపోతుంది. పులిచింతల ప్రాజెక్టువలన 45.77 టియంసిల నీటిని నిల్వచేసి 120 మెగావాట్ల విద్యుత్‌ను ఉత్పత్తి చేసే అవకాశం ఉంది. ఈ ప్రాజెక్టు నిర్మాణాన్ని ఎస్టిమేషన్ ప్రొక్యూర్‌మెంట్ కన్‌స్ట్రక్షన్ (ఇపిసి) కింద చేపట్టారు. రాష్ట్రంలో ఇపిసి ద్వారా దేవాదుల తర్వాత పులిచింతల నిర్మాణాన్ని ప్రభుత్వం చేపట్టింది. ప్రాజెక్టు నిర్మాణాన్ని శ్రీనివాస కన్‌స్ట్రక్షన్స్ సంస్థకు అప్పగించారు.

### మూడు సంవత్సరాల క్రితం శంకుస్థాపన...

ముఖ్యమంత్రి డాక్టర్ వైఎస్ రాజశేఖరరెడ్డి పులిచింతల ప్రాజెక్టుకు 2004 అక్టోబరు 15వ తేదీన శంఖుస్థాపన చేశారు. వైఎస్ ప్రభుత్వం ప్రతిష్టాత్మ

(మిగతా 155లో)

## Hon'ble M.L.C.s IN GUNTUR DISTRICT

| Sl. No. | Name of the M.L.C. | | Cell No. |
|---|---|---|---|
| 1. | Mohd. Jani | | 9849516572 |
| 2. | Dr. Rayapati Srinivas | 0863-2234824, 2350400 | 9440922555 |
| 3. | S. Basava Punaiah | 0863-2252653 | 9848067174 |
| 4. | Laxmana Rao | 0863-2352072 | 9440262072 |
| 5. | Ch. Varaprasad | 9848133229 | 9866551155 |
| 6. | T.G.V. Krishna Reddy | | 9849300147 |

### PARTY OFFICES

| | | |
|---|---|---|
| 1. | CONGRESS | 0863-2323100 |
| 2. | T.D.P. | 0863-2236600, 2236700 |
| 3. | C.P.M. | 0863-2232319 |
| 4. | C.P.I. | 0863-2214401, 2220915 |
| 5. | B.J.P. | 0863-2244123 |





## ZILLA PARISHAD

| S.No. | NAME | OFFICE PHONE | CELL NO. |
|---|---|---|---|
| 1. | Chairman | 2358310 | 9948588588 |
| | | 22408870 | |
| 2. | Vice Chairman | | 9346456688 |
| 3. | CEO-ZP | 2234082 | 9849903355 |
| 4. | Dy.CEO-ZP | 2234217 | 9989248944 |
| 5. | AO-ZP | 2234756 | 9441207801 |
| 6. | PEO-ZP | 2234207 | 9346477652 |
| | **P.R. ENGINEERING** | | |
| 1. | SE-PR | 2234697 | 9848250488 |
| | P.A. TO SE-9848661347 | 2256151 | |
| 2. | SE-RWS (Fax - 2357400) | 2230439 | 9440815221 |
| | P.A. TO S.E.9440815222 | 2256150 | |
| 3. | EE-PR-GNT | 2234124 | 9866324417 |
| 4. | EE-PR-TNL (FAX-232526) | 228075 | 9849178391 |
| 5. | EEPR-NRT (FAX-229487) | 222640 | 9866611945 |
| 6. | EE-RWS- GNT (FAX-2231505) | 2241438 | 9440815228 |
| 7. | EE-RWS-TNL (FAX-222850) | 222614 | 9866822478 |
| 8. | EE-RWS-NRT(FAX-228418) | 222574 | 9440815242 |
| 9. | QUALITY CONTROL | 2327158 | |
| 10. | PILOT PROJECT | 2230708 | |
| 11. | DY.EE-PR-GNT-1 | 2234124 | 9394100981 |
| 12. | DY.EE-PR-GUN-II | 2234124 | 9440263661 |
| 13. | DY.EE-PR-MANGALAGIRI | 233502 | 9866738070 |
| 14. | DY.EE-PR, SAP | 233828 | 9849379605 |
| 15. | DY.EE-PR, AMARAVATHI | | 9866183800 |
| 16. | DY.EE-PR, TENALI-I | 231072 | 9848429527 |
| 17. | DY.EE-PR, RAJUPALEM | 233828 | 9849389962 |
| 18. | DY.EE-PR-REPALLE | 223959 | 9866696588 |
| 19. | DY.EE-PR-PONNUR | 243472 | 9966360175 |
| 20. | DY.EE-PR-VEMURU | 234829 | 9440577814 |
| 21. | DY.EE-PR-VINUKONDA | 273367 | 9440264095 |
| 22. | DY.EE-PR-NRT | 224069 | 9849361827 |
| 23. | DY.EE-PR-CH.PET | 254651 | 9849685285 |
| 24. | DY.EE-PR-GURAZALA | 248403 | 9866197567 |
| 25. | DY.EE-PR-MACHERLA | 224001 | 9440557081 |
| 26. | DY.EE-RWS-GNT-I | 2251027 | 9440815231 |
| 27. | DY.EE-RWS-GNT-II | 2251012 | 9440815233 |
| 28. | DY.EE-RWS-SAP-I | 234513 | 9440815238 |
| 29. | DY.EE-RWS-SAP-II | 233754 | 9440815240 |
| 30. | DY.EE-RWS-TENALI | 222614 | 9440391905 |
| 31. | DY.EE-RWS-BAPATLA | 223008 | 9440815257 |
| 32. | DY.EE-RWS-REPALLE | 222404 | 9441130187 |
| 33. | DY.EE-RWS-CH.PET | 252748 | 9440815245 |
| 34. | DY.EE-RWS-VINUKONDA | 274368 | 9440815255 |
| 35. | DY.EE-RWS-P.RALLA | 252665 | 9440815253 |
| 36. | DY.EE-MACHERLA | 222027 | 9440815247 |
| 37. | DY.EE-RWS-NRT | 222574 | 9440815248 |
| 38. | HEAD QUARTERS A.E. | | 9866073178 |

# కృష్ణా డెల్టాను సస్య శ్యామలం చేసే పులిచింతల

## చురుకుగా సాగుతున్న పనులు
## జలయజ్ఞంలో మొదటి ప్రాజెక్టు
## 120 మెగావాట్ల విద్యుత్ ఉత్పత్తి

| | |
|---|---|
| పులిచింతల ప్రాజెక్ట్ అంచనా వ్యయం | రూ. 566.87 కోట్లు |
| పెరిగిన అంచనాల ప్రకారం అయ్యే వ్యయం | రూ. 900 కోట్లు |
| ప్రాజెక్టు వలన మునిగిపోయే భూమి | 27,111 ఎకరాలు |
| రిజర్వాయర్‌లో పూర్తి నీటి సామర్థ్యం | 53.34 మీటర్లు |
| డ్యామ్ పొడవు | 1289 మీటర్లు |
| పులిచింతల వలన ఆయకట్టు స్థిరీకరణ | 13 లక్షల హెక్టార్లు |

(153వ పేజీ తరువాయి)

కంగా చేపట్టిన జలయజ్ఞంలో మొదటిసారిగా పులిచింతలకు శంఖుస్థాపన చేశారు. ప్రాజెక్టు నిర్మాణం ఆశించినంత వేగంగా జరగటంలేదనే విమర్శలు న్నాయి. ఇప్పటి వరకు రూ. 30 కోట్ల విలువైన పనులు మాత్రమే పూర్తయ్యాయి. కాంట్రాక్టర్‌కు ఇంజనీరింగ్ సిబ్బంది, ప్రభుత్వ యంత్రాంగం సహకరించకపోవటంవలన పనులు చురుకుగా జరగటంలేదని తెలిసింది. పూర్తి చేసిన పనులకు ఇంకా బిల్లులు కూడా విడుదల చేయలేదు. ప్రాజెక్టు నిర్మాణంలో తీవ్ర జాప్యం జరుగుతున్నట్లు రాజ్యసభ మాజీ సభ్యుడు, రైతు నాయకుడు డాక్టర్ యలమంచిలి శివాజి అనేకసార్లు ముఖ్యమంత్రి దృష్టికి తీసుకువెళ్లినా ఫలితం శూన్యమైంది.

### పూర్తికాని భూసేకరణ...

జిల్లాలో పులిచింతల ప్రాజెక్టు నిర్మాణానికి అవసరమైన భూ సేకరణ కార్యక్రమం ఇంకా పూర్తికాలేదు. దీనికి సంబంధించి పబ్లిక్ హియరింగ్

(మిగతా 157లో)



# స్వాతంత్ర్యోద్యమంలో చేబ్రోలు

(ఆన్‌లైన్ -చేబ్రోలు)

తెల్లదొరల నుంచి విముక్తి కలిగించేందుకు శతాబ్దకాలంగా కొనసాగిన స్వాతంత్ర్య పోరాటానికి ఎందరో త్యాగధనులను అందించిన చేబ్రోలు గడ్డ పునీతమైంది. భారత మాత దాస్యశృంఖలాలను చేధించడానికి ధన, మాన, ప్రాణాలను తృణ ప్రాయంగా భావించి ఉద్యమానికి ఊపిరులూదిన ఉద్యమకారుల చరిత్ర చేబ్రోలుకు ఘన కీర్తి తెచ్చిపెట్టింది. ఈ ప్రాంతానికి వచ్చిన జాతీయ నాయకులకు ఆశ్రయమిచ్చి ఆదరించారు. స్వాతంత్ర్య సముపార్జనలో చేబ్రోలు వ్యక్తులు పాల్గొని ఉద్యమాలు నడిపినందున ఉద్యమాల పురిటిగడ్డగా చేబ్రోలు చరిత్ర పుటల్లోకి ఎక్కింది. స్వాతంత్ర్యోద్యమంలో పురుషులతోపాటు మహిళలు కూడా విరివిగా పాల్గొని చేబ్రోలు గ్రామానికి వన్నె తెచ్చారు. రాష్ట్ర నలుమూలల్లో చూసినా ఏ గ్రామం నుండి పాల్గొననంతగా ఎక్కువ మంది ఉద్యమంలో పాల్గొన్నారు. ఆనాడు జాతీయ నాయకులను సైతం చేబ్రోలు ఆకర్షించింది. మహత్తర శక్తి సమన్వితమైన ఉద్యమ సారధి గాంధీ చేబ్రోలు వచ్చినప్పుడు వీరిచ్చిన చేయూతను ప్రశంసించారు. ఇక్కడి నుండి ఎన్నో ఉద్యమాలు ప్రారంభించారు. పన్నుల సహాయ నిరాకరణోద్యమానికి బలమిచ్చి తారా స్థాయికి తీసుకుపోయారు.

1931లో వాసిరెడ్డి వెర్రయ్య శాసనోల్లంఘన ఉద్యమానికి ఇక్కడి ప్రధాన పాత్ర పోషించారు. సమర యోధుడు పాటిబండ్ల పెదపిచ్చయ్య వందే మాతరం, ఉప్పు సత్యాగ్రహోద్యమంలో పాల్గొని జైలుకు వెళ్లారు. పాటిబండ్ల చిన పిచ్చియ్య 1930లో వందేమాతరం పోరాటంలో పాల్గొన్నారు. దేశిరాజు కామేశ్వర్ పలువురు జాతీయ నాయకులకు ఆశ్రయమిచ్చి వందేమాతరం ఉద్యమంలో కీలకపాత్ర పోషించారు. సూర్యదేవర లక్ష్మీపతి, సూర్యదేవర వెంకటప్పయ్య, బోడేపూడి వెంకట సుబ్బయ్యలు ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు గాను మూడు సంవత్సరాలు జైలుకి వెళ్లారు. అప్పట్లో జైలులో దొంగలకిచ్చే నల్ల టోపీని బసవలింగయ్యకు కూడా ఇచ్చారు. వాసిరెడ్డి చంద్ర శేఖరం వందే మాతరం, ఉప్పు సత్యాగ్రహాలలో పాల్గొనటమేకాక పంచాయతీరాజ్ చట్టం ఏర్పడిన తరువాత తొలిసారిగా చేబ్రోలు గ్రామానికి సర్పంచ్‌గా ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. అంతేగాక మాజీ ముఖ్యమంత్రి దివంగత కాసు బ్రహ్మానందరెడ్డి అధ్యక్షతన అప్పటి గుంటూరు జిల్లా బోర్డుకు డైరెక్టర్గా పనిచేశారు. గత పదేళ్ల క్రితం భారత స్వర్ణోత్సవాల సందర్భంగా అప్పటి బిజెపి అధ్యక్షుడు ఎల్కె అద్వాని చేబ్రోలువైపు వెళుతూ చంద్రశేఖరాన్ని సన్మానించారు. వాసిరెడ్డి నాగేశ్వరరావు, వాసిరెడ్డి వెంకటప్పయ్య, కారుమంచి సీతారామయ్య, వాసిరెడ్డి సుబ్బారావు, చిరుమామిళ్ల మురహరిరావు, వాసిరెడ్డి రాజ్యలక్ష్మి, దేవభక్తుని అఖిలాండమ్మ, గోళ్లమూడి రత్తమ్మ, గోళ్లమూడి నాయుడమ్మ, కనికచర్ల రాధాకృష్ణమూర్తి, సూర్యదేవర భద్రయ్య, సూర్యదేవర అనంత రామయ్య, కఠారి శ్రీరాములు, సింహాద్రి వీరాస్వామి, అన్నవరపు వెంకటేశ్వర్లు, కుందేటి రామకోటయ్య, వంటి ఎందరో ఉద్యమకారులు ఉప్పు సత్యాగ్రహం, శాసనోల్లంఘన ఉద్యమాల్లో పాల్గొని జైలు శిక్ష అనుభవించారు.



స్వాతంత్ర్య సమరయోధుడు
వాసిరెడ్డి చంద్రశేఖరం

పాటిబండ్ల నాగేశ్వరరావు 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని రెండు సంవత్సరాలు జైలు శిక్ష అనుభవించారు. అప్పట్లో ఆయన బ్రిటీషు రవాణా సౌకర్యాలను స్తంభింపచేయడానికి వారి కట్టడాలు, వంతెనలు కూల్చడానికి బాంబులు తయారు చేశారతడు. అందుకే ఈయనను బాంబుల నాగేశ్వరరావు అని కూడా పిలుస్తారు. చంద్రశేఖరం సోదరుడైన భానుప్రసాద్ క్విట్ ఇండియా ఉద్యమాలు పాల్గొని కేసు జరుగుతుండగానే సుస్తి చేసి జైలులోనే మరణించారు. జొన్నవిత్తుల గురునాధం 1910-13 మధ్య కాలంలో ఆంధ్రోద్యమ ఉధృతికి ఊపందించారు. చట్ట నరసింహాచార్యులు, వింజమూరి భవనాచార్యులు, చల్లా శేషగిరారావు, కొండా వెంకటప్పయ్యల సహకారంతో ఆంధ్రోద్యమాన్ని విజయవంతంగా నడిపారు. 1913లో జరిగిన ప్రధమ ఆంధ్ర మహాసభకు విశేష కృషిచేశారు. మంచాల గ్రామానికి చెందిన శిష్టా శివ స్వామి కూడా క్విట్ ఇండియా, ఉప్పు సత్యాగ్రహం, వందేమాతరం, శాసనోల్లంఘనోద్యమం, చీరాల- పేరాల పన్నుల నిరాకరణోద్యమాలలో పాల్గొని జిల్లా ప్రజల హృదయాలలో చిరస్థాయిగా నిలిచిపోయారు.

వీరితోపాటు అతివాద వర్గానికి చెందిన గాదె చినపరెడ్డి ఫిబ్రవరి 18, 1903వ తేదీన మహాశివరాత్రి పర్వదినం రోజు కోటప్పకొండ వద్ద జరిగిన సంఘటనలో ఆంగ్లేయులను ఎదిరించడం వలన ఉరితీయబడ్డారు. కొత్తరెడ్డి పాలెంకు చెందిన ఈ చినపరెడ్డి పేరున ఆంధ్రరాష్ట్రంలో 'సైసైరా చిన్నపరెడ్డి నీవేరా బంగారపు కడ్డీ' అనే గేయం రచించబడింది. దేశ స్వాతంత్ర్యం కోసం తమ సుఖ సౌఖ్యాలను, ఐశ్వర్యాలను వదిలి, ప్రాణాలను తృణ ప్రాయంగా భావించి ఉద్యమాల్లో పాల్గొని చరిత్ర పుటల్లో చిరస్థాయిగా నిలిచిన ఈ స్వాతంత్ర్య సమరయోధుల్ని చేబ్రోలులో నేడు స్మరించుకునేవారే కరువయ్యారు. ఇటీవల యావద్భారత దేశం స్వాతంత్ర్య షష్టి పూర్తి వేడుకలను ఎంతో ఘనంగా నిర్వహించినప్పటికీ చేబ్రోలులో మాత్రం స్వాతంత్ర్య సమరయోధుల సంస్మరణ కార్యక్రమం కూడా నిర్వహించకపోవడం విచారించదగ్గ విషయం ఇప్పటికైనా కనీసం చేబ్రోలులో సమరయోధుల స్మృతికి చిహ్నంగా ఒక స్థూపాన్ని ఏర్పాటు చేస్తే అమర వీరులకు నిజమైన నివాళులర్పించినట్లవుతుంది.




శాకాంబరి సన్‌సిటీ నమూనా

# నగరి సిగలో మణిహారాలు

# అపార్టుమెంట్లు

★ అపార్ట్‌మెంట్లతోనే సొంత ఇంటి కల సాకారం

★ కొత్త ఒరవడి సృష్టిస్తున్న నూతన నిర్మాణాలు

(ఆన్‌లైన్ - గుంటూరు)

గృహమే కదా స్వర్గసీమ అన్నారు పెద్దలు. మారుతున్న నాగరిక ప్రపంచంలో ఇంటి నిర్మాణ విషయంలో రోజురోజుకీ ఆసక్తి, ఆదరణ పెరుగుతున్నాయి. ముఖ్యంగా నగర వాతావరణంలో సొంత ఇల్లు ఉంటే అదే చాలు అనుకునే రోజులు ఇవి. అయితే పదిలక్షల జనాభాను సమీపిస్తున్న గుంటూరు నగర జీవనంలో సొంత ఇంటి నిర్మాణం భారంగా మారుతుంది. మధ్యతరగతి వర్గాలకు సొంత ఇల్లు ఓ కలగా మారే పరిస్థితి నెలకొంది. ఇదే సమయంలో రెండున్నర దశాబ్దాల క్రితం గుంటూరు నగరంలోకి ప్రవేశించిన అపార్ట్‌మెంట్ల నిర్మాణం ఉన్నత వర్గాలతో పాటు మధ్య తరగతి ప్రజల సొంత ఇంటి కలను సాకారం చేసింది. ఎన్నో ఒడిదుడుకులు ఎదురైనప్పటికి నగరంలో వందలాది అపార్ట్‌మెంట్‌లు వెలిసాయి. వేల కుటుంబాలకు ఆసరాగా నిలిచాయి. మెట్రోపాలిటన్ సిటీలతో పోటీపడే విధంగా గుంటూరు నగరంలో అపార్ట్‌మెంట్ల నిర్మాణం శరవేగంగా సాగుతుంది. నగర ప్రజలు కూడా ఆయా అపార్ట్‌మెంట్లలో ఉండేందుకు ఎక్కువ మక్కువ చూపుతున్నారు.

(మిగతా 172వ పేజీలో...)

## రైల్వే సమాచారం

(169వ పేజీ తరువాయి...)

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 2670 | చాప్రా | - | చెన్నై (గంగాకావేరి) | 3,5 | 02-40 | 02-50 |
| 2710 | సికింద్రాబాద్ | - | గూడూరు (సింహాద్రి) | రోజూ | 03-25 | 03-35 |
| 2711 | విజయవాడ | - | చెన్నై (పెన్నా) | రోజూ | - | 06-00 |
| 7481 | బిలాస్‌పూర్ | - | తిరుపతి | 3,7 | 08-00 | 08-20 |
| 7479 | పూరి | - | తిరుపతి | 1,2,4,5,6 | 08-00 | 08-20 |
| | | | **తిరుపతి నుండి బయలు దేరు రైళ్ళు** | | | |
| 6204 | తిరుపతి | - | చెన్నై | రోజూ | - | 06-30 |
| 6054 | తిరుపతి | - | చెన్నై | రోజూ | - | 10-05 |
| 6058 | తిరుపతి | - | చెన్నై (సప్తగిరి) | రోజూ | - | 17-20 |
| 7229 | కోసివేల్ | - | హైదరాబాద్ (శబరి) | రోజూ | - | 00-35 |
| 2763 | తిరుపతి | - | సికింద్రాబాద్ (పద్మావతి) | 1,3,5,6,7 | - | 17-05 |
| 2733 | తిరుపతి | - | సికింద్రాబాద్ (నారాయణాద్రి) | రోజూ | - | 18-25 |
| 7487 | తిరుపతి | - | విశాఖపట్నం (తిరుమల) | రోజూ | - | 19-50 |
| 7209 | బెంగుళూరు | - | కాకినాడ (శేషాద్రి) | రోజూ | 19-55 | 20-00 |
| 273 | తిరుపతి | - | కాకినాడ | రోజూ | - | 01-05 |
| 529 | తిరుపతి | - | గూడూరు | రోజూ | - | 06-20 |
| 211 | తిరుపతి | - | గూడూరు | రోజూ | - | 13-45 |
| 439 | తిరుపతి | - | చీరాల | రోజూ | - | 15-15 |
| 0209 | తిరుపతి | - | మచిలీపట్నం | 1,4,6 | - | 19-30 |

1. సోమ * 2.మంగళ * 3.బుధ * 4. గురు * 5.శుక్ర * 6.శని * 7.ఆది.

# నగరి సిగలో మణిహారాలు...

(171వ పేజీ తరువాయి...)

ఈ నేపథ్యంలో గుంటూరు నగరంలో అపార్ట్‌మెంట్‌ల నిర్మాణం, అందులో నివసించే ప్రజల జీవన విధానం మారుతున్న కాలానికి అనుగుణంగా ఉంటోంది. దీనికి సంబంధించి నగరంలో నాటి నుంచి నేటి వరకు అపార్ట్‌మెంట్‌ల నిర్మాణం, వాటిపై పెరుగుతున్న ఆదరణకు దారి తీసిన వివరాలను తెలుసుకుందాం.

### 1985లో ప్రారంభమైన అపార్ట్‌మెంట్ల సంస్కృతి...

అప్పుడప్పుడే గుంటూరు పట్టణం అభివృద్ధి దిశగా అడుగులు ప్రారంభించింది. హైదరాబాద్, విశాఖపట్టణం, విజయవాడ నగరాల్లో అప్పటికే అపార్ట్‌మెంట్‌ల నిర్మాణాలు జోరుగా సాగుతున్నాయి. అప్పట్లో గుంటూరు మున్సిపాలిటీగా ఉంది. ఎటుచూసినా ఐదు కిలోమీటర్లకు మించని విస్తీర్ణంలో గుంటూరు పట్టణం ఉంది. 1985 ఆరంభం నుంచి గుంటూరులో అపార్ట్‌మెంట్‌ల సంస్కృతి ప్రారంభమైఉంది. అంతకు మునుపు పట్టణంలో వ్యక్తిగత గృహ నిర్మాణాలే సాగుతున్నాయి. పెరిగిన వ్యాపార, విద్య, వైద్య రంగాల దృష్ట్యా నగరానికి ప్రముఖులు రావడం ప్రారంభమైంది. అప్పట్లో నగరంలో ఎటుచూసినా ఖాళీ స్థలాలే కనిపించేవి. అపార్ట్‌మెంట్‌లు నిర్మించాల్సిన అవసరం ఉండేది కాదు. అయినప్పటికీ నిర్మాణవ్యయంతో పోల్చుకుంటే వ్యక్తిగత ఇంటికంటే అపార్ట్‌మెంట్‌లో ప్లాటు సగానికి సగం ధర తక్కువకు వచ్చేది. అంతేగాక అక్కడ రక్షణ కూడా ఉండేది. దీంతో అప్పట్లో పలువురు అపార్ట్‌మెంట్‌లలో ఉండేందుకు ఇష్టపడేవారు. దీంతో 1986 నుంచి నగరంలో అపార్ట్‌మెంట్‌లు నిర్మించడం ప్రారంభమైంది. అప్పట్లో ఇది నగర ప్రజలకు కొత్తగా ఉండేది.

### 1991 నుంచి ఊపందుకున్న నిర్మాణాలు...

గుంటూరు నగరంలో 1991 నుంచి అపార్ట్‌మెంట్ల నిర్మాణాలు ఊపందుకున్నాయి. అప్పట్లో పది మంది లోపే బిల్డర్లు ఉండేవారు. ఖాళీ స్థలాలకు కొదువ లేకపోవడం, స్థలాల ధరలు తక్కువగా ఉండడంతో అపార్ట్‌మెంట్ నిర్మాణాలు చురుగ్గా సాగాయి. స్థల యజమానికి 40 శాతం, బిల్డర్‌కు 60 శాతం వాటా ఇచ్చే విధంగా ఒప్పందం కుదుర్చుకుని నిర్మాణాలు పూర్తిచేశారు. అప్పట్లో ఒక్కో అపార్ట్‌మెంటులో 20 నుంచి 25 వరకు ప్లాట్‌లు ఉండేవి. మూడంతస్థుల లోపే అపార్ట్‌మెంట్‌లు నిర్మించేవారు. ఏడాదికి అప్పట్లో 50 వరకు అపార్ట్‌మెంట్ల నిర్మాణం జరిగింది.

### గడిచిన మూడేళ్ళలో శరవేగంగా నిర్మాణాలు...

నగరంలో గడిచిన మూడేళ్ళలో అపార్ట్‌మెంట్ల నిర్మాణాలు శరవేగంగా జరిగాయి. ఏడాదికి సుమారు వంద అపార్ట్‌మెంట్ల వరకు నిర్మాణాలు జరుగుతున్నాయి. ప్రస్తుతం నగరంలో వెయ్యి వరకు అపార్ట్‌మెంట్లు ఉన్నాయి. ఇటీవల అపార్ట్‌మెంట్ల నిర్మాణాలపై ప్రభుత్వం జారీ చేసిన జీవో బిల్డర్లకు అశనిపాతంగా మారింది.

(మిగతా 173వ పేజీలో...)

# నగరి సిగలో మణిహారాలు...

(172వ పేజీ తరువాయి...)

గడిచిన మూడేళ్ళలో ఎక్కువ మంది అపార్ట్‌మెంట్ల సంస్కృతికి అల వాటుపడటంతో వాటిని నిర్మించే బిల్డ ర్‌లు కూడా వందమంది వరకు తయా రయ్యారు. అయితే ఇటీవల మార్కె ట్‌లో చోటుచేసుకున్న పలు పరిణామా లతో అపార్ట్‌మెంట్ల నిర్మాణం భాగా తగ్గిపోయింది.

## కోస్తా జిల్లాలకే మణిహారంగా రూపుదిద్దుకుంటున్న శాకాంబరి సన్‌సిటి

అమరావతి రోడ్డులో అత్యంత భారీగా నిర్మితమవుతున్న శాకాంబరి సన్‌సిటి అపార్ట్‌మెంట్‌లు కోస్తా జిల్లా లకే మణిహారంగా మారబోతున్నాయి. ఇప్పటివరకు నగరంలో ఐదు అంత స్థుల వరకే అపార్ట్‌మెంటులు పరిమితం కాగా మొట్టమొదటిసారిగా నగరంలో ఏడు అంతస్థులతో శాకాంబరి సన్‌సిటి నిర్మాణం శరవేగంగా సాగుతుంది. ఇందులో 300 ప్లాట్లు ఉండే విధంగా ప్లాన్ రూపొందించారు.

అత్యాధునిక సదుపాయాలు కూడా కల్పిస్తున్నారు. ఆవరణలో బ్యాడ్మింటెన్ కోర్టు, స్విమ్మింగ్‌పూల్, స్క్వాష్ కోర్టు, టేబుల్ టెన్నిస్, పూల్ టెన్నిస్, చెస్, క్యారమ్స్, ఏసి జిమ్, స్టీమ్‌బాత్, జాక్విజి బాత్, పిల్ల లకు ఆట గది, ఏసి ఫంక్షన్ హాలు వంటి అత్యాధునిక సదుపాయాలు, సకల సౌకర్యాలు ఈ అపార్ట్‌మెంటు ప్రత్యేకత.

## మోజెందుకు పెరిగిందంటే...

అప్పట్లో రూ. 7 లక్షలకే డబుల్ బెడ్ రూం ప్లాట్ వచ్చేది. మధ్యతరగతి వారికి సైతం ఇది అందుబాటులో ఉండేది. అంతేగాక మనసులను హత్తు కొనే ఇంటీరియర్ డెకరేషన్స్ పెట్టుకునే సౌలభ్యం ఉండేది. ముఖ్యంగా రక్షణ ఉంటుండటంతో అపార్ట్‌మెంట్లవైపు ప్రజలు మొగ్గు చేపారు. అయితే ప్రస్తుతం నగరంలో స్థలాల ధరలు ఆకాశాన్ని అంటడం, సామాగ్రి ధర భారీగా పెరగడంతో సొంత ఇంటి నిర్మాణం కలగా మారిపోయింది. దీంతో అపార్ట్‌మెంట్‌లో ప్లాట్ల వైపు ప్రతి ఒక్కరూ మొగ్గుచూపుతున్నారు. ఇదిలా ఉంటే కొద్దిరోజులుగా చోటుచే సుకున్న మార్పుల దృష్ట్యా అపార్ట్ మెంట్ల నిర్మాణం ఆగిపోయింది. డబల్ బెడ్‌రూం ప్లాట్ రూ. 20 నుంచి 30 లక్షల మధ్య ఉండటంతో మధ్యతరగతి ప్రజలు కొనలేని పరిస్థితిలో ఉన్నారు.

లక్ష్మీపురం, చంద్రమౌళి నగర్, బృందావన్ గార్డెన్స్, రాజేంద్రనగర్, వికాస్‌నగర్, విద్యానగర్, సాయి బాబా రోడ్డు, బ్రాడీపేట, అరండల్‌పే టల్లోనే అత్యధిక అపార్ట్‌మెంట్లు వెలి శాయి. ప్రస్తుతం నగర శివారు ప్రాంతాల్లో స్థలాల ధరలు తక్కువగా ఉండటంతో బిల్డర్లు ఆయా ప్రాంతాల్లో నిర్మిస్తున్నారు.

# మానవ నిర్మిత మహాకట్టడం ఈ నాగార్జున సాగరం

(ఆన్‌లైన్, మాచర్ల, విజయపురిసౌత్)

లక్షలాది ఎకరాల మెట్ట భూములను సస్యశ్యామలం చేస్తూ ఆంధ్రా ప్రజానీకానికి కడుపునింపుతూ, విద్యుత్ వెలుగులను ప్రసరింపజేస్తూ ఆంధ్రుల జీవితాల్లో మమేకమైంది నాగార్జునసాగర్ డ్యామ్. జరజరా పరుగులిడుతున్న కృష్ణమ్మకు ముకుతాడేసి ఒడిసిపట్టిన సాగర్ డ్యామ్ నిర్మాణానికి పడ్డ శ్రమ అంతా ఇంతా కాదు. 1930లో నల్గొండ, ఖమ్మం జిల్లాల రైతులకు సేద్యపు నీటి సౌకర్యాన్ని కల్పించేందుకు ఆనాటి నిజాం ప్రభుత్వం బ్రిటిష్ ప్రభుత్వ అనుమతిని కోరింది. దీనికి తెల్లదొరలు అంగీకరించలేదు. 1948లో హైదరాబాద్ ప్రత్యేక రాష్ట్రంగా అవతరించాక సముద్ర మట్టానికి 546 అడుగుల ఆనకట్ట నిర్మించాలనే తలంపు కలిగింది. ప్రణాళిక సంఘ కమిటి 546 అడుగుల ఎత్తుగల ఆనకట్ట, కుడి, ఎడమ కాలువలను నిర్మించాలని ఇచ్చిన సూచనల మేరకు అప్పటి చీఫ్ ఇంజనీర్ ఆలీవ వాచ్ జింగ్ ఈ డ్యామ్ నిర్మాణానికి రూపకల్పన చేశారు. దీంతో 1955, డిసెంబరు 10న భారత తొలి ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ ఈ మెగా ప్రాజెక్ట్ నిర్మాణానికి శంకుస్థాపన చేశారు. రోజుకు సుమారు 50 వేల మంది కూలీలు 12 సంవత్సరాల పాటు చెమటోడ్చడం మూలాన ప్రాజెక్ట్ నిర్మాణం పూర్తయింది. సాగర్ ప్రాజెక్ట్ పునాది నుంచి 408 అడుగుల ఎత్తు ఉంది. ఈ ఆనకట్ట అడుగు భాగం 287 నుంచి 327 అడుగుల వెడల్పు ఉంది. పై భాగాన్ని పరిశీలిస్తే 30.5 అడుగుల వెడల్పు, 4,756 అడుగుల నిడివి ఉంటుంది. డ్యామ్‌లు 79 బ్లాక్‌లుగా విభజించారు. ఎడమ వైపు నాన్ ఓవర్ ఫ్లో సెక్షన్ 1394 అడుగులు, కుడి వైపు 1812 అడుగులు ఉంటుంది. ఈ రెండు నాన్ ఓవర్ ఫ్లో సెక్షన్‌ల మధ్య 24వ బ్లాక్ నుంచి 50వ బ్లాక్ వరకు ఓవర్

(మిగతా 175వ పేజీలో...)



ప్రాజెక్ట్ నిర్మాణానికి ఏర్పరచిన పరంజా

## మానవ నిర్మిత మహాకట్టడం...

(174వ పేజీ తరువాయి ...)

ఫ్లో సెక్షన్‌ల నిడివి 1550 అడుగులు ఉంటుంది. వీటి మధ్య 26 రేడియల్ క్రస్ట్ గేట్లను అమర్చారు. ఇవి 13.71, 13.41 మీటర్ల పొడవు, వెడల్పులు వుంటాయి. క్రస్ట్ గేట్ల అమరికకు కర్ణాటక, మహారాష్ట్ర ప్రభుత్వాలు తీవ్ర అభ్యంతరం వెలిబుచ్చినప్పటికీ

(మిగతా 176వ పేజీలో ...)



పనుల్లో నిమగ్నమైన కూలీలు



ప్రాజెక్ట్ పనులు జరగాల్సిన బ్లాక్‌ల నుంచి కృష్ణానది ప్రవహిస్తున్న దృశ్యం

# మానవ నిర్మిత మహాకట్టడం...

(175వ పేజీ తరువాయి ...)

కేంద్ర స్థాయిలో ప్రముఖ ఇంజనీర్ స్వర్గీయ కె.ఎల్.రావు ప్రదర్శించిన చొరవ, కృషి మూలంగా వీటి నిర్మాణం పూర్తయింది. రిజర్వాయర్ పూర్తిస్థాయి నీటిమట్టం 590 అడుగులు, 110 చదరపు మైళ్ళ విస్తీర్ణం కలిగి 405 టిఎంసిల నిలువ సామర్థ్యం కలిగి ఉంది. దీనిలో 168 టిఎంసీల నీరు డెడ్ స్టోరేజ్‌గా ఉంటుంది. ఈ రిజర్వాయర్ 23 లక్షల ఎకరాలకు సాగునీరు అందజేస్తోంది. అయితే వర్షాభావ పరిస్థితులతో పాటు

(మిగతా 177వ పేజీలో ...)



ప్రాజెక్ట్ నిర్మాణానికి శంకుస్థాపన చేసినప్పటి దృశ్యం

## మానవ నిర్మిత మహాకట్టడం...

(176వ పేజీ తరువాయి ...)

మరికొన్ని కారణాల వల్ల సామర్థ్యానికి తగిన స్థాయిలో ప్రస్తుతం నీటిని అందించలేకపోతోంది. ఈ నిర్మాణ సమయంలో సుమారు 50 వేల పైచిలుకు కూలీలు మృత్యువాతపడ్డట్లు తెలుస్తోంది. ముఖ్యంగా ఎడమ కాలువ టన్నెల్ అనేక సార్లు కూలి వందలాది మంది కార్మికులు దుర్మరణం పాలయ్యారు. వేలాది మంది కూలీలు అంగవికలురయ్యారు. ఎన్ని ప్రమాదాలు ఎదురవుతున్నా, సాగర్ పనులకు వెళ్తే తిరిగొస్తామో లేదో తెలీకున్నా, మొక్కవోని దీక్షతో శ్రమించి డ్యామ్ నిర్మాణం పూర్తిచేయడంలో కూలీల పాత్రే ప్రముఖమైంది. 1967, ఆగస్ట్ 4న దివంగత ప్రధాని ఇందిరాగాంధీ కాలువలకు నీటిని విడుదల చేశారు. 1970 నాటికి రేడియల్ క్రస్ట్ గేట్లను కూడా అమర్చారు. డ్యామ్ పరిపూర్ణ నిర్మాణం 1974లో జరిగింది. తత్ఫలితంగా 23 లక్షల ఎకరాలకు సాగు నీరందించే మానవ నిర్మిత మహాసాగరం సిద్ధమైంది. రిజర్వాయర్ నుంచి కుడి, ఎడమ, మెయిన్ జల విద్యుత్ కేంద్రాలు కూడా ఏర్పాటయ్యాయి. పూర్తి సామర్థ్యంతో పనిచేస్తే కుడి కాలువ పై నిర్మించిన జల విద్యుత్ కేంద్రం ద్వారా రోజుకు 90 మెగావాట్ల విద్యుదుత్పాదన, ఎడమ కాలువ పై నిర్మించిన జల విద్యుత్ కేంద్రం ద్వారా 60 మెగా వాట్లు, మెయిన్ పవర్ హౌస్ ద్వారా 410 మెగా వాట్ల విద్యుదుత్పాదన జరుగుతుంది.

### నీటి విభజన

కృష్ణా జల వివాద ట్రిబ్యునల్స్‌ను అనుసరించి మానవ వనరులకు వినియోగించుకొనే నిమిత్తం 2060 టిఎంసిల నీటిని మూడు రాష్ట్రాలు వాడుకోవచ్చు. ఇందులో ఆంధ్రప్రదేశ్‌కు 800 టిఎంసిలు, కర్ణాటకకు 695 టిఎంసిలు, మహారాష్ట్రకు 565 టిఎంసిల నీటిని కేటాయించారు. మన రాష్ట్రానికి కేటాయించిన 800 టిఎంసిలలో నాగార్జునసాగర్‌కు (మిగతా 178వ పేజీలో ...)



మోడల్ ప్రాజెక్ట్‌ను పరిశీలిస్తున్న చాచా నెహ్రూ

కుడి కాలువను సందర్శిస్తున్న ఇందిరాగాంధీ, కాసు రాఘవమ్మ





పరిపూర్ణ నాగార్జునసాగర్ డ్యామ్



కుడి కాలువ ప్రారంభోత్సవానికి విమానాశ్రయం నుంచి వస్తున్న ఇందిరాగాంధీ



కుడి కాలువ ప్రారంభోత్సవ అనంతరం బహిరంగ సభలో ప్రసంగిస్తున్న ఇందిరాగాంధీ, ప్రక్కన కాసు బ్రహ్మానందరెడ్డి, గౌతు లచ్చన్న, తదితరులు

# మానవ నిర్మిత మహాకట్టడం...

(177వ పేజీ తరువాయి ...)

264 టిఎంసిలను మాత్రమే కేటాయించారు.

## కుడి కాలువ (జవహర్ కెనాల్)

సాగర్ డ్యామ్ నిర్మాణం పూర్తవకమునుపే కుడి, ఎడమ కాలువల నిర్మాణాలు పూర్తయ్యాయి. కుడి కాలువకు అప్పటి ఉప ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డి 1956, అక్టోబరు 10న శంకుస్థాపన జరుపగా, 1967 ఆగస్టు నాటికి నిర్మాణం పూర్తయింది. అదే నెల 4వ తేదీన ప్రధాని ఇందిరాగాంధీ ఈ కాలువ నుంచి నీటిని విడుదల చేసి జాతికి అంకితమిచ్చారు. కుడి కాలువకు జవహర్ కెనాల్ అని నామకరణం చేశారు. దీని నిర్మాణానికి గాను 1250 మంది కార్యాలయ సిబ్బంది, 4000 మంది సాంకేతిక సిబ్బంది, 40 వేల మంది కూలీలు శ్రమించాల్సి వచ్చింది. సాగర్ రిజర్వాయర్ నుంచి ఈ కాలువ హెడ్ రెగ్యులేటర్‌తో కూడిన 9 గేట్లను అమర్చారు. పూర్తి నిర్మాణ దశలో 245 మైళ్ళ పొడవున్న ఈ కాలువ గుంటూరు, ప్రకాశం జిల్లాల ద్వారా ప్రవహిస్తూ సోమశిల వద్ద వున్న పెన్నా నదిలో కలుస్తోంది. దీని ద్వారా 21 వేల క్యూసెక్కుల నీరు ప్రవహిస్తోంది. ఇది సుమారు 20 లక్షలకు పైగా ఎకరాల భూమికి సేద్యపు నీటిని అందిస్తోంది. ఈ కుడి కాలువ చంద్రవంక, నాగులేరు, గుండ్లకమ్మ, బుగ్గేరు తదితర 178 పెద్ద, చిన్న వాగులను దాటుతూ ప్రవహిస్తోంది.

## ఎడమ కాలువ (లాల్ బహదూర్ కెనాల్)

జై జవాన్, జై కిసాన్ అని నినదించిన మాజీ ప్రధాని లాల్ బహదూర్ శాస్త్రి స్మృత్యర్థం సాగర్ ఎడమ కాలువకు ఆయన పేరు పెట్టారు. ఈ కాలువ కొద్ది దూరం ప్రవహించాక పొట్టిచలమ నుంచి చలకుర్తి వరకు కొండల అడుగు భాగంలో తొలచిన సొరంగం ద్వారా ప్రయాణిస్తోంది. 32 అడుగుల వ్యాసం, 8,465 అడుగుల నిడివి కలిగిన సొరంగ మార్గాల ద్వారా సాగునీరు ప్రవహించే కాలువల్లో ఇది భారతదేశంలోనే అతి పెద్దదిగా చెప్పవచ్చు. 1959లో అప్పటి రాష్ట్ర గవర్నర్ భీమసేన్ సచార్ ఈ కాలువను శంకుస్థాపన జరుపగా, కుడి కాలువతో పాటే 1967, ఆగస్టు 4న శ్రీమతి ఇందిరాగాంధీ దీనికి ప్రాలంభోత్సవం జరిపారు. ఈ కాలువ 218 మైళ్ళ దూరం ప్రవహిస్తూ హాలియా, గడవరం, వైరా, కట్టలేరు, తమ్మిలేరు తదితర 138 వాగులను దాటుకుంటూ నల్లగొండ, ఖమ్మం, కృష్ణా జిల్లాల్లోని మెట్ట భూములను సస్యశ్యామలం చేస్తూ పశ్చిమ గోదావరి జిల్లాలోని ఎర్ర కాలువలో కలుస్తోంది.

దీని నిర్మాణానికి 900 మంది కార్యాలయ సిబ్బంది, 2,500 మంది సాంకేతిక సిబ్బంది, 30 వేల మంది కార్మికులు సుమారు పదేళ్ళ పాటు పని చేశారు.

ఈ కాలువల ద్వారా 1500 క్యూసెక్కుల నీరు ప్రవహిస్తోంది. దీని ద్వారా 8 లక్షల 75 వేల ఎకరాలకు సాగునీరు లభ్యమవుతోంది.

# నాగార్జున సాగర్ డ్యామ్‌కు... భద్రతేదీ?



(ఆన్‌లైన్, విజయపురిసౌత్)
ఆంధ్రుల అన్నపూర్ణగా లక్షలాది ఎకరాలను సస్యశ్యామలం చేస్తున్న నాగార్జునసాగర్ డ్యామ్ ప్రాజెక్టుకు భద్రత కరువైంది. ఐదు దశాబ్దాల క్రితం నిర్మించిన ఈ ప్రాజెక్టు కుడి కాలువ 126 మైళ్ళ దూరం పయనించి రమారమి 12 లక్షల ఎకరాలకు సాగు నీరు అందిస్తోంది. ఎడమ కాలువ

(మిగతా 181వ పేజీలో)

# నక్సలిజం... ఫ్యాక్షనిజం

(ఆన్‌లైన్, మాచర్ల)

పల్నాడుకు ముఖ్య కేంద్రంగా భాసిల్లిన మాచర్ల నియోజకవర్గంలో హింసకు తావు లేని స్థలమే లేదు. పంతం, పౌరుషాలతో అలనాడు పల్నాటి యుద్ధం జరిగితే ఏ లక్ష్యమూ లేకుండా అదే పౌరుషాగ్నిని పుణికిపుచ్చుకున్న వ్యక్తులంతా ఆధిపత్యం పేరుతో ఫ్యాక్షనిజానికి ఆజ్యం పోశారు. పల్నాటి యుద్ధం ఎందుకు జరిగినా ఆ యుద్ధానికి మూల కారకులైన బ్రహ్మనాయుడు, నాయకురాలు నాగమ్మలది సమున్నత వ్యక్తిత్వం. బ్రహ్మనాయుడైతే చాపకూటి సిద్ధాంతంతో పల్నాడులో సమానత్వాన్ని చాటిచెప్పారు. ఫ్యాక్షనిజం పేరుతో ప్రస్తుతం జరుగుతున్న యుద్ధం ఎందరికో వ్యథాభరితం.

## అప్పట్లో నక్సలిజం

### పీడిత జనానికి వెన్నుదన్నుగా..

ఆర్థికంగా వెనుకబడ్డ పల్నాడు హింసకు మారుపేరైన రాయలసీమను తలపిస్తోంది. ఏ క్షణం ఎక్కడ ఏం జరుగుతుందో అనే ఉలికిపాటుతో జనం ప్రతిక్షణం భయం గుప్పెట్లో బతకాల్సి వస్తోంది. 1990లో వెల్దుర్తి, దుర్గి మండలాల్లోని పలు తండాలు, గ్రామాలు నక్సలైట్లకు షెల్టర్ జోన్లుగా మారాయి. పేదరికం, సామాజిక హెచ్చుతగ్గులు పలువురిని నక్సలిజం పట్ల ఆకర్షితులను చేశాయి. భూస్వామ్య, పెత్తందారీ విధానాలతో అణగదొక్కబడ్డ పీడిత జనమంతా 'అన్నల' వెనుకే నిలిచారు. గ్రామాల ఆధిపత్యం కోసం భూస్వామ్య వర్గాలంతా కొట్టుకు చస్తున్న తరుణంలో మేమున్నామంటూ నక్సలైట్లు ఒక్కసారిగా వెలుగులోకి వచ్చారు. ప్రజా కంటకులు అనే పేరుతో అగ్ర, ఇతర వర్గాలకు చెందిన పలువురిని నక్సలైట్లు మట్టుపెట్టారు. 2001 నుంచి 2004 వరకు ఈ ప్రాంతంలో పీపుల్స్‌వార్ చెప్పిందే వేదం. రెవెన్యూ భవనాలు, టెలికాం ఎక్స్ఛేంజీలు తదితర ప్రభుత్వ ఆస్తులను ధ్వంసం చేయడంతో పాటు ఇన్‌ఫార్మర్ల పేరిట వారి హత్యాకాండ యథేచ్ఛగా సాగింది. 2001, మార్చి మాసంలో ఏడు హత్యలకు బరితెగించిన ఫ్యాక్షనిస్టుల వెన్నులో నక్సలిజం చలి పుట్టించింది. ఒకటీ, అరా ఫ్యాక్షన్ హత్యలు జరిగినా, నక్సలిజం ప్రాభవం వున్నంత కాలం మీసం మెలిబెట్టిన ఫ్యాక్షనిస్ట్ లేడనేది నిజం. కోవర్టు సిరాజ్ హత్య, ముగ్గురు గ్రేహౌండ్స్ సిబ్బందిని క్లైమోర్‌మైన్స్‌తో హతమార్చడం, మండల కేంద్రమైన దుర్గి పోలీస్‌స్టేషన్‌పై రాకెట్ లాంఛర్లతో దాడి, సాగర్‌లోని టూరిజం లాంచిని హైజాక్ చేయడం వంటి సంఘటనలు మాచర్ల మరో తెలంగాణ అయిందనే భావనను రాష్ట్ర ప్రజల్లో, పోలీసు యంత్రాంగంలో కల్పించింది.

## చర్చల అనంతరం పరిస్థితి

కాంగ్రెస్ ప్రభుత్వం అధికారంలోకి రాగానే పీపుల్స్‌వార్‌తో జరిపిన చర్చలు విఫలమైన దరిమిలా పోలీసు శాఖ ఆ పార్టీపై ఉక్కుపాదం మోపింది. నక్సలిజం వైపు మొగ్గుచూపిన ఎస్‌సి, ఎస్‌టి, ఇతర వర్గాలను ఇన్‌ఫార్మర్లుగా వినియోగించుకొని దర్పణం పెట్టి మరీ వెతికింది. పలుమార్లు నక్సల్స్ చేతిలో చావుదెబ్బ తిన్న పోలీసులు తమ రక్షణకు తగు రీతిలో జాగ్రత్తలు తీసుకుంటూ ముందుకు సాగి, వారిపై పైచేయి సాధించారు. నక్సల్స్ ప్రాభవాన్ని తగ్గించేందుకు వెల్దుర్తి, మాచర్ల, దుర్గి, కారంపూడి స్టేషన్లలో స్పెషల్‌పార్టీ, గ్రేహౌండ్స్ దళాలను నింపి కూంబింగ్ ద్వారా ఊపిరి సలపకుండా చేశారు. ఇటువంటి ఇబ్బందికర పరిస్థితుల్లో సైతం 2006, జనవరి మాసంలో గుట్టపల్లి సత్యంను, 2007లో ఇన్‌ఫార్మర్ పేరిట మరియదాసును నక్సల్స్ హతమార్చడం విశేషం.

మాచర్ల నియోజకవర్గ పరిధిలోని విజయపురిసౌత్ లాంచిస్టేషన్‌కు చెందిన లాంచిని హైజాక్ చేసిన నలుగురు మావోయిస్టులను ఆధునిక సాంకేతిక పరిజ్ఞానంతో వెంటాడి అప్పటికప్పుడే ఎన్‌కౌంటర్ చేశారంటే పోలీసులది ఏ స్థాయి పైచేయో విశదమవుతోంది. 2005 నుంచి ఇప్పటివరకు ఇటువంటి అడపా దడపా సంఘటనలు మినహా నక్సల్స్ ప్రభావం పూర్తిగా తగ్గిందని చెప్పొచ్చు.

## బుసలుకొడుతున్న ఫ్యాక్షనిజం

పోలీసులు నక్సలైట్ల ఉద్యమాన్ని నీరుగార్చిందే తడవుగా పల్నాడు గ్రామాల్లో ఫ్యాక్షనిజం బుసలుకొడుతోంది. అన్నల భయంతో బరిసెలు, గొడ్డళ్ళకు పని పెట్టని భూస్వామ్య వర్గం ఒక్కసారిగా నిద్రలేచింది. మితిమీరిన రాజకీయ జోక్యాన్ని అండగా చూసుకున్న ఫ్యాక్షనిస్టులు గ్రామాధిపత్యం కోసం ప్రత్యర్థులను నరకడం ప్రారంభించారు. 2006, జూన్ తొమ్మిదిన తెలుగుదేశం పార్టీ సమావేశానికి గురజాల వెళ్ళి తిరిగి వస్తున్న గొట్టం రామకోటిరెడ్డి, బోయ వెంకటరెడ్డిలను కాంగ్రెస్ వర్గాలు గొడ్డళ్ళతో దారుణంగా నరికి చంపారు. దీనికి ప్రతీకారంగా 2007, ఏప్రిల్ 24న, అంటే ఏడాది తిరక్కముందే టిడిపి వర్గాలు గొట్టం బక్కిరెడ్డి, కోటిరెడ్డిలను హతమార్చాయి.

రెంటచింతల మండలం మంచికల్లు బాంబుదాడులతో రోజూ అట్టుడికిపోతోంది. దుర్గి మండలం కంచరగుంటకు చెందిన మాదాసు వెంకట్రామయ్య అనే 'దేశం' నేతను కాంగ్రెస్ వర్గాలు ఈ ఏడాదే పొట్టన పెట్టుకున్నాయి. ఆధిపత్య పోరుకు నిజమైన నిదర్శనంగా నిలిచే వెల్దుర్తిలో సైతం ఈ ఏడాది ఫ్యాక్షన్ పెట్రేగింది.

సెప్టెంబరు మూడున జూలకంటి లక్ష్మారెడ్డిని, అక్టోబరు 11న జూలకంటి చినవెంకటరెడ్డిని ప్రత్యర్థులు దారుణంగా చంపారు. 'పొయ్యి నుంచి పెనంలో పడ్డట్లు' మొన్నటిదాకా నక్సలైట్ల భయంతో భీతిల్లిన జనం నేడు ఫ్యాక్షనిస్టుల వికటాట్టహాసాల మధ్య బతుకీడ్చాల్సి వస్తోంది.

నక్సలైట్లను ఏరి పారేశామని సగర్వంగా చెప్పుకుంటున్న పోలీసు శాఖ ఫ్యాక్షనిస్టుల పట్ల అంతటి మెతక వైఖరిని అవలంబించడం ఆ శాఖ ప్రతిష్టను దిగజార్చుతోంది.

# నాగార్జునసాగర్ డ్యామ్‌కు భద్రతేదీ ?

(179వ పేజీ నుంచి)

మరో 11 లక్షల ఎకరాలలో బంగారం పండిస్తోంది. ప్రధాన జల విద్యుత్ కేంద్రం ద్వారా 810 మెగా వాట్లు, మినీ జల విద్యుత్ కేంద్రాల ద్వారా మరో 150 మెగావాట్ల విద్యుత్తును అందిస్తోంది. మానవ నిర్మిత మహాసాగరంలో అతి పెద్దదిగా ప్రాశస్త్యం వున్న నాగార్జునసాగర్ ప్రాజెక్టును కూల్చి వేసేందుకు ఉగ్రవాదులు కుట్ర పన్నిన విషయం వెల్లడి కావడంతో రైతాంగం ఒక్కసారిగా ఉలిక్కి పడింది. ఇటీవల పట్టుబడ్డ లష్కరే తోయిబా ఉగ్రవాది సాగర్ డ్యామ్‌ను పేల్చివేసేందుకు పథక రచన చేసినట్లు చెప్పిన విషయం విదితమే.

### పట్టనట్లు వ్యవహరిస్తున్న ప్రభుత్వం

ఖండాంతరాలు వ్యాపించిన ఉగ్రవాదం ప్రపంచ పోలీస్‌గా చెప్పుకునే అమెరికానే వణికించింది. ఆత్మాహుతి దాడులతో అమెరికాను ఉగ్రవాద సంస్థలు బెంబేలెత్తించాయి. నాగార్జున సాగర్ ప్రాజెక్టుకు ఉగ్రవాదుల నుంచి ప్రమాదం వుందని తెలిసీ ప్రభుత్వం తీసుకున్న జాగ్రత్తలు ఏమీ లేవనే విమర్శలు వున్నాయి. మూడు కిలోమీటర్ల నిడివి, 546 అడుగుల ఎత్తులో అంతర్జాతీయ స్థాయి ఖ్యాతి వున్న ఈ డ్యామ్ రక్షణకు ఆయుధాలు లేని పోలీసులు ఇప్పటికీ కాపలాగా వుండడం కలవరపెడుతోంది. విజయపురిసౌత్ పరిధిలోని డ్యామ్ ప్రారంభంలో ఒక చెక్‌పోస్టు, పైలాన్ వైపు వున్న మరో చెక్‌పోస్టులలో నలుగురేసి చొప్పున వున్న లాఠీల పోలీసులు ఉగ్రవాదుల దాడిని ఏమాత్రం ఎదుర్కోగలుగుతారనే ప్రశ్న ఉత్పన్నమవుతోంది. రాత్రయితే నిద్రించడం, పగలు డ్యామ్ పైకి వాహనాలు, మనుషులు వెళ్ళకుండా నియంత్రించడం ప్రస్తుతం వీరు చేస్తున్న పని. ఉన్నతాధికారుల అజామాయిషీ ఏమాత్రం లేకపోవడంతో ఇక్కడ వీరంతా మొక్కుబడి రక్షణకే పరిమితమయ్యారు. చేతులు కాలాక ఆకులు పట్టుకోవడం అనే నైజం నుంచి బయట పడి అధునాతన ఆయుధాలతో డ్యామ్‌కు పహారా కాస్తే తప్ప ఉగ్రవాదుల నుంచి రక్షించుకోవడం కష్టంగానే చెప్పొచ్చు.



# వికసిస్తున్న... సంస్కృతీ సౌరభాలు

## కళారంగంలో రాణిస్తున్న జిల్లా వాసులు

(ఆన్‌లైన్ - గుంటూరు)

విద్య, వాణిజ్య రంగాలకు ఖిల్లాయైన గుంటూరు జిల్లా సాంస్కృతిక రంగంలోనూ అగ్రస్థానంలో నిలిచింది. ప్రముఖ సాహితీవేత్తలు, కళాకారులకు నిలయమైన ఈ జిల్లా ఎన్నో ప్రముఖ సాహితీసభలు, సాంస్కృతిక కార్యక్రమాలకు వేదికగా నిలిచింది. సంవత్సర కాలంలో జిల్లా సాహితీ జగత్తులో ఎన్నో మరపురాని కమనీయ ఘట్టాలు జనహృదయాలను దోచుకున్నాయి. అంతర్జాతీయ స్థాయిలో కూడా ఖ్యాతిని గడించింది. ప్రవాసాంధ్రులు ప్రతిష్టాత్మకంగా నిర్వహించిన తానా సభలు ప్రత్యేక గుర్తింపును తెచ్చాయి. నిరంతరం కొనసాగుతున్న సాహితీ వసంతోత్సవాలు, సరస కవితా మహోత్సవాలు, సినిమా చిత్రీకరణలు, నాటక, నృత్య ప్రదర్శనలు ఆహ్లాదాన్ని, ఆనందాన్ని పంచుతున్నాయి. సాంస్కృతిక రంగంలో జిల్లా కీర్తి ప్రతిష్టలను నేటి కళాకారులు సైతం కొనసాగిస్తూ కళారంగంలో తరిస్తున్నారు. వీరికి ఎంతోమంది అండగా నిలిచి కళాపోషకులుగా పేరుగడించారు.

### ప్రత్యేక గుర్తింపు తెచ్చిన తానా సభలు...

2006 డిసెంబరు 24, 25, 26 తేదీలలో గుంటూరులోని వెంకటేశ్వర విజ్ఞాన మందిరంలో ఉత్తర అమెరికా తెలుగు సంఘం నిర్వహించిన తానా సభలు తెలుగు సాంప్రదాయాన్ని, సంస్కృతిని ప్రతిబింబించాయి. వివిధ హోదాల్లో స్థిరపడ్డ ప్రవాసాంధ్రులు ప్రతిష్టాత్మకంగా వీటిని ఏర్పాటుచేశారు. మూడు రోజులపాటు జరిగిన ఈ సభల్లో రాష్ట్ర నలుమూలల నుంచి ప్రాచీన కళలకు చెందిన కళాకారులు తమ ప్రదర్శనలతో గ్రామీణ వాతావరణాన్ని ఆవిష్కరించారు. తానా అధ్యక్షుడు డాక్టర్ బండ్ల హనుమయ్య అధ్యక్షతన ఈ కార్యక్రమాలను నిర్వహించారు. ప్రముఖ సినీ కళాకారులు, నాటకరంగ ప్రముఖులు, పలువురు సాహితీవేత్తలు తమ ప్రదర్శ

(మిగతా 183వ పేజీలో)



ఉగాది రోజు మల్లాది సోదరులను సత్కరిస్తున్న సినీ దర్శకుడు విశ్వనాథ్

## వికసిస్తున్న సంస్కృతీ సౌరభాలు...

(182వ పేజీ నుంచి)

నలతో జిల్లా వాసుల హృదయాల్లో చెరగని ముద్రవేశారు. తెలుగుకు ప్రాచీన హోదా కల్పించేందుకు సమష్టిగా కృషి చేయాలని తీర్మానించారు.

**నిరంతర సాహితీ సమ్మేళనాలు...**

జిల్లాలో ఏదో ఒక ప్రాంతంలో నిరంతరం సాహితీ సమ్మేళనాలు జరుగుతున్నాయి. సాహితీ వసంతోత్సవం, సరస కవితా మహోత్సవాలు ఈ ఏడాది కన్నుల పండుగగా

(మిగతా 184వ పేజీలో)

## ఆంధ్రజ్యోతి 5వ వార్షికోత్సవం సంధర్భంగా

పత్రికా రంగంలో నిత్యం సంచలన వార్తలతో
ఆంధ్రుల అభిమానం చూరగొంటు అగ్రశ్రేణి దిన పత్రికగా
ఎదిగిన ఆంధ్రజ్యోతికి 5వ వార్షికోత్సవ శుభాకాంక్షలు



వైఎస్. రాజశేఖర రెడ్డి, రాష్ట్ర ముఖ్యమంత్రి | పిన్నెల్లి లక్ష్మారెడ్డి, ఎమ్మెల్యే మాచర్ల | చల్లా మట్టారెడ్డి, మండల కాంగ్రెస్ నాయకులు | చింతమళ్ళ పెద వెంకటేశ్వర్లు(బుజ్జి), సర్పంచ్, పశర్లపాడు | గొట్టం బ్రహ్మారెడ్డి, ఎం.పి.టి.సి, పశర్లపాడు

ఎమ్మెల్యే పిన్నెల్లి సహాయ సహకారంతో పశర్లపాడు గ్రామంలో కాంగ్రెస్ నేత చల్లా మట్టారెడ్డి గారు బలహీన వర్గాలవారికి ఇళ్ళు మంజూరు ముస్లింలకు మసీదు నిర్మాణం చేయించడం, వంటి పలు కార్యక్రమాలు చేయించి, సర్పంచ్ వెంకటేశ్వర్లు, ఎం.పి.టి.సి.బ్రహ్మారెడ్డి లను గత ఎన్నికలలో గెలిపించి కాంగ్రెస్ పార్టీ విజయానికి కృషి చేసిన మా చల్లా మట్టారెడ్డి గారికి కృతజ్ఞతలు.

## ప్రగతి పథంలో గోవాడ గ్రామపంచాయితీ



బేతపూడి ఆదినారాయణ
సర్పంచ్, గోవాడ.

నూతన పాలక వర్గం పదవీ బాధ్యతలు చేపట్టి ఏడాదికాలం పూర్తయిన శుభ సందర్భంలో గ్రామాభివృద్ధికి సహకారం అందిస్తున్న ప్రజలకు దసరా, దీపావళి శుభాకాంక్షలు. గ్రామంలో రహదార్లు, మౌలిక వనరుల కల్పనకు కృషిచేస్తామని తెలుపుతూ...

**చేకూరి వెంకట లక్ష్మయ్య చౌదరి** - ఉపసర్పంచ్

**వార్డు సభ్యులు**
ఉల్లంగుంట వెంకటేశ్వర్లు
పావులూరి రమేష్
ఆరుబాక రమేష్
కురగంటి శివకుమారి
పిల్లి నల్లయ్య
రామదాసు శ్రీనివాసరావు
ముద్రబోయిన మంగమ్మ
పావులూరి సుశీల
మండవ శివ ధనలక్ష్మి,
కోటపాటి మోహనరావు
పొట్లూరి రాఘవయ్య
కార్యదర్శి మరియు సిబ్బంది, గోవాడ

## హార్ధిక శుభాకాంక్షలు



గ్రామ పంచాయతీ నూతన పాలక వర్గం పదవీ బాధ్యతలు చేపట్టి యేడాది కాలం పూర్తయిన సందర్భంగా గ్రామాభివృద్ధికి సహకారం అందిస్తున్న ప్రజలకు దసరా, దీపావళి శుభాకాంక్షలు... గ్రామంలో రహదార్లు, మౌలిక వనరుల సదుపాయంకోరకు కృషిచేస్తామని తెలుపుతూ...

సదా ప్రజల సేవలో...

బి. వెంకటప్పయ్య - కార్యదర్శి, వార్డు మెంబర్లు మరియు సిబ్బంది

**వజ్రాల వెంకటరెడ్డి** - సర్పంచ్, ఇంటూరు
అమృతలూరు మండలం

## ఆంధ్రజ్యోతికి 5వ వార్షికోత్సవ శుభాకాంక్షలు



మా ఖాతాదారులకు
దసరా, దీపావళి,
క్రిస్మస్ శుభాకాంక్షలు...

786

**జయలక్ష్మి వైన్స్**, దుగ్గిరాల
**విజయ వైన్స్**, చిలువూరు
**హరితా వైన్స్**, దుగ్గిరాల
**శ్రీకనకదుర్గా వైన్స్**, రేవేంద్రపాడు
**శ్రీదుర్గా వైన్స్**, పెదపాలెం
**నరేంద్ర వైన్స్**, చిలువూరు
**శ్రీ దుర్గా వైన్స్**, రేవేంద్రపాడు
**శ్రీ దుర్గా వైన్స్**, ఈమని

## ఆంధ్రజ్యోతికి పంచమ వార్షికోత్సవ శుభాకాంక్షలు

**నీటిపారుదల శాఖ - వేమూరు**

మండలంలోని రైతులు, ప్రజలు కు రంజాన్, దసరా ,దీపావళి శుభాకాంక్షలతో....

**యార్లగడ్డ రామకోటయ్య**, అధ్యక్షులు
వేమూరు 1 నీటి సంఘం

**విష్ణుమొలకల శ్రీరామ కోటేశ్వరరావు**,
అధ్యక్షులు, వేమూరు-2 నీటి సంఘం

**గాజుల సుబ్బారావు**, అధ్యక్షుడు
పెనుమర్రు నీటి సంఘం

**సోమ రౌతు సాంబశివరావు**, అధ్యక్షుడు
పెరవలి నీటి సంఘం

**యు. సాంబశివరావు, అసిస్టెంట్ ఇంజనీర్**
వేమూరు 1 సెక్షన్, నీటిపారుదల శాఖ

## ఆంధ్రజ్యోతికి శుభాకాంక్షలు

ఆంధ్రజ్యోతి దినపత్రిక 5వ వార్షికోత్సవం
జరుపుకుంటున్న శుభ సందర్భంలో యాజమాన్యానికి,
సిబ్బందికి నా హృదయపూర్వక శుభాకాంక్షలు
సత్తెనపల్లి నియోజక వర్గ ప్రజలకు
దసరా, రంజాన్ శుభాకాంక్షలు

మీ

**ఆళ్ళ రామకృష్ణా రెడ్డి** (ఆర్.కె)
వ్యాపారవేత్త



**రాంకీ గ్రూప్ ఆఫ్ కంపెనీస్, హైదరాబాద్.**

## ఆంధ్రజ్యోతికి అయిదవ వార్షిక శుభాకాంక్షలు





శ్రీమతి సోనియాగాంధి
ఏఐసిసి అధ్యక్షురాలు



డా॥ వై.ఎస్. రాజశేఖరరెడ్డి
రాష్ట్ర ముఖ్యమంత్రివర్యులు



శ్రీ నాదెండ్ల మనోహర్,
శాసనసభ్యులు తెనాలి.



శ్రీ రాహుల్ గాంధి
ఎఐసిసి ప్రధాన కార్యదర్శి

ఎఐసిసి ప్రధాన కార్యదర్శిగా రాహుల్ గాంధి, కార్యదర్శిగా మధు యాష్కి గౌడ్ పదవీ బాధ్యతలు చేపట్టిన సందర్భంగా అలాగే 'ఆంధ్రజ్యోతి' ఐదు వసంతాలు పూర్తి చేసుకొని ఆరవ వసంతంలోకి అడుగిడుతున్న తరుణంలో 'ఆంధ్రజ్యోతి' యాజమాన్యానికి సిబ్బందికి, పాఠకులకు విజయదశమి, దీపావళి శుభాకాంక్షలు



శ్రీ మధు యాష్కి గౌడ్
ఎఐసిసి కార్యదర్శి





**కేసన కోటేశ్వరరావు గౌడ్**
మండల పరిషత్ అధ్యక్షులు, తెనాలి.
సోమసుందరపాలెం

# వికసిస్తున్న సంస్కృతీ సౌరభాలు...

(183వ పేజీ నుంచి)

జరిగాయి. సాహితీ సమాఖ్య ఆధ్వర్యంలో ఉగాది సందర్భంగా ఏర్పాటు చేసిన సాహితీ వసంతోత్సవంలో ప్రముఖ కవులు గరికపాటి నరసింహారావు వంటివారెందరో హాజరయ్యారు. హాస్యాన్ని పండిస్తూ ప్రేక్షకులను రంజింపచేసిన సరస కవితా మహోత్సవాలు జిల్లాలోని సాహితీ అభిమానులకు మధురానుభూతిని మిగిల్చింది. తుమ్మల కళాపీఠం, జాషువా పీఠం వంటి సంస్థలు ఏర్పాటు చేసిన సాహిత్య సమావేశాలు కూడా జిల్లా



వాసులకు సాహిత్య రంగంపై ఉన్న అభిమానాన్ని చాటాయి. ప్రముఖ సాహితీ వేత్తలు డాక్టర్ ద్వానా శాస్త్రి, డాక్టర్ రాళ్లబండి కవితా ప్రసాద్, డాక్టర్ తుర్లపాటి కుటుంబరావు, ఆచార్య మృణాళిని, ఆచార్య ఇనాక్, రాష్ట్ర సాంస్కృతిక మండలి చైర్మన్ ధర్మవరపు సుబ్రహ్మణ్యం వంటి ఎందరో జిల్లాలో నిర్వహించిన పలు సాహితీ కార్యక్రమాల్లో పాల్గొన్నారు.

## జిల్లాలో సినిమా షూటింగ్‌లు...

కొద్దికాలంగా జిల్లా సినిమా షూటింగ్‌లకు నిలయంగా మారింది. ఎంతోమంది నూతన దర్శకులు తమ సినిమాల చిత్రీకరణ జిల్లాలో నిర్వహించారు. అల్లరి నరేష్ హీరోగా నిర్మిస్తున్న చిత్రం అమరావతి, తుళ్లూరు ప్రాంతాలలో చిత్రీకరించారు. నాగేంద్రబాబు ముఖ్యపాత్రలో, గుంటూరు ఎంపి రాయపాటి సాంబశివరావు ముఖ్యమంత్రిగా నటిస్తున్న 'ఆపద మొక్కులవాడు' చిత్రీకరణ మొత్తం జిల్లాలోనే కొనసాగుతోంది. దీనికి దర్శకుడిగా జిల్లాకే చెందిన పోసాని కృష్ణమురళి వ్యవహరిస్తున్నారు. ఎమ్మెల్సీ డాక్టర్ రాయపాటి శ్రీనివాస్ ఇందులో కలెక్టర్ పాత్ర పోషిస్తున్నారు. వీటితోపాటుగా చిలకలూరిపేట, నాగార్జున సాగర్ డ్యామ్‌ల వద్ద మరో సినిమా చిత్రీకరణ జరిగింది.

## వెల్లివిరిసిన ఆధ్యాత్మిక సుగంధాలు...

జిల్లాలో వాడవాడలా ఆధ్యాత్మిక సుగంధ పరిమళాలు వెదజల్లుతున్నాయి. ప్రతి పర్వ దినానికీ జిల్లాలోని ప్రముఖ ఆలయాలన్నీ భక్తులతో కిటకిటలాడుతున్నాయి. మహాశివరాత్రి, ఉగాది, శ్రీరామనవమి, వినాయకచవితి, దసరా వేడుకలను జిల్లా వాసులు భక్తిశ్రద్ధలతో నిర్వహిస్తున్నారు. వినాయకచవితిని వాడవాడలా ఘనంగా నిర్వహించారు. గుంటూరు బృందావన్ గార్డెన్స్‌లో ఉన్న వెంకటేశ్వర స్వామి దేవాలయంలో నిత్యం ఆధ్యాత్మిక కార్యక్రమాలు కొనసాగుతున్నాయి. ఆలయ పాలకమండలి ఆధ్వర్యంలో నిరంతరం సాంస్కృతిక కార్యక్రమాలను కొనసాగిస్తున్నారు.

వీటితోపాటుగా సర్కస్, జాదూగర్ ఆనంద్ ఇంద్రజాల ప్రదర్శనలు ఎంతో మందిని ఆహ్లాదపరిచాయి. అన్ని పర్వదినాల్లోనూ సమైక్యంగా జిల్లా వాసులు ఆనందాన్ని పంచుకొంటున్నారు. అంతరించి పోతున్న సంస్కృతీ సాంప్రదాయాలను పరిరక్షించేందుకు జిల్లాలోని పలువురు ప్రముఖులు నిర్విరామ కృషి కొనసాగిస్తున్నారు. చిన్నారులు సైతం సాంస్కృతిక కళల పట్ల మక్కువ పెంచుకొంటూ వాటిలో రాణిస్తున్నారు. ఎంతోమంది కళాకారులు తమ ప్రతిభాపాటవాలను ప్రేక్షకుల ముందు ప్రదర్శించి వారి నీరాజనాలు అందుకొంటున్నారు.

# చేనేత బాంధవుడు

# ప్రగడ కోటయ్య

(ఆన్‌లైన్- పొన్నూరు)

అటు జాతీయోద్యమంతో పాటు - ఇటు చేనేత పరిశ్రమ సముద్ధరణోద్యమంలో పాల్గొన్న ధన్యజీవి ప్రగడ కోటయ్య. 1947లో దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన తర్వాత ఆయన జీవితాన్నంతా చేనేత పరిశ్రమ, పేద చేనేత కార్మికుల సముద్ధరణకు వినియోగించారు. చేనేత తన ఊపిరిగా తుది శ్వాస వరకు కృషి చేసిన ధన్యజీవి చేనేత కోటయ్య. ఆయన 1915 జూలై 26న జన్మించారు. 1931లో స్కూల్ ఫైనల్ పరీక్షలో ఉత్తీర్ణుడయ్యారు. అనంతరం మద్రాసులోని జౌళి శిక్షణా సంస్థలో సూపర్‌వైజర్ కోర్సు పూర్తి చేశారు. జౌళి పరిశ్రమకు సంబంధించిన శాస్త్రంలోని సిటీ అండ్ గిల్డ్స్ సంస్థ నిర్వహించిన సర్టిఫికెట్ కోర్సులో కూడా కోటయ్య ఉత్తీర్ణులయ్యారు. చేనేత రంగానికి ఇతోధికమైన సేవలను అందిస్తూనే దేశ స్వాతంత్ర్య సంగ్రామ ఉద్యమాల్లో కూడా ఆయన కీలక పాత్రను పోషించారు.



ప్రగడ కోటయ్య

## రాజకీయ పదవులు

అవిభక్త మద్రాసు రాష్ట్రంలో కర్నూలు రాజధానిగా ఏర్పడిన ప్రత్యేక ఆంధ్రరాష్ట్రంలో ఆ తరువాత అవతరించిన ఆంధ్రరాష్ట్రంలో ఆయన శాసనసభ్యునిగా, శాసనమండలి సభ్యునిగా పనిచేశారు. సభా కమిటీల్లో సభ్యునిగా వుంటూ అమూల్యమైన సేవలను చేనేత రంగానికి అందించారు. రాజకీయాలు, చేనేత రంగానికి అంకితమైన ప్రగడ కోటయ్య 1948 నుంచి 1974 వరకు ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటి సభ్యునిగా, 1955-56 కాలంలో పిసిసి కార్యవర్గ సభ్యునిగా 1974 నుంచి 1978 వరకు ప్రదేశ్ కాంగ్రెస్ కమిటి కార్యదర్శిగా పనిచేశారు.

## చేనేతకు సేవలు

అవిభక్త మద్రాసు రాష్ట్రంలోనూ, ఆంధ్ర రాష్ట్రంలోనూ చేనేత కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శిగా ఆయన చేనేత రంగానికి ఏనలేని సేవలను అందించారు. 1945లో నాగపూర్‌లో గాంధీజీ ఆశీస్సులతో స్థాపించబడిన అఖిల భారత చేనేత కార్మికుల కాంగ్రెస్ కార్యదర్శిగా ఎంపికయ్యారు. చేనేత రంగానికి సంబంధించిన రాష్ట్ర, జాతీయ స్థాయిలలో అనేక సంస్థలు, బోర్డులలో సభ్యులుగా ప్రగడ కోటయ్య చేనేత రంగానికి ఎనలేని సేవలను అందించారు. చేనేత రంగానికి ఏయే వస్త్రాలను పూర్తిగా కేటాయించాలో సిఫార్సు చేయడానికి 1950లో ప్రభుత్వం ఏర్పాటు చేసిన ప్రత్యేక కమిటీలో సభ్యునిగా వున్న ప్రగడ 1976-78

మిగతా 186వ పేజీలో

# చేనేత బాంధవుడు ప్రగడ కోటయ్య

(185వ పేజీ నుంచి)

కాలంలో అఖిల భారత చేనేత బోర్డు సభ్యునిగా పనిచేశారు. చేనేత కార్మికుల కనీస వేతనాలు నిర్ణయించడానికి ఆయన ఎనలేని కృషి సల్పారు.

### సహకార సంఘం

చేనేత రంగం అభివృద్ధికి సహకారం సంఘం విధానం అవసరమనేది 'ప్రగడ' ప్రగాఢ విశ్వాసం. 1962–66 మధ్య మూడేళ్ళ పాటు అఖిల భారత సహకార నూలు మిల్లుల సమాఖ్య ఉపాధ్యక్షుడిగా ఢిల్లీలో పనిచేశారు. రాష్ట్రంలో చేనేతసేవా సహకార సంఘా ల ఏర్పాటుకు అహర్నిశలూ శ్రమించారు. ఆనాడు ఆయన జరిపిన కృషి చేనేత ఉద్యమ ఆవిర్భావానికి బాటలు వేసింది. సహకార రంగంలో చీరాల నూలు మిల్లు ఏర్పాటుకు కోటయ్య ఎంతగానో కృషి చేశారు. 1959లో దేశ ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూచే మిల్లుకు శంకుస్థాపన చేయించారు.

### చేనేత రక్షణ పై ఆందోళన

చేనేత పరిశ్రమకు రక్షణ కల్పించడం కోసం ప్రభుత్వం సూత్రప్రాయంగా అంగీకరించినా... ఆ నిర్ణయం అమలుకాక చేనేత పరిశ్రమ దుస్థితిలో పడింది. ఈ పరిణామంతో ఆందోళనకు గురైన కోటయ్య మద్రాసు రాష్ట్రంలో 75రోజులు, ఆంధ్రప్రాంతంలో 20రోజులు సత్యాగ్రహ ఉద్యమాలను నిర్వహించి జైలు శిక్ష అనుభవించారు.

### వ్యవసాయ రంగం పరిరక్షణకు కృషి

రైతు బాంధవుడు ఆచార్య ఎన్.జి.రంగా స్ఫూర్తితో రైతాంగ ఉద్యమాల్లో పాల్గొన్న ప్రగడ రొంపేరు ప్రాంత అభివృద్ధికి కృషి చేశారు. ఆయన కృషితో 16వేల ఎకరాల మేరకు పేద రైతుకూలీలకు పంపిణీ చేశారు. చీరాల, వేటపాలెం ప్రాంతాల్లో పలు ఎత్తిపోతల పథకాల ఏర్పాటుకు ప్రగడ కోటయ్య కృషే కారణం. కృష్ణా పశ్చిమ డెల్టా ప్రాంత భూముల ముంపు బెడద నివారణకు డ్రెయినేజి కాల్వల వ్యవస్థ రూపకల్పన ప్రగడ కృషి ఫలితమే.

### చేనేత బాంధవుడు– సహకారోద్యమ నిర్మాత

మిల్లు వస్త్రాల తాకిడితో ఉనికి కోల్పోతున్న నేత పరిశ్రమ పరిరక్షణకు ఎన్నో ఉద్యమాలను నిర్వహించిన ప్రగడ చేనేత పరిశ్రమకు కొన్ని రకాల వస్త్రాల తయారీని కేటాయింప జేయగలిగారు.

1936లో తూర్పు గోదావరి జిల్లా ఉప్పాడలో ఆంధ్ర రాష్ట్ర చేనేత పారిశ్రామిక మహాసభను విజయవంతంగా నిర్వహింపజేశారు. రేపల్లె తాలూకాలో చేనేత రక్షణ యాత్రను, నిడుబ్రోలులో గుంటూరు జిల్లా చేనేత మహాసభలను నిర్వహించారు.

రాజ్యసభ సభ్యునిగా చేనేత పరిశ్రమ పరిరక్షణ, కార్మికుల సంక్షేమానికి చివరి క్షణం వరకు కృషి చేసిన ప్రగడ కోటయ్య 1995 నవంబరు 26న దివంగతులయ్యారు. కోటయ్య మరణంతో దేశంలో చేనేత పరిశ్రమ, కార్మికులు పెద్ద దిక్కును కోల్పోయారు.

# నాగార్జున యూనివర్శిటీ-అనుబంధ కళాశాలల ఫోన్ నెంబర్లు

| వ.నెం. | కాలేజి పేరు | |
|---|---|---|
| | గుంటూరు జిల్లా | |
| 1. | అభ్యుదయ మహిళా డిగ్రీ కళాశాల, గుంటూరు | 0863-2231359 |
| 2. | ఆంధ్రా ముస్లిమ్ కళాశాల, గుంటూరు | 0863-2223684 |
| 3. | ఏ.సి. కాలేజి(డే), గుంటూరు | 0863-2322046 |
| 4. | బి.హెచ్.హెచ్. మహిళా డిగ్రీ కళాశాల, గుంటూరు | 0863-2230785 |
| 5. | జె.కె.సి. కాలేజి, గుంటూరు | 0863-2351062 |
| 6. | డా॥ జయప్రదాంబ డిగ్రీ కళాశాల, గుంటూరు | 0863-2119233 |
| 7. | గవర్నమెంట్ మహిళా డిగ్రీ కళాశాల, గుంటూరు | 0863-2220093 |
| 8. | జి.వి.ఆర్ & శైలజా మహిళా డిగ్రీ కళాశాల, గుంటూరు | 0863-2350436 |
| 9. | జి.వి.ఆర్ & ఎస్ ఇనిస్టిట్యూట్ ఫర్‌ప్రో స్టడీస్, గుంటూరు | 0863-2351265 |
| 10. | హిందూ కాలేజి(యు.జి.), గుంటూరు | 0863-2220134 |
| 11. | కెరీర్ డిగ్రీ కళాశాల, గుంటూరు | 0863-2357153 |
| 12. | విజ్ఞాన్ డిగ్రీ కళాశాల, గుంటూరు | 0863-2352831 |
| 13. | మహాత్మాగాంధీ కాలేజి. గుంటూరు | 0863-2233953 |
| 14. | జి.యస్.ఆర్. డిగ్రీ కళాశాల, గుంటూరు | 0863-2236767 |
| 16. | చలపతి డిగ్రీ కాలేజి, గుంటూరు | 0863-2355286 |
| 15. | శ్రీ మాజేటి గురవయ్య డిగ్రీ కళాశాల, గుంటూరు | 0863-2231622 |
| 16. | సెయింట్ ఆన్స్ డిగ్రీ మహిళా కళాశాల, గుంటూరు | 0863-2236470 |
| 17. | ఎస్.జి.హెచ్.ఆర్ & ఎం.సి.ఎం.ఆర్ కాలేజి, గుంటూరు | 0863-2231173 |
| 18. | ఎస్.ఎం.ఎం. జెయిన్ డిగ్రీ కాలేజి, గుంటూరు | 0863-2356126 |
| 19. | టి.జె.పి.ఎస్. కాలేజి(పి.జి), గుంటూరు | 0863-2233188 |
| 20 | టి.జె.పి.ఎస్.కాలేజి(యు.జి.), గుంటూరు | 0863-2230852 |
| 21 | బాపట్ల కాలేజి ఆఫ్ ఆర్ట్స్ & సైన్స్, బాపట్ల | 08643-224066 |
| 22. | మహిళా డిగ్రీకాలేజి, బాపట్ల | 08643-224731 |
| 23. | ఎం.వి.జి.ఆర్.ఆర్. డిగ్రీ కాలేజి, భట్టిప్రోలు | 08648-248279 |
| 24. | గవర్నమెంట్ డిగ్రీ కాలేజి, చేబ్రోలు | 08644-254221 |
| 25. | ఎస్.ఎం.పి.ఎ డిగ్రీ కాలేజి, చెరుకుపల్లి | 08648-247564 |
| 26. | ఎ.యం.జి. మహిళా డిగ్రీ కళాశాల, చిలకలూరిపేట | 08647-254633 |
| 27. | సి.ఆర్. కాలేజి, చిలకలూరిపేట | 08647-253984 |
| 28. | డి.ఆర్.ఎన్.ఎస్. & సి.వి.ఎస్. కాలేజి, చిలకలూరిపేట | 08647-253500 |
| 29. | ఎస్.కె.ఎస్.వి.ఆర్. మహిళా డిగ్రీ కాలేజి, చిలకలూరిపేట | 08647-254006 |
| 30. | ఆర్.వి.వి.ఎన్. కాలేజి, ధరణికోట | 08645-255223 |
| 31. | డా॥ కె.ఆర్.ఆర్.ఎం. డిగ్రీ కళాశాల, దుగ్గిరాల | 08644-277262 |
| 32. | సెయింట్ ఆన్స్ డిగ్రీ కళాశాల, యడ్లపాడు | 08647-276701 |
| 33. | ఇగ్నేషియస్ డిగ్రీ కాలేజి, గురజాల | 08649-248580 |
| 34. | ఎస్.ఎం.ఎం. జెయిన్ డిగ్రీ కాలేజి, గుంటూరు | 0863-2356126 |
| 35. | కె.వి.ఆర్.,కె.వి.ఆర్. & ఎం.కె.ఆర్. కాలేజి, ఖాజీపాలెం | 08643-258745 |
| 36. | ఎస్.కె.బి.ఆర్. గవర్నమెంట్ డిగ్రీ కాలేజి, మాచర్ల | 08643-272052 |
| 37. | సాధినేని చౌడయ్య కాలేజి ఆఫ్ ఆర్ట్స్ & సైన్స్ | 08647-255871 |
| 38. | వి.టి.జె.ఎం. & ఎం.టి.ఆర్ డిగ్రీ కాలేజి | 08645-232501 |
| 39. | ఎస్.వి.ఆర్.ఎం. కాలేజి, నగరం, మంగళగిరి | 08648-256724 |
| 40. | ఎ.పి. రెసిడెన్షియల్ డిగ్రీ కాలేజి. నాగార్జునసాగర్ | 08642-242347 |
| 41. | క్రిస్టియన్ మహిళా కాలేజి, నల్లపాడు | 0863-2246824 |
| 42. | డా॥ ఎస్. బెంజిమెన్ మెమోరియల్ బాప్టిస్ట్, నరసరావుపేట | 08647-2246793 |
| 43. | ఎస్.బి.టి & ఎస్.వి.ఎస్. కాలేజి, నరసరావుపేట | 08647-223873 |
| 44. | పి.ఎన్.సి & కె.ఆర్. డిగ్రీ కాలేజి, నరసరావుపేట | 08647-222628 |
| 45. | సెయింట్ మెరీస్ డిగ్రీ కాలేజి, నరసరావుపేట | 08647-223525 |
| 46. | ఎస్.కె.ఆర్.బి.ఆర్. కాలేజి, నరసరావుపేట | 08647-223506 |
| 47. | ఎస్.ఎస్.ఎన్. కాలేజి, నరసరావుపేట | 08647-222011 |
| 48. | పి.బి.ఎన్. కాలేజి, నిడుబ్రోలు | 08643-242014 |
| 49. | ఎస్.బి.ఎం.ఎస్ డిగ్రీ కాలేజి, పెదకాకాని | 0863-2556024 |
| 50. | పి.ఎ.ఎస్. కాలేజి, పెదనందిపాడు | 08643-276626 |
| 51. | Fr. హెయిర్ డిగ్రీ కాలేజి, ఫిరంగిపురం | 08643-2231942 |
| 52. | ఎ.ఎస్.ఎం. మహిళా డిగ్రీ కాలేజి, పొన్నూరు | 08643-244675 |
| 53. | పొన్నూరు డిగ్రీ కాలేజి, పొన్నూరు | 08643-242422 |
| 54. | ఎం.ఎం. జోసఫ్ డిగ్రీ కాలేజి, ఫూండ్ల | |
| 55. | అబార్స మహిళా డిగ్రీ కాలేజి, ప్రత్తిపాడు | 08643-2280209 |
| 56. | రేపల్లె క్రిస్టియన్ కాలేజి, రేపల్లె | 08648-222698 |
| 57. | శ్రీ ఎ.బి.ఆర్. గవర్నమెంట్ డిగ్రీ కాలేజి, రేపల్లె | 08648- 222045 |
| 58. | ఎస్.ఎన్.బి.టి. మహిళా డిగ్రీ కాలేజి, రేపల్లె | 08648-222436 |
| 59. | ఎ.జి.కె.యం. డిగ్రీ కాలేజి, సత్తెనపల్లి | 08641-232116 |
| 60. | బి.ఎస్.ఎస్.బి. డిగ్రీ కాలేజి, తాడికొండ | 08645-256124 |
| 61. | ఎ.ఎస్.ఎన్. డిగ్రీ కాలేజి, తెనాలి | 08644-228821 |
| 62. | డా॥ బి.ఆర్. అంబేద్కర్ సెయింటనరీ డిగ్రీ కాలేజి, తెనాలి | 08644-224965 |
| 63. | జె.ఎం.జె. మహిళా కాలేజి, తెనాలి | 08644-222458 |
| 64. | ఎన్.ఆర్.కె. & కె.ఎస్.ఆర్ గుప్తా డిగ్రీ కాలేజి, తెనాలి | 08644-229000 |
| 65. | ఎస.జె.ఎల్.ఎన్. శాస్త్రీ డిగ్రీ కాలేజి, తెనాలి | |
| 66. | వి.ఎస్.ఆర్ & ఎన్.వి.ఆర్ కాలేజి, తెనాలి | 08644-226961 |
| 67. | ఎస్.జి.టి & జె.వి.బి డిగ్రీ కాలేజి, తుళ్లూరు | 925-244548 |
| 68. | బొగ్గవరపు గురవయ్య డిగ్రీ కాలేజి, వేల్పూరు | |
| 69. | ఎస్.జి.కె. గవర్నమెంట్ డిగ్రీ కాలేజి, వినుకొండ | 08646-272118 |

(ఆన్‌లైన్, గురజాల)

చిన్న చిన్న రాళ్ళు, చిల్లర దేవుళ్లు
నాగులేటి నీళ్ళు, నాపరాళ్ళు
సజ్జ జొన్న కూళ్ళు, సర్పంబులును, దేళ్ళు
పల్లనాటి సీమ పల్లెటూళ్ళు

# పరమేశా! గంగ విడుము పార్వతి చాలున్!

## ★ శ్రీనాథుని నోట పల్నాటి మాట

పలనాటి జీవన విధానంపై శ్రీనాథుడు రచించిన చాటువు ఇది. క్రీ.శ.1410-20 ప్రాంతంలో పలనాటి సీమలో పర్యటించిన శ్రీనాథ మహాకవి ఇక్కడి ఆచార వ్యవహారాలపై, సాంఘిక జీవన విధానంపై, వేషభాషలపై ఎన్నో చాటువులు రచించారు. పలనాటి ప్రజలు నిజమైన స్వామిని కొలవకుండా చిన్న రాళ్ళకు, చిల్లర దేవుళ్ళకు విలువ ఇస్తారని, నాగులేరులోని నీళ్ళు, నాప రాళ్ళు, సర్పాలు, తేళ్ళు తప్ప ఆ గ్రామాల్లో సిరి సంపదలు కనిపించవని శ్రీనాథుడు అభిప్రాయపడ్డారు. సన్నన్నానికి ఇంకా అలవాటు పడకుండా ఇక్కడి ప్రజలు సజ్జన్నం, జొన్నకూడు తినడం పై ఆశ్చర్యపోయినట్లు ఈ చాటువు చెబుతోంది. ఆశ్చర్యపోవడంతో ఆగలేదు ఆ మహానుభావుడు.. నేరుగా శివుడికే సవాల్ విసిరాడు.

గరళము మ్రింగితిననుచున్
బురహర! గర్వింపబోకు, పోపోపో! నీ
బిరుదింక గానవచ్చెడి
మెఱసెడి పల్నాటి జొన్న మెతుకులు తినుమీ!

విషం మింగి నీలకంఠుడిగా బిరుదు పొందిన శివుడు సైతం పల్నాటి సీమ ప్రజలు తినే జొన్నన్నం తినలేడని ఈ చాటువులో ఆయన చెప్పాడు. పర్యటన నిమిత్తం వచ్చిన ఆయన ఇక్కడి ఆహారాన్ని ఏమాత్రం జీర్ణించుకోలేక పోయిన వైనానికి ఈ చాటువు దర్పణంగా వుంది. జిహ్వాచాపల్యంతో అల్లాడిన ఆయన ఇక్కడ దొరికే ఆహారం ఏమాత్రం సక్కక పలు విసుర్లు విసిరాడు.

జొన్నకలి, జొన్నయంబలి
జొన్నన్నము, జొన్న పిసరు, జొన్నలెతప్పన్
సన్నన్నము సున్నసుమీ
పన్నుగ పల్నాటి సీమ ప్రజలందరకున్

శృంగారప్రియుడైన ఆయన కంటికి ఇక్కడి భామలు నచ్చలేదని, శుచి, శుభ్రతను ఏమాత్రం పాటించరని, పల్నాడులో సౌకర్యాలేమీ లేవని ఈ క్రింది చాటువులో ఆయన చెప్పాడు.

అంగడి యూరలేదు, వరియన్నము లేదు,
సుచిత్వమేమి లే,
దంగన లింపు లేరు, ప్రియమైన వనంబులు
లేవు, నీటికై
భంగపడంగ బాల్వడు కృపావరులెవ్వరూ లేరు,
దాతలె
న్నంగనుసున్న, గాన బలనాటికి మాటికి
బోవటనేటికిన్

రాళ్ళు రప్పలతో నిండి వున్న పల్నాడు గ్రామాల్లో తాగేందుకు నీరు దొరకని దుర్భర అవస్థను శ్రీనాథుడు స్వయంగా అనుభవించినట్లు మరో చాటువు చెబుతోంది.

సిరి గలవానికి జెల్లును
దరుణుల బదియారువేల దగ బెండ్లాడన్
దిరిపమున కిద్దరాండ్రా?
పరమేశా! గంగ విడుము పార్వతిచాలున్!

గంగాధారుడైన శివుడిని నీకిద్దరు పెళ్ళాలెందుకు.. పైగా నీ దగ్గర బూడిద తప్ప ఏమీ లేదు కదా.. గంగను పలనాటికి వదిలితే ఇక్కడ దాహార్తి తీరుతుందని నిలదీశాడు.

పల్నాడులో పర్యటించినంత కాలం ఒకటి, రెండు సందర్భాల్లో మినహా శ్రీనాథుడు ఎక్కడా సంతృప్తుడు కాలేదని ఆయన చాటువులన్నీ చెబుతున్నాయి.

## రైతులకు చేరువగా
# బేయర్ క్రాప్ సైన్స్

(ఆన్‌లైన్ - గుంటూరు)

ప్రపంచ ప్రఖ్యాతిచెందిన బేయర్ క్రాప్‌సైన్స్ అంతర్జాతీయ ప్రమాణాలకు ధీటుగా అధునాతన సాంకేతిక పరిశోధనతో రూపొందించిన ఫేమ్, ఫాలిక్యూర్ ఉత్పత్తులను ఇటీవల మార్కెట్‌లోకి విడుదల చేసింది.

ఇప్పటికి 141 సంవత్సరాలుగా ఎన్నో విశిష్ట ఉత్పాదనలను సుమారు 160 దేశాలలో ఉన్న కోట్లాదిమంది రైతులకు అందిస్తూ గత సంవత్సరం ప్రపంచంలో అతి పెద్ద కంపెనీల్లో ఒకటైన అవంతీస్ క్రాప్ సైన్స్‌ను విలీనంచేసుకుంది.

ప్రపంచంలో 400 కంపెనీల మొత్తం మార్కెట్ షేర్ 78 శాతం కాగా, బేయర్ ఒక్కటే 22 శాతం మార్కెట్ షేర్‌తో అగ్రస్థానంలో ఉంది. ప్రతి ఏటా పరిశోధనలు, అభివృద్ధి నిమిత్తం 14,500 కోట్ల రూపాయలను ఖర్చు చేస్తోంది.

నిష్ణాతులైన శాస్త్రవేత్తలతో ఒక ప్రత్యేకమైన బయోలాజికల్ డిపార్టమెంట్‌ను స్థాపించి, ఎప్పటికప్పుడు చీడపీడల ఉధృతిని పర్యవేక్షించడం, వాటిని నియంత్రించడానికి తగు సలహాలు, సూచనలు ఇవ్వడం చేస్తున్నది. రైతుల్లో ఎంతో ప్రాచుర్యం పొందిన బేయర్ కంపెనీ విత్తన శుద్ధి దగ్గరనుంచి పంట కోతకు వచ్చేంత వరకు అవసరమయ్యే కలుపు, పురుగు, తెగుళ్లను నివారించడానికి ప్రత్యేక తరహాలో పనిచేసే ఉత్పాదనలను రైతులకు అందిస్తున్నది.

కేవలం వ్యాపార దృష్టితో కాకుండా రైతులకు అవసరమైన అన్ని సలహాలు సూచనలు చేస్తున్నారు. ఈ సంవత్సరం బేయర్ సీడ్స్ తయారీలో కూడా ప్రవేశించింది. పురుగు మందులు జల్లే సమయంలో రైతులు తీసుకోవాల్సిన జాగ్రత్తల గురించి ఎప్పటికప్పుడు తెలియజేస్తున్నారు.

ఈ సంవత్సరం బేయర్ క్రాప్ సైన్స్ ఎరైజ్ - 6516, 6444, సర్పాస్, ధన్ బిటి పత్తి, మొక్కజొన్నలో సమర్థ్, సమన్, 4644, 4640, సజ్జలో జి-5, 33 అనే రకాల విత్తనాలను మార్కెట్‌లోకి విడుదల చేసింది. రైతులకు అన్ని వేళల్లో బేయర్ క్రాఫ్ సైన్స్ సిబ్బంది అందుబాటులో ఉంటున్నట్టు రీజనల్ మేనేజర్ నాగేంద్రరావు తెలిపారు.

★★★



తిక్కిరెడ్డిపాలెంలో బేయర్ క్రాప్ సైన్స్ దత్తత ప్లాంట్ రైతులతో మాపతిరెడ్డి, రామారావు, అనిల్‌జైన్ తదితరులు



తిక్కిరెడ్డిపాలెంలో రైతులకు మందుకొట్టే సమయంలో వేసుకునే రక్షణ దుస్తులను అందిస్తున్న బేయర్ జీఎం మాపతిరెడ్డి, వైస్‌చైర్మన్ రామారావు, అనిల్ జైన్ తదితరులు



గోలిలోని నాపరాయి క్వారీ

# సంపద వారిది... అయి'నాపరాయి'

(ఆన్‌లైన్, రెంటచింతల)

**గుం**టూరు జిల్లా రెంటచింతల మండలం నాపరాయి గనులకు పెట్టింది పేరు. మండలంలోని గోలి, జెట్టిపాలెం, పశర్లపాడు, తుమృకోట గ్రామాల పంచాయతీల పరిధిలో వేలాది ఎకరాల్లో విస్తరించివున్న ఈ నల్ల బంగారం(నాపరాయి) గనులలో లభించే నాపరాయి ఎంతో నాణ్యమైనది. నాపరాయి క్వారీల ద్వారా తీసే ఇక్కడి రాయి రాష్ట్ర స్థాయిలోనేగాక ఇతర రాష్ట్రాలకు సైతం ఎగుమతి చేస్తుంటారు.

రెంటచింతల మండలంలో ముఖ్యంగా గోలి గ్రామంలోని క్వారీలలో లభించే నాపరాయికి అత్యంత గిరాకీ వుంటుంది. మండలంలో రోజుకు దాదాపు 60 నుంచి 70 లారీల నాపరాయి రవాణా అవుతుంది. మండలంలో విస్తరించి వున్న నాపరాయి క్వారీల ద్వారా సీనరేజి రూపంలో పంచాయతీలకు లక్షలాది రూపాయల ఆదాయం లభిస్తున్నది.

పలు గ్రామాలలో నిక్షిప్తమై వున్న నాపరాయి క్వారీలు మండలంలో వందలాది మందికి ఉపాధి కల్పిస్తున్నాయి. వందల సంఖ్యలో కుటుంబాలు క్వారీలలో పనిచేస్తూ జీవనం సాగిస్తున్నాయి. ఒక్క గోలి గ్రామంలోనే ఉన్న జనాభాలో 90 శాతం కుటుంబాలు ఈ క్వారీలలోనే పనిచేసుకుంటూ కుటుంబాలను పోషించుకుంటున్నారు.

అయితే, నాపరాయి వ్యాపారం చేసే వ్యాపారులు మాత్రం ఆర్థికంగా ఎదిగిపోతున్నారుగాని కార్మికుల బతుకులు మాత్రం ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్న చందంగా వున్నాయి. క్వారీల మీద మైనింగ్ శాఖకు ఏటా లక్షలాది రూపాయలు ఆదాయం వస్తుంది. సంబంధిత మైనింగ్, చెక్‌పోస్టులు, రెవెన్యూ శాఖల అధికారుల అవినీతి కారణంగా కొన్ని వాహనాలు 'వే' బిల్లులు లేకుండా రవాణా చేస్తూ ప్రభుత్వ ఆదాయానికి గండి కొడుతున్నారన్న విమర్శలు వినిపిస్తున్నాయి.

కొంత మంది నాపరాయి వ్యాపారులు తాము లీజుకు తీసుకున్న భూములలోనే రాయిని వెలికి తీయాల్సి వుంది. అయితే లీజు భూములలోనే కాకుండా మరికొంత భూమిని ఆక్రమించుకుని అక్రమ త్రవ్వకాలు జరుపుతూ వ్యాపారం చేస్తున్నారన్న ఆరోపణలు సైతం వినిపిస్తున్నాయి. అక్రమ తవ్వకాలు జరుపుతున్నప్పటికీ రెవెన్యూ, మైనింగ్ శాఖలకు చెందిన అధికారులు ఏమాత్రం పట్టించుకోవడం లేదన్న ఆరోపణలు వున్నాయి.

నాపరాయి క్వారీలలో పనిచేసే వందలాది కార్మికులు పలు ప్రమాదాలకు గురవుతూ ప్రాణాల మీదకు తెచ్చుకుంటున్న సందర్భాలు అనేకం. క్వారీలలో రాళ్ళు తొలిచే సమయంలో, మలచిన రాయిని లారీలకు లోడు చేసేటప్పుడు ప్రమాదాలకు గురై సరైన వైద్యం చేయించుకునే స్తోమత లేక శాశ్వత అంగవైకల్యం పొందిన కార్మికులూ వున్నారు. నాపరాయి క్వారీల్లో పనిచేసే కార్మికులను సంఘటితం చేసి, వారికే క్వారీ భూములను లీజుకు ఇచ్చి ఆదుకోవాలని ప్రజా సంఘాలు ఆందోళన కార్యక్రమాలు సైతం చేపట్టడం జరుగుతున్నాయి.

క్వారీలలో పనిచేసే నాపరాయి కార్మికులకు తరచూ ప్రమాదాలు సంభవించే అవకాశాలు వున్న దృష్ట్యా వారికి బీమా సౌకర్యం కల్పించాల్సిన అవసరం ఎంతైనా వుంది. వందలాది కుటుంబాలు క్వారీలపై ఆధారపడి జీవిస్తున్నాయి. క్వారీల సమీపంలోనే వైద్య సదుపాయాలు అందే విధంగా వ్యాపారులు, ప్రభుత్వం తగిన చర్యలు తీసుకోవాల్సిన అవసరం వుంది. వర్షాకాలంలో కురిసే వర్షాలకు క్వారీ గుంతల్లో నీరు చేరి కార్మికుల ఉపాధికి తీవ్ర అవరోధం ఏర్పడుతున్నది. దీంతో వర్షాకాలంలో కార్మికులు ఉపాధి లేక కుటుంబ పోషణకు ఇబ్బందిగా మారుతున్నది. కాబట్టి వర్షాకాలంలో కార్మికులు ప్రత్యామ్నాయ ఉపాధి కల్పనకు ప్రభుత్వం తగిన చర్యలు తీసుకోవాలని కార్మికులు కోరుతున్నారు.



విశ్వనగర్‌లో రూపు దిద్దుకున్న తల్లీపిల్లల వైద్యశాల

# దీనజన సేవలో విశ్వయోగి

(ఆన్‌లైన్ - ప్రత్తిపాడు)

అందరూ ఆరోగ్యంగా ఉండాలి. అంటే వైద్య సౌకర్యం అందుబాటులోకి రావాలి. ముఖ్యంగా పేద, మధ్య తరగతివారు ఎక్కువ నివసించే గ్రామీణులకు మెరుగైన వైద్య సేవలు అందాలి అనే కృత నిశ్చయంతో విశ్వగురు పీఠాధిపతి విశ్వయోగి విశ్వంజీ సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్ నిర్మాణానికి శ్రీకారం చుట్టారు. ప్రత్తిపాడు మండల పరిధిలోని ఐదవ నెంబరు జాతీయ రహదారి పక్కనే చినకోండ్రుపాడు వద్ద ఉన్న విశ్వనగర్‌లో సుమారు రూ. 10 కోట్ల వ్యయంతో విశ్వయోగి ఇనిస్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్ మదర్ అండ్ చైల్డ్ కేర్ ఆస్పత్రిని నెలకొల్పారు.



లాంఛనంగా ఆస్పత్రికి ప్రారంభోత్సవం చేస్తున్న విశ్వంజీ

త్వరలో ప్రారంభోత్సవానికి సిద్ధం కానున్నది. ఉచితంగా గ్రామీణులకు మెరుగైన వైద్య సేవలు అందించాలనే విశ్వంజీ కల నేటికి నెరవేరింది. కటిక పేదవాడైనా, ధనవంతుడైనా అందరికీ సమాన న్యాయం జరిగేలా పూర్తి ఉచితంగా వైద్య అందించనున్నారు.

1998వ సంవత్సరం నుంచి విశ్వనగర్‌లో ప్రతి నెలా 3వ ఆదివారం నిష్ణాతులైన వివిధ విభాగాలకు చెందిన డాక్టర్లతో ఉచిత వైద్య శిబిరం నిర్వహిస్తున్నారు. ఇప్పటివరకు సుమారు 30 వేల మందికి వైద్య సేవలు అందించారు. పూర్తి ఉచితంగా మందులు పంపిణీ కళ్లజోళ్ల పంపిణీ, కంటి ఆపరేషన్లు, నిర్వహిస్తున్నారు. విశ్వనగర్‌లో రూపుదిద్దుకుంటున్న ఆస్పత్రికి తల్లి పిల్లల వైద్యశాల అని నామకరణం చేయడంలో ప్రాధాన్యం ఉన్నది. ఈ ఆస్పత్రికి ప్రపంచ వైద్య నిపుణులు డాక్టర్ నోరి దత్తాత్రేయుడు ప్రధాన బాధ్యతలను స్వీకరించారు. ఇప్పటి

(తరువాయి 193వ పేజీలో)

# 'కోలవెన్ను' మానస పు(వ)త్రిక త్రివేణి

(ఆన్‌లైన్, నరసరావుపేట)

స్వాతంత్ర్య సమరోద్యమంలో తెల్లోళ్ళపై 'త్రివేణి' తిరగబడింది. స్వాతంత్ర్యం కోసం సమరశంఖం పూరించింది. సమరయోధుల భావాలకు, ఉద్యమాలకు బాటలు వేసింది. 'త్రివేణి' పేరు చెబితే చాలు తెల్లోళ్ళ గుండెల్లో రైళ్ళు పరిగెత్తేవి. కరుకైన కథనాలతో యువతను తట్టిలేపే రచనలతో సాహిత్యం, రాజకీయాలలో ఉన్నత ప్రమాణాలకు ఆనాడు ఖ్యాతినిచ్చింది త్రివేణి పత్రిక. అంతటి పేరెన్నికగన్న ఈ పత్రిక వ్యవస్థాపకుడు కోలవెన్ను రామకోటేశ్వరరావు నరసరావుపేట నివాసి కావడం ఈ ప్రాంతానికే గర్వ కారణం.



కోలవెన్ను రామకోటేశ్వరరావు

స్వాతంత్ర్య సమరంలో తెలుగులో అనేక పత్రికలు వాటి వంతు పాత్ర అవి నిర్వహించాయి. అయితే, త్రివేణికి ఒక ప్రత్యేక స్థానం సంతరించుకుంది. తెల్లోళ్ళకు అర్థమయ్యేందుకేనేమో కోలవెన్ను రామకోటేశ్వరరావు త్రివేణి పత్రికను ఇంగ్లీషులో ముద్రించేవారు. దేశ ప్రజల భావాలను పత్రిక ద్వారా బ్రిటీష్ పాలకులకు చాటిచెప్పేవారు.

1927వ సంవత్సరంలో త్రివేణి పత్రిక కోలవెన్ను రామకోటేశ్వరరావు సంపాదకత్వంలో అవతరించింది. స్వాతంత్ర్యోద్యమంతోపాటు ఆంగ్ల పత్రిక త్రివేణి ద్వారా దేశంలోని వివిధ సాహిత్యాల సౌదర్యం, దేశవాసులు, విదేశ వాసులు ఆస్వాదించేట్టు చేసింది. తెలుగు సాహిత్యపు నిగ్గును ఇతరులకు అందజేసి తెనుగు సాహిత్యం ఉత్తమ ప్రపంచ సాహిత్యానికి ఏ మాత్రం తీసిపోదని చాటి చెప్పింది. భావ సమైక్యాన్ని త్రివేణి సాధించింది. ఈ పత్రిక సంపాదక మండలిలో సర్వేపల్లి రాధాకృష్ణన్, కె.చంద్రశేఖర్, డి.ఆంజనేయులు, కె.సౌమిత్రి అమ్మాళ్, యుపి.పండిట్‌లు వున్నారు. ఆనాటి స్వాతంత్ర్య సమరయోధులు రాజేంద్ర ప్రసాదు, సర్వేపల్లి రాధాకృష్ణ, రాజాజీ, అనిబిసెంట్, మున్ని, ప్రకాశ, ఆనంద్, కె.కుమార స్వామి, జిడ్డు కృష్ణమూర్తి లాంటి వారెందరో త్రివేణికి రచనలు అందించేవారు.

## 'త్రివేణి' ఒక భూషణం

### జవహర్‌లాల్ నెహ్రూ

భారత మాజీ ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ త్రివేణి సంచికను చేతబూని స్వాతంత్ర్య సమావేశాలకు హాజరయ్యేవారు. ఈ సందర్భంగా ఆయనను పలువురు ప్రశ్నించగా, 'త్రివేణి' ఒక భూషణం. దానిని ధరించడానికి నేను గర్వపడుతున్నాను అని నెహ్రూ అనే వారట'. దీనిని బట్టి 'త్రివేణి' స్వాతంత్రోద్యమంలో ఎటువంటి పాత్ర పోషించిందో ఇట్టే అర్థం చేసుకోవచ్చు.

న్యాయశాస్త్ర పట్టభద్రుడైన కోలవెన్ను రామకోటేశ్వరరావు నరసరావుపేటలో న్యాయవాద వృత్తిని చేపట్టారు. సహాయ నిరాకరణోద్యమం ముమ్మరంగా జరుగుతున్న సమయంలో 1920 సంవత్సరంలో లాయర్ వృత్తికి స్వస్తిచెప్పి ప్రజా ఉద్యమంలో పాల్గొన్నారు. తొలుత ఆయన 'స్వరాజ్య' పత్రికలో కాసా సుబ్బారావు, కృపానిధిలతో కలసి కొంత కాలంపాటు సహాయ సంపాదకులుగా పనిచేశారు. స్వరాజ్యాన్ని పత్రికను వదిలేసి చెన్నై నుంచి త్రివేణి ఆంగ్ల సాహిత్య మాసపత్రికను ఆయన ప్రారంభించారు. తెలుగువారేగాక మహారాష్ట్ర, కన్నడ బాషా సాహిత్య వేత్తలు ఆయన కృషికి తోడ్పాటునిచ్చారు.

రాజనీతిజ్ఞులకన్నా సాహిత్య వేత్తలే భారత సమైక్యం సాధించగలరని కోలవెన్ను విశ్వాసం. ఇతర భారతీయ భాషలను పరిశీలించినట్టయితే సంస్కృతానికి, ఆంగ్లానికి కూడా అందరూ రుణపడి వున్నామని తేలుతుందని, ఏ భాషపైనా ద్వేషమన్నది ఎప్పుడూ పెంచుకోరాదు అన్నది కోలవెన్ను కఠోర నియమం. ఒకవైపు త్రివేణి పత్రికలో సేవ చేస్తూనే బందరు జాతీయ కళాశాల ప్రిన్సిపాల్‌గా, కృష్ణ పత్రిక సంపాదకులుగాను కొంత కాలం సౌత్ ఇండియన్ తెలుగు సంపాదకులుగాను పనిచేశారు. కేంద్ర సాహిత్య అకాడమి సలహా సంఘం సభ్యులుగా కోలవెన్ను వున్నారు. తెలుగు నవకవితోద్యానంలో ప్రముఖులు అడవి బాపిరాజు, నండూరి సుబ్బారావు, బసవరాజు అప్పారావులు కోలవెన్నుకు ప్రాణమిత్రులు.

## సంపాదకులకే సంపాదకుడు 'కోలవెన్ను'

ఓ సారి పత్రికా ప్రముఖ సంపాదకులు నార్ల వెంకటేశ్వరరావు నరసరావుపేటలో కోలవెన్నును చూడడానికి త్రివేణి నిలయానికి వచ్చారు. ఈ సందర్భంగా ఆయన 'కోలవెన్ను' గురించి అన్న మాటలు ఇవి. 'నేను ఒక సంపాదకుడినే. మేము ఎవరైనా ఇతర రచయితలు అందించిన రచనను, వ్యాసాన్నో, వార్తనో ఎడిట్‌చేస్తే ఆ విషయం ఆ రచయితకేగాక కొందరు పాఠకులు కూడా గుర్తించగలుగుతారు. కానీ కోలవెన్ను రామకోటేశ్వరరావు ఎడిట్ చేస్తే పాఠకులే కాదు సాక్షాత్తు ఆ రచయిత కూడా గుర్తించ లేరు. వారు ఒక విధంగా సంపాదకులకే సంపాదకులు' అని రామకోటేశ్వరరావును ప్రశంసించారు. 1939లో జరిగిన ఉప ఎన్నికల్లో మద్రాసు రాష్ట్ర అసెంబ్లీకి కోలవెన్ను రామకోటేశ్వరరావు ఎమ్మెల్యేగా ఎన్నికయ్యారు. కానీ అతి తక్కువ కాలంలోనే అధిష్ఠానం ఆదేశాల మేరకు ఆయన రాజీనామా చేశారు.

## అన్ని భాషలూ అవసరమే

సుమారుగా 1963 సంవత్సరంలో ఆంధ్రప్రభ వారపత్రికకు ఇచ్చిన ఇంటర్వ్యూలో ఆయన అన్న మాటలివి. 'దేశంలో ఉత్తమ కార్యాలు జరిగే కాలంలో కవులు, గాయకులు ఉత్తమ స్థాయికి వెళ్ళగలుగుతారు. అంతరంగా ఎంత పరిణితి పొందినా పరిసర ప్రభావం తప్పించు కోలేరు. ఏమైనా, పశుత్వం నుంచి మానవత్వానికి, మానవత్వం నుంచి దైవత్వానికి దారి తీసేదే ఉత్తమ సాహిత్యం. ఆంగ్ల సాహిత్యం తెలుగు సాహిత్యానికి ప్రమాదం తెచ్చి పెట్టిందనే మాటలు అవాస్తవం. ఏ భాషవల్లా మరో భాషకు ప్రమాదం లేదు. మనకు

(తరువాయి 193వ పేజీలో)

# 'కోలవెన్ను' మానస పు(ప)త్రిక త్రివేణి



విశ్రాంతిగా...



కోలవెన్ను రామకోటేశ్వరరావు దంపతులు



సాహిత్య రచనలో కోలవెన్ను

(192వ పేజీ తరువాయి)

హిందీ, ఇంగ్లీషు రెండూ అవసరమే. కనుక కాల పరిమితి లేకుండా ఆంగ్లం అధికార భాషగాగాని, పరిపాలనాభాషగా గాని వుండాలి. రాజ్యాంగంలో తక్కిన భాషలతో పాటు ఇంగ్లీషును చేర్చాలి. మన వారసత్వంలో ఆంగ్ల సాహిత్యం కూడా చేరింది. ఆంగ్లమంటే ఆంగ్లం ద్వారా వచ్చిన ఇతర సాహిత్యాలు కూడా.

మహోజ్వలంగా కాకపోయినా, ఉత్తమ స్థాయిలోనే 'త్రివేణి'ని నడిపానని నాకెంతో సంతృప్తిగా వున్నదని కోలవెన్ను అన్నారు. 1970 మే నెలలో కోలవెన్ను రామకోటేశ్వరరావు నరసరావుపేటలో మృతిచెందారు. స్టేషన్ రోడ్డులోని ప్రస్తుతం వున్న డాక్టర్ కృష్ణకుమారి హాస్పటల్ స్థలంలో కోలవెన్ను నివాసం వుండేది. ఆయన ఇంటికి త్రివేణి నిలయం అని పేరు వుండేది.

# దీనజన సేవలో...

(192వ పేజీ తరువాయి)

వరకు డాక్టర్ వివి సుబ్బారావు, డాక్టర్ పద్మావతి, డాక్టర్ కె రాజరాజేశ్వరి, డాక్టర్ కె దత్తాత్రేయ శాస్త్రి, డాక్టర్ ఎస్ఎల్ శాస్త్రి, డాక్టర్ జి సూర్యప్రకాశ్, డాక్టర్ పి నరసింహం, డాక్టర్ ఎన్ పేరయ్య, డాక్టర్ జి ఆర్ శ్రీనివాసరావు, డాక్టర్ కెవిఎల్ ప్రకాశ్ చంద్ర, డాక్టర్ జె శ్రీనివాసరావు, డాక్టర్ ఆర్ నాగేశ్వరిలు వైద్యసేవలు అందిస్తున్నారు.

ఆస్పత్రి నిర్మాణానికి శ్రీకారం చుట్టినప్పుడు విశ్వంజీ ఈ ఆస్పత్రిని నిర్మించగలరా, అందరికీ ఉచితంగా వైద్య సేవలు అందించగలరా అని చాలా మంది అనుకున్నారు. నన్ను కూడా ప్రశ్నించారు. కానీ అందరి సహకారంతో విశ్వంజీ ఆశయం సిద్ధించింది అంటూ పలుమార్లు విశ్వయోగి అన్న మాటలివి.

లోక కల్యాణం, ప్రపంచ శాంతి మనుషుల హృదయాలను క్రోధంతో కాకుండా ప్రేమతో నింపడమే విశ్వంజీ సంకల్పం.



# ప్రగతి కాంతుల సిరి 'మంగళగిరి'

(ఆన్‌లైన్...మంగళగిరి)

మంగళగిరి అంటే ఒకప్పుడు ఉద్యమాల పుట్టినిల్లు... వామపక్ష భావజాలం ముసురుకున్న ఈ ప్రాంతమంటే పారిశ్రామికుల్లో ఓ రకమైన వెనుకంజ కనిపించేది. ఫలితంగా రెండు పెద్ద నగరాల మధ్య ఉన్న మంగళగిరి ఏడేళ్ల ముందు నాటి వరకు సాధారణ పట్టణంగానే మిగిలిపోయింది. మరి ఇప్పుడేమో! మంగళగిరి ఓ 'మహానగరి'గా రూపు దాల్చబోతుంది. ఇంతలోనే ఎంత మార్పు!! అన్నట్టు మంగళగిరి మారిపోతుంది. ఈ మార్పు చారిత్రాత్మకమనే చెప్పుకోవాలి.

ఎందుకంటే మంగళగిరి పట్టణ రూపురేఖలను మార్చివేసే అత్యద్భుతమైన ప్రణాళికా రచనలు కార్యరూపం దాల్చుతున్నాయి. ఇప్పటివరకు మంగళగిరి ప్రత్యేకత రెండింటికే పరిమితమైంది. అవి (1) మంగళగిరి ఓ పెద్ద వైష్ణవ నారసింహ క్షేత్రం, (2) ప్రపంచంలోనే పేరెన్నిక గన్న చేనేత కేంద్రం. కాని, ఇప్పుడు మంగళగిరి జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో ఇంకా గొప్ప గుర్తింపును పొందేవిధంగా సరికొత్త హంగులను ఏర్పరుచుకుంటుంది. అవేమంటే... మంగళగిరి పట్టణానికి పశ్చిమ శివారులో వున్న విజిటియం ఉడా వారి 450 ఎకరాల టౌన్‌షిప్‌లో సుమారు 53 ఎకరాల విస్తీర్ణంలో సింగపూర్ టౌన్‌షిప్ 975 కోట్ల రూపాయలకు పైగా వ్యయంతో రూపుదిద్దుకోబోతుంది. అరిహంత్ ఇండో ఆఫ్రికన్ ఇన్‌ఫ్రా డెవలపర్స్ అండ్ బిల్డర్స్ ప్రైవేటు లిమిటెడ్ సంస్థ ఈ నిర్మాణ కాంట్రాక్టును దక్కించుకుంది.

తాజాగా అంటే, 2007 అక్టోబరు 13వ తేదిన రాష్ట్ర ముఖ్యమంత్రి డాక్టర్ వైయస్ రాజశేఖరరెడ్డి చేతుల మీదుగా ఈ ప్రాజెక్టు నిర్మాణ పనులకుగాను శంకుస్థాపన జరిపించారు. ఈ భారీ ప్రతిష్టాత్మక ప్రాజెక్టులో మొత్తం 3088 ఫ్లాట్‌లను నిర్మించనున్నారు. దీని పక్కనే సుమారు 35 కోట్ల రూపాయల అంచనా వ్యయంతో అంతర్జాతీయ క్రికెట్ స్టేడియం నిర్మాణాన్ని రాష్ట్ర క్రికెట్ అసోసియేషన్ ఇప్పటికే చేపట్టింది. అయితే నిధులను దశల వారీగా మంజూరు చేస్తూ స్టేడియంకు అంచెలంచెలుగా అంతర్జాతీయ స్థాయి హోదాను తీసుకురానున్నారు. ఇవి రెండూ మంగళగిరికి మహత్తరమైన ప్రాజెక్టులు.

ఇంతటితో కాకుండా మంగళగిరి నియోజకవర్గం పరిధిలో కొత్తగా రెండు ఎస్‌ఈజడ్‌లకు ప్రభుత్వం ప్రాథమిక అనుమతిని మంజూరు చేసింది. వీటిలో ఒకటి ఉడా టౌన్‌షిప్ పరిధిలోనే 43 ఎకరాల విస్తీర్ణంలో మంజూరై ఉండగా, మరొకటి నాగార్జున యూనివర్సిటీ ఎదురుగా గల లింగమనేని ఎస్టేట్స్ వారి భూమిలో 110 ఎకరాలకు అనుమతి లభించింది. ఇక్కడే లింగమనేని సంస్థ ఐజేయం వారి నేతృత్వంలో మరో బ్రహ్మాండమైన టౌన్ షిప్‌కు శ్రీకారం చుట్టింది.



మంగళగిరి గాలి గోపురం



ఉడా టౌన్‌షిప్ మెయిన్‌గేటు , ఏపియస్‌పి ఆరవ బెటాలియన్ ప్రధాన కార్యాలయం, కాజలోని శ్రీనారాయణతీర్థ యతీంద్రుల వారి ఆశ్రమం, సింగపూర్ టౌన్‌షిప్‌లోని భవనం నమూనా

అలాగే ఉడా సంస్థ తాడేపల్లి సిమెంట్ ఫ్యాక్టరీ స్థలాన్ని సేకరించి కొత్తగా టౌన్‌షిప్‌ను నిర్మించేందుకు రంగం సిద్ధం చేసింది. ఇంతేకాకుండా మంగళగిరి - విజయవాడ బైపాస్ మార్గం వెంబడి మరో 100 ఎకరాల విస్తీర్ణంలో ఇంకొక ప్రైవేటు సంస్థ మలేషియా టౌన్‌షిప్ నిర్మాణానికి సర్వే చేస్తుంది. మంగళగిరి పట్టణానికి నైరుతి శివారులో కొత్తగా ఆటోనగర్ ఆవిర్భవిస్తుంది. దీని వెంబడే పట్టణాన్ని ఆనుకుని ప్రముఖ పారిశ్రామిక సంస్థ రహేజా గ్రూప్ ఆఫ్ కంపెనీస్ 20 ఎకరాల విస్తీర్ణంలో షాపింగ్‌మాల్స్, ఐమాక్స్ థియేటర్ వంటి భారీ ప్రాజెక్టులకు రూపకల్పన చేస్తున్నట్టు ప్రచారం జరుగుతుంది.

ఇవన్నీ ఒక ఎత్తయితే... ఇప్పటికే మంగళగిరి నియోజకవర్గం పరిధిలో ఓ రెండు పెద్ద ప్రైవేటు ఆసుపత్రులు, ప్రైవేటు వైద్య కళాశాల, ప్రైవేటు ఇంజనీరింగ్ కళాశాల ఉన్నాయి. వీటికి తోడు ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం వుండనే వుంది. తాజాగా కోస్తా ఆంధ్రాలో నిమ్స్ తరహా ఓ సూపర్ స్పెషాలిటీ ఆసుపత్రి ఏర్పాటుకు ప్రభుత్వం సంసిద్ధమవుతున్న నేపథ్యంలో దానిని మంగళగిరి టిబి శానిటోరియంకు చెందిన 75 ఎకరాలలో నిర్మించాలనే ప్రతిపాదన పరిశీలనలో వుంది.

ఇక్కడే మరో వంద ఎకరాలలో ఉడా సంస్థ ఇంకొక కొత్త టౌన్‌షిప్‌ను నిర్మించేందుకు పావులు కదుపుతుంది. ఇందుకుగాను ప్రభుత్వం కూడా అంగీకరించినట్టు వార్తలు వినవస్తున్నాయి. ప్రత్యేక పోలీసు పటాలాన్ని (ఆరవ బెటాలియన్), మూడు జిల్లాలకు చెందిన పోలీసు యంత్రాంగానికి ఉపకరించే ఫైరింగ్ రేంజ్ ఏరియా తాడేపల్లి మండలం నులకపేటలోనే వుంది.

ఆధ్యాత్మికంగా కూడ మంగళగిరి నియోజకవర్గం సుప్రసిద్ధమైంది. ఈ నియోజకవర్గంలో శ్రీ మంగళాద్రి లక్ష్మీ నృసింహస్వామి వారి దేవస్థానంతో పాటు చారిత్రాత్మకమైన ఉండవల్లి గుహాలయాలు, కృష్ణా తీరాన శ్రీ జియ్యర్‌స్వామి, శ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజి ఆశ్రమాలు ఉన్నాయి. ఇక మంగళగిరి పట్టణానికి సుమారు నాలుగైదు కిలోమీటర్ల దూరంలో వున్న పెనుమాక కొండపై పాతకాలం నాటి కోట అవశేషాలు ఉన్నాయి. ఈ కొండపై కోట ప్రాకారం గోడ ఆనవాళ్లు, అనేక కోనేరులు, వ్యవసాయం చేసిన ఆనవాళ్లు ఇప్పటికి కనిపిస్తాయి.

మంగళగిరికి మంచి భవిష్యత్తు ఉందనేది ఇపుడు అందరినోట వినవస్తున్న మాట!.

తెలంగాణా నినాదం మరింత బలపడి రాష్ట్ర విభజన అంటూ జరిగితే ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రానికి మంగళగిరే సరికొత్త రాజధాని నగరంగా అవతరిస్తుందనేది పలువురి ఉవాచ.

అదే జరిగితే మంగళగిరి రాష్ట్రంలోనే ఓ పెద్ద మహానగర మవుతుందనడంలో సందేహం అక్కర్లేదు.



# ఆర్థిక పథంలో ముందడుగు

# సహకార రంగానికే వెలుగు





సంగం డెయిరీ

**(ఆన్‌లైన్ - చేబ్రోలు)**

సహకర రంగంలో వేమూరు నియోజకవర్గానికి అంతర్జాతీయంగా గుర్తింపు తీసుకువచ్చిన ఘనత సంగం డెయిరీకి దక్కుతుంది. రాష్ట్ర పాడి పరిశ్రమలో సహకార రంగానికి ఎన ఒడిదుడుకులను ఎదుర్కొని గుంటూరు జిల్లా పాల ఉత్పత్తి దారులకు చేదోడు వాదోడుగా నిలిచిన సంస్థగా డెయిరీ పేరొందింది. జాతీయ పాడి పరిశ్రమాభివృద్ధి సంస్థ సహకారంతో 1978లో ఆపరేషన్ ఫ్లడ్-1 పథకం కింద ప్రారంభమైన గుంటూరు జిల్లా పాల ఉత్పత్తిదారుల సహకార సంఘం 1997లో దేశంలోనే ప్రథమంగా 1995 పరస్పర సహాయ సహకార చట్టాన్ని అమలు పరచి గుంటూరు జిల్లా పాల ఉత్పత్తిదారుల పరస్పర సహాయ సహకార చట్టాన్ని అమలు పరచి గుంటూరు జిల్లా పాల ఉత్పత్తిదారుల పరస్పర సహాయక సహకార సంఘంగా రూపుదిద్దుకుంది. సంగం డెయిరీ లాభాలలో అధిక మొత్తం ఉత్పత్తి దారులకే అందజేసింది. రాష్ట్రంలో గత ఆరు సంవత్సరాలుగ క్రమం తప్పకుండా వచ్చిన లాభాలను ధర వ్యత్యాసం కింద తిరిగి ఉత్తత్తిదారులకే చెల్లిస్తున్న సంస్థగా సంగం డెయిరీని పేర్కొనవచ్చు. ధర వ్యత్యాసం కింద సంవత్సరానికి దాదాపు రూ. కోటి ఉత్పత్తి (మిగతా 218వ పేజీలో)

## మహిమాన్వితుడు

# శ్రీ అమరలింగేశ్వరుడు

(ఆన్‌లైన్, గురజాల)

శైవక్షేత్రాల్లో అత్యంత ప్రసిద్ధిగాంచిన క్షేత్రం దైద అమరలింగేశ్వరస్వామి దేవాలయం. దైద గ్రామ శివారున దుర్గమారణ్యంలో కృష్ణానది తీరాన వున్న బిలంలో అమరలింగేశ్వరుడు వెలిశాడు. మొక్కిందే తడవుగా భక్తుల కోర్కెలు తీర్చే శ్రీ అమరలింగేశ్వరస్వామిని దర్శించాలంటే కాస్తంత శ్రమతో కూడినదే. మూడు కిలోమీటర్ల నడక అనంతరం బిల ప్రవేశం తప్పనిసరి.



దైద శ్రీ అమరలింగేశ్వరస్వామి

### ఆరు దశాబ్దాల క్రితం బయటపడ్డ వైనం

పులిపాడుకు చెందిన కొండ్ర రామయ్య, పోట్ల హనుమయ్యలు పశువుల మందను తోలుకువెళ్ళి వాటిని మేపుతూ విశ్రాంతి తీసుకుంటున్నారు. నిర్మానుష్య ప్రాంతంలో హార్మోని, మద్దెల వంటి వాయిద్య పరికరాల తాళాలతో 'ప్రొద్దునే లేవండి.. బుద్ది నివారించండి.. తల్లిదండ్రులను పూజించండి.. శ్రీ అమరలింగేశ్వరస్వామిని కొలవండి..' అంటూ రాగాలాపన వినిపించింది. ఈ సంకీర్తన విని ఆశ్చర్యపోయిన వారిరువురు అడవంతా గాలించి ఎవరూ కనబడకపోవడంతో ఈ విషయాన్ని గ్రామస్తులకు వివరించారు. ఆ రాగం ఎక్కడి నుండి వచ్చింది కనుక్కునేందుకు సుమారు 50 మంది గ్రామస్తులు మరుసటి రోజు ఆ ప్రాంతంలో వెతకనారంభించారు. కాసేపటికి బండ రాళ్ళ మాటున బిల ద్వారాన్ని గుర్తించారు. ఒకరి వెనుక ఒకరు లోపలికి అతి ప్రయాసమీద వెళ్ళసాగారు. బిలంలోని మైదాన ప్రాంతంలో మూడు మార్గాలు కనిపించాయి. దారితప్పి నడుస్తున్న వారందరికి అటు కాదు ఇటూ అంటూ భగవద్వాణి వినిపించింది. అలా ఒక ప్రదేశంలోకి చేరగానే గోపుర శిఖరం వలె ఒక పురాతన దేవాలయం దర్శనమిచ్చింది. ఇన్నాళ్ళుగా అగోచరంగా వుండి తాను మునులకు మాత్రమే దర్శనమిచ్చానని, ఈ రోజు నుండి మానవులు కూడా తనకు పూజలు జరపాలని ఒక భక్తుడికి పూని ఆయన నోట శ్రీ అమరలింగేశ్వరుడు పలికించాడు. అజ్ఞాతంలో వున్న ఓ మహత్తర దేవాలయం ఇలా వెలుగులోకి వచ్చింది. ఈ బిలంలోని ఒక మార్గం పవిత్ర కాశీ క్షేత్రానికి దారి అని ఇక్కడి వారి నమ్మకం. దేవాలయం బయటపడ్డ నాటి నుండి ప్రతి సోమవారం స్వామి దర్శనార్థం భక్తులు అధిక సంఖ్యలో వస్తుండేవారు. హరహర మహాదేవ అంటూ కృష్ణానది జలాన్ని అభిషేకించి ఆ రాత్రి నిద్ర చేస్తే చాలు.. ఎంతటి కోరికైనా ఇట్టే తీరుతుందని భక్తుల నమ్మకం. అడిగిందే తడవుగా భక్త జనుల కోరిక తీరుస్తారనే ప్రతీతి శ్రీ అమరలింగేశ్వరస్వామి క్షేత్రానికి దక్కుతుంది. పిల్లలు లేని వారికి సంతాన భాగ్యం కలిగిస్తారని, దీర్ఘ కాల వ్యాధులు ఈయన దర్శనంతో మటుమాయమవుతాయని చెప్పుకుంటారు. ఈ క్షేత్రం ఖ్యాతిని తెలుసుకొని భక్తులు క్రమేణా పెరుగుతూ వస్తున్నారు. శివరాత్రి పర్వదినాన్ని ఇక్కడ బాగా జరుపుకుంటారు. పగలంతా ఉపవాసంతో, రాత్రి జాగారం (మిగతా 197వ పేజీలో)

(196వ పేజీ తరువాయి)

చేస్తూ ఓం నమఃశివాయ అనే పంచాక్షరీ మంత్రాన్ని జపిస్తూ శివరాత్రి రోజు కోలాహల వాతావరణం వుంటుంది.

### క్షేత్రంలో నెలకొన్న అన్ని సౌకర్యాలు

స్వామి మహిమలు తెలుసుకొని వస్తున్న భక్తుల కోసం పలు స్వచ్ఛంద సంస్థలు అన్ని సౌకర్యాలను ఏర్పాటు చేశాయి. ప్రజా విరాళంతో క్షేత్రానికి 1991లో రహదారి నిర్మించారు. బిల మార్గం కనుక గతంలో భక్తులు దివిటీలు, టార్చిలైట్లతో వెళ్ళాల్సి వచ్చేది. గత ఏడాది నుండి బిలం నుండి గర్భాలయం వరకు జనరేటర్‌తో విద్యుత్ దీపాలను ఏర్పాటు చేశారు. శ్రీ వాసవి కన్యకా పరమేశ్వరి నిత్య అన్నదాన సత్రం ప్రతి సోమవారం భక్తులకు ఉచిత భోజన వసతిని ఏర్పాటు చేసింది. శ్రీ అమర లింగేశ్వర భక్త సమాజం గత ఆరేళ్ళ నుండి ప్రతి ఆదివారం భజన సంకీర్తన కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు. కార్తీక పౌర్ణమికి స్వామి సన్నిధిలో ఏకాహం, అన్నదాన కార్యక్రమాలను నిర్వహిస్తారు. రాత్రి నిద్రచేసే భక్తుల కోసం పది గదులను దాతలు నిర్మించారు. పొంగలి, వంట చేసుకునే భక్తుల కోసం వంటపాత్రలు కూడా ఇక్కడ ఉచితంగా లభిస్తాయి.

# మహిమాన్వితుడు శ్రీ అమరలింగేశ్వరుడు



దైవ క్షేత్రానికి బిల మార్గం ఇదే

ఆదిపరాశక్తి స్వరూపిణి

# శ్రీ పాత పాటేశ్వరి అమ్మవారు



శ్రీ పాత పాటేశ్వరి అమ్మవారిదేవాలయం

(ఆన్‌లైన్, గురజాల)

అమ్మలగన్న అమ్మ ముగ్గురమ్మల మూలపుటమ్మ అయిన శ్రీ ఆదిపరాశక్తి స్వరూపిణి అయిన శ్రీ పాతపాటేశ్వరి అమ్మవారు గురజాల పట్టణంలో సుమారు వెయ్యి సంవత్సరాల క్రితం దుగ్గరాజు వంశీకులచే ప్రతిష్ఠించబడినట్లు ఆలయంలోని శాసనముల ద్వారా తెలుస్తోంది. క్రీ.శ.11వ శతాబ్దంలో పల్నాటి నాయకురాలైన శ్రీ నాగమ్మ, శ్రీ పాతపాటేశ్వరి అమ్మవారికి భక్తి ప్రవత్తులతో పూజలు జరిపినారని పెద్దలు చెబుతూ వుంటారు. వీర శైవ భక్తురాలైన శ్రీ నాగమ్మ గురజాల గ్రామంలో వున్న శ్రీ ముక్కంటేశ్వరుడ్ని, శ్రీ వీరభద్రస్వామి వారిని, శ్రీ పాతపాటేశ్వరి అమ్మవారిని కొలిచినట్లు ఆలయ శాసనముల ద్వారా తెలుస్తోంది. ఎంతో మహిమాన్వితమైన ఈ పుణ్యక్షేత్రము శిథిలమై తిరిగి 1826వ సంవత్సరములో అప్పటి గుంటూరు జిల్లా కలెక్టరు అయిన ఓక్స్ దొర అమ్మవారి సత్యములకు, మహిమలకు ముగ్ధుడై అమ్మవారి నిత్య నైవేద్య దీపారాదనల నిమిత్తము సుమారు 40 ఎకరాల భూమి ఇనాముగా ఇచ్చారు. అమ్మవారికి ప్రతి సంవత్సరము మార్గశిర శుద్ధ ఏకాదశి నుండి మార్గశిర శుద్ధ పౌర్ణమి వరకు తిరునాళ్ళ బ్రహ్మోత్సవాలు జరుగుతాయి. ఈ ఉత్సవాల్లో ఏకాదశి రోజున అమ్మవారికి బియ్యం కొలత జరుగును. ఆ రోజు అమ్మవారికి బియ్యం కొలచి ముడుపు కడితే నాలుగవ రోజు అమ్మవారి మహిమ వల్ల రెట్టింపు అవుతాయని భక్తుల విశ్వాసం. ఐదవ రోజున అనగా పున్నమి రోజున అమ్మవారి తిరునాళ్ళ ఉత్సవములు చేస్తారు. ఈ ఉత్సవములో ముఖ్యమైనది సిడిమాను(సిరిమాను) ఉత్సవము. ఈ ఉత్సవములో అమ్మవారి సిడిమానుక రైతులు తమ పొలాల్లో పండించిన గుమ్మడి కాయలు, సొరకాయలు, ఇతర ధాన్యాలు కడతారు. పూర్వపు రోజులలో అమ్మవారి దేవాలయం నందు జంతు బలులు జరిగేవి. ప్రస్తుతం ఎండోమెంట్స్ డిపార్ట్‌మెంట్స్ అధికారులు వన్యప్రాణి సంరక్షణ చట్టం కిందదీనిని నిషేధించినారు.

## అమ్మవారి మహిమలు కోకొల్లలు

1826 ప్రాంతమున శిస్తువసూలు నిమిత్తం (మిగతా 199వ పేజీలో)

## ఆదిపరాశక్తి స్వరూపిణి శ్రీ పాత పాటేశ్వరి అమ్మవారు



శ్రీ పాత పాటేశ్వరి అమ్మవారు

(198వ పేజీ తరువాయి)

గురజాల వచ్చిన అప్పటి గుంటూరు జిల్లా కలెక్టర్ ఓక్స్ దొర అమ్మవారి దేవాలయమును అధికార నిర్లక్ష్యముతో దేవాలయ ప్రాంగణం లోనే బస చేసి తన గుర్రాలను కట్టివే శాడు. ఆ గుర్రాలన్నీ కింద పడి గిలగిల తన్నుకోగా అప్పటి దేవాలయ సిబ్బంది ఇదంతా అమ్మవారి ఆగ్రహంతో జరిగిన దనీ, వెంటనే క్షమాపణ వేడుకొని నమ స్కరించినట్లయితే మరలా తమ గుర్రా లన్నీ యధాస్థితి పొందుతాయని చెప్పారు. ఆ కలెక్టరు అపరాధాన్ని మన్నించమని వేడుకుంటే అప్పుడు ఆ గుర్రాలన్నింటికి స్వస్థత చేకూరినట్లు అప్పుడు ఆ ఓక్సు దొర సంతోషముతో అమ్మవారికి 40 ఎకరాల భూమిని ఇనా ముగా ఇచ్చినట్లు దేవాలయములోని శాసనము ద్వారా తెలుస్తున్నది. ప్రతి సంవత్సరం జరుగు శరన్నవరాత్రు లలో అమ్మవారికి జరుగు పూజలు ఎంతో ప్రసక్తమైనవి. ఈ దేవాలయంలో అమ్మవారికి లలితా సహస్రం, లక్ష్మీ సహస్రం, త్రిశతి ఖడ్గములతో పూజలు జరుపుదురు. శ్రీ పాతపాటేశ్వరి అమ్మ వారి దేవాలయము పల్నాడులోనే చాలా విశిష్టమైనదని పల్నాటి వాసులు చెప్పుకుంటారు.

# రూ.30 కోట్లతో కూచినపూడి నియోజకవర్గ అభివృద్ధి

## రాష్ట్ర మంత్రి మోపిదేవి వెంకటరమణరావు



(ఆన్‌లైన్ - రేపల్లె)

కూచినపూడి నియోజకవర్గంలో వున్న రోడ్లను కోట్లాదిరూపాయలు వెచ్చించి శాశ్వత ప్రాతిపదికపై రోడ్ల నిర్మాణం చేపడుతున్నట్లు రాష్ట్ర మౌళిక సదుపాయాలు, ఓడరేవులు, విమానయాన, సహజవాయువు, పెట్టుబడుల శాఖమంత్రి మోపిదేవి వెంకటరమణరావు తెలిపారు. ఈసందర్భంగా మంత్రి మోపిదేవి 'ఆన్‌లైన్'తోమాట్లాడారు. కూచినపూడి నియోజకవర్గంలో ఈమూడున్నరేళ్ళ కాలంలో 30కోట్లతో అభివృద్ధి పనులు చేపట్టినట్లు ఆయన వివరించారు.

అదేవిధంగా కూచినపూడి నియోజకవర్గంలో రేపల్లె మెయిన్ డ్రెయిన్, భట్టిప్రోలు మెయిన్‌డ్రెయిన్‌లకు సుమారు వందకోట్ల రూపాయలు మంజూరయ్యాయని, కాగా ఇరిగేషన్ కెనాల్స్‌కు సుమారు వందకోట్ల రూపాయలు ఆధునీకరణలో భాగంగా మంజూరయ్యాయని వీటికి త్వరలో టెండర్లు పిలుస్తారని ఆయన వివరించారు. రేపల్లె-నగరం, వయా ముత్తుపల్లి రోడ్డు నిర్మాణానికి టెండర్లు ఖరారయ్యాయన్నారు. నగరం-చీరాల రోడ్డు నుంచి వయా పెనుమూడి వరకు కోటి 30లక్షలతో టెండర్లు ఖరారయ్యాయన్నారు. సజ్జావారిపాలెం నుంచి నిజాంపట్నం వరకు కోటి 30లక్షలతో రోడ్డు నిర్మాణం చేపడుతున్నట్లు ఆయన వివరించారు. కోనఫలం ఆర్ అండ్‌బి నుంచి కళ్ళీఫలం వరకు 80లక్షల రూపాయల నిధులు మంజూరయ్యాయన్నారు. సజ్జావారిపాలెంనుంచి నగరం వరకు గల రోడ్డు నిర్మాణానికి 16కోట్లు ప్రతిపాదనలు పంపించామన్నారు. రేపల్లె మండలం తుమ్మల-గంగడిపాలెం గ్రామాల్లో కోటి 30లక్షలు, పెనుమూడి నుంచి లంకెవానిదిబ్బ రోడ్డు, తుమ్మల-కైతేపల్లి రోడ్డుకు 80లక్షలు నిధులు మంజూరయ్యాయన్నారు. ఇరిగేషన్‌కు సంబంధించిన పంటకాల్వల అభివృద్ధితోపాటు కాల్వల లైనింగ్ నిర్మాణానికి పదికోట్లనిధులు మంజూరయ్యాయన్నారు. ఈసందర్భంగా కూచినపూడి నియోజకవర్గ అభివృద్ధికి నిరంతరం సహకరిస్తున్న కాంగ్రెస్‌పార్టీ నాయకులు, అధికారులు, అనధికారులకు, ప్రజాప్రతినిధులకు మంత్రి మోపిదేవి వెంకట రమణరావు ప్రత్యేక కృతజ్ఞతలు తెలియచేశారు. రంజాన్, దసరా దీపావళి, క్రిష్టమస్ పండుగ శుభాకాంక్షలు తెలియచేశారు.













# వందకోట్లకుపైగా నియోజకవర్గ అభివృద్ధికి కృషి

## రేపల్లె ఎమ్మెల్యే దేవినేని మల్లికార్జునరావు



(ఆన్‌లైన్ - రేపల్లె)

రేపల్లె నియోజకవర్గ అభివృద్ధికి తెనాలి పార్లమెంటు సభ్యుడు వల్లభనేని బాలశౌరి సహకారంతో ఈమూడున్నర సంవత్సరాల కాలంలో వందకోట్లకు పైగా అభివృద్ధి పనులు చేపట్టినట్లు రేపల్లె ఎమ్మెల్యే దేవినేని మల్లికార్జున రావు ఆన్‌లైన్‌కు తెలిపారు. డ్రెయిన్లు, ఇరిగేషన్ కెనాల్స్ ఆధునీకరణలో భాగంగా రేపల్లె నియోజకవర్గానికి 175కోట్లతో త్వరలో టెండర్లు పిలువను న్నారని ఆయన చెప్పారు. అదేవిధంగా వెల్లటూరు-పెనుమూడి డబుల్‌రోడ్డు నిర్మాణానికి 12.5కోట్ల రూపాయలు, భట్టిప్రోలు-వెల్లటూరు కాల్వకట్ట రోడ్డు నిర్మాణానికి కోటి 24లక్షలతో టెండర్లు ఖరారు చేసినట్లు ఆయన వివరించారు. వెల్లటూరు చినరేవుపై తొమ్మిది లంకగ్రామాల ప్రజల సౌకర్యం కోసం 3కోట్ల 50లక్షలు ఆర్ అండ్ బి నాబార్డు నిధులు మంజూరయ్యాయని ఆయన తెలిపారు. వీటికి డిజైన్లు రూపొందిస్తున్నారన్నారు. కోటి 24లక్షలతో డ్రెయిన్‌ల పనులు చేపడుతున్నట్లు ఆయన వివరించారు. మోర్లవారిపాలెం నుంచి పేటేరు మీదుగా రావి అనంతవరంకు సిమెంటు, తారురోడ్డు నిర్మాణానికి కోటి 60లక్షలు నాబార్డు నిధులు మంజూరయ్యాయని, త్వరలో పనులు చేపడతామన్నారు. వెల్లటూరునుంచి వయా కిష్కిందపాలెం తారు రోడ్డుకు నాబార్డు నిధులు 90 లక్షలు మంజూరయ్యాయని తెలిపారు. డ్రైనేజ్ సౌకర్యాన్ని కల్పిస్తానని ఎన్నికల్లో చేసిన వాగ్దానాన్ని నెరవేర్చటానికి కోటి 50లక్షలతో రేపల్లె పట్టణంలో ఓల్డ్‌టౌన్‌నుంచి అక్కిలేరువరకు డ్రెయిన్‌ను నిర్మిస్తున్నట్లు ఆయన తెలిపారు. 50లక్షలతో రింగురోడ్డునుంచి రాజ్యలక్ష్మి థియేటర్ వరకు సిమెంటు రోడ్డు నిర్మాణం చేపడుతున్నట్లు ఆయన వివరించారు. రేపల్లె నియోజకవర్గంలో అధికసంఖ్యలో ఇందిరమ్మపక్కాగృహాల నిర్మాణం, ఫించన్ల పంపిణీ చేసినట్లు ఆయన తెలిపారు.

రేపల్లె పట్టణంలో ఈమూడేళ్ళన్నరేళ్ళల్లో అదనంగా మూడువేల రేషన్‌కార్డులు మంజూరు చేశామన్నారు. అదేవిధంగా 30 ఎకరాల నివేశనస్థలాల పట్టాలు మంజూరు చేసేందుకు స్థలసేకరణ చేపడుతున్నామన్నారు. నియోజకవర్గ సర్వతోముఖాభివృద్ధికి అహర్నిశలు కృషి చేస్తున్న తెనాలి పార్లమెంటు సభ్యుడు వల్లభనేని బాలశౌరి, నియోజకవర్గంలోని వివిధ శాఖల అధికారులు, అనధికారులకు కాంగ్రెస్ నాయకులకు, అభిమానులకు ఎమ్మెల్యే దేవినేని ప్రత్యేక కృతజ్ఞతలు తెలియచేశారు. ఈసందర్భంగా నియోజకవర్గంలోని కాంగ్రెస్‌పార్టీ కార్యకర్తలు, నాయకులు, సర్పంచ్‌లు, ఎంపిటిసిలు, అభిమానులకు ఎమ్మెల్యే దేవినేని రంజాన్, దసరా, దీపావళి, క్రిష్టమస్ శుభాకాంక్షలు తెలియచేశారు.

# పల్నాటి వీరుల స్మృతి చిహ్నం

# వీర్ల ఆలయం

(ఆన్‌లైన్, కారంపూడి)

పల్నాడు అనే పదంవినగానే పౌరుషం పుట్టుకొస్తుంది. 12వ శతాబ్దంలో జరిగిన యుద్దానికి ప్రతీకగా కారంపూడిలో నేటికీ చిహ్నాలు నిలిచివున్నాయి. ఆనాటి యుద్ధంలో మరణించిన 66 మంది వీరనాయకులకు గుర్తుగా బ్రహ్మనాయుడు నిర్మింపజేసిన వీర్లదేవాలయం నేటికీ అంతే వుంది. ఎన్నిప్రభుత్వాలు మారినా దేవాలయంపై నిర్లక్ష్యనీడలు నిలువెత్తున కనిపిస్తున్నాయి. సుమారు 20 సంవత్సరాలక్రితం ఈవీర్ల దేవాలయాన్ని దేవాదాయశాఖ తన ఆధీనంలోకి తీసుకుంది.

దీనిని ఆధునీకరంచి ప్రతి ఏడాదివచ్చే వీరాచారవంతులకు తగు నీడను కల్పించే భవనాలు నిర్మిస్తారని, దేవాలయం చుట్టూ పెద్దప్రహరీ ఏర్పాటు చేస్తారని, పీఠాధిపతికి ఆశ్రమం నెలకొల్పుతారని ఇక్కడి ప్రజలు విశ్వసించారు. కానీ అదంతా అడియాశే అయింది. ఏప్రభుత్వం పల్నాటి వీరుల దేవాలయాన్ని అభివృద్ధి చేయాలనే తలంపు చేయకపోవటం ఇక్కడి ప్రజల దురదృష్టమే. ప్రపంచంలో వీరులకు ఉత్సవాలు జరిపేది గ్రీకు దేశం తర్వాత ఆంధ్రప్రదేశ్‌లోని కారంపూడే. అంతటి ఘనచరిత్ర కలిగిన దేవాలయాన్ని ప్రభుత్వం నిర్లక్ష్యం చేయటం పల్నాటి ప్రజల మనోభావాలను దెబ్బతీస్తున్నాయి. ఎన్నేళ్లు గడిచినా దేవాలయ పరిస్థితి ఇంతేనా అని వీరాచారవంతులు ప్రశ్నించి నిరసన వ్యక్తం చేయటం ఇక్కడ పరిపాటిగా మారింది.

## అయిదురోజుల ఉత్సవాలు

ప్రతియేడాది కార్తీక అమావాస్యనుండి 5రోజులపాటు జరిగే ఉత్సవాలకు 11 జిల్లాలనుంచి వీరాచారవంతులు తరలివస్తారు. వారికి నీడకల్పించే సత్రం గదులు శిథిలావస్థకు చేరి వంటచేసుకునే గూళ్లుగా మారిపోయాయి. ఉత్సవాల సమయంలో వీరాచారవంతులు నాగులేటి ఒడ్డునే నివశించటం, నిద్రిస్తారు. అనేకమంది వస్తువులు పోగొట్టుకొన్న సంఘటనలు కోకొల్లలు. సత్ర నిర్మాణం చేపట్టవలసిన ప్రభుత్వం కేవలం ప్రేక్షకపాత్ర వహించటం శోచనీయం.



వీర్లదేవాలయ ముఖద్వారం

## గంగధార మడుగు ప్రత్యేకత

కాశీలోని మణికర్ణిక నదితో నాగులేరులోని గంగధార మడుగును శ్రీనాథకవి పోల్చినట్లు చరిత్ర తెలుపుతుంది. పల్నాటి యుద్ధానంతరం బ్రహ్మనాయుడు గుత్తికొండ బిళంలోకి గంగధార మడుగునుండే తపస్సుకు వెళ్లాడని శ్రీనాథకవి తెలిపాడు. అటువంటి పవిత్రమైన గంగధార మడుగులో వీరాచారవంతులు తమ ఆయుధాలను స్నానమాచరింపజేసిన తర్వాతనే ఉత్సవాలకు బయల్దేరతారు. ఆమడుగకి నేటికీ స్నానఘట్టాలుకూడా నిర్మించకపోవటం పాలకుల నిర్లక్ష్యానికి అద్దం పడుతుంది. ఇంకా ఆనాటి కోటబురుజు, బ్రహ్మనాయుడు మేడ, కన్నమదాసుమేడ, బ్రహ్మనాయుడు కత్తితో కొండను నరికి మార్గము చేసిన గుర్తులు కనుమరుగయ్యే పరిస్థితి నెలకొంది.

(మిగతా203లో)

# పల్నాటి వీరుల స్మృతి చిహ్నం

(202 తరువాయి)

## పరిరక్షణ కమిటీ ఎక్కడ ?

ఇటీవల పల్నాటి ప్రాంత ఎమ్మెల్యేలు పరిరక్షణ కమిటీని ఏర్పాటుచేశారు. పల్నాటి యుద్ధసమయంలోని చారిత్రక ఆధారాలను భావితరాలవారికి అందించటానికి తగిన జాగ్రత్తలు చేపట్టకపోవటంతో అవి కాలగర్భంలో కలిసిపోతున్నాయి. పరిరక్షణ కమిటీ కేవలం విగ్రహాల ప్రతిష్టకేనా అన్న అనుమానాలు ప్రజల్లో రేకెత్తాయి. చారిత్రక ఆధారాలను కనుమరుగుకాకుండా తగుచర్యలు పరిరక్షణ కమిటీ చేపట్టాలని ప్రజలు కోరుతున్నారు.



వీర్లదేవాలయ ప్రాంగణం




పల్నాటి చరిత్ర తెలిపే బోర్డు



శిథిలావస్థకు చేరిన సత్రం గదులు

# మోటారు వాహన చట్టం నిబంధనలివీ...

(ఆన్‌లైన్-బాపట్ల)
ట్రాక్టర్, టేలర్ యాజమానులకు మోటారు వాహానాల చట్టం గురించి అవగాహన అవసరమని బాపట్ల మోటారు వాహానాల తనిఖీ అధికారి జి.ఆదినారాయణ పేర్కొన్నారు. 'ఆంధ్రజ్యోతి' ప్రచురించే ప్రత్యేక సంచికకు ఆయన ఇంటర్వ్యూ ఇచ్చారు.

2007 ఆంధ్రప్రదేశ్ రవాణాశాఖల ట్రాక్టర్, టేలర్ విధానం 1.24కిలో మీటర్ల ట్రాక్టర్, టేలర్ పద్ధతి, దీని ప్రకారం ట్రాక్టర్, టేలర్ ఎలాంటి పన్ను రవాణాశాఖకు చెల్లించ నవసరం లేదు. ఫిట్‌నెస్, పర్మిట్ అవసరం లేదు. డ్రైవర్‌కు బ్యాడ్జిలేని ట్రాక్టర్, టేలర్ డ్రైవింగ్ లైసెన్స్ ఉంటే సరిపోతుంది. ప్రతి ఏడాది తప్పునిసరిగా ఇన్సూరెన్స్ కట్టాలి. ఈ రకం ట్రాక్టర్, టేలర్ యాజమాని అడ్రస్ నుండి 24కిలో మీటర్ల పరిధిలోవ్యవ యోత్పత్తులను పొలం నుంచి ఇంటికి, ఇంటి నుంచి మార్కెట్‌కు అదే జిల్లాలో సొంత పనుల నిమిత్తం తిరగాలి గానీ కిరాయికి తిరగరాదు. ఒక వేళ కిరాయికి తిరిగి నప్పుడు తనిఖీ అధికారి కేసురాస్తే కమర్షియల్ ట్రాక్టర్, టేలర్‌గా పన్ను,పెనాల్టీ, అపరాధ రుసుం చెల్లించాల్సి వుంటుంది. ఈ రకం ట్రాక్టర్ కిరాయి దుక్కి దున్నరాదు. లేదా దమ్ముకూడా చేయరాదు. ఇసుక, కంకర, ఇటుక వంటి వాటిని సొంతానికి కూడా తోలరాదు. కావున యజమానులు ఆలోచించి కమర్షియల్‌గా రిజిస్టర్ చేయించుకోవడం వలన లాభం కలుగుతుందని అన్నారు.

### మూడు నెలలకు మూడు వందల పన్ను

ఈ రకం ట్రాక్టర్, టేలర్ యజమాని తన వ్యవసాయ ఉత్పత్తులను అదే జిల్లాలో లేక ఆంధ్రప్రదేశ్‌లో వేరే జిల్లాలోగాని ఈ వాహనం ద్వారా రవాణా చేయవచ్చును. ఈ రకం ట్రాక్టర్, టేలర్ రిజిస్ట్రేషన్ ఒక రైతుకు ఒక జిల్లా కంటే ఎక్కువ జిల్లాలలో పొలం ఉన్నప్పుడు చేయించుకోవాలి. ఈ రకం వాహనానికి ఏప్రిల్ ఒకటవ తేదీ నుంచి మరుసటి ఏడాది మార్చి 31వ తేదీ వరకు వున్న 12 నెలలకు నాలుగు క్వార్టర్లుగా విభజింపబడుతుంది. ఒక్కొక్క క్వాటర్‌కు 300 రూపాయల చొప్పున రవాణాశాఖకు పన్ను చెల్లించాల్సి ఉంటుంది.

### కమర్షియల్ ట్రాక్టర్, టేలర్

ఈ రకం ట్రాక్టర్, టేలర్ యజమాని తన సొంత పనులకు ఇటుక, కంకర లాంటి కమర్షియల్ వస్తువులను, వ్యవసాయ ఉత్పత్తులను సొంతానికి లేక కిరాయికి లేక రివార్డుకు ఆంధ్రప్రదేశ్‌లో ఎక్కడైన నడుపవచ్చును. రిజిస్ట్రేషన్ నెంబరును ఈ రకం ట్రాక్టర్ టేలర్ మీద పసుపు రంగు మీద నలుపులో రాయించాలి.

### డ్రైవర్లకు సూచనలు

డ్రైవర్‌కు తప్పునిసరిగా డ్రైవింగ్ లైసెన్స్ ఉండాలి. డ్రైవింగ్ లైసెన్స్ లేని డ్రైవర్ ట్రాక్టర్ లేక టేలర్ నడుపుతున్నప్పుడు ప్రమాదం జరిగితే ఇన్సూరెన్స్ కంపెనీ క్లయిమ్ ఇవ్వడానికి నిరాకరిస్తాయి. ట్రాక్టర్,టేలర్ టేపురికార్డును రోడ్డు మీద వాడరాదు. కానీ పొలంలో పనిచేస్తున్నప్పుడు తక్కువ సౌండ్‌లో వాడుకోవాలి. సింగిల్ లైట్‌ను రాత్రి వేళల్లో రోడ్లమీద గాని, పొలంలో పనిచేస్తున్నప్పుడు అవసరమైనప్పుడు వాడాలి. విభజించడానికి వీలుకాని వస్తువులను తీసుకెళ్ళునప్పుడు మాత్రమే టేలర్ డోర్‌లను విప్పాలి.

(మిగతా 205లో)

# మోటారు వాహన చట్టం

(204వ పేజి తరువాయి)

టైలర్ నుంచి బయటకు వచ్చిన భాగం, చివరిలో పగలు, రాత్రిలో ఎరుపు బల్బు లేదా ఎర్రటి వస్తువును కట్టాలి. ట్రాక్టర్, టేలర్ యజమానులు తమ వాహనాలను వివాహాలకు జనాలను తీసుకెళ్ళేందుకు, తీర్థయాత్రలకు యాత్రికులను తీసుకెళ్ళేందుకు ఉపయోగించరాదు. కూలీల కోసం అయిదుగురికి రవాణాశాఖ అనుమతి ఇచ్చుటకు చట్ట ప్రకారం అవకాశం వుంది. కనుక అనుమతి తీసుకొన వలెను. దమ్ము చక్రాలను బద్ధకముతో ట్రాక్టర్‌కు తగిలించి రోడ్డు పై ట్రాక్టర్ని నడుపరాదు. ఒక యజమాని ట్రాక్టర్ వేరేవారి టేలర్‌ను రవాణాశాఖ అనుమతి లేకుండా వాడటం మంచిదికాదు. టేలర్ ఛాసిస్ నెంబరును టేలర్ తయారుదారుడు ప్లేటుమీద పంచింగ్ చేసి టేలర్ ముందు డోర్‌మీద రివిటింగ్ చేస్తాడు. సిగ్నల్‌లైట్లు, ట్రాక్టర్, టేలర్ వాహన యజమాని వీటి గురించి పట్టించుకోనందున ఎక్కువ ప్రమాదాలు జరుగుతున్నాయి. ట్రాక్టర్‌మీద వున్న హెడ్‌లైట్‌కు, సిగ్నల్‌లైట్‌కు ఐరన్ గిల్స్ బిగించాలి. రోడ్డు పక్క ట్రాక్టర్,టేలర్‌లేక రెండింటిని వదలటం వలన రోడ్డు ప్రమాదాలు జరగవు, ట్రాక్టర్‌కు ఏదైనా టేలర్‌ని వాడేముందు ఈ ప్రాంత ఆర్టీఓ కార్యాలయంలో తగిన పత్రాలు నింపి, తగిన రుసుం చెల్లించి ట్రాక్టర్ ఆర్‌సీ బుక్, టేలర్ ఆర్‌సి బుక్ పుస్తకంలో రాయించిన తర్వాతనే వాడాలి. ఏ వాహన యజమాని గాని, ఓరిజనల్ రికార్డులు జిరాక్స్ కాఫీలను అటెస్టెడ్, నోటరి చేసిన ఒక సెట్‌ను ఇంటిలో వుంచి ఓరిజనల్ రికార్డులను వాహనంలో ఉంచాలి. డ్రైవర్ మద్యం సేవించి వాహనం నడిపితే ఆరు నెలల జైలుశిక్ష ఉంటుందని అన్నారు. సోమ,బుధ,శుక్రవారాలలో బాపట్ల పటేల్‌నగర్ మొదటి లైన్‌లో ఉదయం నుంచి సాయంకాలం వరకు డ్రైవర్లకు అవగాహన సదస్సులు నిర్వహిస్తున్నామని డ్రైవర్లు ఈ సదస్సుల్లో పాల్గొని విషయాలు తెలుసుకోవాలని బాపట్ల మోటారు వాహనాల తనిఖీ అధికారి జి.ఆదినారాయణ విజ్ఞప్తి చేశారు.

# పెదనందిపాడు అరుణ కిరణం

# పీడితపక్షమే నిరంతరం

(ఆన్‌లైన్-పెదనందిపాడు)

భారతదేశ స్వాతంత్ర్య సముపార్జనలో పన్నుల నిరాకరణ ఉద్యమం ద్వారా స్వర్గీయ పర్వతనేని వీరయ్య చౌదరి పెదనందిపాడుకు బ్రిటిష్ పార్లమెంటులో గుర్తింపు తీసుకురాగా పీడిత ప్రజల విముక్తికి కమ్యూనిస్ట్ ఉద్యమమే పరిష్కారమంటూ 70 సంవత్సరాలకు పైగా కృషి ఆంధ్ర కమ్యూనిస్ట్ భీష్మునిగా పేద బడుగు వర్గాలచే కొనియాడుతూ రాజకీయంగా పెదనందిపాడుకు గుర్తింపు తెచ్చిన వ్యక్తి స్వర్గీయ కామ్రేడ్ కొల్లా వెంకయ్య. కామ్రేడ్ కొల్లా వెంకయ్య కొల్లా కిష్టమ్మ-రత్తయ్య దంపతులకు1908 జులై 19న పెదనంది పాడులో జన్మించారు. జాతీయోద్యమంలో రవి అస్తమించని బ్రిటీష్ సామ్రాజ్యానికి వ్యతిరేకంగా సాగిన చారిత్రాత్మక పన్నుల నిరాకరణ ఉద్యమంలో బాల్యంలోనే కొల్లా పాల్గొని పెదనందిపాటి అరుణకిరణంగా తన ఉనికిని చాటి చెప్పారు. 1928లో జాతీయ కాంగ్రెస్ పార్టీ కార్యకర్తగా లావు అంకమ్మ లాంటి పెద్దలకు చేదోడు వాదోడుగా పనిచేసి జాతిపిత మహాత్మాగాంధీని పెదనందిపాడుకు తీసుకొని వచ్చి ప్రజలను ఉద్యమం వైపు చైతన్య పర్చుటకు కృషి చేశారు. 1929లో రాజమండ్రి సీతానగరం కాంగ్రెస్‌కు వాలంటీరుగా, 1934లో బాంబే జాతీయ కాంగ్రెస్ సమావేశానికి డెలిగేట్‌గా వెళ్ళి ఈ ప్రాంతానికి ఆయన రాజకీయ గుర్తింపు తెచ్చారు. 1934 నుంచి 1936వరకు గుంటూరు ఎ.సి.కళాశాలలో బిఎ చదువుతూ



కామ్రేడ్ కొల్లా వెంకయ్య

కమ్యూనిస్టు సాహిత్యంతో పరిచయం పెంచుకొని 1936నుండి రాజకీయ మార్పుతో కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాణానికి నడుం కట్టారు. నాటి నుంచి పేద, బడుగు వర్గాల రైతు కూలీల సమస్యలపై అధ్యయనం చేస్తూ పీడిత రైతాంగ ఉద్యమాలకు ఆయన నిర్వహించారు.

(మిగతా 208లో)

# పొదుపు రంగాన ప్రగతి
# కాకుమాను మహిళల కీర్తి

(ఆన్‌లైన్-బాపట్ల)

పరస్పరం సహకారం సంపూర్ణంగా వుంటే మహిళా ఆర్థిక స్వావలంబన సాధించడం కష్టతరం కాదని అక్షరాలా రుజువు చేస్తున్నారు గుంటూరు జిల్లా కాకుమాను గ్రామ మహిళలు. ఒక మహత్తర ఆశయంతో, మహిళల్లో బృహత్తర మార్పుకోసం వారిలో పొదుపు రంగాన చైతన్యవంతుల్ని చేసే కృషిలో ఆవిర్భవించిన 'తేజస్వి' మహిళా పరస్పర సహాయక సహకార పొదుపుసంఘం మహిళల్లో మణిదీపంలా వెలుగులు నింపుతోంది. నెల్లూరులోని 'పొదుపులక్ష్మి' సంఘం సహకార వ్యవస్థలో సాధిస్తున్న అద్భుత ఫలితాలు ఇక్కడి మహిళల్ని ఉత్తేజితుల్ని చేశాయి. దీంతో కొందరు మహిళలు సమావేశమై ఆలోచన చేసి వెంటనే ఆచరణలో పెట్టారు. అప్పట్లో జరుగుతున్న నాలుగో విడత మహిళా



తేజస్వి మహిళా పరస్పర సహాయ పొదుపు సహకార సంఘం కార్యాలయం

జన్మభూమి వీరి ఆశయానికి మరింత ఊతమిచ్చింది. 1999వ సంవత్సరం మే 25న సంఘాన్ని ఆవిష్కరించి కాకుమాను పరిసర ప్రాంత మహిళల్ని భాగస్వాముల్ని చేశారు. శ్రీమతి తరిగోపుల అమరేశ్వరి అధ్యక్షురాలు. మరో ఎనిమిది మంది పాలకవర్గ సభ్యులతో తేజస్వి పొదుపుసంఘం ప్రారంభమైంది. కేవలం 15 డ్వాక్రా గ్రూపుల్ని ఇందులో విలీనం చేశారు. కాకుమాను ప్రాంతంలోని 18 గ్రామాల మహిళలకు ఇందుకు ప్రాతినిధ్యం కల్పించారు. సంఘ అధ్యక్షురాలుగా వున్న అమరేశ్వరి ప్రాథమిక స్థాయిలో కూడా విద్యనభ్యసించక పోయినా పొదుపు రంగంలో అంచలంచెల అనుభవంతో ముందుకు సాగుతున్నారు. నవంబరు 30, 31 తేదీల్లో ఢిల్లీలో జరిగిన మైక్రో ఫైనాన్స్ మూడవ జాతీయ సదస్సులో పాల్గొన్న సంఘ అధ్యక్షురాలు అమరేశ్వరి పనితీరు, ప్రస్తుతం ఆమెకున్న మాటతీరు పరిశీలిస్తే పొదుపు ఉద్యమంలో ఆమె చేసిన కృషి, కార్యదక్షత కనిపిస్తోంది. ఈ సంఘం సభ్యులు పొదుపులో కనబరుస్తున్న తపన, లక్షసిద్ధిలో సభ్యుల ఆశయసాధన నిరంతరం కనిపిస్తుంది. 167 గ్రూపుల్లో మొత్తం ప్రస్తుతం 2,340 మంది సభ్యులతో సంస్థ కార్యకలాపాలు నిర్వహిస్తోంది. సుమారు 75లక్షల టర్నోవర్‌తో మహిళా పొదుపు సంఘంలో ఏకైక అగ్రగామి సంస్థగా నిలిచింది. ఈ టర్నోవర్‌ను మరింత పెంచే దిశగా ప్రణాళికను రూపొందిస్తున్నారు. వాణిజ్య బ్యాంకులు పావలాకు ఇచ్చే రుణాల్ని తమ సంస్థకు ఇవ్వాలని సంఘ సభ్యులు చేస్తున్న ఆలోచన అమలు జరిగితే ఈ సంస్థ తిరుగులేని పురోగతి సాధించే అవకాశాలు ఉన్నాయి. మహిళా సాధికారత సాధనలో భాగంగా, పటిష్టమైన మూలధన సమీకరణతో మహిళలకు నిరంతరం పరపతి సౌకర్యాన్ని కల్పిస్తూ ఆర్థిక సేవల్ని విస్తృత పరిచే దిశలో ఎనిమిది సంవత్సరాలుగా సంస్థ మహిళాభ్యున్నతికి అవిరళ కృషి చేస్తుంది. సంస్థ మరింత పురోగమన దిశలో తీసుకెళ్ళేందుకు చేపట్టాల్సిన చర్యల్ని సమీక్షించేందుకు రాష్ట్రంలోని పలు ప్రాంతాల్లో మహిళా పొదుపు ఉద్యమాల పనితీరు నిత్యం దృష్టి సారిస్తూ ఇక్కడి మహిళల్ని చైతన్యవంతుల్ని చేస్తున్నారు. సంస్థ అధ్యక్షురాలైన శ్రీమతి తరిగోపుల అమరేశ్వరి ఈ సంస్థ ఒక మహోన్నత లక్ష్యంతో పనిచేయాలనేదే తమ అభిమతమని పేర్కొన్నారు.

సంస్థ గురించి ఆమె ఆలోచన విధానం, పొదుపు ఉద్యమంలో మహిళల భాగస్వామ్యం గురించి ఆమె చెప్పిన వివరాలు మాటల్లోనే.. సామాజిక, ఆర్థిక స్థితిగతులు చిన్నాభిన్నమై నిరాదరణకు గురయ్యే మహిళలకు చేయూత నివ్వాలనే ఆలోచన ఉండేది. పొదుపులో మహిళల్ని భాగస్వాముల్ని చేయడంలో చంద్రబాబు నాయుడు ప్రవేశపెట్టిన పథకాలు, డ్వాక్రా సంఘాల పనితీరు ఎంతో నచ్చింది. దీంతో నాకంటూ ఆలోచన రావడం, దీనికి మిగతా మహిళలు కూడా కలసి రావడం నేడు ఈ ఉన్నత స్థితికి రావడానికి దోహదపడింది. మీ వల్ల ఏమవుతుందని కొందరు, ఏలా చేస్తారని మరి కొందరు రకరకాలుగా నిరాశకు గురిచేసిన సందర్భాలు ఉన్నాయి. దీన్ని చాలెంజ్‌గా తీసుకొని ముందు కెళ్ళాము. ఆశించిన లక్ష్యాన్ని సాధించాము. ఇంకా సాధిస్తాము. శిధిలమైన పంచాయతీ భవనంలో సంస్థ కార్యకలాపాల్ని కొనసాగిస్తూ వచ్చాము. డాక్టర్ కోటేశ్వరరావు ఇచ్చిన 25 సెంట్ల స్థలంలో సంస్థ సొంత భవనాన్ని నిర్మించేందుకు కృషి జరుగుతుంది. జిల్లా పరిషత్ ద్వారా మూడు లక్షలు, ఎన్నార్ఐ ద్వారా మరో రెండు లక్షలు సంస్థ అభివృద్ధికి, సొంత భవన నిర్మాణానికి (మిగతా 207వ పేజీలో)



అధ్యక్షురాలు
తరిగోపుల అమరేశ్వరి



































# ఉత్తరవాహిని ఈ చంద్రవంక

(ఆన్‌లైన్, మాచర్ల)

ఉత్తరవాహినిగా ప్రవహిస్తున్న చంద్రవంక 13వ శతాబ్దానికి పూర్వమే ఏర్పడినట్లు చరిత్ర చెబుతోంది. అన్ని నదులు పడమర నుండి తూర్పుకు ప్రవహిస్తుండడం సహజం. అయితే ఒకప్పుడు జీవనదిగా భాసిల్లిన చంద్రవంక మాత్రం దక్షిణం నుండి ఉత్తర దిక్కుకు ప్రవహిస్తోంది. అత్యంత పుణ్యతీర్థంగా భావించడం వల్లే కార్త వీర్యార్జునుడు ఈ ప్రాంతంలో శ్రీ లక్ష్మీచెన్నకేశవుని ఆలయాన్ని నిర్మించడం జరిగింది. పల్నాటి వీరుడిగా పేరొందిన బ్రహ్మనాయుడు సైతం ఈ చంద్రవంక నదీ తీరంలోనే బస చేసినట్లు ప్రతీతి. నిత్యం ప్రవహించే చంద్రవంక పల్నాటి ప్రాంతంలోని పలు ప్రాంతాలను సస్యశ్యామలంగా వుంచేది. ఆక్రమణలతో కుంచించుకుపోయిన చంద్రవంక కాస్తంత వానొస్తే చాలు కట్టలు తెగిన ఆగ్రహంతో ప్రస్తుతం ఊళ్ళ పై విరుచుకుపడుతోంది.

## కొండలు, గుట్టలు దాటి..

నల్లమల అడవులు, కొండలు, గుట్టల్లో కురిసిన వాన నీరు చంద్రవంక నదిలోకి ప్రవేశిస్తాయి. దుర్గి మండలం కోలగుట్లలోని దంతెవాగు, ముటుకూరులోని జేరుగల్లు వాగు, వెల్దుర్తి మండలం ఉప్పలపాడులోని బొత్తల వాగుల్లోని నీరు ఆత్మకూరు చెరువుకు చేరుకొని అక్కడి నుండి చెంగున దూకి చంద్రవంకలోకి కలుస్తాయి. నీటిని నిల్వ చేసుకొని పొదుపుగా వాడాలనే ఉద్దేశంతో 1902లోనే ఈ ఆత్మకూరు చెరువును బ్రిటీష్ ప్రభుత్వం నిర్మించడం జరిగింది. అప్పట్లో ఆత్మకూరు చెరువు 24 అడుగుల లోయంతో వుండేది.



ఇటీవల కురిసిన వర్షాలకు ఉప్పొంగిన చంద్రవంక

అందువల్లనే ఏడాది పొడవునా చంద్రవంక జీవనదిగా విలసిల్లింది. కాలక్రమంలో ఈ చెరువు పూడికతో పేరుకుపోయి ప్రస్తుతం నాలుగు అడుగులకు పరిమితమైంది. ఫలితంగా నీరు నిలిచేందుకు చోటులేక అలంకారప్రాయంగా మిగిలింది. కాస్తంత వాన కురవగానే పొంగిపొర్లే ఆత్మకూరు చెరువు చంద్రవంక ద్వారా ప్రవహించి ఊరును కబళిస్తోంది.

## దుఃఖదాయినిగా మారిన ...

పురాతన కాలం నుండి అత్యంత పవిత్ర తీర్థంగా వినతికెక్కి ప్రజలకు సిరి సంపదలను అందించిన చంద్రవంక ఐదు దశాబ్దాలుగా మాచర్లకు దుఃఖదాయినిగా మారింది. దీనిద్వారా ముంచెత్తిన వరద 1964లో మాచర్ల పట్టణ ప్రజలకు తీరని విషాదాన్ని మిగిల్చింది. అప్పట్లోనే లక్షలాది రూపాయల ఆస్తి నష్టం ఏర్పడింది. నీట మునిగి వందలాది మంది మృత్యువాతపడ్డారు.

అంతటి తీవ్ర ఉద్రిక్తత ఆ తరువాత లేనప్పటికీ అడపా దడపా ఈ చంద్రవంక కాటేస్తూనే వుంది. 1997, 2001, 2003, 2007 సంవత్సరాల్లో రమారమి పది మందిని బలిగొంది. వందలాది మూగజీవాలు చంద్రవంకలో జలసమాధి అయ్యాయి. ఈ విషాద సంఘటనను ఇప్పటికీ పల్నాటి వాసులు నెమరువేసుకుంటూనే వుంటారు.

## హై లెవల్ బ్రిడ్జి నిర్మించినా...

చంద్రవంక ఉధృతిని తట్టుకునేందుకు ఐదేళ్ళ క్రితం రూ.1.70 కోట్లతో తెలుగుదేశం ప్రభుత్వం ఈ నది పై హై లెవల్ బ్రిడ్జి నిర్మాణాన్ని తలపెట్టింది. ఏడాదిన్నర క్రితం రాష్ట్ర మంత్రి కన్నా లక్ష్మీనారాయణ చేతులమీదుగా ఈ బ్రిడ్జి ప్రారంభానికి నోచుకుంది. అయితే బ్రిడ్జికి కేవలం మూడు ఖానాలే ఏర్పాటు చేయడం వల్ల వరదనీరు ముందుకు వెళ్ళే మార్గం ఇటీవల లోతట్టు ప్రాంతాలను ముంచెత్తింది. చంద్రవంక చుట్టూ వున్న ఆక్రమణలను తొలగించడం, ఆత్మకూరు చెరువు పూడికతీయించడం వంటి చర్యలు చేపడితే మినహా ఈ వరదలు పునరావృతం కావని పలువురు అభిప్రాయపడుతున్నారు.

# పొదుపు రంగాన ప్రగతి

(206వ పేజీ తరువాయి)

నిధులు సమకూరి వున్నాయి. త్వరలోనే ఈ కార్యక్రమానికి శ్రీకారం చుట్టడం జరుగుతుంది. పొదుపు ఉద్యమంతో పాటు, మహిళలకు అన్ని రంగాల్లో చైతన్య వంతుల్ని చేసేందుకు జనశిక్షణా సంస్థ, వికాస్ సర్వీస్ సొసైటీ సంస్థలు వివిధ అంశాల్లో ఇచ్చిన సంపూర్ణ సహకారంతో మహిళల స్థితిగతులు మెరుగుపడ్డాయి. ఆ సహకారం స్ఫూర్తితో మహిళలకు ఉద్పాదక శక్తుల మీద మహిళలకు హక్కులు కల్పించటం ద్వారా వారి జీవన స్థితి గతుల్ని మెరుగుపర్చడం ధ్యేయంగా పనిచేస్తాము. సంస్థ ఆధ్వర్యంలో వృద్ధాశ్రమ ఏర్పాటు చేయాలని నిర్ణయించాము. వివిధ చేతి వృత్తుల ద్వారా మహిళలకు ఉపాధి కల్పించేందుకు శిక్షణా కార్యక్రమాలు చేపట్టనున్నాము. ప్రభుత్వ పరంగా తమ సంస్థకు చేయూత అవసరం. వెలుగు, డిఆర్‌పిఎ ద్వారా అమలు జరిగే పథకాలు మాలాంటి సంస్థలకు కూడా పూర్తి స్థాయిలో వర్తింప చేస్తే మరిన్ని సత్ఫలితాలు సాధిస్తాము. మహిళకు విద్య ఎంత అవసరమో నాకు ఇప్పుడు తెలిసింది. అందుకే నేను చదువుకోలేక పోయినా నా పిల్లల్ని ఉన్నత చదువుల్ని చదివించ గలిగాను. చదువుకోవాల్సిన అవసరాన్ని అనుభవ పూర్వకంగా చెబుతున్నాను. మాతో పాటు మరో అయిదుగురు మహిళలకు ఉపాధి కల్పిస్తున్నాము. ఇతర మండలాలలో సైతం మా బ్రాంచిలు ప్రారంభించాలని పలువురు కోరుతున్నారు. ప్రభుత్వ అధికారుల ప్రోత్సహం మాకు లేదు. కేవలం ఇతర దేశస్థులు, ప్రపంచ బ్యాంకు ప్రతినిధులు వచ్చినప్పుడు మాత్రమే మా సంస్థల గురించి గొప్పగా చెప్పుకుంటారే గాని మాకు సహకరించిందేమి లేదు. 1997లో ఉత్తమ డ్వాక్రా లీడర్‌గా అప్పటి డిఆర్‌డిఎ పిడి ఉదయలక్ష్మి ద్వారా అవార్డు అందుకొన్నాను. అమెరికా అధ్యక్షుడు బిల్‌క్లింటన్‌తో వీడియో కాన్ఫరెన్స్‌లో గుంటూరునుంచి మాట్లాడాము.

# కోస్తా ఆరోగ్య రాజధాని గుంటూరు




గుంటూరు వైద్య కళాశాల

(ఆన్‌లైన్ - గుంటూరు)

కోస్తా ఆంధ్ర జిల్లాల్లో వైద్య సేవలకు గుంటూరు జిల్లా రాజధానిలా భాసిల్లుతోంది. వందేళ్ల చరిత్ర ఉన్న జిల్లాలో తొలినుంచి వైద్య ఆరోగ్య సేవలకు పేరు గాంచింది. ప్రపంచ వ్యాప్తంగా ప్రసిద్ధి చెందిన గుంటూరు మెడికల్ కళాశాల జిల్లా వైద్య రంగానికే తలమానికంగా నిలుస్తోంది. వందేళ్లకు పైగా చరిత్ర ఉన్న సెయింట్ జోసఫ్స్ ఆస్పత్రితోపాటు గుంటూరు ప్రభుత్వ సమగ్రాస్పత్రులు అవిశ్రాంతంగా ఆరు దశాబ్దాలుగా కోస్తా జిల్లా ప్రజానీకానికి నాణ్యమైన వైద్య సేవలందిస్తున్నాయి. ఇటీవల అభివృద్ధి చెందిన ప్రైవేట్ వైద్య రంగం కూడా చెప్పుకోదగిన రీతిలో పురోగతి సాధిస్తోంది.

(మిగతా 209లో)

# పెదనందిపాడు అరుణ కిరణం

(205పేజి తరువాయి)

తెలంగాణా పోరాట కాలంలోకోస్తా ఆంధ్రాలో రైతు కూలి ఉద్యమాలను నిర్మించి భూస్వామ్య వ్యతిరేక పోరాటం నడవటంలో అగ్రభాగాన నిలబడ్డ యోధుడు కొల్లా వెంకయ్య. 1937-38లో అప్పాపురం ప్రాజెక్టు (నేటి అప్పాపురం చానల్) మహాసభలకు రైతుల సమస్యలపై కృషి చేసి 1938లో రాష్ట్ర ఇరిగేషన్ బోర్డు కార్యదర్శిగా నియమింపబడి చానల్, రొంపేరు, డీప్ కట్స్,అభివృద్ధికి చేసిన కృషి ఈ ప్రాంత రైతాంగానికి కరువు పరిస్థితులను నివారించగలిగాయి. 1943-45 జిల్లా రైతు కమిటి కార్యదర్శిగా, 1944-47 వరకు పొగాకు మార్కెట్ యార్డు ప్రెసిడెంటుగా పనిచేసి రైతాంగానికి ఏనలేని సేవలు చేశారు. 1952లో పొన్నూరు శాసనసభ్యునిగా, 1958లో హైదరాబాదు లెసిస్లేటివ్ కౌన్సిల్‌గా పదవులు నిర్వహించారు. 1962లో తెనాలి పార్లమెంటు మెంబరుగా ఆచార్య ఎన్.జి.రంగా పై లక్షా యాభై మూడు వేల మెజారిటీతో గెలుపొంది భారత తొలి ప్రధాని జవహార్‌లాల్ నెహ్రూచే పార్లమెంటులో అభినందనలు పొందటంలో పెదనందిపాడుకు రాజకీయ గుర్తింపును తెచ్చారు. 1962 డిసెంబరులో చైనాను బలపరుస్తున్నారనే నెపంతో ఆయన అరెస్ట్ కాబడిట జైలు జీవితం గడిపి 1963 జూన్‌లో విడుదలయ్యారు. 1968లో సిపిఎం పార్టీ నుండి బహిష్కరణ జరిగింది. మార్కిస్టు, లెనినిస్టు పార్టీ నాయకత్వాన సాగిన నక్సల్బరీ, శ్రీకాకుళం పోరాటాలను బలపరచి నాయకత్వం వహించిన వారిలో కొల్లా ప్రముఖులు

## పత్రికా సంపాదకునిగా

పత్రికలు సమాజ చైతన్యానికి పునాదులు అని నిదర్శనం చేసిన వ్యక్తి కొల్లా. ఎర్రజెండా,ముందుబాట పత్రికలకు సంపాదకునిగా వుండి పీడిత ప్రజలకు విప్లవోద్యమానికి పురికొల్పిన విప్లవ నాయకుడు. భూమి,భుక్తి,స్వేచ్ఛ కోసం అని మార్క్సిజం, లెనినిజం, మావో ఆలోచనా విధానాన్ని నమ్మిన కొల్లా భూ సంస్కరణలు అమలుకొరకు దున్నేవానికే భూమి చెందాలని గుంటూరు జిల్లా కోటప్ప కొండ, సంతరావూరు నిజాంపట్నం, ఈతేరు, రేటూరు, కొండపాటూరు, నరసాయపాలెం, ప్రకాశంజిల్లా జె.పంగులూరు, చందలూరు తదితర గ్రామాల్లో గ్రామీణ పేదల సంఘం నిర్మాణంతో భూపోరాటాలను నిర్మించి భూస్వామ్య వ్యతిరేక వ్యవసాయ విప్లవం కాంక్షించిన కొల్లా వెంకయ్య 28-9-98న స్వర్గస్థులయ్యారు.

## త్యాగనిరతి

పదవులు అడ్డం పెట్టుకొని లక్షలాది రూపాయలు సంపాదించే నేటి రాజకీయ పరిస్థితుల్లో కూడా ఆయన పార్లమెంటు సభ్యునిగా, అసెంబ్లీ సభ్యునిగా, ఎంఎల్‌సి గా పదవులు నిర్వహించి నందుకు ప్రభుత్వం ఆయనకు మంజూరు చేసిన పెన్షన్‌ను బ్యాంకులోనే జమచేసి ఆయన సొంతానికి గాని,కుటుంబానికి గాని వినియోగించకుండా దానిని తనకు పదవిని తెప్పించిన అవిభక్త కమ్యూనిస్ట్ పార్టీకి వినియోగించాలని నిర్ణయించినట్లు ఆయన చెప్పారు. మొత్తం సుమారు రెండు లక్షలు బ్యాంకులోనే వున్నదని, దానిని పార్టీకే వినియోగించాలని అన అభిప్రాయం అని, అన్ని కమ్యూనిస్ట్ పార్టీలను సంయుక్తపరచి ఉమ్మడి కమ్యూనిస్ట్ పార్టీగా అవిర్భవించి చేయాలన్నది తన లక్ష్యం అని ఆయన వెల్లడించారు.

(208పేజి తరువాయి)



# కోస్తా ఆరోగ్య రాజధాని గుంటూరు

మంగళగిరి సమీపంలో ఏర్పాటుచేసిన ఎన్ఆర్ఐ జనరల్ ఆస్పత్రి, చినకోండ్రుపాడులో నెలకొల్పిన కాటూరి మెడికల్ కళాశాలలు గ్రామీణ ప్రజానీకానికి కార్పొరేట్ వైద్యాన్ని అందిస్తున్నాయి. వీటికి సహాయంగా ప్రభుత్వ, ప్రైవేటు రంగాల్లో ఆయుర్వేధం, హోమియో, యునాని ఆస్పత్రులు కూడా తమ ఉనికిని చాటుకొంటూ జిల్లావాసులకు చక్కటి వైద్య సేవలందిస్తున్నాయి. ప్రాధమిక ఆరోగ్య కేంద్రాలు, కమ్యూనిటీ హెల్త్ సెంటర్లు, జిల్లా ఆస్పత్రులు, అర్బన్ హెల్త్ సెంటర్లు కూడా జిల్లా వైద్య ఆరోగ్య రంగంలో తమ వంతు పాత్రను పోషిస్తున్నాయి. రాష్ట్రంలో హైదరాబాద్ తరువాత ఆరోగ్య సేవలకు గుంటూరు ప్రధాన కేంద్రంగా రూపొందింది.

స్వాతంత్ర్యానికి పూర్వం ఏర్పాటుచేసిన గుంటూరు ప్రభుత్వ సమగ్రాస్పత్రి, వైద్య కళాశాలలు జిల్లాకే తలమానికంగా నిలుస్తున్నాయి. 1946 జూన్ 22వ తేదీన ప్రారంభమైన జియంసి, జిజిహెచ్‌లు ఇటీవల 60 వసంతాలు పూర్తి చేసుకొని ఘనంగా గోల్డెన్ జూబ్లీ ఉత్సవాలను జరుపుకున్నాయి. కళాశాలలోని మైక్రో బయాలజీ, పెథాలజీ, అనాటమీ వంటి వైద్య విభాగాలు జాతీయ స్థాయిలో చక్కటి పేరుగాంచాయి. టైఫాయిడ్ రెసిస్టెన్స్‌ను ప్రపంచంలో తొలి సారిగా జియంసి మైక్రోబయాలజీ విభాగం ఆవిష్కరించి సంచలనం సృష్టించింది. 1970 దశకంలో ఆవిష్కరించిన ఈ సంఘటన నేటికీ వైద్య విద్యార్థులకు స్పూర్తినిస్తోంది. ఇక వైద్య కళాశాలలోని పెథాలజీ మ్యూజియం ప్రపంచస్థాయి ప్రమాణాలను అందుకొని ఆసియాలోనే అత్యున్నత పెథాలజీ మ్యూజియాన్ని కలిగి ఉంది. 3680 అతి అరుదైన స్పెసిమన్లతో వైద్య బోధన రంగంతోపాటు వ్యాధి నిర్ధారణ రంగంలో విశేష సేవలందిస్తోంది. గుంటూరు మెడికల్ కళాశాలలో చదవటం తమ అదృష్టంగా వైద్య విద్యార్థులు భావిస్తారు. రాష్ట్రంలోనే గాక జాతీయ స్థాయిలో చక్కటి పేరు ప్రతిష్టలు ఉన్నాయి. ఇక్కడ వైద్య విద్యను అభ్యసించిన సుమారు రెండు వేల మంది పూర్వ విద్యార్థులు అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో వైద్య నిపుణులుగా స్థిరపడ్డారు. తమ మాతృ విద్యా సంస్థ అభివృద్ధికి తమ వంతు కృషిగా సుమారు రూ. 4 కోట్లతో అద్భుతమైన జింఖానా ఆడిటోరియాన్ని నిర్మించారు. త్వరలో ప్రభుత్వాస్పత్రిలో నిర్మించనున్న మిలీనియం బ్లాక్‌కు తమ వంతు విరాళంగా రూ. 4 కోట్లు అందించనున్నారు.



గుంటూరు ప్రభుత్వ సమగ్ర ఆస్పత్రి

మెడికల్ కళాశాలకు అనుబంధంగా నేరుగా ప్రజలకు వైద్య సేవలందించే గుంటూరు ప్రభుత్వ సమగ్ర ఆస్పత్రి 1177 పడకలతో కోస్తాలోనే పేద ప్రజలకు పెద్ద దిక్కుగా మారింది. ప్రతినిత్యం 2,400 మందికి పైగా ఔట్ పేషెంట్లు, సుమారు వంద మంది ఇన్‌పేషంట్లతో నిత్యం వైద్య సేవలందించడంలో తల మునకలై ఉంటుంది. ఎందరో నిష్ణాతులైన వైద్యులు ఈ ఆస్పత్రిలో పనిచేసి తమ అమూల్యమైన వైద్యసేవలతో ప్రజల ఆదరాభిమానాలను పొందారు. యూరాలజీ, కార్డియాలజీ, ప్లాస్టిక్ సర్జరీ, న్యూరాలజీ, న్యూరో సర్జరీ, కార్డియో థొరాసిక్ సర్జరీ, పీడియాట్రిక్ సర్జరీ వంటి పలు సూపర్ స్పెషాలిటీ వైద్య సేవలతోపాటు సాధారణ వైద్య సేవలతో జిజిహెచ్ పేదలకు విశిష్ట సేవలందిస్తోంది. మొన్నటివరకు మెడికో లీగల్ కేసులకు వైద్యం చేసే పెద్ద దిక్కు జిజిహెచ్ మాత్రమే. ఇటీవల ప్రైవేట్ ఆస్పత్రులు కూడా ఎంఎల్‌సి కేసులకు వైద్యసేవలందిస్తున్నాయి. ఏటా 7 వేలకు పైగా ప్రసవాలు చేస్తున్న ప్రభుత్వ ఆస్పత్రి ప్రసూతి వైద్య విభాగం రాష్ట్రంలోనే ప్రత్యేకత సాధించింది. పలు జిల్లాలనుంచి క్లిష్టపరిస్థితుల్లో ఉన్నకేసులను ఇక్కడికి పంపడం, ఇక్కడి నిపుణులైన గైనకాలజిస్టులు అత్యంత నైపుణ్యంగా వైద్య సేవలందించి సుఖ ప్రసవం చేస్తున్నారు. కోస్తా ఆంధ్ర ప్రజలకు విలువైన వైద్య సేవలందిస్తున్న మరొక విభాగం జిజిహెచ్‌లో హృద్రోగ వైద్య విభాగం. 40 పడకలు గల కార్డియాలజీ విభాగంలో సంవత్సరం పొడవునా వంద శాతానికి పైగా ఆక్యుపెన్సీరేటు నమోదవుతుంటాయి. ప్రచారానికి పెద్దగా నోచుకోకపోయినా రోగులకు మెరుగైన వైద్యసేవలందిస్తూ వారికి ప్రాణదానం చేస్తున్న ఘనత జిజిహెచ్ న్యూరోసర్జరీ వైద్యులకే దక్కుతుంది. అనేక క్లిష్టమైన కేసుల్లో, ప్రాణాపాయ స్థితిలో ఉన్న క్షతగాత్రులకు ఇక్కడి న్యూరోసర్జన్‌లు శ్రమించి వారి ప్రాణాలను కాపాడిన సంఘటనలు ఎన్నో ఉన్నాయి.

(మిగతా 214లో)

# భువిపై తొలి వైష్ణవ క్షేత్రం మంగళగిరి

(ఆన్‌లైన్...మంగళగిరి)

మంగళగిరి క్షేత్రం చాలా ప్రాచీనమైంది. కలియుగ దేవుడు శ్రీ వెంకటేశ్వర స్వామి అయితే సృష్టి ఆరంభంలోనే వెలసిన దేవుడు మంగళాద్రి శ్రీ పానకాల లక్ష్మి నృసింహస్వామి. యుగాలలో కెల్ల తొలియుగం కృతయుగమని మన పురాణగాధలు చెబుతున్నాయి. అటువంటి కృతయుగారంభంలోనే మంగళగిరి కొండపై శ్రీ నృసింహస్వామివారు అవతరించి యున్నారని వేదవ్యాస ప్రణీతమైన బ్రహ్మ వైవర్త పురాణం చెబుతోంది. భవానీ శంకరగీతలో సైతం మంగళగిరి క్షేత్ర



శ్రీ పానకాల నృసింహస్వామి

మహత్యాన్ని గురించి శ్రీ పరమశివుడు తాను స్వయంగా శ్రీ పార్వతీదేవికి వివరించినట్టు ప్రతీతి. సృష్టి ఆదిలోనే భూలోకంపై పరంధాముడు స్వయం వ్యక్తమై వెలిసిన తొలి పుణ్యక్షేత్రం మంగళాద్రి యేనని భావించాల్సి వుంటుంది. మంగళాద్రి క్షేత్రంలో కొండపై శ్రీ పానకాల నృసింహస్వామి కృతయుగంలో అవతరించి వుండగా, దిగువ సన్నిధిలో శ్రీ లక్ష్మి నృసింహస్వామివారి విగ్రహాన్ని ద్వాపరయుగంలో పాండవులు తమ అరణ్యవాసకాలంలో ధర్మరాజుచేత ఇక్కడ ప్రతిష్టింపజేశారని పురాణ ఇతిహాసాలను బట్టి తెలుస్తుంది.

## ఎగువ సన్నిధి

మంగళగిరి కొండపై పూర్వం కృతాయుగారంభంలో నముచి అనే రాక్షసుణ్ణి సంహరించి శ్రీ స్వామివారు ఇక్కడే ఉగ్ర రూపాన వెలిసియున్నారన్నది స్థల పురాణం.

(మిగతా 211వ పేజీలో)



మంగళగిరి క్షేత్ర సుందర దృశ్యం

# తొలి వైష్ణవ క్షేత్రం..

( 210వ పేజీ తరువాయి)

నముచి సంహారం అనంతరం శ్రీస్వామి వారు మహోగ్రరూపంతో ఉచ్ఛ్వాస, నిశ్వాసాలను విడుస్తుండడంతో ఆధాటికి ఎదురుగా వున్న మంగళగిరి ప్రాంతం కాలిపోయిందని పురాణ ఇతిహాసం. అంతట దేవతలు, శ్రీ మహాలక్ష్మి శ్రీస్వామివారిని శాంతించాలని కోరుతూ స్తోత్రం చేయగా శ్రీస్వామి వారిని అనుగ్రహించి తాను ఇక్కడే వెలిసియుందునని, తనకు కృతయుగంలో అమృతాన్ని, త్రేతాయుగంలో గో క్షీరాన్ని, ద్వాపరయుగంలో ఆవునెయ్యిని, కలియుగంలో బెల్లం పానకాన్ని నివేదనగా సమర్పించాలని శ్రీస్వామి సెలవిచ్చినట్టు చెబుతారు.



శ్రీ పానకాల రాయుని ఘాట్ రోడ్డు

ఇప్పటికి ఈ క్షేత్రంలో ఉదయకాలం వరకే మానవార్చన జరుగుతోంది. సాయంకాలం నుంచి దేవతలు శ్రీస్వామివారిని అర్చించేందుకు వస్తారనే విశ్వాసంతో సాయంకాలం నుంచి ఆలయాన్ని మూసివేస్తారు.ఘాట్‌రోడ్డుతో అభివృద్ధి: చాలా ప్రాచీనమైన ఈ ఆలయానికి నాలుగేళ్ల నుంచే భక్తుల సంఖ్య గణనీయంగా పెరిగింది. లోగడ కేవలం మెట్ల మార్గం మాత్రమే వున్న ఎగువ సన్నిధికి ఘాట్



శ్రీ లక్ష్మీ నృసింహస్వామి వారు

రోడ్డును నిర్మించడంతో సౌకర్యవంతంగా వుండి భక్తుల రద్దీ పెరిగింది. ఆలయ విశిష్టతను బట్టి కాక సౌకర్యాలను బట్టే భక్తుల ఆదరణ పెరుగుతుందనడానికి మంగళగిరి క్షేత్రమే ఒక ప్రత్యక్ష నిదర్శనమని చెప్పవచ్చు. ఎగువ సన్నిధికి ఏడాదికేడాదికి భక్తుల రద్దీ క్రమంగా పెరుగుతూ వస్తుంది. శ్రీ స్వామి వారి లీలామృతం:శ్రీ పానకాల స్వామికి నివేదనగా సమర్పించే బెల్లం పానకాన్ని స్వామి ఆలయ ముఖమండపంలోనే తయారు చేయాలి. ఈ తయారీలో ఎంత పానకం కింద ఒలికినా..చీమలు చేరవు..ఈగలు వాలవు. తీపి వున్న చోట చీమలు, ఈగలు చేరడం సృష్టిలో సర్వ సాధారణం. కానీ ఈ సృష్టి ధర్మానికి విరుద్ధంగా జరిగే ఈ వింతను భక్తులు స్వయంగా వీక్షించి తన్మయులు కావల్సిందే. అలాగే భక్తులు తమ మొక్కుబడి కింద శ్రీస్వామి వారికి సమర్పించే పానకంలో సగాన్ని మాత్రమే శ్రీస్వామి స్వీకరిస్తారు..మిగతా మొత్తాన్ని తన ప్రసాదంగా కక్కివేస్తారు. ఇదొక అద్భుతమైన స్వామి వారి లీలగా చెప్పుకుంటారు.

(మిగతా 212వ పేజీలో)

# పీడితజన పక్షపాతి...

# వరికల్లు కోటేశ్వర రావు

(ఆన్‌లైన్ - గుంటూరు సిటీ)



పీడిత జనహక్కుల కోసం ఆ కంఠం నినదించింది. కార్మిక జనరక్ష ణకే అంకితమైంది. మునిసిపల్ కార్మికుల కన్నీటి హృదయాలను పోరుజెండాలుగా మార్చింది. వారి కోసం ఎన్నో పోరాటాలు చేసి ప్రభుత్వం నుంచి జీవోలను విడుదల చేయించింది. ఆ కంఠానికి రూపమే 'ది గుంటూరు మునిసిపల్ వర్కర్స్ యూనియన్'ని స్థాపించిన వరికల్లు కోటేశ్వరరావు. ఆయన ఆశయాలకు అనుగుణంగా పారిశుధ్య కార్మికుల సంక్షేమం కోసం యూనియన్ పోరాటపంథాని అనుసరిస్తూ విజయబావుటాలను ఎగరవేస్తున్నది.కోటేశ్వరరావు స్థాపించిన యూనియన్ 1968వ సంవత్సరం నుంచి కార్మికుల కోసం పోరాటాలు చేస్తున్నది. పారిశుధ్య కార్మికుల జీవితాలను సామాజికంగా, ఆర్థికంగా, సాంస్కృతికంగా అన్ని కోణాలలో సమగ్రంగా పరిశీలిస్తూ పోరాటాలకు శ్రీకారం చుడుతున్నది. మునిసిపల్ కార్మికులను నాల్గో తరగతి ఉద్యోగులుగా గుర్తించుతూ 1977వ సంవత్సరంలో ప్రభుత్వం జారీ చేసిన జీవో యూనియన్ సాధించిన విజయాల్లో ఒకటిగా చిరకాలం గుర్తుండి పోతుంది. అప్పటి వరకు కార్మికునికి నెలకు రూ. 50లుగా ఉన్న మూలవేతనాన్ని టైంస్కేలుగా పెంపొందించింది. రిటైర్ అయిన కార్మికులకు పింఛన్‌తో పాటు అన్ని సౌకర్యాలు ఈ జీవోతో సమకూరాయి. దీనికి సూత్రధారి కోటేశ్వరరావే. అప్పట్లో కార్మికులను అంటరానివారిగా చూసేవారు. అలాంటి విపత్కర పరిస్థితుల్లో కార్మికులందరిని ఏకం చేసి ఉద్యోగ భద్రత కల్పించడంలో యూనియన్ కీలకభూమిక పోషించింది. నగరంలో ఏటూకురురోడ్డులో ఉన్న దర్గామాన్యం, డీఎస్ నగర్, నల్లచెరువు, సుద్ధపల్లిడొంక తదితర ప్రాంతాలలో కార్మికులకు ఇళ్లస్థలాలు ఇప్పించడంలో యూనియన్ అనేక పోరాటాలు చేసింది. అంతేకాకుండా సుదీర్ఘకాలం పోరాటాలు చేసి కార్మికులకు గృహవసతి కల్పించింది. పారిశుధ్య కార్మికులకు ఉపాధి కల్పించే 518, 30 జీవోలను విడుదల చేయించిన ఘనత కూడా మునిసిపల్ వర్కర్స్ యూనియన్‌కే దక్కుతుంది.

## తాజాగా...

ఈ ఏడాది మే నెలలో జరిగిన మునిసిపల్ సమ్మె విజయవంతంగా నగరంలో నిర్వహించిన ఘనత యూనియన్‌కే దక్కుతుంది. తద్వారా కార్మికులకు ప్రయోజనకరమైన దినసరి వేతనాలకు సంబంధించిన జీవోలను ప్రభుత్వం విడుదల చేయక తప్పలేదు. అంతేకాకుండా కాంట్రాక్టు సిబ్బందికి పింఛన్ సౌకర్యం కూడా కల్పిస్తున్నది.

# తొలి వైష్ణవ క్షేత్రం...

( 211వ పేజీ తరువాయి)

## అభివృద్ధి బాట పట్టిన క్షేత్రం

మంగళగిరి క్షేత్రం ఇప్పుడిప్పుడే అభివృద్ధి బాట పట్టింది. ఎగువ సన్నిధిలో శ్రీ పానకాల రాయుడి కొండపై ముఖ మండప నిర్మాణాన్ని చేపడుతున్నారు. అలాగే పైన పార్కింగ్ స్థలాన్ని రెండు లక్షల రూపాయల వ్యయంతో మరింత విస్తరిస్తున్నారు. దిగువ సన్నిధిలో ఆలయ ప్రాకారంలో చింతామణి రాయితో ఫ్లోరింగ్ పనులను జరిపిస్తున్నారు. కాటేజిల నిర్మాణానికి ఈ ఏడాది శంకుస్థాపనను జరుపనున్నారు. ఘాట్ రోడ్డు ప్రవేశ మార్గంలో ముఖద్వారం వెంబడి శ్రీ వెంకటేశ్వరస్వామివారి ఆలయ నిర్మాణాన్ని చేపట్టనున్నారు. ఘాట్‌రోడ్డు మార్గాన్ని మరింత సుందరంగా తీర్చిదిద్దేందుకు ప్రణాళికలను రూపొందిస్తున్నారు.



# 'పేట'లో కళా సుమాల తోట

(ఆన్‌లైన్, చిలకలూరిపేట)

కవుల ఘంటాలు కమనీయమైన కావ్యాలను సృష్టించాయి. 'నందికంత పోతుకరారి' వంటి కత్తుల తళతళలు శత్రువుల గుండెల్లో సింహస్వప్నంగా నిలిచాయి. శిలలను అపురూపమైన శిల్పాలుగా చెక్కిన తరతరాల ఘనత గల కొండవీటి రాజ్యం అంతర్భాగంగా ఉన్న చిలకలూరిపేట నియోజకవర్గానికి ఉత్తర కొసగా ఉన్న కొండవీటి కొండలపై క్రీ.శ.1325 ప్రోలయ వేమారెడ్డి గిరిదుర్గాన్ని నిర్మించడంతో దాదాపు వంద సంవత్సరాలకు పైగా రెడ్డి రాజ్యం విలసిల్లింది. కర్పూర వసంత రాయల బిరుదాంకితుడైన అన వేమారెడ్డి కాలంలో వసంతోత్సవాలు రంగరంగ వైభవంగా జరిగేవి. కుమారగిరి రెడ్డి, పెదకోమటి వేమారెడ్డి వంటి రాజులు జనరంజకమైన పాలన చేశారు. శృంగార నైషధం, కాశీఖండం, భీమ ఖండము వంటి కావ్యాలను వ్రాసిన శ్రీనాధుడు కొండవీటి రాజ్యంలో విద్యాధికారిగా పనిచేశారు. మండల కేంద్రమైన నాదెండ్లకు కూడా ఐదు శతాబ్దాల సుదీర్ఘ చరిత్ర ఉంది.

శ్రీ కృష్ణ దేవరాయలకు గురువు, మంత్రి, ఆత్మబంధువైన సాళువ తిమ్మరుసు నాదెండ్లకు చెందిన నాదెండ్ల తిమ్మన సోదరి లక్ష్మమ్మను వివాహమాడారు. ధరణికోట ప్రభువైన రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు 18వ శతాబ్దంలో ఓగేరు నది ఒడ్డున రాజాపేట గ్రామాన్ని నిర్మించారు. ఈ గ్రామం దాదాపు 1960 వరకూ దాదాపు 100 గ్రామాలకు వాణిజ్య కేంద్రంగా విలసిల్లింది. మానూరి వంశస్థుడైన వెంకన్నారావుకు 1707 సంవత్సరంలో హైదరాబాద్ నవాబు నూట అరవై గ్రామాలలో కూడిన చిలకలూరిపాడు సంస్థానమును దానమిచ్చారు. అనంతరం 1779లో మానూరి వంశానికి చెందిన వెంకటేశానికి చిలకలూరిపాడు భాగాన్ని, నరసన్నరావుకు కొంతభాగాన్ని ఇచ్చారు. దీనితో నరసరావుపేట పట్టణం ఆవిర్భవించింది.

చిలకలూరిపేట నియోజకవర్గంలో పుట్టిన నాదస్వరవిద్య ఖండఖండాంతరాలలో సుశ్రావ్యంగా ప్రతిధ్వనించింది. చిలకలూరిపేటలో పుట్టిన ఈ కళ ఇంటకాక తమిళనాడులో రచ్చగెలిచి అర్థశతాబ్దికాలంగా చిలకలూరిపేట బాణిగా ఇప్పటికీ విరాజిల్లుతుంది. నాదస్వర పితామహుడైన షేక్ నబీసాహెబ్ సాతులూరు గ్రామంలో జన్మించారు. షేక్ చిననసర్ది, పెదనసర్ది చిలకలూరిపేట ఆస్థాన విద్వాంసులుగా నియమితులయ్యారు. నాదస్వర విద్యలో ప్రఖ్యాతిగాంచిన షేక్ చినపీరు సాహెబ్, శాసనమండలి సభ్యునిగా నియమితుడైన నాదస్వర విద్వాంసుడు షేక్ ఆదంసాహెబ్, తమిళనాడు ప్రభుత్వంచే కలైమామణి బిరుదులను పొందిన షేక్ మెహబూబ్ సుభానీ, షేక్ కాలేషాబి దంపతులు చిలకలూరిపేట పట్టణానికి చెందినవారే.

భారతదేశం గర్వించదగిన నాదస్వర విద్వాంసుడు పద్మశ్రీ షేక్ చిన మౌలానా చిలకలూరిపేట పట్టణంలోనే షేక్ ఆదం సాహెబ్ వద్ద నాదస్వర విద్యను అభ్యసించారు. కనపట్లుకు చెందిన కనపర్తి మస్తాన్, హుస్సేన్ రాష్ట్రంలో ప్రముఖ విద్వాంసులుగా కీర్తి గడించారు. సినీ, నాటక రంగాలలో కధానాయిక పాత్రలను ధరించిన సీనియర్ శ్రీరంజని, జూనియర్ శ్రీరంజని చిలకలూరిపేట మండలం మురికిపూడికి చెందినవారే. యన్‌టిఆర్, భారతీరాజా, భాగ్యరాజా వంటి ప్రముఖులకు చెందిన 300 చిత్రాలకు కళాదర్శకునిగా వ్యవహరించిన యం.సోమనాధ్ చిలకలూరిపేట పట్టణానికి చెందినవారే. యం.మల్లిఖార్జునరావు, భీమనేని శ్రీనివాసరావు, సముద్ర వంటి సినీ దర్శకులు కూడా ఈ నియోజకవర్గానికి చెందినవారే. ప్రముఖ నవలారచయిత్రి ఓల్గా యడ్లపాడు గ్రామానికి చెందినవారు. నయాగారా కవులలో ఒకరైన అనిశెట్టి సుబ్బారావు పురుషోత్తమపట్నంలో జన్మించడంతోపాటు ప్రాధమిక విద్యను ఇక్కడే చదివారు.

ముఖ్యమంత్రిగా, కేంద్రమంత్రిగా, ఎఐసిసి అధ్యక్షులుగా వ్యవహరించిన కాసు బ్రహ్మానందరెడ్డి స్వగ్రామమైన తూబాడు చిలకలూరిపేట నియోజకవర్గంలోనిదే. సిపిఐ జాతీయ నాయకులైన చండ్ర రాజేశ్వరరావు స్వగ్రామము చిలకలూరిపేటకు సమీపంలోనిచీరి కమ్మవారిపాలెం, దేశంలోనే మొదటిదైన పొగాకు ఈనె తీసే పరిశ్రమను కందిమళ్ల రాఘవయ్య సోదరులు, మద్ది వెంకటరత్నం, లక్షయ్య సోదరులు చిలకలూరిపేట పట్టణంలో స్థాపించారు. రాష్ట్రవ్యాప్తంగా లక్షలాది మందికి సేవలను అందిస్తున్న ఎయంజి ఇండియా ఇంటర్నేషనల్ సేవాసంస్థను స్థాపించిన డాక్టర్ ఎస్.జాన్‌డేవిడ్ చిలకలూరిపేటకు చెందినవారే.

# కోస్తా ఆరోగ్య రాజధాని 'గుంటూరు'

(209 తరువాయి)

అదే విధంగా యూరాలజీ, ప్లాస్టిక్ సర్జరీ, కార్డియో థొరాసిక్ సర్జరీ వంటి వైద్య విభాగాలు కూడా చక్కటి వైద్య సేవలందిస్తూ రోగుల ఆదరాభిమానాలు పొందుతు న్నాయి.

గుంటూరు మెడికల్ కళాశాలలో వైద్య విద్యను అభ్యసించిన ఎందరో డాక్టర్లు రాజకీయ రంగంలో కూడా రాణించారు.

★ డాక్టర్ కోడెల శివప్రసాద రావు, డాక్టర్ మాకినేని పెదరత్తయ్య, డాక్టర్ శనక్కాయల అరుణ తదిత రులు శాసనసభకు ఎన్నికై మంత్రు లుగా రాష్ట్ర ప్రజానీకానికి సేవలం దించారు.

★ డాక్టర్ కొల్లి శారద గుంటూరు నగర తొలి మేయర్గా ఎన్నికై నగరాభివృద్ధికి తన వంతు కృషి చేశారు.

★ మెడికల్ కళాశాలలో యంబిబిఎస్ చేసిన డాక్టర్ జయప్ర కాశ్ నారాయణ ఐఏఎస్కు ఎంపికై కలెక్టర్గా పనిచేశారు. ప్రస్తుతం లోక్ సత్తా జాతీయ సమన్వయ కర్తగా వ్యవహరించడంతోపాటు తాజాగా లోక్సత్తా రాజకీయ పార్టీని ఏర్పాటు చేశారు.

★ డాక్టర్ కె అంజిరెడ్డి జిజి హెచ్ సూపరింటెండెంట్గా అత్యు త్తమ సేవలందించడంతోపాటు రాష్ట్ర వైద్య విధాన పరిషత్ కమిషనర్గా, రాష్ట్ర వైద్య ఆరోగ్య సేవల డైరెక్టర్ జనరల్గా సమర్థవంతంగా పనిచే శారు.

★ డాక్టర్ సురేష్ కేంద్ర రైల్వే శాఖలో వైద్య ఆరోగ్య సేవల డైరెక్టర్ జనరల్గా సేవలందించారు.

★ ప్రతిష్ఠాత్మకమైన భార తీయ వైద్య మండలి అధ్యక్షుడు జియంసి మాజీ ప్రిన్సిపాల్ డాక్టర్ పిన్నమనేని నరసింహారావు పనిచేసి గుంటూరు వైద్య రంగ ఖ్యాతిని జాతీయ స్థాయిలో ఇనుమడింపచే శారు.

★ డాక్టర్ బిజిరెడ్డి, డాక్టర్ బి స్వామి, డాక్టర్ డి భాస్కరరెడ్డి, డాక్టర్ కెఆర్ఆర్ మోహనరావు, డాక్టర్ ఎల్ సూర్యనారాయణ, డాక్టర్ కె రాజ్యలక్ష్మి, డాక్టర్ సిఎస్ భాస్కర న్లు వివిధ విశ్వవిద్యాలయాల వైస్ ఛాన్సలర్లుగా సేవలందించారు.

★ ఈ వైద్య కళాశాలలో చదివి సుప్రసిద్ధ వైద్య నిపుణులుగా రాణించిన డాక్టర్ గుళ్ళపల్లి నాగేశ్వర రావు, డాక్టర్ బి సోమరాజు, నిమ్స్ డైరెక్టర్ డాక్టర్ దాసరి ప్రసాదరావు, డాక్టర్ సియం హబీబుల్లాలు జాతీయ స్థాయిలో ప్రతిష్ఠాత్మకమైన పద్మశ్రీ అవార్డులను కైవసం చేసుకు న్నారు.

★ డాక్టర్ సిఎస్ భాస్కరన్, డాక్టర్ కెఆర్ఆర్ మోహనరావు, జాతీయ స్థాయి వైద్య రంగంలో అత్యంత ప్రతిష్ఠాత్మకమైన బిసి రాయ్ అవార్డును సాధించారు.

★ జియంసి పూర్వ విద్యార్థు లైన డాక్టర్ యలమంచిలి శివాజీ, డాక్టర్ యంవి రమణారెడ్డి, డాక్టర్ రాయపాటి శ్రీనివాస్, డాక్టర్ పాలేటి రామారావు, డాక్టర్ ఎంఎస్ఎస్ కోటే శ్వరరావు, డాక్టర్ కె కోయా తదిత రులు రాజకీయ రంగంలో రాణిం చారు.

★ గుంటూరు ప్రభుత్వ సమ గ్రాస్పత్రిలో వరుసగా మూడు అవి భక్త కవలల జంటలను విజయవం తంగా వేరుచేసిన సుప్రసిద్ధ పీడియా ట్రిక్ సర్జన్ డాక్టర్ యార్లగడ్డ నాయ డమ్మ అంతర్జాతీయ స్థాయిలో కీర్తి ప్రతిష్ఠలను సాధించారు.

★ ఆర్థోపెడిక్ వైద్య రంగంలో పలు జాతీయ స్థాయి అవార్డులతో పాటు రాష్ట్ర వైద్య రంగంలో అత్యంత ప్రతిష్ఠాత్మకమైన డాక్టర్ వ్యాఘ్రేశ్వరుడు అవార్డును ఐదు సార్లు కైవసం చేసుకున్న డాక్టర్ ఎస్ అమరనాథ్ గుటూరు మెడికల్ కళా శాల పూర్వవిద్యార్థే.

★ జియంసిలో చదివి అమెరి కాలో ఎన్ఆర్ఐగా స్థిరపడిన డాక్టర్ ముక్కామల అప్పారావు అమెరికా లోని మిచిగాన్ మెడికల్ సొసైటీ ఛైర్మన్గా ఎన్నికై ఆ ఘనత సాధిం చిన తొలి భారతీయుడుగా రికార్డు సృష్టించారు.

ప్రభుత్వ వైద్య రంగానికి దీటుగా జిల్లాలో ప్రైవేటు వైద్య రంగం కూడా చక్కటి వైద్య సేవ లందిస్తోంది. ఇటీవల జిల్లాలో ఏర్పాటుచేసిన ఎన్ఆర్ఐ, కాటూరి మెడికల్ కళాశాల, ఆస్పత్రులు గ్రామీణ ప్రజలకు మెరుగైన వైద్య సేవలందిస్తున్నాయి. గుంటూరు నగరంలో కూడా పలు ప్రైవేట్ కార్పొరేట్ ఆస్పత్రులు సూపర్ స్పెషాలిటీ వైద్యసేవలతో రాష్ట్ర స్థాయిలో పేరుప్రఖ్యాతులు గడిస్తు న్నాయి.

జాతీయ రహదారిపై జరుగు తున్న ప్రమాదాలను దృష్టిలో ఉంచుకొని ఇటీవల ప్రవేశపెట్టిన 108 అంబులెన్సులు కూడా జిల్లా ప్రజలకు చక్కటి సేవలందిస్తు న్నాయి.

ప్రాణాపాయంలో ఉన్న పలు వురు క్షతగాత్రులను సకాలంలో ఆస్పత్రులకు చేరవేస్తూ తమ వంతు బాధ్యతలను నెరవేరుస్తున్నాయి.

# అంతర్జాతీయ ఖ్యాతి గడించిన

# పసుపు యార్డు

(ఆన్‌లైన్ - దుగ్గిరాల)

దేశంలో పసుపుకు దుగ్గిరాల పసుపు యార్డు ప్రసిద్ధి చెంది, ప్రత్యేకతను సంతరించుకుని ఉంది. రాష్ట్రంలో దేశ వాళీ రకం పసుపుకు దుగ్గిరాల ప్రాంతం ప్రసిద్ధి చెందగా కడప, కర్నూలు తదితర ప్రాంతాలతో పాటు రాష్ట్రం నలుమూలల నుండి దుగ్గిరాల యార్డుకు పసుపు వస్తుంది. బహిరంగ వేలం ద్వారా సరుకు అమ్మిన వెంటనే డబ్బు చెల్లించడం, రైతుబంధు పథకం ద్వారా రుణాలు అందజేయడం, రైతుకు అవసరమైన ఎరువులను సకాలంలో సరసమైన ధరకు అందించడం వంటి కార్యక్రమాలతో అభివృద్ధిలో ముందంజలో ఉంది.



యార్డులో వేలం షెడ్లు

యార్డులో పసుపుతో పాటు అపరాల నిల్వ ఉంచేందుకు 20 ఎకరాల స్థలంలో గిడ్డంగులను నిర్మించారు. గిట్టుబాటు ధర పలికేంత వరకు రైతులు మూడు నెలల కాలం ఎలాంటి బాడుగ లేకుండా నిల్వ పెట్టుకుని, నిల్వపై రైతుబంధు ద్వారా రుణాలు అందిస్తున్నారు. ఏడాదికి 30 కోట్ల రూపాయలకు పైగా టర్నోవర్ కలిగి కోటికిపై చిలుకు మార్కెట్ ఫీజు ఆదాయంగా లభిస్తోంది.

యార్డులో 140 మంది పురుష, మహిళా హమాలీలు పసుపు యార్డుపై ఆధారపడి జీవిస్తున్నారు. దీనికి అనుబంధంగా పసుపు ఫ్యాక్టరీలలో 500 మంది కూలీలు జీవిస్తున్నారు. వందకు పైగా లైసెన్సు కలిగిన సంస్థలు పసుపు వ్యాపారం కొనసాగిస్తున్నాయి. యార్డులో రైతుల సమక్షంలో బహిరంగ వేలం



దుగ్గిరాల పసుపు మార్కెట్ యార్డు

ద్వారా కొనుగోలు చేసిన పసుపు పాలిష్ నిర్వహించి, దేశంలోని లక్నో, సాంగ్లీలతో పాటు బంగ్లాదేశ్, సౌదీ దేశాలకు కూడా ఎగుమతులు చేస్తుంటారు. పసుపు విత్తనం, వండే పద్ధతులలో నాణ్యత లోపించినందునే ఇతర మార్కెట్‌లతో పోల్చినప్పుడు తక్కువ ధర పలుకుతోందని సర్వేలు తెలియజేస్తున్నాయి. ఇటీవల రెండు లక్షల రూపాయలకు పైగా ఖర్చుతో ప్రయోగాత్మకంగా 'టర్మరిక్ స్టీమ్ బాయిలింగ్ యూనిట్'ను రూపొందించి రైతులకు అందుబాటులోకి తీసుకు వచ్చారు. ఇటీవల కోల్డ్ స్టోరేజ్ నిర్మాణం కూడా యార్డు ఆవరణలో ప్రారంభమైంది. రైతులకు అవసరమైన విశ్రాంతి భవనాల, హమాలీలకు ప్రత్యేక భవనం, ఎలక్ట్రానిక్ కాటాల ద్వారా తూకం నిర్వహణ వంటి ప్రత్యేకతలు కలిగి, వేలం నిర్వహణలో పారదర్శకతను కలిగిన యార్డుగా ప్రసిద్ధికెక్కింది.

## మురళి లేని గాన రవళి

# పద్మశ్రీ ఈలపాట రఘురామయ్య

(ఆన్‌లైన్-బాపట్ల)

కళ అజరామరం.. కళ లోకకళ్యాణకరం..కుల మతాలకు అతీతంగా సర్వుల చేత సర్వ కాలాలలో శ్రమించి గౌరవింపబడేవారు కళాకారులు మాత్రమే. కళాకారులు జాతీయ సమైక్యతకు దోహద కారులు. కళలలో ఉత్తమమైనది సంగీతం. ఆ సంగీతం తెలుగునాట నాటకరంగంలో ప్రయోగింపబడి పలువురి మన్ననలు పొందిన పద్మశ్రీ ఈలపాట రఘురామయ్య. పద్య సంగీతంతో పాటు ఏ పరికరం లేకుండ వేలు మడత పెట్టి నోటి ద్వారా ఫ్లూటు నాదాన్ని ధ్వనింప జేసిన నాద(సంగీత) సృష్టి కర్త పద్మశ్రీ ఈలపాట రఘురామయ్య ధన్యజీవి, ఆదర్శప్రాయుడు. అటువంటి మహావ్యక్తులు తెలుగుజాతికే గర్వకారణం. గుంటూరుజిల్లా చిలకలూరిపేట మండలం యనమదల ప్రాంతంలో పూర్వీకులు జన్మించి కృష్ణా జిల్లా సుద్ధపల్లి గ్రామంలో కళ్యాణ నరసింహం,వెంకటసుబ్బమ్మలకు అయిదవ సంతానంగా ఈయన జన్మించారు. చదువు సరిగా అబ్బక పోయిన విద్యాంసుల సంగీత కచేరిలకు వెళుతూ సంగీతం మీద మనస్సు లగ్నం చేసి వేణువు నుంచి ఈ నాదం ఏలా వస్తుంది, అనే ఆలోచనలు కలిగి పెద్ద వారు పాడిన సంగీత మును ఏ సాధన లేకుండానే అలవోకగా పాడే వారు. ఈ పాటను సంగీత రసికత గలిగిన వ్యక్తి కీర్తి శేషులు దండుకృష్ణయ్యగారు విని అబ్బురపడి తెనాలిలో ప్రాక్టీస్ చేస్తున్న మహానటుడు యడవల్లి సూర్యనారాయణ గారికి చెప్పి వారి భక్తరామదాసు నాటకంలో రఘురాముడు పాత్రకు బాలనటుడుగా నటింప జేశారు. ఆ బాలకుడు పాడిన పాటకు తన్మయత్వం చెంది కరతాళ ధ్వనులతో వన్స్‌మోర్ కొడుతూ మళ్ళి పాడాలి..మళ్ళిపాడాలి అని పాడించుకొని ఆనందించారు ప్రేక్షకులు. మద్రాసులో ఆడిన నాటకాన్ని కాశీనాధుని వారు చూసి ఆనందించి 'భలే రఘురామ' అని పిలిచి ప్రశంసల వర్షం కురిపించి ఇక నుంచి నీ పేరు రఘురాముడే అనడంతో ఆనాటి వరకు వెంకట సుబ్బయ్యగా పిలువబడుతున్న వ్యక్తి రఘురామయ్యగా మారారు. రఘురామయ్య నాటక సాధనతో పాటు 'ఈలపాట'ను కూడా సాధన చేసి మురళి లేని మురళి కృష్ణుడుగా కీర్తి పొందారు. విజయవాడలో మహాగాయకుడుగా పేరుపొందిన జొన్నావిత్తుల శేషగిరిరావు పరిచయమై ఆయన వద్ద సంగీతం మెళుకువలు నేర్చుకొన్నారు. సక్కుబాయి, రాధిక, మామపిల్ల, చంద్రవంక, అపవాదు, గొల్లభామ ఇత్యాధి సినిమాలలో పృధ్వీరాజు, నరకాసుర మొదలగు నాటకాల్లోను ప్రధాన పాత్రలు ధరించి ఏనలేని కీర్తి సంపాదించారు. గొల్లభామ సినిమాలో 'వలపు తేనీయలూరిన' అనే పద్యం సక్సెస్‌కు దోహద పడటమే గాక, ప్రతి రంగ స్థలం మీద అది పాడించ కుండా వదలలేదు. గొల్లభామ సినిమా ద్వారానే అంజలి తొలి సారిగా చిత్ర రంగ ప్రవేశం చేసింది. రాయభారంలో కృష్ణుడు, తులాభారంలో కృష్ణుడులా ఇలా ఆనాడు కృష్ణుని పాత్ర అనగానే రఘురామయ్య అని అనని వాడు లేడంటే అతిశయోక్తి కాదు. 1928లో రవీంద్రనాథ్ ఠాగూర్ సమక్షంలో చూసిన నాటకానికి తన్మయత్వం చెంది 'నైటింగేల్ ఆఫ్ ది స్టేజ్' అని బిరుదుతో సత్కారం పొందారు. రవీంద్రనాథ్ ఠాగూర్ రచించిన 'ది రీకలెక్షన్స్ ఆఫ్ ఠాగూర్' అనే పుస్తకంలో రఘురామయ్య గురించి ప్రశంసించడం విశేషం. రఘురామయ్య ఈలపాట గానానికి మంత్రముగ్ధులైన అప్పటి ప్రధాన మంత్రి ఇందిరాగాంధీ 1974వ సంవత్సరంలో అయిదు నిమిషాలు ఇంటర్వ్యూ ఇచ్చి 40 నిమిషాలు ఆయన గానామృతాన్ని, ఈల పాటను వింటూ ఆనంద పరవశులైనారు. అప్పటి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రు, అప్పటి రాష్ట్రపతి వి.వి.గిరిలచే పలు ప్రశంసలు పొందాలు. 1938లో బాపట్ల వాసులు రోహిణి వెంకటసుబ్బయ్య, సీతమ్మ గార్ల సంతానం సావిత్రమ్మను వివాహ మాడారు. ప్రతి గొప్పవాని జీవిత చరిత్ర వెనుక ఒక స్త్రీ మూర్తి హస్తం ఉంటుంది అన్న నానుడిని సార్థకం చేసుకొన్న సతీమణి. భవిష్యత్ బంగారుబాటలో ప్రయాణం చేయడానికి తగిన వనరులు,వసతులు సమకూర్చి సినిమారంగంలో ఉన్నతుడు కావడానికి సహకరించారు.



ఈలపాట రఘురామయ్య

శ్రీకృష్ణ తులాభారంలో శ్రీకృష్ణుడు, సారంగధరలో సారంగధరుడు, చింతామణిలో భవానీ శంకరుడు ఇత్యాధి పాత్రలలో యావదాంధ్ర దేశమే కాక ఆంధ్రేతర రాష్ట్రాలలో తెలుగునాటకరంగ విజయకేతనం ఏగరడానికి దోహదకారి అయినారు. గొల్లభామ సినిమాలో కృష్ణుడుగా నటించిన రఘురామయ్య 35 సంవత్సరాల తరువాత భక్తకుచేల సినిమాలో తిరిగి కృష్ణుడి పాత్ర పోషించడం ఆయన కళాభినయానికి నిదర్శనం. 1954లో అనంతసేనం అయ్యంగారు(లోక్‌సభ స్పీకర్) చేత ప్రశంసలు పొంది జర్మనీ దేశంలో పర్యటించి తెలుగుపద్యానికి ఈలపాటకు ఖండాంతర ఖ్యాతి తెచ్చారు.

# కీర్తి పతాక స్ఫూర్తి ప్రదాత


స్వర్గీయ కోన ప్రభాకరరావు

(ఆన్‌లైన్-బాపట్ల)

కొన్ని మాటల్లోనో, కొద్ది పుటల్లోనో వర్ణించడానికి వీలు కాని వ్యక్తిత్వం ఆయనది. రంగస్థలాన రవళించి, సినీ రంగాన ఖ్యాతి గడించి, క్రీడా రంగాన కీర్తి పతాకాన్ని ఎగురవేసి, రాజకీయాన రాటుదేలిన ఘనపాటి ఆయన. సేవాతత్పరతకు ప్రతిరూపంగా స్వయం కృషికి మణిదీపంగా నిలిచిన బాపట్ల పట్టణం జాతికి అందించిన ఆణిముత్యం ఆయన. కష్టాలను అధిగమించి సమర్థుడైన వ్యక్తిగా నిలిచారు కోనప్రభాకరరావు. కళామతల్లి ముద్దుబిడ్డగా సేవాతత్పరతతో స్ఫూర్తి ప్రదాతగా రాజకీయాలలో ఎక్కడా రాజీపడని నేతగా తనదంటూ విలక్షణ వ్యక్తిత్వాన్ని సొంతం చేసుకొన్నారు. కొన్ని రాష్ట్రాలు ఆయనను గవర్నరుగా చూసుకుంటే ఆంధ్రరాష్ట్రం ఆర్థికమంత్రిగా చూసుకుంది. బాపట్ల మాత్రం జలప్రదాతగా, కళాపిపాసిగా చూసుకొని నేటికీ మురిసి పోతుంది. యావత్‌జాతి గర్వించ దగ్గ అరుదైన నేతలలో ఒకరుగా కోనకు సముచిత స్థానం వుంది. అంతకు మించిన అగ్రనేతగా భారతదేశం అగ్ర తాంబూలం ఇచ్చిన సందర్భాలు కోకొల్లాలు, బాపట్లకు హ్యాట్రిక్ శాసనసభ్యునిగా వున్న కోన ప్రభాకరరావు అప్పటి ముఖ్యమంత్రి అంజయ్య సహకారంతో కోటి రూపాయలు వెచ్చించి రక్షిత మంచినీటి పథకాన్ని ఏర్పాటు చేశారు. 1963లో బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీని స్థాపించి 1981వరకు వ్యవస్థాపక కార్యదర్శిగా కొనసాగారు. ఆయన చేసిన కృషి ఫలితంగా విద్యారంగంలో ఎందరో మేధావులుగా కీర్తించబడ్డారు. మండలంలోని వెదుళ్ళపల్లి, బేతపూడి, స్టూవర్టుపురం ప్రాంతాల్లోని 220 ఎకరాల సొంతభూమిని నిరుపేదలకున పంపిణీ చేశారు. ఇసుక ప్రాంతాలలో పంటకాలువలకు సిమెంటు లైనింగ్ వేయాలని ఆనాడే ప్రభాకరావు ఆలోచన చేశారు.

## చిత్రసీమలో కోన...

సినీ జగత్‌లో కోనప్రభాకరరావు నటునిగా, దర్శకునిగా నిర్మాతగా నిరూపమాన సేవలందించారు. సౌదామిని, ద్రోహి చిత్రాలలో కోనను విలన్‌గా నిలబెట్టినది. ఆ తర్వాత సినిమాలు మంగళసూత్రం, రూపవతి, ప్రజాసేవ వంటి సినిమాలలో వివిధ పాత్రలు కోన పోషించారు. అంతకు ముందు రంగ స్థలాన ఎన్నో నాటికలలో అనన్యమైన ప్రతిభా పాటవాలను ప్రదర్శించారు. దుర్యోధనుడి పాత్రలో రంగస్థలానికి వన్నె తెచ్చిన కోన శ్రీకృష్ణుని పాత్రలో ప్రేక్షకుల్ని సమ్మోహితుల్ని చేశారు. 1982లో రాష్ట్ర ఆర్థిక శాఖ మంత్రిగా వున్న సమయంలో, ఫిల్మ్ కార్పొరేషన్ మంత్రిగా తెలుగు సినీ పరిశ్రమ మద్రాసు నుంచి హైదరాబాదుకు తరలించేందుకు తీవ్ర ప్రయత్నాలు చేశారు.

## రాజకీయాన దీటైన నేత...

రాటు దేలిన రాజకీయ రంగంలో దీటైన నేతగా వాసికెక్కిన కోన బాపట్లకు మూడు సార్లు శాసనసభ్యునిగా పనిచేశారు. 1972లో వచ్చిన జై ఆంధ్రా ఉద్యమాన్ని వ్యతిరేకించి సమైక్యవాదిగా నిలిచారు. 1981లో మంత్రిగా తన పదవులకు వన్నె తెచ్చారు. సిక్కిం, మహారాష్ట్ర, పాండిచ్చేరి గవర్నర్లుగా 1983 నుంచి 1985 వరకు పనిచేశారు. రాజకీయ దురంధరుడైన వల్లూరు బసవరాజు శిష్యరికంలో కోన ఏనలేని కీర్తి గడించారు. బాపట్లకు మంచినీరు అందించే ప్రయత్నంలో కోటి రూపాయలు అప్పటి ప్రభుత్వం ద్వారా మంజూరు చేయించారు. దీనికి సంబంధించి ప్రభుత్వమే ఆ వడ్డి చెల్లించేలా ఒప్పించారు. దీంతో పాటు రాష్ట్రంలోని మరో 30 పురపాలక సంఘాలలో కూడా కోన ప్రభావంతో రక్షిత మంచినీటి పథకాలు మంజూరయ్యాయి. 1981లో అసెంబ్లీ స్పీకరుగా వున్న కోన ఆ పదవిని ఎంతో హుందాగా నిర్వహించి ప్రతిపక్షాల ప్రశంసలందుకున్నారు.

## బాపట్లలో రాజకీయ శిక్షణ శిబిరం

సూర్యలంక సముద్రతీరం వద్ద 1987లో రాజకీయ శిక్షణాశిభిరం ఏర్పాటు కోన జీవితంలో మరుపురాని ఘట్టంగా పేర్కొనవచ్చు. మధురమైన అనుభూతుల్ని మిగిల్చిన ఈ శిక్షణ శిబిరానికి ఎందరో కేంద్ర మంత్రులు, కాంగ్రెస్ అగ్రనేతలు ఆశీనులైనారు. ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షునిగా వున్న సమయంలో క్రమశిక్షణ రాహిత్యానికి పాల్పడ్డారనే కారణంగా అప్పట్లో మంత్రులుగా వున్న నారా చంద్రబాబు నాయుడు, సి.దాస్‌లను సస్పెండ్ చేసిన సంఘటనలు ఇప్పటికీ ప్రజలు చర్చించుకోవడం గమనార్హం.

## ఆటలలోనూ మేటే...

అనేక క్రీడలలో కోనకు మంచి ప్రవేశముంది. మద్రాసు లయోలా కాలేజి విద్యార్థిగా టెన్నిస్ పోటీలలో చాంపియన్‌గా నిలిచారు. పూనా విశ్వవిద్యాలయం బ్యాడ్మింటన్ పోటీలలో చాంపియన్‌షిఫ్ సాధించారు. బాపట్లలో శివాజీ వ్యాయామ మండలి స్థాపించి అనేక మంది యువకులకు కుస్తీలో శిక్షణ నిచ్చేవారు. అప్పటి మద్రాసు గవర్నర్ చేతుల మీదుగా ఆయా క్రీడాకారులకు బహుమతులందజేసి క్రీడలలో కోన తనకున్న అభిమానాన్ని చాటుకున్నారు. కళాత్మక హృదయంలో ఉల్లాసమైన క్రీడా శరీరంతో స్వచ్ఛమైన తెల్లని వస్త్రాలతో రాజకీయాలలో హుందాగా కనిపించే ఎందరో రాజకీయ నాయకులకు మార్గదర్శకులయ్యారు. బాపట్ల చరిత్ర పుటలలోనే కాకుండా జాతి గుండెల్లో ఎప్పటికీ గుర్తుండే కోన ప్రతి తరం స్మరించుకోవాల్సిన స్ఫూర్తి ప్రదాత.

# ఆర్థిక పథంలో ముందడుగు సహకార రంగానికే వెలుగు

(206వ పేజీ తరువాయి)

దారులకు చెల్లించింది. డెయిరీ స్థాపించిన నాటి నుండి పాల ఉత్పత్తి దారులకు ఉచిత వైద్య సేవలు, అత్యావసర వైద్యం, సబ్సిడీపై పశువుల దాణా, పశు గ్రాస విత్తనాల సరఫరా, ఇతర రాష్ట్రాలలో అభివృద్ధి పథంలో ఉన్న డెయిరీలను సందర్శించే అవకాశం ఉత్పత్తి దారులకు కలుగజేసింది. గ్రామాలలో పశుపోషణపై ఫిలిం ప్రదర్శన, ఉచితంగా పశువులకు కృత్రిమ గర్భదారణ, సంకర జాతి ఆవులు, దున్నపోతుల పంపిణీ, పాడిపరిశ్రమకు సంబంధించిన పలు అంశాలపై శిక్షణ కార్యక్రమాలు నిర్వహించడం ద్వారా అనేక రకాలుగా ఉత్పత్తి దారులకు సహాయ సహకారాలు అందిస్తుంది. కొన్ని ప్రైవేటు డెయిరీలు ధర ఎక్కువగా చెల్లించి తాత్కాలికంగా ప్రయోజనం కలిగిస్తున్నా, ధరతోపాటు ఎన్నో ప్రయోజనాలు అందిస్తున్న సంస్థగా సంగం డెయిరీ నమ్మకం కలిగి ఉంది. సంగం డెయిరీ పాల ఉత్పత్తులకు కూడా రాష్ట్రంలో మరే ఇతర డెయిరీ ఉత్పత్తులకు లేనంత గిరాకీ ఉండడం డెయిరీ ఉన్నత నాణ్యత ప్రమాణాలకు మచ్చు తునక. సంగం డెయిరీ టేబుల్ బట్టర్, వైట్ బట్టర్, స్కిమ్ మిల్క్ పౌడర్లకు జాతీయ స్థాయి మార్కెట్ పెంటర్లలో హెచ్చు ధర ఉంది. డెయిరీ ఏటా సుమారు 1200 టన్నుల వరకు స్కిమ్ మిల్క్ పౌడర్ 900 టన్నుల వైట్ బట్టర్, వెయ్యి టన్నుల నెయ్యి, 700 టన్నుల టేబుల్ బట్టర్‌లను మార్కెట్ చేస్తుంది. పాల ఉత్పత్తులకే కాక సంగం డెయిరీ పాలకులు జిల్లాలోనే కాకుండా హైదరాబాద్, తిరుపతి, చెన్నై లాంటి నగరాల్లో సైతం మంచి డిమాండ్ ఉంది. రోజుకు సరాసరి లక్ష లీటర్ల వరకు పాలను ప్యాకెట్ల రూపంలో వినియోగదారులకు అందజేస్తుంది. రాష్ట్రంలోనే కాక ఇతర రాష్ట్రాలలో ప్రైవేటు డెయిరీలు సైతం సంగం డెయిరీ పాల కోసం క్యూలలో నిలబడతాయనడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు.

## విదేశాలకు ఎగుమతులు...

సంగం డెయిరీ ఉత్పత్తులకు దేశంలోనే కాక విదేశాలలో సైతం మంచి డిమాండ్ ఉంది. సంగం నెయ్యి ఇప్పటికే గల్ఫ్ తదితర దేశాలకు ఎగుమతి అవుతోంది. డెయిరీ ఉత్పత్తులకు అంతర్జాతీయ ప్రమాణాలు ఉన్నాయని విదేశాలకు జరుగుతున్న ఎగుమతుల ద్వారా స్పష్టమైంది. జిల్లాలో సీజన్‌లో రోజుకు సగటున ఐదు లక్షల లీటర్ల పాలు ఉత్పత్తి జరిగితే అందులో సగానికి పైగా పాలను సంగం డెయిరీ సేకరిస్తున్నది. గ్రామాలలో డెయిరీకి అనుబంధంగా పాల సొసైటీలు ఉన్నాయి. 75 శాతం సొసైటీలకు స్వంత భవనాలు ఉండటం విశేషం. ఇక గుంటూరులో డెయిరీ ఒక సీడ్ ప్రాసెసింగ్ ప్లాంటును నిర్వహిస్తోంది. దీని ద్వారా రైతులు అవసరమైన పశు గ్రాస విత్తనాలను తయారు చేసి సబ్సిడీపై అందిస్తున్నారు. డెయిరీ ఉత్పత్తులలో పాల పదార్థాలతోపాటు మినరల్ వాటర్, మ్యాంగో జ్యూస్ వంటి అదనపు ఉత్పత్తులు ప్రజాదరణపొందాయి.

అన్ని వర్గాల ప్రజలకు అందుబాటులో ఉండేలా సంగం డెయిరీ ఉత్పత్తుల ధరలను నిర్ణయించారు. రాష్ట్రంలో అనేక సహకార డెయిరీలు ఆర్థి సంక్షోభంలో కొట్టుమిట్టాడుతుండగా, గుంటూరు జిల్లా డెయిరీకి, రైతులకు మధ్య ఉన్న పరస్పర అవగాహనే ప్రధాన కారణమని చెప్పవచ్చు. అన్నింటికి మించి సంగం డెయిరీకి అంతర్జాతీయ స్థాయిలో గుర్తింపు కల్పిస్తూ అవార్డులు లభించడం విశేషం. భవిష్యత్తులో మరిన్ని ఉత్పత్తులతో తన మార్కెటింగ్‌ను విస్తృత పర్చుకునేందుకు సంగం డెయిరీ ఇప్పటి నుండే కార్యాచరణ ప్రణాళిక సిద్ధం చేసుకుంటోంది.

## కరువులో కొండంత అండ...

గత సంవత్సర కాలంలో తీవ్ర కరువు పరిస్థితులు పాడిపరిశ్రమను కుదిపేసిన నేపథ్యంలో రైతులను ఆదుకునేందుకు సంగండెయిరీ ప్రభుత్వంలో కలిసి ముందుకు వచ్చింది. కరువు ప్రాంతాల రైతులకు సంగం డెయిరీ పశు దాణాను సబ్సిడీపై అందించింది. అంతేకాకుండా ఇందు కోసం లక్షలాది రూపాయలను ప్రత్యేకంగా కేటాయించింది. రైతులకు అందజేసి వారి ఆదుకుంది. ప్రభుత్వంలో కలిసి సంగం డెయిరీ ప్యాకెట్‌కు సబ్సిడీని కూడా సమకూర్చాయి. ఈ విధంగా రైతులు కష్టకాలంలో ఉన్నప్పుడు ఆదుకోవడంలో సంగం డెయిరీ ఎప్పుడూ ముందుంటుంది.

## గుంటూరు జిల్లాలోని ముఖ్యమైన దేవాలయాలు

| | | |
|---|---|---|
| శ్రీ మల్లేశ్వరస్వామి | కాకాని | 0863-2556184 |
| లక్ష్మీనరసింహస్వామి | మంగళగిరి | 08645-232945 |
| త్రికోటేశ్వరస్వామి | కోటప్పకొండ | 08647-247133 |
| అమరేశ్వరస్వామి | అమరావతి | 08645-255241 |
| భావన్నారాయణస్వామి | పొన్నూరు | 08643-242021 |
| సహస్రలింగేశ్వరస్వామి | పొన్నూరు | 08643-247099 |
| చెన్నకేశవస్వామి | మాచర్ల | 08642-222490 |
| వెంకటేశ్వరస్వామి | వైకుంఠపురం | 08644-229524 |
| వేణుగోపాలస్వామి | సత్తెనపల్లి | 08641-234123 |
| నాగేశ్వరస్వామి | చిలకలూరిపేట | 08647-253012 |

# న్యాయశాఖలో జిల్లాకు విశిష్టస్థానం

(ఆన్‌లైన్ - లీగల్ )

రాష్ట్ర న్యాయశాఖలో గుంటూరు జిల్లాకు విశిష్ట స్థానం ఉంది. హైదరాబాద్ నగరం తర్వాత న్యాయశాఖలో గుంటూరు జిల్లాకు మంచి గుర్తింపు ఉంది. జిల్లాకు చెందిన కొందరు న్యాయవాదులు రాష్ట్ర ముఖ్యమంత్రి పదవి, కేంద్ర మంత్రులుగా రాష్ట్ర మంత్రి వర్గంలో కీలకమైన పదవులు నిర్వహించారు. మరికొందరు న్యాయవాదులు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తులుగా, న్యాయమూర్తులుగా జిల్లా ఖ్యాతిని మరింత ఇనుమడింపచేశారు.

**స్వాతంత్ర్యోద్యమంలోనూ వీరి పాత్ర మరువలేనిది..**

మొదట్లో కృష్ణా, గుంటూరు జిల్లాలు కలిసి ఉన్నపుడు గురజాల , బాపట్లలో మేజిస్ట్రేట్ కోర్టులు పనిచేసేవి కృష్ణాజిల్లా నుంచి విడిపడిన కాలంలో న్యాయవాదులను సమాజంలో ఎంతో గౌరవించేవారు. దీంతో ఆర్థికంగా ఉన్నవారు విదేశాల్లో బారిస్టర్ చదివి వచ్చి న్యాయవాదులుగా స్థిరపడేవారు. వారు ఫీజులతో సంబంధం లేకుండా వృత్తిపై ఉన్న అంకిత భావం, గౌరవంతో బాధ్యతగా పనిచేసేవారు. కొందరు న్యాయవాదులు మద్రాసు తర్వాత విశాఖపట్నంలో 'లా' పట్టా పూర్తిచేసి లాయర్లుగా ప్రాక్టీసు చేశారు. ఇప్పుడు ప్రతి జిల్లాలో న్యాయ కళాశాలలు పుట్టుకొచ్చాయి. మన గుంటూరు నగరంలో ప్రస్తుతం రెండు న్యాయ కళాశాలలున్నాయి.



గుంటూరు జిల్లా కోర్టు

తర్వాత 1905లో గుంటూరు జిల్లా కేంద్రంగా కోర్టులు ఏర్పాటుచేశారు. మొదట్లో ప్రకాశం జిల్లా కూడా గుంటూరులో కలిసి ఉంది. ఇక్కడ కోర్టు భవనాలను 1913లో నిర్మించారు. 1954లో రాష్ట్ర హైకోర్టును తొలుత గుంటూరులోనే ఏర్పాటు చేశారు. తర్వాత దీనిని పెద్దమనుషుల ఒప్పందం ద్వారా హైదరాబాద్‌కు తరలించారు. ఒప్పందం ప్రకారం గుంటూరులో హైకోర్టు బెంచ్ ఏర్పాటుచేయాలని న్యాయవాదులు ఇప్పటికీ పోరాడుతూనే ఉన్నారు. స్వాతంత్ర్యోద్యమ

చ్చాయి. మన గుంటూరు నగరంలో ప్రస్తుతం రెండు న్యాయ కళాశాలలున్నాయి. తొలినాళ్లలో కొంపల్లి కోటిలింగం, దేశిరాజు హనుమంతరావు, అన్నంరాజు సీతాపతిరావు, మాధవ పెద్ది హనుమంతరావు, కెవి జయ కృష్ణారావు గోవిందరాజులు శ్రీనివాస రావు అధ్యాపకులుగా, మంచి న్యాయవాదులుగా ఒక వెలుగువెలిగారు. గోవిందరాజులు శ్రీనివాసరావు నగరంలో విద్యుత్ రాకముందే జనరేటర్ విద్యుత్ సౌకర్యం కల్పించుకున్న తొలి వ్యక్తి. ఈయన ఎందరో యువ

న్యాయవాదులకు వేయాతనిచ్చారు. సును జూనియర్లకు అప్పగించి రిటైర్ 60 ఏళ్లకు వృత్తికి స్వస్తిపలికిన ఉన్న ప్రాక్టీ మెంట్ (తరువాయి 220వ పేజీలో)

# న్యాయశాఖలో జిల్లాకు విశిష్ట స్థానం

(219వ పేజీ తరువాయి)

విషయంలో ఇతర న్యాయవాదులకు ఆదర్శంగా నిలిచారు. గుంటూరుకు చెందిన నడింపల్లి వెంకటలక్ష్మీనరసింహారావు, కొండావెంకటప్పయ్య, ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులులు స్వాతంత్ర్య సమరంలో పాల్గొని చెరసాలకు వెళ్లివచ్చారు. నడింపల్లి వెంకటలక్ష్మీనరసింహారావు గుంటూరు మున్సిపల్ ఛైర్మన్‌గా చాలాకాలం పని చేశారు. ఈయన 'కర్నూలు' ఆంధ్ర రాష్ట్ర రాజధానిగా ఉన్న రోజుల్లో ప్రొటెం స్పీకర్‌గా కూడా పనిచేశారు. కొండా వెంకటప్పయ్య పంతులు అప్పట్లో మహాత్మాగాంధీకి ముఖ్య అనుచరుడిగా ఉండేవాడు ఈయనకు 'దేశభక్త' బిరుదు కూడా ఉంది. ఈయన కొంతకాలం కాంగ్రెస్ పార్టీ కార్యదర్శిగా కూడా పనిచేశారు. ఇప్పుడు బ్రాడీపేటలో నడుస్తున్న నవోదయ స్కూల్ ఒకప్పటి ఆయన స్వగృహమే. దానిని ప్రభుత్వానికి ఇచ్చేశారు. ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు స్త్రీ జనోద్ధరణకు నడుంకట్టి బ్రాడీపేటలో శారదానికేతన్ను స్థాపించారు. ఆయన నవల 'మాలపల్లి' జాతీయ స్థాయిలో మంచి గుర్తింపు పొందింది. బాపట్లలో కొద్ది కాలం మేజిస్ట్రేట్‌గా పనిచేసిన జస్టిస్ కోకా వెంకటసుబ్బారావు భారత అత్యున్నత న్యాయస్థానం సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా పనిచేశారు. దివంగత జస్టిస్ ఆవుల సాంబశివరావు, జస్టిస్ అంబటి లక్ష్మణరావులు రాష్ట్ర హైకోర్టు ప్రధాన న్యాయమూర్తులుగా పనిచేశారు. జస్టిస్ సాంబశివరావు ఆంధ్రా యూనివర్సిటీ వైస్ చాన్సలర్‌గా, రాష్ట్ర తొలి లోకాయుక్తగా పనిచేశారు. జస్టిస్ పి.ఎ చౌదరి, జస్టిస్ అమరేశ్వరి, జస్టిస్ వెంకట్రామరెడ్డి, జస్టిస్ సిహెచ్.ఎస్ ఆర్‌కె ప్రసాద్‌లు రాష్ట్ర హైకోర్టు న్యాయమూర్తులుగా పని చేయగా ప్రస్తుతం జస్టిస్ పిఎస్ నారాయణ హైకోర్టు జడ్జిగా కొనసాగుతున్నారు. గుంటూరు బార్ అసోసియేషన్‌కు చెందిన న్యాయవాది కొండూరి వెంకటేశ్వరరావు జిల్లా నుంచి 1964లో నేరుగా జిల్లా జడ్జి పదవికి ఎంపికై చివరికి హైకోర్టు రిజిస్ట్రార్‌గా పదవీ విరమణ చేశారు. నాలుగు దశాబ్దాల అనంతరం మహిళా న్యాయవాది టి రజని జిల్లా నుంచి రెండో వ్యక్తిగా జిల్లా జడ్జి పదవికి ఎంపికై పనిచేస్తుండగా టి రాంగారావు ఫాస్ట్ ట్రాక్ జిల్లా కోర్టుకు న్యాయమూర్తిగా ఎంపికై పనిచేస్తున్నారు. మేజిస్ట్రేట్‌లుగా ఎంపికై జిల్లా జడ్జీలుగా పదోన్నతి పొంది పని చేసినవారు చేస్తున్నవారు చాలా మంది ఉన్నారు. గుంటూరులో ప్రాక్టీసు చేసి ప్రస్తుతం సుప్రీంకోర్టులో ప్రాక్టీసు చేస్తున్న లావు నాగేశ్వరరావు ఎన్‌డిఏ ప్రభుత్వ హయాంలో అతి చిన్న వయస్సులో భారత ప్రభుత్వ అదనపు సొలిసిటర్ జనరల్‌గా పనిచేశారు. మన రాష్ట్రంనుంచి ఈ పదవి పొందిన రెండో వ్యక్తి ఆయన.

కాసు బ్రహ్మానందరెడ్డి చాలా కాలం రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా, కేంద్ర మంత్రిగా, గవర్నర్‌గా పనిచేయగా భవనం వెంకట్రామ్, నాదెండ్ల భాస్కరరావులు ముఖ్యమంత్రిగా రాష్ట్ర కేబినెట్ మంత్రిగా పనిచేశారు. వీరు (తరువాయి 221వ పేజీలో)

# న్యాయశాఖలో జిల్లాకు విశిష్ట స్థానం

(220వ పేజీ తరువాయి)

కాక యడ్లపాటి వెంకటరావు, భవనం జయప్రద, ఆలపాటి ధర్మారావు, ఆలపాటి రాజేంద్రప్రసాద్ తదితరులు క్యాబినెట్ మంత్రులుగా పనిచేశారు. యడ్లపాటి వెంకటరావు న్యాయ, వ్యవసాయ శాఖా మంత్రిగా పనిచేయగా ఆయన హయాంలోనే తెనాలి సొంత కోర్టు భవనాలు ఏర్పాటు చేశారు. ఆలపాటి ధర్మారావు 'రాష్ట్ర అసెంబ్లీ స్పీకర్‌గా, న్యాయ, హోమ్ శాఖ మంత్రిగా పనిచేశారు. ఈయన న్యాశాఖ మంత్రిగా ఉన్నప్పుడే గుంటూరుకు కొత్త కోర్టు భవనాలు మంజూరయ్యాయి. ఆలపాటి రాజేంద్ర ప్రసాద్ రాష్ట్ర సాంకేతిక విద్యాశాఖ మంత్రిగా ఉన్నప్పుడే గుంటూరుకు కొత్త కోర్టు భవనాలు మంజూరయ్యాయి. ఆలపాటి రాజేంద్రప్రసాద్ రాష్ట్ర సాంకేతిక విద్యాశాఖ మంత్రిగా పనిచేశారు. కేంద్రంలో పలు పదవులు నిర్వహించిన కొత్త రఘురామయ్య కూడా న్యాయవాదే. కేంద్ర న్యాయశాఖ మంత్రిగా, గవర్నర్‌గా పనిచేసిన పి శివశంకర్ తెనాలి పార్లమెంట్ నియోజకవర్గం నుంచి పోటీచేసి ఒకసారి విజయం సాధించారు. గుంటూరు తొలి పార్లమెంట్ సభ్యుడు దివంగత ఎస్‌విఎల్ నరసింహం ఉన్న విలువలకు కట్టుబడి న్యాయవాదిగా చివరి వరకు పనిచేశారు. నర్సరావుపేటకు చెందిన నల్లపాటి వెంకటరామయ్య రాష్ట్ర అసెంబ్లీ స్పీకర్‌గా పనిచేయగా ఆయన సోదరుడు వెంకటేశ్వర్లు చౌదరి జిల్లా బోర్డు ప్రెసిడెంట్‌గా పనిచేశారు. నిశ్శంకరరావు వెంకటరత్నం ఎమ్మెల్యేగా, ఎంపిగా పనిచేసి కొంతకాలం రాష్ట్ర అసెంబ్లీ స్పీకర్‌గా కూడా పనిచేశారు. దివంగత జూపూడి యజ్ఞనారాయణ జన సంఘ పార్టీ ఉపాధ్యక్షుడిగా పనిచేసి, వాజ్‌పేయి, ఎల్‌కె అద్వానీల సన్నిహితుడుగా మెలిగారు. సీనియర్ న్యాయవాది సింగం బసవపున్నయ్య గతంలో తెనాలి నుంచి ఎంపిగా ఎన్నికయ్యారు. ప్రస్తుతం ఎమ్మెల్సీగా ఉన్నారు. రాష్ట్ర గ్రంథాలయ సంస్థ చైర్మన్ కూచిపూడి సాంబశివరావు, జిల్లా (తరువాయి 222వపేజీలో)

(221వ పేజీ తరువాయి)

గ్రంధాలయ సంస్థ చైర్మన్ చిట్టా విజయభాస్కరరెడ్డిలు న్యాయవాదులే, మాజీ ఎమ్మెల్యే ఎపిఐఐసి మాజీ చైర్మన్ అంబటి రాంబాబు కూడా రేపల్లెలో న్యాయవాదిగా కొనసాగుతున్నారు. ప్రస్తుత చిలకలూరిపేట ఎమ్మెల్యే మర్రి రాజశేఖర్, తాడికొండ ఎమ్మెల్యే డొక్కా మాణిక్య వరప్రసాద్, బాపట్ల ఎమ్మెల్యే గాదె వెంకటరెడ్డిలు కూడా న్యాయవాదులే.

# న్యాయశాఖలో జిల్లాకు విశిష్ట స్థానం

స్థానిక బార్ అసోసియేషన్ 1924 కేవలం 45మంది న్యాయవాదులతో ప్రారంభమైంది. ప్రస్తుతం 1600 మందికి పైగా న్యాయవాదులు గుంటూరులో ప్రాక్టీసుచేస్తున్నారు. జిల్లా వ్యాప్తంగా సుమారు 3500 మంది న్యాయవాదులు వృత్తిలో కొనసాగుతున్నారు. హైదరాబాద్ తరువాత ఎక్కువ కోర్టులు ఉంది గుంటూరు జిల్లాలోనే కేసులు పెండెన్సీలో జిల్లా గతంలో హైదరాబాద్ తర్వాత రెండో స్థానంలో ఉండేది. అయితే ప్రస్తుతం ఆ స్థానాన్ని నల్గొండ చేరుకోవడంతో ప్రస్తుతం మూడవ స్థానంలో ఉంది. 50 వేలకు పైగా కేసులు ప్రస్తుతం జిల్లాలో పెండింగ్‌లో ఉన్నాయి. జిల్లాలో ప్రస్తుతం నగరంలో పది, తెనాలి, నర్సరావుపేటల్లో ఒక్కో



న్యాయదేవత

జిల్లా కోర్టు పనిచేస్తున్నారు. ఐదు జిల్లాలకు సంబంధించి కార్మిక న్యాయస్థానం కూడా ఇక్కడ పనిచేస్తుంది. ఇక సీనియర్ సివిల్ జడ్జి కోర్టులు గుంటూరులో నాలుగు, తెనాలి, నర్సరావుపేల్లో రెండు చొప్పున పనిచేస్తుండగా గురజాల, బాపట్లల్లో ఒక్కొక్కటి పనిచేస్తున్నాయి. జూనియర్ సివిల్ జడ్జి కోర్టులు గుంటూరులో తొమ్మిది, తెనాలిలో మూడు, నర్సరావుపేటలో మూడు, పొన్నూరులో రెండు, మంగళగిరిలో రెండు, బాపట్లలో రెండు, చిలకలూరిపేటలో రెండు, గురజాలలో రెండు, రేపల్లెలో మూడు, మాచర్లలో ఒకటి, సత్తెనపల్లిలో రెండు పనిచేస్తున్నాయి. కోర్టులన్నీ ఒకే ప్రాంగణంలో ఉన్నది రాష్ట్రంలో గుంటూరు

ఒక్కచోటే. మరో రెండు సబ్ కోర్టులు త్వరలోనే వాటిని ఏర్పాటుచేయను
కూడా నగరానికి మంజూరయ్యాయి. న్నారు.

# 'గాలి బుడగ'ల జీవితాలు

## ఆదరణ కోసం ఎదురు చూపు

(ప్రత్తిపాడు - ఆన్‌లైన్)
బూరాలు కుట్టుకుంటూ జీవించే బడుగు జీవులు వారు. వారికి అదే జీవనాధారం. చిన్న పిల్లలు మొదలు, వృద్ధుల వరకు అందరూ ఈ వృత్తిపైనే ఆధారపడి జీవనం సాగిస్తుంటారు. మిల్లుల వద్ద నుంచి చినిగిపోయిన పాత గోతాలను కొని కుడుతుంటారు. వారి తాత, ముత్తాతలు ఎప్పుడో కోయూరివారిపాలెం చేరారు.నాటి నుంచి నేటి వరకు రోడ్డు వెంట గుడిసెలు వేసుకుని జీవనం సాగిస్తున్నారు. గుంటూరు- ప్రత్తిపాడు రోడ్డులో కోయూరివారిపాలెం వద్ద రోడ్డు పక్కన పట్టాలు కుడుతూ వచ్చేపోయే వారికి కనిపిస్తుంటారు. వారు అంతా లంబాడా జాతికి చెందినవారు. పూర్వకాలంలో ఎప్పుడో వారి తాత ముత్తాతలు ఈ గ్రామం చేరారు.

(మిగతా 224వ పేజీలో)

(223వ పేజీ తరువాయి)

## 'గాలి బుడగ'ల జీవితాలు

నాటి నుంచి వారి కుటుంబాలు ఇక్కడే కాపురం ఉంటున్నాయి. కోయూరివారిపాలెం లోని చెరువు కట్టవెంట గుడిసెలు వేసుకొని జీవనం సాగిస్తున్నారు. వారు పూర్తిగా నిరక్షరాస్యులు గతంలో ఎప్పుడో రాత్రిపూట పాఠశాల పుణ్యమాని సంతకాలు చేయడం నేర్చుకున్నారు. ప్రస్తుతం ఇక్కడ 50 కుటుంబాలు జీవనం సాగిస్తున్నాయి. సమాజంలో వీరికి ఒక గుర్తింపు లభించింది. కాని ఆదరణే కరువయ్యింది. ప్రభుత్వ పరంగా పింఛన్లు అందుతున్నా వృత్తిపరంగా ఎదుగుదలకు బ్యాంకుల నుంచి ఆర్థిక సాయం కావాలంటున్నారు. గతంలో వృత్తిలోకొన్ని ఇబ్బందులు ఎదురై పూటగడవని పరిస్థితి ఏర్పడిందని కాని గత నాలుగు సంవత్సరాలుగా ఎలాంటి ఇబ్బందులు లేకుండా కాలం వెళ్లదీస్తున్నట్లు బానావత్ శ్రీనివాసనాయక్ తెలిపారు.

* సంవత్సరానికి రూ. 40 బూరాల వరకు తయారు చేస్తుంటారు.

* రోజుకి సగటున ఒక మనిషి 14 బూరాలు కడతాడు.

(మిగతా 225వ పేజీలో)

# 'గాలి బుడగ'ల జీవితాలు

(224 వ పేజీ తరువాయి)

* కుట్టినందుకు ఒకొక్క బూరానికి రూ. 4 కుట్టుకూలి ఉంటుంది.
* ఒక్క రూపాయి లాభంతో బూరాలను అమ్ముకుంటారు.



కోయవారిపాలెం పెద్ద రోడ్డు వెంట ఉన్న స్థలంలో పూరి గుడిసెలు వేసుకొని జీవిస్తున్న లంబాడాలు



అమ్మకానికి సిద్ధంచేసి ఉంచిన బూరాలు



పట్టాలు కుడుతున్న దృశ్యం



పనిలో నిమగ్నమైన లంబాడాలు

* భద్రాచలం, పల్లాడు ఏరియాల నుంచి వ్యాపారస్తులు వచ్చి సరుకును ఇక్కడ కొనుగోలుచేస్తుంటారు.

* మిల్లులు వద్ద తాము కొనుగోలు చేసే వేస్ట్ పట్టాలను బట్టి లాభాలు ఉంటాయని వారు తెలిపారు.

## ప్రభుత్వం ఇచ్చిన ఇళ్ల స్థలాలను అమ్ముకున్నారు

గతంలో వీరికి ప్రభుత్వం ఇళ్ల స్థలాలను కేటయించింది. అయితే అనతికాలంలోనే అందిన రేటుకు స్థలాలను అమ్ముకున్నారు. ఆనాడు 20 మంది వరకు పట్టాలు ఇచ్చింది. రెండు వేలకు స్థలాలను అమ్ముకున్నారు. కాని నేడు వారి బాధ వర్ణనాతీతంగా ఉంది. పూట గడవని పరిస్థితుల్లో గతి లేక స్థలాలను అమ్ముకోవాల్సి వచ్చిందని ఇప్పుడు తమకు స్థలాలు ఇప్పిస్తే ఇళ్లు కట్టుకుంటామని వారు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. కొంతమంది ఇప్పటికే రోడ్డు పక్కనే స్థలాలను కొనుగోలుచేసి గృహాలు నిర్మించుకున్నారు. మిగిలిన వారు ప్రభుత్వం దయతలచి స్థలాలు ఇప్పించాలని ఆ కాలనీవాసులు కోరుతున్నారు.

# నాటి గండేశ్వరుడే నేటి దండేశ్వరుడు

(ఆన్‌లైన్ - ప్రత్తిపాడు)

అతిపురాతన కాలంలోనే ప్రత్తిపాడుకు అత్యంత ప్రాశస్త్యమున్నది. గౌతమ మహర్షి అంతటి వాడు ఇక్కడ తపస్సుచేసి శివలింగాన్ని ప్రతిష్టించి పూజించాడని చరిత్ర చెబుతుంది. భక్తి శ్రద్ధలతో, భక్తి పారవశ్యంలో ఈ ప్రాంతం నాడు భక్తుల వాడగా పేరొందిది. ప్రత్తిపాడుగా రూపాంతరం చెందిక ముందు ఇది జన సంచారం లేని కీకారణ్యం ఈ ప్రాంతం.

గౌతమ మహర్షి కొన్ని దినాలు తపస్సు చేసి శివలింగాన్ని ప్రతిష్టించిన తరువాత విదర్భ దేశపు రాజకుమార్తె సీమంతిని యొక్క భర్తను నాగ దేవతలు నాగ లోకమునకు అపహరించుకొనిపోయారు. తన భర్త కోసం శ్రీమంతిని అంతఃపురం వదిలి ఈ ప్రాంతానికి వచ్చి గౌతమ మహర్షి ప్రతిష్టించిన శివలింగానికి పూజలు చేసింది. భక్తి శ్రద్ధలతో శీమంతిని చేసిన పూజలు ఫలించాయి. తన భర్త గండం నుంచి బయట పడ్డాడు.

దీంతో ఆ శివలింగానికి దండేశ్వరుడనే పేరు వచ్చింది. తదనంతరం కలియుగ ప్రవేశము తరువాత కూడా ఈ లింగమూర్తి అదృశ్యం కాకుండా ఉండెను. కాలానుగుణంలో భక్తుల సందర్శన పెరిగి వాడగా రూపాంతరం చెంది తదనంతరం కాలానుగుణంగా ప్రత్తిపాడుగా రూపాంతరం చెందింది.

గండేశ్వరుడని ఈ స్వామికి పేరు రావడానికి గల ఇతివృత్తం శిలాశాసనాలలో నేటికి ధర్శనమిస్తుంది. పరిచ్ఛేద కుసుమరాజు చోళ రాజ్యంపై యుద్ధం ప్రకటించి తన సైన్యంతో ఈ ప్రాంతానికి వచ్చి ఇక్కడ విడిది చేశారు. ఆ రోజు రాత్రి కుసుమరాజుకు ఒక కల వచ్చింది.

ఆ కాలంలో గండేశ్వరుడు ప్రత్యక్షమై పూర్వం రుషిచేత ప్రతిష్టించబడినాడని అనంతరం శీమంతిని అవే భక్తురాలిచేత పూజించబడినానని, కాల గర్భంలో ఆలయ పాలన లేక ఒక పుట్టలో ఉన్నానని, నన్ను తిరిగి పునః ప్రతిష్ట చేయాలని ఆ రాజును ఆజ్ఞాపించారు.

మరునాడు సైనికులతో ఈ ప్రాంతం మొత్తం వెతికించి పుట్టలో ఉన్న శివలింగాన్ని వెలికితీసి ఆ ప్రాంతంలోనే విమాన గోపుర ప్రాకార నిర్మాణం గావించెను. శాలివాహణ శకం 1222లో గుడి ప్రతిష్టించినట్టుగా శాసనాలు తెలియజేస్తున్నాయి. 1240లో కొండవీటి రెడ్డి రాజుల కాలంలో రాజ బంధువు అయిన కురగంటి వెంకటరెడ్డి ఈ గండేశ్వర దేవాలయాన్ని అభివృద్ధి చేశారు.

ఈ కాలం నుంచే ధూప దీప నైవేధ్యాలతో నిత్య పూజలు జరుగుతున్నాయి. శాలవాహన శకం 1450లో కొండవీటి సింహాసనాదీసుడైన శ్రీకృష్ణ దేవరాయలు ఈ దేవాలయానికి భూములను దానమిచ్చారు.

శాలివాహన శకం 1502లో కర్నాటక రాజులను జయించి కొండవీటి దుర్గం పుచ్చుకున్న మల్కిభరాము పాదుషా రాజు గండేశ్వర స్వామివారికి రథోత్సవం కార్తీకమాస పూజలు, శ్రావణమాస అభిషేకాలకు శివరాత్రి, నవరాత్రి పూజలకు కొంత భూమిని దానం చేశాడు.



దండేశ్వరాలయం

అనంతరం శాలివాహన శకం 1528లో గింజువల్ల అచ్చినాయుడు తన తల్లి దండ్రులు పోతునాయుడి గుర్తుగా దక్షిణ ముఖ ద్వారం నిర్మించారు. ఈ రకంగా రూపాంతరం చెందిన గండేశ్వరుడు కాలక్రమంలో వివిధ రూపాంతరాలు చెందుతూ దండేశ్వరునిగా పిలవబడుతున్నాడు. దండేశ్వరునిగా నేటికి నిత్యపూజలు అందుకుంటున్నాడు. పూర్వం ఈ దేవాలయానికి సుమారు 130 ఎకరాల భూమి ఉండేది. గ్రామోత్సవాలలో మంత్రాలు చదివే బ్రాహ్మణులకు సుమారు 44 ఎకరాల ఉండేది. భాజా భజంత్రీలలో వారు ఆ భూములను అమ్ముకోవడం జరిగింది. ప్రస్తుతం 60.73 ఎకరాల భూమి మాత్రమే ఉన్నది.



నేటికీ ధర్శన మిస్తున్న శిలాశాసనాలు

